పురాణపండవారి

# సంపూర్ణ మహాభారతం



మోహన్ పబ్లికేషన్స్, రాజమహేంద్రవరము

## పారాయణ గ్రంథం

# సంపూర్ణ మహాభారతం

(వచన కావ్యము)

గ్రంథకర్త :
పురాణపండ శ్రీచిత్ర - ఆలమూరు

సంపాదకులు :
శ్రీ విద్యారణ్య - రాజమండ్రి.



ప్రకాశకులు : ☎ 246 2565

మోహన్ పబ్లికేషన్స్
అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమండ్రి -1.

కాపీరైట్ 2012 వెల : 120-00



## సంపూర్ణ మహాభారతము
(వచన కావ్యము)

గ్రంథకర్త :
పురాణపండ శ్రీచిత్ర
ఆలమూరు

సంపాదకులు :
శ్రీ విద్యారణ్య - రాజమండ్రి.
ఫోన్ : 2470224



ప్రకాశకులు :
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, రాజమండ్రి - 533 101.



మహాభారతము

శుభాశీస్సులతో...



శ్రీమతి / శ్రీ-----------------------------------------------

గారికి--------------------------------------------సందర్భముగా

**“సంపూర్ణ మహాభారతము”** అను పుస్తక రత్నమును

బహూకరించడ మైనది.

సంతకం.

(మీ మీ ఆప్తమిత్రునికి / బంధువునకు మీ కానుకగా

ఈ పుస్తకమును ఇవ్వదలిస్తే ఈ పేజీని ఉపయోగించండి.)

# విషయసూచిక



# సంపూర్ణ మహాభారతం



## ఆది పర్వము

శ్రీ వేదవ్యాస భగవానుడు తన మనుమలచరిత్రను "శ్రీ మహాభారతము"గా ఒక లక్ష శ్లోకాలతో వ్రాశాడు. దీనిని ప్రపంచ భాషల్లోనికి యెందరో అనువదించారు. మన తెలుగులో దీనిని ముగ్గురు కవులు పద్యగద్యాల్లో తెనిగించారు. 1. నన్నయభట్టు 2. తిక్కన సోమయాజి; 3. ఎఱ్ఱాప్రెగ్గడ; యిందులో 18 పర్వాలున్నాయి. నన్నయభట్టు ఆదిపర్వం 'సభాపర్వం – అరణ్యపర్వంలో సగం భాగాన్ని వ్రాయగా' తిక్కన మహాకవి విరాటపర్వం నుంచి తక్కిన 15 పర్వాలూ ఆంధ్రీకరణ చేశాడు. అరణ్య పర్వశేషము వ్రాసిన ఎఱ్ఱాప్రగ్గడ అరణ్య పర్వం శేషాన్ని తాను వ్రాసినా నన్నయభట్టు పేరుతోనే వ్రాశాడు. ఇది మహాభారత ఆంధ్రీకరణము. పూర్వం పల్లెల్లో రచ్చబండలపై కూర్చొని రాత్రి ముఖ్యంగా మహాభారతాన్ని ఒకరు పద్యాలు చదువగా బాగా అర్థాన్ని తెలిసిన పండితుడు అచ్చట గల వారికి రాగయుక్తంగా చెప్పడం నేనెరుదును. నేనూ అలా చెప్పెడువాడినే కనుక.

ఇక మహాభారతం రాజకీయాలకి పెట్టింది పేరు. అందువలన రాజకీయ వేత్తలందరికీ యిది వేదము పునాది. అందుకే నన్నయ మహాకవి మహాభారతాన్ని గూర్చి యిలా వ్రాశాడు.

**"ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని;**
**ఆధ్యాత్మవిదులు వేదాంత మనియు;**
**లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని;**
**యైతిహాసికు లితిహాస మనియు;**



**పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ**
**యంబని మహి గొనియాడు చుండ;**
**వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసు**
**డాదిముని పరాశరాత్మజుండు;**
**విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై**
**పరగుచుండ జేసె భారతంబు (భార – ఆదిప : 1 – ఆశ్వాసము)**

మహాభారతాన్ని యెవరు యెన్ని రకాలుగా చదివినా వ్రాసినా అన్వయం గావించుకొన్నా వారి వారి అభిరుచులననుసరించి వారికి అర్థమవుతుందని దీని అర్థం. యిందుగల పాత్రలలోగల వృత్పత్త్యార్థం మనకు కథను సూచిస్తుంది. మహాభారత – భాగవత – రామాయణాలూ మనకు భారతీయ ఆర్షధర్మానికి పట్టుకొమ్మలు. అంతేకాక వీటికి మామూలుగా కథ ఉండి అందులో అంతరార్థంగా ఆధ్యాత్మిక – మంత్ర శాస్త్రాలు మనకు బోధిస్తాయి. యిది మహాభారతము గూర్చి ముందుగా తెలిసికొనదగింది.

### సూత మహార్షి

**"పుణ్యము! వైరిజంతు పరిపోషిత తోషిమృగాఽహి నాగము**
**ధ్గణ్యము! సంయమీశ్వర తత ప్రతికూల విహీన యాగనై**
**పుణ్యము! నిర్ఝరీ తత విభుస్వన గణ్యము మించు నైమిశా**
**రణ్య మగణ్య పుణ్య మునిరాజ వరేణ్య శరణ్య భూమియై"**

నైమిశారణ్యంలో శౌనకాదిమునులు "దీర్ఘసత్రయాగం" అను యాగాన్ని శ్రీమన్నారాయణుని గూర్చి చేస్తున్నారు. ఆ యాగానికి మహర్షులు రాజులు– పుణ్యాత్ములు వచ్చీపోయేవారు. దానిని తిలకించడానికి "సూతమహర్షి" రాగా– మునీంద్రులందరూ యెదురేగి అర్ఘ్యపాద్యాలిచ్చి తీసికొనివచ్చి ఉన్నతాసనముపై కూర్చుండబెట్టి మునులందరూ యేకకంఠంతో "సూత" సుధామధురవచో వ్రాత! నతత్రాత! విష్ణురమ్యగుణకథాఖ్యాత!

"మహాత్మా! సకలపురాణాలను మి గురుదేవుడగు వ్యాసమహర్షి కరుణతో విని వ్యాఖ్యానింపదగినవాడవు. యిప్పుడు నీవు మాపూర్వపుణ్యంచేత వచ్చావు. మాకు నీవు పవిత్రమైన మహాభారత చరిత్ర వినిపించాలని కోరారు. దానికి సూతుడు యెంతో సంతోషించాడు. మాగురుదేవుల వలన విన్న చరిత్ర నేను మీకందరకూ విన్పిస్తాను శ్రద్ధతోవినండి" అనియిలాచెప్పాడు.

### వైశంపాయనుడు

జనమేజయ మహారాజు హాయిగా రాజ్యాన్ని చేసికొంటుండగా వైశంపాయనముని ఆ సమయానికి అచ్చటకు రావడం. మహర్షిని మహారాజు పూజించడం జరిగింది. ఆయనను చూసి" మహాత్మా! మాపూర్వుల చరిత్ర

వ్యాసులవారు వ్రాశారు. అదే మహాభారతం. దానిని వినాలని ఉన్నదని జనమేజయు డడుగగా వైశంపాయనుడిలా చెప్పాడు.

## వ్యాసమహర్షి

సూతమహర్షి శౌనకాదులకు "మహాత్ములారా! ముందుగా మాగురుదేవుల చరిత్ర మీకు చెప్పుతాను వినండి. వసురాజు అనేనామముతో ఒక మహారాజు ఉండేవాడు. ఆతని అర్ధాంగి గిరికాదేవి. ఆమె అపురూపలావణ్యవతి. అందాలరాసి. ఆమెనుకూడి ఆ రాజు దాంపత్యసుఖా లనుభవించేవాడు. అలా ఉండగా ఆమె ఋతుస్నాత అయి భర్తృరతిక్రీడను కోరింది. అలాగే వసురాజూఉన్నా యింతలో ఆయన పితృ దేవతలు "నీవుతప్పకుండా అరణ్య మృగమాంసాన్ని మాకుతక్షణం కావాలి. యిదిమాఆజ్ఞ" అని వసురాజును వారు ఆజ్ఞపించారు. అరణ్యానికి ఆతడు వేటకు వెళ్లడం తప్పని సరి అయింది. అలావెళ్లినా మహారాజు మనస్సంతా తన అర్ధాంగిపైనే ఉంచి ఆమెరూపలావణ్యాలు అరణ్యములో తలచుటవలన ఆతని వీర్యము స్కలన మయింది. అలా అదిపోవడం యిష్టములేక ఆ రేతస్సును ఆకుడొప్పలో ఉంచాడు. దాన్ని తన డేగమెడలో కట్టి తన అర్ధాంగికి అందించమని పంపాడు. అలా డేగ వెళుతుండగా యింకొకటి వచ్చి దానిమెడలోనిది తినేవస్తువని దాంతో యుద్ధము సాగించగా డొప్పలో నున్న వీర్యం క్రిందనున్న యమునానదిలోపడింది. ఒకశాపము మూలముగా ఆనదిలోగల చేపదానిని మ్రింగింది. ఆచేప గర్భముదాల్చింది. అది దాశరాజను మత్స్యకారుని వలలోపడింది. అద్రిక ఒకదివ్యాంగన. శాపవశాన చేపరూపు ధరించింది దాశరాజు దానినికోయగా ఒకమగబిడ్డ– ఒక ఆడబిడ్డ ఆచేపలో నుండి వచ్చారు. అద్రికకు శాపంపోయి తనలోకానికి వెళ్లింది దాశరాజు ఆయిరువురనూ వసురాజుకు యిచ్చేశాడు.

వసురాజు తాను మగబిడ్డను తీసికొని – ఆడబిడ్డను దాశరాజుకే యిచ్చేశాడు. దాశరాజు దగ్గర ఉన్న ఆడబిడ్డకు "సత్యవతి" అనే పేరుపెట్టాడు ఆమత్స్యరాజు; సత్యవతి యుక్త వయస్సు సమీపింపగా తండ్రికి మారుగా యమునా నదిపై పడవ నడపడం ఆమెకు అలవాటయింది. మత్స్యమునకు పుట్టడం చేత ఆమెకు పొలసువాసన రావడంతో "మత్స్యగంధి" అని కూడా ఆమెను పిలుస్తుండేవారు.

ఇలా కొంతకాలము జరగ్గా ఒకరోజు వశిష్ఠ మహర్షి మనుమడు పరాశర మహర్షి యమునానదిని దాటగా వచ్చాడు. మామూలుగా సత్యవతి పడవ నడపడం ప్రారంభింపగా యెవ్వరూ లేరు. సత్యవతీ పరాశర మహర్షి యిరువురే అచట ఉండగా ఆమె యవ్వన రూపలావణ్యాలకు పరాశర మహర్షి మనస్సు కామోద్రేకం కలిగింది.

"యేమిటి? యెప్పుడూ లేని యీమనో వికారమే" మని ఆతడు తన తపో నేత్రముతో చూడగా వసురాజు వీర్య సంజాతగా అర్ధమయింది. సంతసించాడాతడు. పరాశరుడు తన అభిప్రాయాన్ని సత్యవతికి తెలుపగా ఆమెకు మొదట యిష్టము



కాకపోయినా తుదకు అంగీకరించి "యీ పగటి పూట కూడదు. అందరూ చూస్తున్నారనగా పరాశరుడు తన తపోమహిమతో ఆ యమునా నదీ యిసుకతిన్నెల రెల్లుపై ఆమెతో సంగమింపగా మగబిడ్డ పుట్టాడు. ఆమెకు పొలసువాసన లేకుండా – కన్యాత్వం పోకుండా పరాశరుడు యెన్నోవరాలిచ్చాడు. ఆమెతో సంగమించు సమయమున మంచులాగ క్రమ్మించాడు మహర్షి.

తల్లి గర్భము నుండి భూమ్మీద పడ్డ ఆ మగశిశువు ద్వాదశ వర్షప్రాయం (12 సం॥) గలవాడయ్యాడు. శ్యామల ఛాయతో పుట్టుటచేత ఆతనికి "కృష్ణనామం" వచ్చింది. నదీ యిసుక దిబ్బపై పుట్టుట వలన ద్వైపాయను డయ్యాడు. అందుకే ఆతడు కృష్ణ ద్వైపాయనుడయ్యాడు. పరాశరునికి ఉద్భవించుట వలన దివ్యర్షి అయ్యాడు. తల్లి సత్యవతికి వందన చందన లర్పించి "మాతా! నేను తపస్సుకు వెళతాను నన్ను స్మరిస్తే నేనెక్కడ ఉన్నా నీదగ్గర రెక్కలు కట్టుకొని వ్రాలతా" నని తపస్సుకు వెళ్లాడు.

సత్యవతి పరాశర మహర్షిని – తన కుమారుని పంపి యథాప్రకారముగా యమునా నదిలో పడవ నడుపుతుంది. ఆమె శరీర సౌందర్యానికి సుగంధానికి వచ్చీపోయే వారందరూ ఆశ్చర్యమందారు. క్రమముగా అందరకూ జరిగిన చరిత్ర అవగతమయింది. తండ్రి దాశరాజు జరిగిన దానికి సంతోషించాడే గాని యేమీ బాధపడలేదు.



## కౌరవులు - పాండవుల జననం

అలా కృష్ణద్వైపాయనుడు మహత్తర తపోనిధి అయ్యాడు. రాశులుగా పడి ఉండే వేదాలను తపోశక్తితో బ్రహ్మ దేవుని ముఖాల్లాగ నాలుగుగా విభజించేడు. "జయమను" పేర యీ మహాభారతాన్ని విరచించాడు. పదునెనిమిది పురాణాలను వ్రాశాడు" అని జనమేజయ మహారాజా! మీ వంశానికి మూల పురుషుడు ఉపరిచర వసువు. "కురువను మహారాజు" నూరు అశ్వమేథ యాగాలు చేశాడు. అందువల్లనే "కురువంశం" అనే పేరు వచ్చింది. యీ వంశములో ప్రఖ్యాతిగాంచిన వాడు దుష్యంత మహారాజు.

## దుష్యంత మహారాజు

ఆతడు ప్రజారాజ్యంగా తన కన్నబిడ్డల కన్నా మిన్నగా రాజ్యాన్ని పాలించేవాడు. భూమి సస్య శ్యామలముతో ఉంది. జార చోరాదులు యేవరూలేరు. ఆకలిగలవారు గాని – అజీర్ణముగలవారు గాని యెక్కడాలేరు. (వసుంధర) బంగారం ధరించింది అని భూమి దేవి పేరు మోసింది. ఆతడొకనాడు అరణ్యానికి వేటకు వెళ్లాడు. సేనానులనూ – సైనికులను – వీరవరులనూ వెంటతీసికొని వెళ్లేడు. అరణ్యాన అనేక క్రూరమృగాల వేటలో ఆతడు బాగా అలసిపోయాడు. దాహశాంతికి ఆ సమీపాన ఒక సరోవరం కానరాగా అచటికి వెళ్లాడు దుష్యంతుడు. అచ్చట పూలతో నిండిన వృక్షాలూ – లేళ్లూ – తుమ్మెదలూ – నెమళ్లు ఆరు ఋతువుల్లో పూసి కాశి – ఫలించే వృక్షాలను తిలకించి. ఆతని హృదయం పులకించింది.

ఆక్కడ మాలినీ అనే నది ప్రవహిస్తుంది. ముని కుమారులందు స్నానాలు చేసి వేద పఠనము చేస్తూ వస్తుండగా వారి వలన అది దివ్యుడైన కణ్వ మహర్షి ఆశ్రమముగా రాజు తెలిసికొన్నాడు. వినగానే ఆతని మనస్సుయెంతో వికసించి పరిమళించి దాహం కొంత శాంతించింది. ఆ ఆశ్రమోపాంత మంతా యెంతో రమణీయ కమనీయంగా భూపాలునకు భూమిదేవి పూర్ణమైన ఉత్సాహముతో ఉడుగరలు సమర్పించినట్లుంది. సకల శాస్త్రాలూ సాకల్యముగా చతురతతో చదివి అతినియ యమ వ్రతాలతో నున్న విజ్ఞానమే రూపాన్ని దాల్చినట్లున్న తపస్వులతో కన్నులనిండుగా పండువుగా ఉన్న కణ్వమహర్షి ఆశ్రమము.

దుష్యంతుడు ఆనందముతో ఆ ఆశ్రమాన అడుగిడ్డాడు. అందుయెవ్వరూ ఆతనికి కానరాలేదు. లేళ్లు మాత్రం గంతులు వేయక పూరిమేస్తూ మెల్లగా మహారాజుకు స్వాగతాన్ని అందిస్తున్నాయి. నెమిళ్లుకూడా ఆనందంతో పురులు విప్పి ఆనందంగా ఒయ్యారాలొలికిస్తు నాట్యభంగిమలతో దుష్యంత మహారాజుకు స్వాగతం చెప్తుతున్నాయి.

మహారాజు ఆశ్రమ ద్వారం వద్ద "యెవరున్నారు" అని మృదువుగా అన్నాడు. అంతలో రూపయౌవన లావణ్యం ఒలికిస్తు రాజహంసవలె ఒక యువతి వచ్చి మహారాజ లక్షణ లక్షితుడైన ఆతనిని కాంచి "అతిథి దేవోభవా! తమకు సుస్వాగతం" అని లోనికి ఆనందంగా గొనిపోయి మహారాజుకు అర్ఘ్యపాద్యాదులర్పించి ఉన్నతాసనాన్ని సమర్పించి ఉచిత ప్రశ్నలు వేసింది. "నేను దుష్యంతుడను. ఇల మహారాజు పుత్రుడను. మహర్షి కణ్వుల వారి దివ్య దర్శనం గావించి - వారి పవిత్రాశీరుపాయనల నందగా వచ్చాను" అనగా "పితృపాదులు ఫలమూలాలకు అరణ్యానికి వెళ్లారు" అన్నది శకుంతల. "యువతీ! నిన్ను చూచి నా హృదయం యెంతగానో ఆకర్షింపబడింది. నీ తండ్రి యెవరో" అన్నాడు రాజు.

"నీవు మాత్రం క్షత్రియునికి పుట్టి ఉండాలి. లేదా పవిత్రమైన నామనస్సు యిలా ఆకర్షింపబడదు" అన్నాడు. "మహారాజా! పుట్టిన దగ్గరనుండి కణ్వమహర్షే నా తండ్రి. సర్వమూ వారే. వారే నాకు విద్యాబుద్ధులు చెప్పి యింత దానిని చేశారు. ఆ గురుపాదులుకు చెప్పి తమరు నన్ను చేకొనవచ్చును" అన్నది శకుంతల. "యువతీ! బ్రహ్మచర్య తపోనిష్ఠాగరిష్టులు. బ్రహ్మజ్ఞానులు వారికి నీవెలా పుట్టావో ఆశ్చర్యముగా ఉందే?" అనగా శకుంతల "ప్రభూ! నాపుట్టువు గూర్చి వినండి. మహర్షి వర్యులు యింకొక మహర్షి వర్యులతో చెప్పగా విన్నాను.

"మహారాజా! రాజర్షి విశ్వామిత్రుడు ఘోరంగా చేయు తపోవేడికి లోకాలన్నీ అట్టుల్లాగ ఉడికి పోతుండగా అందరూ మహేంద్రుని చేరుకున్నారు. అందచందాల్లో మేనక అగ్రేసర! విశ్వామిత్రుని తపోభంగం చేయమని ఆమెను మహేంద్రుడు పంపాడు. మేనక భయపడింది. కాని లోకాలను రక్షించాలని తానేమైనా సరే అన్నది అప్సరాంగన మేనక "ప్రభూ! నావెంట మన్మధుని - మందమలయా నిలాన్ని పంపాలి.



మలయా నిలుడు నాచీర కుచ్చిళ్లు తొడలపైకి యెగవేయాలి. అదే సమయాన మారుడు నా ఓర చూపుల్లో నిల్చి తన తూపులు వేయాలని మేనక అడగ్గా మహేంద్రుడు అన్నింటికీ ఒప్పుకొని పంపాడు.

మేనక సురపురాన్ని వీడి సుందర తపోవనాన్ని సృష్టించుకున్న విశ్వామిత్రుని ఆశ్రమ ప్రాంతములో కాళ్లగజ్జెలు మ్రోయిస్తూ అడుగు పెట్టింది. ఆమె హావ భావ విలాసరమణీయ నాట్యభంగిమలతో మహర్షి సమీపంలో నాట్యమయూరిలా నాట్యం చేయ ప్రారంభించింది. ఆమె నడల ననుసరింప రాజహంసలొచ్చాయి. నాట్యాన్ని నేర్చుకొనడానికి నెమిళ్లు వచ్చి పురివిప్పి ఆడుతున్నాయి. మహర్షి సమీపమున ఆమె నాట్యంచేస్తుండగా మలయ మారుతము నెమ్మదిగా ఆమె చీర కుచ్చిళ్లు తొడలపైకి యెత్తసాగింది. యీకలకలానికి విశ్వమిత్రుడు కన్నులు విప్పి చూసేడు. దాంతో ఆతని మనస్సు చలించింది. తదేక ధ్యానముగా ఆమె తొడల అందాన్ని ఆపోశనం పట్టి ఆమె ఓరచూపులకు గులామై దగ్గరకు పిలిచాడు. ఆమె ముసిముసి నగవులతో ఒయ్యారంగా నడుస్తూ వచ్చి ఆతని తొడపై కూర్చుంది. ఆమె తొడలు స్పృసిస్తూ యిక యేముంది? మేనకా విశ్వామిత్రులిద్దరూ యేకమై మహిమాలయమైన హిమాలయ సానువుల్లో సెలయేటి తుంపురుల్లో తడిసి అచట గుహల్లో రతిక్రీడా విలాసాలలో తేలియాడుతూ రాత్రీ పగలు తెలియక యెన్నో యేండ్లు గడిపారు. ఆ సమయాన వారికి ఒక ఆడబిడ్డ జన్మించింది. కనీసము పసికందనియైనా అనక యిద్దరూ చెరొక దారి పట్టారు. ఆ బిడ్డ యేడుస్తుండగా అక్కడ ఉన్న శకుంతపక్షులు తమ రెక్కలు విప్పి యెండ తగలకుండా ఆ పసికందును చక్కగా రక్షింపసాగాయి. సహజముగా కాముకులు వారి అవసరాలు తీరగానే యేవరి మట్టుకు వారుపోతారు. స్నానార్థం వస్తున్న కణ్వ మహర్షి ఆ బిడ్డను తీసుకొచ్చి శకుంతపక్షుల రక్షణలో పెరిగింది కాబట్టి "శకుంతల" గా పిలవసాగారు. అలా నన్ను ఆ మహర్షి చంద్రుడు తల్లీ తండ్రీ గురువూ దైవమూ తానై సమస్త విద్యలూ నేర్పేరు. మహారాజా! యిది నా జీవిత చరిత్ర" అని శకుంతల దుష్యంత మహారాజుకు చెప్పిం"దని జనమేజయునకు వైశంపాయనుడు చెప్పాడని శౌనకాది మహర్షులకు సూత పౌరాణికుడు చెప్పాడు.

"ఓ కల్యాణీ! నీవు రాజర్షికే జన్మించావు. అందువలననే నాహృదయం నీపైపడింది. రా! నన్నువివాహం చేసికో" అన్నాదురాజు. నీవురాజభోగాలన్నీ అనుభవించుతావు. యింకా సందేహమెందుకు?" అనగా "మహారాజా! మహాతపస్వియై బ్రాహ్మీమయమూర్తి యైన నాతండ్రితో చేప్పకుండా మీతో గాంధర్వ వివాహమా? మహర్షులవారి అనుమతి గొని నన్నుగొనుట నాకు సమ్మతము అన్నది. "యువతీమణీ! సందేహించకు. నీయాత్మ యేది చెప్పితే దానినేచెయ్యి. ఆత్మ అనృతము చెప్పదుకదా! యెంతకీ మహారాజు సమాధానంపడక పోవడం వలన "ప్రభూ! మీయాత్మ యేదిచెప్పితే అదిచేయండి. కాని ఒకనియమం. నాకూ మీకూ జన్మించినవాడే మీ యనంతరం రాజ్యాభిషిక్తుడవాలి. అందుకు మీరుసరే అంటే నేనూ సరే అంటాను" అన్నది.

అంత దుష్యంతుడు శకుంతలయు అట గల పొదరిండ్లలో కలిసి ఆనందముగా "ఓయువతీ! నేను నారాజధానికేగి నిన్నటకు తోడ్కొనిరావడానికి తగినట్లు రాజలాంఛనాలతో తీసుకొనిరా యెర్పాటు గావిస్తాను అని వెళ్ళిపోయాడు.

ఇంతలో దివ్యతాపసికణ్వ మహర్షి ఆశ్రమానికి వచ్చారు. యెప్పుడూ యెంతోసంతోషముతో స్వాగతోక్తులు పలుకు శకుంతల తండ్రి యేమంటారో అని సిగ్గూ భయముతో తల్లడిల్లిపోయింది. కొంతసేపటికి ధైర్యము తెచ్చికొని మహర్షి దగ్గరకు వచ్చింది. ఆమెను తనదగ్గరగా తీసికొనిలాలిస్తూ "అమ్మా! యేమిజరిగిందో వివరించు మమ్మా?" అనగా; "తండ్రీ! తమతో యేమిచేప్పాలో. యేమిచెప్పాలో తోచలేదు. ఇల మహారాజచంద్రుని కుమారుడు కురు వంశరాజు దుష్యంతుడు క్రూరమృగ వేటకువచ్చి మన ఆశ్రమానికి తమదర్శనానికి వచ్చారు. ఆయనకు నాహృదయాన్ని అర్పించి గాంధర్వ వివాహం గావించుకున్నాము. ఆదరణతో హృదయ పూర్వకముగా ఆశీర్వదించండి." అనగా! "బిడ్డా! నీవు ధర్మపరుడూ- నియమవ్రతుడూ- మహాత్ముడైన దుష్యంత మహారాజునే గాంధర్వమున వివాహము చేసికొన్నావు. నీగర్భమున ఒక చక్రవర్తి కాగలబిడ్డడున్నాడు" అని శకుంతలకు ఆశీస్సులందించాడు. మంచి సుముహూర్తాన శకుంతల ఒకకుమారుని కన్నది. ఆశ్రమవాసులంతా ఆనందించారు. ఆబిడ్డడు మాత్రము శుక్ల పక్ష క్షపాకరునివలె దిన దినాభివృద్ధి నందుతున్నాడు. సుమారు అయి దేళ్లవాడయిన ఆరాచ బిడ్డడు తనపరాక్రమముతో క్రూరసత్వ మృగాలను దువ్వి వాటిపై స్వారి గావిస్తూ నగరానికి గొనివస్తుండేవాడు. మనుజులను బాధించే పిశాచాలను గూడాచంపేవాడు. ఆతనిని "సర్వదమను" డని అందరూ కణ్వమహర్షి ఆశ్రమములో ఆబాలుని పిలిచేవారు. యిలా శకుంతలకుమారుడు మహర్షుల ఆశ్రమాలన్నీ తిరిగి వారి ఆశీస్సులను పొంది. వారికి కావలసిన పనులన్నీ చేస్తుండేవాడు. కాని దుష్యంత మహారాజు మాత్రం వెళ్లిన దగ్గరనుంచి కనీసం ఒక భటుడనైనా పంపలేదు. సంవత్సరాలు యిట్టే తిరిగి పోతున్నాయి. యిలా ఆబాలునికి పదిరెండు సంవత్సరాలు వయస్సువచ్చింది. శకుంతల రాజపుత్రుడు కనుక తనకుమారునికి అస్త్రశస్త్ర విద్యలతో పాటు శాస్త్రాలూనేర్పించింది. సర్వదమనుడు అలా అన్ని విద్యల్లో ఆరితేరినవాడయ్యాడు.

ఒకరోజు మహర్షి "బిడ్డా! యిన్నిసంవత్సరాలైనా మహారాజు నీకు వర్తమానంపంపలేదు. నీవు పరమ పతివ్రతవగుట దుష్యంతునే త్రికరణాలనమ్మి కొలుస్తున్నావు. యిక నీకడుపు పంట సర్వశాస్త్ర పారంగతుడై యువరాజ సింహాసనాన్ని అధిష్ఠించే వయస్సు కలవాడయ్యాడు. స్త్రీ యెన్నినాళ్లు పుట్టింటిలో ఉన్నా సౌఖ్యముసున్న. భర్తయే యేదుగడ. ఆతని దగ్గరే ఆమెకు సర్వసుఖాలూ లభిస్తాయి. తల్లి దండ్రులు యెంతగాచూసినా భర్తతోనున్న ఆనందానికి సరిరాదు. కణ్వమహర్షి సర్వదమనుని చూచి "కుమారా! నీవుకొందరు మునికుమారులతో కలిసి వెళ్లి





యువరాజువగుము" అని ఆశీర్వదించి శకుంతలను అత్తవారింటికి సాగనంపి పెంచిన మమకారముతో సర్వసంగపరిత్యాగియైన కణ్వమహర్షి అంతవాడుకూడా పుత్రికా యెడబాటుకు కళ్లంట నీరు తెచ్చుకున్నాడు. ఆహా! కన్న ప్రేమకన్నా పెంచిన ప్రేమమిన్న.

అలా కుమారునితో మునికుమారులతో వెళ్లినశకుంతలదర్బారులో గల దుష్యంత మహారాజు దగ్గరకువెళ్లి నమస్కరించి నిలబడింది కన్నకుమారుని వెంట పెట్టుకొని కాంతా! యిక్కడకెందుకు వచ్చావు. అనగా "మహారాజా! కొన్నాళ్లక్రిందట మీరుకణ్వమహర్షి ఆశ్రమములో నన్ను గాంధర్వ విధిని వివాహ మాడినాకు పుట్టినవానికే యువరాజ్యపదము కట్టపెడతానని యెన్ని సంవత్సరాలైనా మీరురానందులకు యీబిడ్డకు యువరాజ్యాభిషేకాన్ని కట్టమని అడగడానికి వచ్చాను." అనగా! "ఓకాంతా! నిన్ను నేను వివాహంగావించుకున్నానా? యిదంతా కట్టుకథ. వెంటనేపొమ్మా వలకు" అన్నాడురాజు.

"మహారాజా! మీమాటలు ఆత్మ సాక్షిగా వచ్చినవేనా? ఆత్మయెప్పుడూ- యెవరికీ అబద్ధము చెప్పదు. అంతేకాదు మనము కన్నులు మూసుకొనిగావించిన కార్యాలన్నీ యీపంచ భూతాలూ తిలకిస్తూ ఉన్నాయి. యిందరూ మనకు సాక్షులే! యిక యీ దర్బారులో నన్నెవ్వరూ యెరుగరు. నన్ను యిలా యిందరిలో అవమానించి నవ్వుల పాలుచేయడానికి చూస్తున్నావా? మీపితృదేవతలు- మీరు పున్నామనరకమునుండి బయటపడడానికి పుత్రుడు కావాలి.

భార్యను సక్రమముగా గౌరవించి- ఆమెకు తనవలన కలిగిన సంతానాన్ని తగినట్లు ఆదరించిన నాడే పురుషునకు గౌరవభాగ్యాలుంటాయి. లేనివాడు రెంటికిచెడిన రేవడే అవుతాడు. భార్యా భర్తల యిద్దర ప్రతిరూపమే బిడ్డ. ఆ బిడ్డ మా ప్రతిరూపమని తల్లి దండ్రు లానందించాలి. వారిదే నిజమైన దాంపత్యము. లేనివారికి ఆ సౌభాగ్యం దూరమౌతుంది. సృష్టిలో ప్రతిజీవితమ సంతానాన్ని యెంతగానో ప్రేమించి ఆదరాభిమానాలతో చూస్తాయి. యింక మానవులగూర్చి చెప్పనక్కరలేదు. "మహారాజా! యీ నీకుమారుని ఒక్కమారు అక్కున చేర్చుకొన్న మంచిగంధము కన్నా మీమనస్సుకు ఎంతో సుగంధంతో చల్లదనమూ హాయిని అందుకోండి. మీరు సత్యాన్ని ధర్మాన్నీ మరువకండి. యీసృష్టిని సత్యధర్మాలు రెండే నడుపుతున్నాయి. "శకుంతలా! స్త్రీలు యెంతకైనా తెగించినవారే." అనగా! "మహారాజా! యింతైనా ముందుచూపులేని మీవంటి కాములను చేపట్టడం నాదే పొరపాటు మీరేదో చంద్రవంశములో పుట్టిన రాజచంద్రులనుకున్నాను. యింతటి మాయదారులని అప్పుడు తెలిసికొన లేక పోయాను.

కామం కళ్లు మూసుకు పోతుందన్నారు. అదినా పట్ల సరిగ్గా సరిపోయింది. లేకున్న పుట్టిన నాటినుండి అతిగారాబంగా పెంచి విద్యాబుద్ధులతో పెంచి పెద్దగావించే మహర్షి నాతండ్రి కణ్వుడుతో నైనా చెప్పువరకూ అవకాశాన్నివ్వక

మాయ మాటలతో నన్ను నమ్మించి యిప్పుడిలా మాట్లాడిన మీరాజరికమును యేమనాలి? గర్భవాసమున పుట్టిన బిడ్డను ఆదరించలేకపోతే అటువంటివారు నరకములో కూరుకుపోతారు;. కుమారునిజూపి యిదిగో యీనీకుమారుని పోలికలన్నీ మీవే! వీని ఆపాదమస్తకం సర్వ రాజ్యరమామణిని పాలించే మహాశక్తిని మీరు కాంచలేదా! నేను నీకు అర్థాంగిని. త్రికరణాలనిన్నే? నమ్మిన దానను మమ్ముకాదని అనకండి.

రాజు తన దర్బారులోగల జ్ఞానులు పెద్దలందరినీ జూచి "మహాత్ములారా! యిప్పుడు అశరీరవాణి వాక్కులన్నీ మీరందరూ విన్నారుకదా! ముందుగా యీశకుంతలను నాభార్యగా చెప్పితే మీకందరికీ అనుమానము వచ్చునుకదా!" అని సర్వదమనుని కుమారుని ఆనందముతో తీసికొని తలస్పృశించగా దేవదుందుభులు మ్రోయగా- దేవతలు పుష్పవృష్టికురిపించారు. వేదపండితులు వేదాశీస్సులందించారు. శకుంతలను జూచి "ప్రియా! నీవువచ్చిన వెంటనే నిన్ను నేను స్వీకరిస్తే యీ సభా సదులూ- పౌరులూ శంకిస్తారు. మనము గాంధర్వ వివాహం గావించుకున్నామని యెరుగరు. సర్వ ధర్మాలూ ఆశ్రమ వాసివైన నీకు తెలుసు. నా పొరపాటుకు మన్నించు. నన్ను వేరు విధంగా మాత్రం యేమాత్రం భావించకు" అన్నాడు దుష్యంతమహారాజు. అంతఃపురానికి తల్లీ కుమారులను తీసుకెళ్లి మహారాజు అచ్చట గలవారందరికీ వారిద్దరినీ పరిచయముగావించాడు. అందరూ ఆనందించారు. సర్వదమనునిలో గల రాజలక్షణాలన్నీజూచి యిది వరకు యీ చంద్రవంశములో యిన్ని క్షాత్రవలక్షణాలు గలజ చంద్రుడు లేడని వేనోళ్లపొగడారు.

వేదవేత్తలందరినీ పిలిచి దుష్కంతమహారాజు తన కుమారునకు "భరతు" డని పేరుపెట్టారు. ప్రజలందరి సమక్షమున భరతునకు యౌవరాజ్యాభిషేకముగావించాడు మహారాజు. దుష్యంతుడు చాల కాలం రాజ్యాన్ని పాలించాడు. అనంతరం భరతుడు భారతరాజ్యాన్ని పాలిస్తూ ప్రజారాజ్యముగా ప్రజలందరిచేతా మెప్పులంది పెద్దలందరినీ గౌరవించి కణ్వమహర్షి అధ్వర్యములో అశ్వమేధాది క్రతువులుచేసి భూరి దక్షిణలిచ్చి రాజ్యపాలన గావించాడు.

## కచుడు-దేవయాని

శుక్రాచార్యుడు రాక్షసులకు గురువు. దేవతలూ- రాక్షసులూ తల్లులు వేరైనా తండ్రి మాత్రము కశ్యపమహర్షి ఒక్కడే అయినా దుర్మార్గులైన రాక్షసులు- సాత్వికులైన దేవతలను యెప్పుడూ చంపుతుండడము జరుగుతుండేది. రాక్షసులు చనిపోగా శుక్రుడు మృతసం జీవినీ విద్యతో రాక్షసులను బ్రతికిస్తుండేవాడు. దేవతలు మాత్రం ఆ మృతసంజీవినీ విద్య యెరుగరు. యిలా ఉండగా దేవగురువు బృహస్పతి శుక్రాచార్యుల దగ్గరకు తనకుమారుని కచుని మృతసంజీవినీ విద్య నేర్చుకోడానికి



పంపాడు. కచునిలో సంయమనం- ధర్మశీలం. సునిశిత ప్రజ్ఞాపాటవాలు- యెదుటి వారిని మెప్పించగల శక్తి మిక్కుటంగా ఉన్నాయి. శుక్రాచార్యులవారి దివ్యాశ్రమము అతిప్రశాంతిగా ఉంది. వినయ వివేకాలుగల కచుడు శుక్రునికి అభివాదముచేసి మహాత్మా! నేను ఆంగీరసుని మనుమడను. బృహస్పతి కుమారుడను. నాపేరు కచుడు నమస్కరిస్తున్నా"నని చెప్పాడు. ఆతనికి పాదాభి వందన గావించాడు. తమ కటాక్షముతో విద్య నేర్చుకోవడానికి వచ్చాను" అన్నాడు.

"నాయనా! నీవినయ సంపత్తి నా హృదయాన్నాకర్షించింది. నీవంటి కుమారునికన్న బృహస్పతి ధన్యుడు" అన్నాడు. యిక కచుడు గురుదేవుని కార్యక్రమాలన్నీ ఆయన చెప్పకుండానే సక్రమంగా చేస్తూ శుక్రుని మనస్సుకు ఆనందాన్ని కలిగించాడు;. యిలా తమకంటే దగ్గరయి గురునికి ప్రేమపాత్రుడవడం రాక్షసులకు కళ్లుకుట్టాయి. మామూలుగా కచుడు ఆశ్రమము లోని పనులన్నీచేసి గురువుగారి ఆవులనుతోలుకొని అరణ్యానికి వెళ్లడం అలవాటు. సమయానికి వేచి ఉన్న రాక్షసులు ఒంటరిగా ఉన్న కచుని అడవిలో చంపివేశారు. "సాయంసమయమైనా కచుడురాక గోవులు మాత్రం వచ్చాయి." అని మొదటినుండి కచుని అభిమానించే శుక్రాచార్యులు కూతరు దేవయాని యేడుస్తూతనతండ్రి దగ్గర మొరపెట్టుకుంది. "తండ్రీ! యేలాగైనా కచుని మీరు తీసుకురావాలి. లేకున్న నేను బ్రతక"నని పట్టు పట్టుకుకూర్చుంది; అప్పుడు శుక్రుడు మృతసంజీవినీ మహా విద్యతో కచుని బ్రతికించాడు. కచుడు ఆశ్రమానికి రాగా పరుగు పరుగున దేవయాని వెళ్లి కచుణ్ణికలిసి విషయము అడగ్గా, కచుడు ఆమెకు జరిగినదంతా చెప్పాడు. ఆమెయెంతో బాధపడింది. మరల అరణ్యానికి కట్టెలూ దర్భలూ తేవడానికి వెళ్లిన కచుని చంపి శరీరాన్ని భస్మంచేసి సాగరంలో వేశారు.

రాక్షసులు చేసిన అన్నిపనులకూ శుక్రాచార్యులు కచుని జీవింపచేశాడు. యిలా యెన్నో విధాల కచుని హింసించినా శుక్రుడు బ్రతికిస్తుండగా- రాక్షసులందరూ ఆలోచించి- శుక్రునికి బ్రతికించడానికి వీల్లేనట్లుగా కచుని శరీరాన్ని బూడిదచేసి మద్యములో కలిపి శుక్రాచార్యులకీయగా అతడు దానిని త్రాగివేశాడు. దేవయాని కచుడు లేక పోవడముచూసి తండ్రి దగ్గరకు వెళ్లి చెప్పింది. దాంతో శుక్రుడు తపోనేత్రముతో చూడగా, విషయ మంతా ఆతనికి కానుపించింది. యింతలో యేడుస్తూ శుక్రుని ముద్దుల కూతురు దేవయాని వచ్చి యెలాగైనా కచుడు లేని జీవితము నేను జీవింపలేనన్నది. అప్పుడు శుక్రుడు మద్యము వలన యింత వరకు వచ్చినదని తాను ఆరోజునుండి త్రాగడమేగాక, శిష్యులను బాగా తిట్టి తనతప్పు తెలిసి కొన్నాడు. సురాపానము యెన్నో అనర్థాలకు కారణమని తెలిసికొన్నాడు.

కచుడు యెక్కడోలేడు. తన పొట్టలోనే ఉన్నాడు. అందువలన తనగర్భములో నున్న అతనికి మృతసంజీవినీ విద్య నేర్పాడు.

కచుడు శుక్రాచార్యుని పొట్ట చీల్చుకొని వచ్చాడు. చనిపోయిన ఆచార్యులను వెంటనే మృత సంజీవినీ విద్యతో బ్రతికించాడు. శుక్రుడు యెంతో సంతోషించాడు. కచుని విద్యాభ్యాసము పూర్తి అయిందని దేవలోకానికి వెళతాడని తెలిసిన దేవయానికి నిద్దరపట్టడంలేదు. ఆమె ఒంటరిగా కచుని కలిసి తనప్రేమను వెలి బుచ్చగా "గురుపుత్రీ! నీవు నాకుసోదరివి. యెంతమాత్రం నీయభిప్రాయము కుదరదనగా దేవయాని "ఓరీ! యిన్నిరోజులూ నీకొరకు కాచుకొనియున్న నాకు తగినట్లు బుద్ధిచెప్పావు." నీవు యే మృత సంజీవినీ విద్యకొరకై యిక్కడ పడరాని పాట్లుపడి యెన్నిమార్లో చచ్చిబ్రతికావో! అలాబ్రతకడానికి కారణ మెవరో ఉహించావా? అట్టి నాప్రణయాన్ని తిరస్కరించిన నీపై ప్రళయాన్ని చూపిస్తాను. "మృతసంజీవినీ విద్య నీకుపని చేయకపోవుగాక!" అని కచునికి శాపమిచ్చిందామె.

దానికి కచుడు సహజశాంతుడై "ఓకామపిశాచీ! నాకుకాకపోయినా– నేను ప్రయోగించిన వారిపై పని చేయుగాక! యిదిగో నా ప్రతిశాపాన్ని నీవు పరిగ్రహించు. నిన్ను బ్రాహ్మణుడెవరూ వివాహమాడకుండుగాక" అని శాపమిచ్చి కచుడు దేవలోకానికి వెళ్లాడు. కచుని సాహసానికి సమయస్ఫూర్తికి– క్షమాగుణానికి దేవేంద్రాదులందరూ యెంతగానో ఆతనిని మెచ్చుకున్నారు.



## యయాతి మహారాజు

కచుని శాపముతో కంగారు పడింది దేవయాని. యిలాకాలము చక్రము లాగు తిరుగుతుండగా ఒకనాడు మహారాజ పుత్రి శర్మిష్ట దేవయాని చెలులగూడి ఉద్యాన వన సరస్సులో జలక్రీడల్లో తేలి అనంతరం శర్మిష్ఠ పొర పాటుగా దేవయాని చీరను దాల్చింది. అహంకారి యైన దేవయాని "ఓసీ! శర్మిష్ఠా! నేనెవరినో తెలియునా? రాక్షస జాతికే గురువు. తపోధనుడైన శుక్రాచార్యుల ముద్దుల కుమారిని. అటువంటి నా చీరను తేరి పార చూడ్డానికి కూడా తగని నీవు నాచీరనే ధరిస్తావా? యెంతసాహసమే నీది?" అని గర్వంతో అహంకరించింది దేవయాని.

శర్మిష్ఠ "చాల్లేవే! నీవూ నీయహంకారమూ యేమిచూసి యిలా మిడిసి పడుతున్నావు. నాతండ్రి యీదేశానికే మహారాజు. అయినంత మాత్రాన అహంకరించాలా? చాలుచాలు" ననగా; దేవయాని రెచ్చిపోయింది. యింతలో శర్మిష్ఠ దాసీలతో దేవయానిని సమీపానగల పాడునూతిలో త్రోసివేయించి వారు వెళ్లిపోయారు. నూతిలో దేవయాని విచారముతో అలా ఉండిపోయింది. దైవవశాత్తు యయాతి మహారాజు వేటకు వచ్చాడు. ఆతనికి దాహం మిక్కుటము కాగా దేవయాని ఉన్న నూతి లోనికి తొంగిచూడగా! అందాలభరణిలాగున్న దేవయాని కానుపించింది. నగ్నముగా ఉన్న ఆమెకు తన ఉత్తరీయాన్నందించి ఆమెను కట్టుకొమ్మని ఆమెహస్తాన్ని పట్టుకొని పైకితీశాడు. దేవయాని తనకు పాణిగ్రహణముచేసినవాడు నహుషునికుమారుడని తెలిసి యెంతో ఆనందించింది.



"మహారాజా! నగ్నంగా ఉన్న నాశరీరాన్నంతా తిలకించి నాకుడి చేయిపట్టుకున్న నీవే నాకు భర్తవు" అని దేవయాని తలవంచింది. "ఓ యువతీ! లోకపూజనీయుడైన ఆచార్య శుక్రులవారి ముద్దు కుమారివి. వారి అనుగ్రహము లేకుండా నిన్ను భార్యగా స్వీకరిస్తే వారికోపశాపాగ్నికి గురికావాలి. వారి అంగీకారమున నిన్ను చేపడతాను" అన్నాడు యయాతి రాజు వెళ్లినాడు. దేవయాని తనకు శర్మిష్ఠగావించిన అవమానానికి ప్రతిగా శర్మిష్ఠతనకు దాసీగాచేయనిదే యింటికి రానని తన తండ్రకి దేవయాని వర్తమాన మంపింది. శుక్రునికి దేవయాని మీద అపారమైన ప్రేమాభిమానాలు. అందువలన రాక్షస చక్రవర్తికి ఆవిషయాన్నే తెలియజేశాడు. తన కుమార్తెకు జరిగిన పరాభవానికి ప్రతీకారము యెలాగైనా తీర్చికొనాలని పట్టుబట్టాడు.

వృషపర్వ మహారాజు తల పట్టుకొని కూర్చున్నాడు. గురువుగారంపినవార్త తలపై పిడుగు పడ్డట్లు అయింది. యిదంతా తెలిసిన శర్మిష్ఠ తండ్రి దగ్గరకు వచ్చి "తండ్రీ! మీరు విచారింప నక్కరలేదు. గురుపుత్రిక దేవయానిని నా దాసదాసీజనముతో సేవిస్తూ మీవిచారాన్ని పోగొడతాను" అన్నది. అలా కొంతకాలము గడువగా దేవయాని తన చెలులతో ఉద్యానవనానికి విహారానికి వెళ్లింది. అచ్చటగల చిలుకల పలుకు – కోయిల పాటలూ – నెమిళ్ల నాట్యాలు – గండుతుమ్మెదల ఝుంకారాలకు పులకింప అచట క్రీడాసరస్సులలో ఓలలాడుతూ అందరూ పరమానందముతో తిరగుతున్నారు. అదే సమయానికి యయాతిమహారాజువచ్చాడు. మహారాజపుత్రియైన అందచందాలతో తులతూగు శర్మిష్ఠపై ఆతని కన్ను పడింది. దేవయాని తనూ కలయిక ఆతడు మరిచిపోయాడు. దేవయాని ఆతనిని చూసి "మహారాజా! యెందుకలా చూస్తున్నారు? వీరందరూ నాదాసీగణం. అందులో పెద్దదాసి శర్మిష్ఠ" అని నర్మగర్భంగా అన్నది. "ఓ యువతీ! నేను యయాతిని సమస్త శాస్త్రాలూ చదివి బ్రహ్మచర్య దీక్షలో నున్న మహారాజును" అని దేవయానికి ఆతని చరిత్ర చెప్పాడు. అప్పుడు దేవయాని పట్టరాని ఆనందముతో పూర్వము జరిగిన విషయము గుర్తుకు తెచ్చి ఆమె తన తండ్రి దగ్గరకు దాసదాసీ జనముతో మహారాజును తీసుకొని వెళ్లింది. శుక్రాచార్యులు. విషయమంతా తెలిసి సంతోషించాడు.

దేవయాని యయాతి మహారాజుల వివాహము శుక్రాచార్యులు స్వయముగా జరిపించి మహారాజా! దేవయానిలాగే యీ శర్మిష్ఠను చూడాలి. కాని రతిక్రీడలో మాత్రము పరిత్యజించాలి. యీ నియమాన్ని మాత్రము అతిక్రమించరాద"ని హెచ్చరించాడు. రాజు అందరితో కలిసితన రాజధానికి వెళ్లాడు. శర్మిష్ఠకు మాత్రము ఒక భవనాన్ని నిర్మించి ఆమెనందుంచాడు; యిలా కొంతకాలము జరగ్గా, శర్మిష్ఠ దేవయాన్ని చూసి "దేవయానీ! నేనూ నీవంటి దాన్నేకదా! నాకు మాతృమూర్తిని అయ్యే యోగాన్ని ప్రసాదింపమని దీనముగా కోరింది. దేవయాని శుక్రాచార్యునితో

సంప్రదించమన్నది. అలాగే యయాతిని వేడి "మహాత్మా! నాకు మాతృత్వం ప్రసాదించండి. ఋతుమతినై యున్నాను. భర్తృసమాగమానికై యెదురుచూస్తున్నాను. కాదనకండి?" అని వేడుకొంది. యాయాతి అలాగే ఒప్పుకున్నాడు.

శర్మిష్ఠ అలాగ పుత్రుని కన్నది. దేవయానికి తెలిసి "అధర్మమన్నది "కాదు? నాభర్తకు నేను పుత్రుని కన్నాను ధర్మమే అన్నది. అలా యయాతి మహారాజుకు దేవయాని యిద్దరు కుమారులను – శర్మిష్ఠ యిరువురు పుత్రులను కన్నారు. దేవయాని యదు – తుర్వసులు కన్నది; శర్మిష్ఠ – దృహ్యుడు – అనువు – పూరులను కన్నది. శర్మిష్ఠ కుమారులు దినదినాభి వృద్ధితో పెరుగుతున్నారు. యిలా ఉండగా ఒకరోజు దేవయాని యయాతి మహారాజు క్రీడావనవిహార సమయాన శర్మిష్ఠ కుమారులు దేవయాని కంటపడ్డాడు. "ప్రభూ! అటుచూడండి. అచ్చంగా మీలాగేఉన్నారు. వారెవరో" అని ఆమె ఆకుమారులను మీ తలిదండ్రులెవరని అడగ్గా, వారు శర్మిష్ఠ – యయాతి మహారాజులని చెప్పారు. రాజు వైపు చూడగా రాజు మారుమాటాడలేదు. యిక దేవయాని అపరిమితమైన కోపము తెచ్చుకొంది.

శర్మిష్ఠ దగ్గరకు దేవయాని వెళ్లి "శర్మిష్ఠా! యెంత నంగనాచివే" అనగా "దేవయానీ! నీవివాహపు దినాన్నే నేనూ యయాతి మహారాజును వివాహం గావించుకున్నాను. నీలాగే పిల్లలనుకన్నాను. నీవు పెద్ద – నేను చిన్న యింతే తేడా! మహారాజు పోషణలో నుండే నేను ఆతని వలన యీ బిడ్డలను కనడంలో ఆశ్చర్యమేముంది? నీవిందుకు ఆగ్రహము చెందనక్కరకూడాలేదు. దేవయాని శుక్రుని వద్దకేగి "తండ్రీ! యెంత జరిగిందో చూడు. యయాతి కూడా దేవయానితో భయముతో వెళ్లాడు. "ఓరీయయాతీ! యింతకు తెగించే నీవు యే యవ్వనాన్ని చూసి నామాటను కూడా ధిక్కరించావో! ఆ యవ్వనము పోయి వార్ధక్యము వచ్చుగాక!" అని శుక్రుడు శాపమిచ్చాడు. "ఆచార్యా! నాదే తప్పు తమరు కటాక్షించండి. యింకా దేవయానితో కామోపభోగాలందాలని ఉంది. యీ శాపాన్ని బాపండి" అని శుక్రుని కాళ్లమీద పడి అతి దీనముగా వేడుకోగా "ఓరాజా! నా శాపముతప్పదు. కాని నీకుమారులలో యెవరైనా నీవార్ధక్యం తీసికొని వారియవ్వనము నీకీయవచ్చు. యింతే మార్పు చేయగలను" అన్నాడు శుక్రుడు. యయాతి తన పుత్రులను పిలిచి యీ విషయము చెప్పగా తండ్రీ! ముసలితనమును మించిన కష్టము మరిలేదు. అన్నాడు యదువు. ఓరి మూర్ఖుడా! నామాటనే తిరస్కరిస్తావా? నీకూ నీ సంతతికీ రాజ్యార్హత లేదు పొమ్మన్నాడు. యేకుమారుడూ ఆతని మాటను వినలేదు. కడకు "పూరువు" అనుకుమారుడు "తండ్రీ! యీ శరీరము తమరిచ్చినదే కదా! యెప్పుడో ఒకప్పుడు యీ శరీరానికి ముసలి తనము రాక తప్పదు కదా! అని తండ్రి ముసలి తనాన్ని హృదయపూర్వకముగా అంగీకరించాడు. వెంటనే ఆతనికి ముసలి తనము వచ్చింది. యయాతి ఆతనికి రాజ్యాన్నిచ్చి అంతఃపురాన దేవయానితో యిష్టకామ్యార్థాలలో మునిగి తేలుతున్నాడు. యెంత అనుభవించినా





యీ కామాభోగాలకు తృప్తిలేదని తెలిసిన యయాతి రాజు యాగాలు యోగాలు త్యాగాలుగావించాడు. అప్పుడు పూరువును పిలిచి" కుమారా! అనుభవించిన కొలదీ స్త్రీ వాంఛ పెరుగుతుంది. నేయి వేసిన కొలదీ అగ్ని హోత్రునిలాగు దీనికితగ్గడమంటూ ఉండదు.

మంత్రి పురోహిత – దండనాథాదుల సమక్షమున ప్రజలందరి దగ్గర యయాతిరాజు "జ్యేష్ఠునదే రాజ్యం అయినా నామాటకు యెదురాడి నన్ను తిరస్కరించాడు. అందువలన యీరాజ్యాధిపతి వాడెంత మాత్రమూకాడు. తండ్రి మాటను శిరోధార్యముగా శిరసావహించిన వాడే కుమారుడు. తక్కిన వాడు కుక్కిమంచము దొడుకు. అందునకు యీ "పూరుడే" రాజ్యార్హుడని" ఆతనికే తన రాజ్యాన్ని పట్టముగట్టాడు యయాతి. సద్గుణ సంపన్నుడైన యీతడే అని సింహాసనముపై ప్రజలందరూ ఆతనిని కూర్చుండ బెట్టారు. యయాతి తన యౌవనం తన కుమారునకిచ్చి వానప్రస్థుడై అరణ్యానికి వెళ్లి అచ్చట తపస్సు చేసి తరువాత తన భౌతిక కాయాన్ని త్యజించాడు. "పూరుడు" వలన అభివృద్ధి అగుటచేత "పూరువంశము"ని దీనిని అందరూ అన్నారు.

యీ కురు – లేక పూరువంశానికి ఘనతరమైన కీర్తి తెచ్చాడు ప్రతీపుడను రాజచంద్రుడు. అనంతరము ఆతనికి ముగ్గరు కుమారులు కలిగారు 1. దేవాపి; 2. శంతనుడు; 3. బాహ్లికుడు. అందు పెద్ద వాడు దేవాపి తనకు రాజ్యము చేయడము యిష్టములేదని అరణ్యానికి పోయి తపోధనుడయ్యాడు. తరువాత శంతనుడు పూరు వంశానికి రాజైనాడు. ప్రతీపరాజు గంగాతీరములో తపస్సు గావిస్తుండగా, మహాసుందరుడైన ఆతనిని కామించి పరమ పావనియైన గంగాదేవి శృంగారాంగనయై ఆతని కుడి తొడపై కూర్చుంది. దానికి రాజు "ఓయువతీ! నీవెందుకొచ్చావనగా" నేను గంగాదేవిని నిన్ను కామించి వచ్చానన్నది. "సరే కాని ఓకాంతా! నేను పరస్త్రీని మాతృదేవిలాగ చూస్తాను. అంతేకాక నీవూ నాకుమారుడుండ వలసిన కుడి తొడపై కూర్చున్నావు. అందువలన నాకుమారునికి నీవు భార్యవగుదువుగాక" అని వరమిచ్చాడు ప్రతీప మహారాజు.

అంత కొన్నాళ్లకు శంతనుడు గంగాతీరప్రాంతానికి రావడం జరిగింది. అక్కడ గంగాదేవి శృంగార దివ్యాంగన రూపముతో నడయాడుతుంది. శంతనుడు ఆమె లావణ్య యౌవ్వనాదులు చూసి పులకించాడు. గంగాదేవి కూడా తన కామానురాగాన్ని బయటపెట్టి మనసు ఆమె ఆతని కర్పించింది. శంతనుడూ ఆమెకు బద్ధుడై నిలిచాడు. రెండు హృదయాలూ పరస్పరము చేరువయ్యాయి. పెదవి పెదవులు కలిసాయి. మహారాజా! నేను నిన్ను మనఃపూర్తిగా ప్రేమించడానికి అభ్యంతరము లేదు.

"మహారాజా! నామాటకు మీరు యెట్టి పరిస్థితుల లోనూ యెదురు చెప్పరాదు. అలా మీరొప్పుకున్న తప్పక మీ కర్ధాంగి నౌతాను" అన్నది గంగాదేవి. శంతనుడు దానికి సమ్మతించాడు. అనంతరం గంగాశంతనులకు సశాస్త్రీయముగా

హస్తినాపురములో మహావైభవముగా వివాహము జరిగింది. యిలా గంగా శంతనులు సంసార రసాన్ని ఆస్వాదించగా తనకు కలిగిన వరుస క్రమముగా యేడుగురు కూమారులనూ గంగాదేవి పుట్టిన వెంటనే గంగలో కలిపేశింది. శంతనుడు మాత్రం ఆమెకుయెదురు చెప్పడంలేదు. అడిగితే వెళ్లి పోతుందనే బాధ ఒక ప్రక్క, పుట్టిన ప్రతిబిడ్డను గంగలో కలిపేయడం ఒక బాధగా ఆతడు అనుభవిస్తున్నాడు. యింతలో యెనిమిదవ బిడ్డను గంగాదేవి కన్నది. ఆ బిడ్డను యెత్తుకొని మామూలు ప్రకారముగా గంగాదేవి బయల్దేరగా శంతును డడ్డువచ్చాడు.

"మహారాజా! మన వివాహం ముందు నా అభిమతానికి అడ్డురానన్నావు. యిప్పుడు మాట తప్పి నన్నడ్డుకున్నావు. అందువలన నేనిదే వెళ్లుచున్నాను. దీనికొక పరమ రహస్యం కూడా ఉంది. వసువులు యెనమండుగురూ నాగర్భాన పుట్టారు. అందు యేడుగురికీ శాపవిముక్తి జరిగింది. యెనిమిదవ వాడు నీకుమారుడు నిన్నానందింప చేస్తాడు. యీ మన కుమారుడు దేవవ్రతుడను నామముతో చిరకాలం భూమ్మీద ఉంటాడు. యీతడు పెరిగి పెద్దవాడైనంత వరకూ నాదగ్గరే పెరుగుతాడు. సకల విద్యలూ వీనికి నేర్పించి అప్పుడు నీదగ్గరకు పంపుతా" నని గంగాదేవి తన కుమారుని తీసికొని వెళ్లింది.



ఇలా శంతన మహారాజు రాజులందరిలోనూ మంచికీర్తి నార్జించాడు. ప్రజాపరిపాలనలో – దానదయ ధర్మ సత్యకర్మలందు కూడా అందరికన్నా మిన్నగా ప్రఖ్యాతి వహించాడు. ఆతని పరిపాలనలో లేమి లేకుండా పోయింది. భూమి సస్య శ్యామలమై కరువూ కాటకాలు లేకుండా, జారచోరులు లేకుండా ప్రజలు అన్నివిధ ఆనందాలతో ఉన్నారు. దేవవ్రతుడు గంగమ్మ పెంపకములో యెంతగానో సమస్త శస్త్రాస్త్ర విద్యలు ఒక ప్రక్క క్షాత్రవ విద్యలు వేరొక ప్రక్క శాస్త్ర విద్యలు నేర్చుకున్నాడు. శంతన మహారాజు ఒకనాడు వేటకు వెళ్లగా గంగానదీ ప్రాంతమున దివ్య తేజముతో మెరుస్తున్న యువకిశోరాన్ని చూసి తనకుమారుడుగా గుర్తించాడు. ఆ కుమారుని తన రాజధానికి తీసికొని వచ్చి యువరాజ్యాభిషేకం చేశాడు మహారాజు.

మామూలుగా శంతనుడు యమునా నదీతీరాన సంచరించగా అచ్చట ఒక సుందరీమణిని చూచి మనస్సువ్వెళ్లూర్చసాగాడు. యమునానదిపై పడవ గడుపుతుంది. ఆమె రూపలావణ్యాలకు శంతన మహారాజు ముగ్ధుడై "కాంతా నీవెవ్వరవు. నీవంటి అందాలరాశి యిలా పడవ నడిపి జీవించడమా?" అనగా; "మహాభాగా! నేను మత్స్యరాజు కుమార్తెను. సత్యవతి నానామధేయం. వచ్చేపోయే జనాలను యమునా నది ఆవలగట్టూ – యీవలి గట్టుకు చేరవేయడమే నావృత్తి – నా జీవనం కూడా. అనగా శంతనుడు మత్స్యరాజు దగ్గరకు వెళ్లి "ఓమత్స్యరాజా! నీకూతురును నేను వివాహము గావించుకుంటూ" ననగా; ఓమహారాజా! మీకు నాబిడ్డ నీయడం నాకిష్టమే కాని, ఆమెకు జన్మించిన వానికి మీ రాజ్యాభిషేకం చేయాలి. అలా మీకు సమ్మతమైతే మాకూ సమ్మతమే. శంతనునకు యేమీతోచలేదు.



తనకు చెట్టంత కొడుకుండగా యీమెకు పుట్టిన వానికే రాజ్యాభిషేకము యెలా చేస్తాడు? విచారంతో యింటికి వచ్చాడు. యెక్కడ చూసినా ఆమెయే కాన్పిస్తుంది శంతన మహారాజుకు మనస్సు మనస్సుగాలేదు. యేమి చేయడానికీ పాలుపోలేదు. యింతలో గంగానందనుడు మంత్రిముఖముగా తెలిసికొని తిన్నగా మత్స్యరాజు దగ్గరకు వెళ్లి "మత్స్యరాజా! మీ అమ్మాయి సత్యవతమ్మ మా తండ్రి శంతనమహారాజునకిచ్చి వివాహముగావించుము. ఆమెకు పుట్టిన వానికే రాజ్యాభిషేకంగావిస్తాను" అన్నాడు. అప్పుడు మత్స్యరాజు "కుమారా! మీరు రాజ్యాన్ని వదులు కుంటారు. బాగానే ఉంది. తరువాత నీకొడుకులు నీ అనంతరం ఊరుకుంటారా?" అన్నాడు.

వెంటనే దాశరాజా! నేను నా తండ్రి సుఖానికి యిలా బ్రహ్మచర్యనిష్ఠా గరిష్ఠుడనౌతాను. యిదే నాశపథము" అనగా దేవతలు పుష్పవృష్టి కురిపించారు. అలా భీష్మించుటచేత దేవవ్రతుడు భీష్ముడైనాడు ఓ శౌనకవాది మహర్షుల్లారా? అని సూతపౌరాణికుడు చెప్పాడు. సత్యవతిని భీష్ముడు రాజధానికి తెచ్చి అందరి సమక్షాన సత్యవతీ శంతనులకు వివాహం జరిపించాడు. తరువాత కొంత కాలానికి శంతన మహారాజు చిత్రాంగద విచిత్ర వీర్యులను కుమారులను కన్నాడు. యింతలో శంతనుడు స్వర్గస్థుడయ్యాడు. తల్లి యైన సత్యవతి భీష్ముని యందు అపారమైన ప్రేమాభిమానా లుంచేది. ఆమె అభిప్రాయమున భీష్ముడు చిత్రాంగదునికి రాజ్యాభిషేకము చేయించాడు. తాను రాజ్య ప్రతినిధిగా భీష్ముడు సర్వమూ నిర్వహించేవాడు.

చిత్రాంగదుడు ఒకగంధర్వునితో యుద్ధముగావించి ఆతని చేతిలో చనిపోయాడు. మరల భీష్ముడు విచిత్ర వీర్యునికి పట్టాభిషేకము గావించాడు. కాశీరాజు పుత్రికలు అంబ–అంబిక – అంబాలికలకు స్వయంవరము ప్రకటింపగా భీష్ముడు ఆ ముగ్గరు కన్యకలను తమ్ముని కొరకై తీసుకువచ్చాడు. యెదిరించిన రాజుల నందరగెలిచాడు. అంబ నేను సాళ్వరాజును ప్రేమించా ననగా ఆమెను విడిచిపెట్టి అంబిక – అంబాలికలను విచిత్ర వీర్యనకిచ్చి ఘనముగా వివాహముగావించాడు భీష్ముడు.

అంబ సాళ్వుడు కాదన్నాడని తిరిగి వచ్చి భీష్ముని వివాహము చేసికొనమని యెంతేని పట్టుపట్టింది. భీష్ముని వదలలేదు. భీష్ముడు తన ప్రతిజ్ఞ మాత్రము విడవనన్నాడు. యిలా ఉండగా నిరంతరమూ కామలీలల్లో తేలియాడి విచిత్ర వీర్యుడు ప్రాణాలు గోల్పోయాడు. యిక సత్యవతి అపారమైన చింతకు లోనైంది. రాజ్యాధికారి లేడు. అందువలన భీష్ముని పిలిచి "కుమారా! నీకు తెలియని ధర్మరహస్యాలు లేవు. మనవంశము యింతటితో అంతము కావలసినదేనా? మనకు దేవర న్యాయమున్నదికదా! దాని ప్రకారముగా నీ మరదండ్రయందు నీవు సంతానాన్ని

కని మన పూరువంశాన్ని నిలబెట్టాలని యెంతగానో బ్రతిమాలింది. కాని భీష్ముడు ససేమిరా ఒప్పుకొనలేదు. పోనీ రాజు లేని రాజ్యము అనేక దుష్పరిణామాలకు దారి తీస్తుంది. జారచోరాదులు దండనలేక మితిమీరుతారు కనుక నీవుయీ రాజ్యాధికారాన్నైనా చేపట్టుమని యెంత బ్రతిమాలినా భీష్ముడు తన ప్రతిజ్ఞ విడువనన్నాడు. యిక సత్యవతికి మరింత మన స్థాపము యెక్కువయింది. యింక యేదిక్కు? అని విచారింపగా తన పెద్ద కుమారుడు పరమతపోనిధి వ్యాసమహర్షి జ్ఞాపకము రాగా "కుమారా! వ్యాసా" అని పిలిచిన మాత్రమున తల్లి పాదాల దగ్గర వ్రాలేడు కృష్ణద్వైపాయనుడు, సత్యవతి కుమారుని చేర బిలిచి నాయనా మన వంశము నిలబడాలి. యీ భీష్ముడు తన వ్రతము వీడడు. యిక నీవే నాకు దిక్కు. అంబిక – అంబాలికలందు నీయనుగ్రహము ప్రకటిస్తే మనవంశం నిలుస్తుంది. అని గడ్డము పట్టుకొని సత్యవతి యెంతగానో బ్రతిమాలింది. మాతృదేవి వాక్యాలు విన్నాడు. సరే అన్నాడు.

అంబికను వ్యాసుని దగ్గరకు పంపగా ఆతని రూపాన్ని చూచిన అంబిక గట్టిగానేత్రాలు మూసుకుంది. అప్పుడు వ్యాసుడు సత్యవతిని చూసి తల్లీ అంబికకు పుట్టు గ్రుడ్డివాడు జన్మిస్తాడన్నాడు. గొప్పవాడేకాని తల్లి వలన కన్నులు కానరావు అన్నారు. అది విని కుమారా! గ్రుడ్డి వాడు రాజ్యార్హతకు తగడు. అందువలన అంబాలికకు సంతానాన్ని కలుగ జేయమని వేడింది. అంబాలికను కలిసి వచ్చిన మహర్షి అమ్మా యీమె కంపించిన శరీరముతో కలిసింది. అందువలన యీమె పాండురోగికి జన్మనిస్తుంది. అంబాలికకు వేరొక కుమారుని యీయమనగా; అంబాలిక భయపడి తన భూషణాలూ చీనిచీనాబంబరాలు ధరింపచేసి దాసిని వ్యాసుని దగ్గరకు పంపింది. యింకేముంది? అంబాలిక దాసీ వ్యాసభగవానునితో కలియుట కన్న భాగ్యమేముందని ఆనందముతో వ్యాసుని కలిసింది.

వ్యాసుడు యీవలకు వచ్చి మాతా! నీకోడలు తన దాసిని పంపింది. ఆమెకు ప్రజ్ఞా విజ్ఞాన ధర్మవిదుడు పుడతా"డని తాను వెళ్లిపోయాడు. భీష్ముడు ధృతరాష్ట్ర – పాండురాజ–విదురులను పెంచుచూ విద్వాంసులుగా అస్త్రశస్త్ర విద్యానిపుణులుగా తీర్చిదిద్దాడు. వారు కూడా భీష్ముని కన్న తండ్రి కన్న మిన్నగా గౌరవ వినయ భక్తి ప్రవత్తులతో మెలగసాగేరు. ముగ్గురకూ యుక్తవయస్సు వచ్చింది. భీష్ముడు సత్యవతిని సంప్రదించి అంధుడైన ధృతరాష్ట్రునికి గాక పాండురాజును భారత సింహాసనాశీనునిగా చేశాడు. విజ్ఞాన విదుడైన విదురుని సంప్రదించి గాంధార దేశపు మహారాజు సుబలుని పుత్రికను ధృతరాష్ట్రునకు నీయమని పురోహితులను పంపాడు భీష్ముడు.

పుట్టుగ్రుడ్డి వానికి నాబిడ్డను యెలా యియ్యడమని మహారాజు ఆలోచిస్తుండగా గాంధారి "తండ్రీ! నేనాతనినే వివాహం చేసుకుంటానని పట్టుపట్టడము వలన తండ్రి ఒప్పుకొన్నాడు. తన భర్తకు కన్నులు లేవు నాకుమాత్రము యెందుకుండాలని



తానూ నేత్రాలకు గుడ్డ కట్టుకుంది. ధృతరాష్ట్రునికి ఆమెతో పెండ్లి జరిపించారు విదుర భీష్మలిద్దరు. గాంధారి సోదరుడు శకునితో హస్తిపురమువచ్చి సోదరి యింట మకాం గావించాడు.

యిక పాండురాజుకు తగిన వధువు కొరకు అన్వేషింపసాగారు. యదు వంశమహారాజు శూరసేనుని కుమార్తె – కుంతి భోజునికి దత్తత నీయబడ్డ పృథాకుమారితో పాండురాజుకు కల్యాణాన్ని జరిపించారు. విదురభీష్ములు కుంతి భోజమహారాజుగారింటికి దత్తతగా వచ్చిన పృథాకుమారిని "కుంతీ!" అని పిలువడం వలన కుంతిగా ఆమె పేరుగాంచింది. యిలా ఉండగా ఒకనాడు దుర్వాసమహర్షి తన వాడుక ప్రకారం సంత్సరానికొక మహారాజు ఆశ్రయములో శిష్యులూ – ప్రశిష్యులు వేలాది మందితో కలిసి కుంతి భోజుని దగ్గరకు వచ్చాడు. కుంతి భోజుడు దివ్యతాపసికి తగినట్లు అర్ఘ్యపాద్యాదులిచ్చి పూజించి వచ్చిన పని తెలుపమనగా! "మహారాజా! యీ సంవత్సరం చాతుర్మాస్యవ్రతాన్ని మీ ఆధ్యక్ష్యములో గావించాలని వచ్చాననగా! "మునీంద్రా! యీ మహత్తర అవకాశాన్ని నాకు కల్పించారు. తప్పక అలాగే చేయం"డని కుంతి భోజ మహారాజు మంత్రి సామంతాదులను పిలిచి యేర్పాట్లు చక్కగా గావించాడు. తన పుత్రిక కుంతిని మహర్షికి యేలోటూ రాకుండా చూడ్డానికి నియమించాడు.

ఆనాలుగు మాసాలూ వర్షాకాలామగుట మహారాజు యాగము చూడవచ్చిన వారికి తగిన యేర్పాట్లుగావించాడు. యిలా నాలుగు మాసాలూ జయప్రదముగా చాతుర్మాస్యవ్రతము జరుగుటకు మహారాజును యెంతగానో అభినందించి కన్యయైన కుంతిని పిలిచి ఆమెకు భర్తవలన సంతానము కలగదని తలచి "రాకుమారీ! నీకొక మంత్రము చెప్పుతాను దాన్ని జాగ్రత్తగా ఉంచుకొనుము అని దుర్వాసుడు వెళ్లిపోయాడు. అలా కొన్ని రోజులు గడువగా ఒకనాడు కుంతి ఉదయాన్నే గంగానదిలో స్నానముగావించి అప్పుడే ఉదయిస్తున్న సూర్యభగవానుని చూచి దుర్వాస మహర్షి యిచ్చిన మంత్రాన్ని సూర్యభగవానునిపై ప్రయోగించింది. యింకేముంది? ఒక మహారాజువలె సూర్యదేవుడు కుంతీదేవి ముందు నిలబడగా కుంతి వణికిపోతూండగా "రాకుమారీ! నీకు భయములేదు. నేను వచ్చిన పని వృథాకారాదు. అని ఆమెలో తన తేజమునిల్పి వెళ్లిపోయాడు. కుంతి గర్భాన్ని ధరించి ఒక దాసి సహాయముతో అంతఃపురములో యెవరికీ తెలియకుండా నవమాసాలు నిండగా ఒక తేజోమూర్తిని కన్నది. ఆ బిడ్డడు రెండవ సూర్యునివలె వెలిగిపోతూ కవచకుండలాలుతో పుట్టాడు. వివాహము కాని కుంతి ఆ బిడ్డను కన్నదని ప్రజలంటారని ఒక నాటి అర్ధరాత్రి దాసీని తీసికొని ఒకపేటికలో ఆ పసికందును పెట్టి విడువలేక విడువలేక గంగానదిలో విడిచివచ్చింది.

**కుంతి - పాండురాజు**

కుంతీదేవికి నవయవ్వనము వచ్చింది. ఆమెకొరకు రాకుమారులు యెందరో వచ్చి కుంతిభోజుని గుక్కతిప్పకుండాచేశారు. అందుచేత కుమార్తెకు స్వయంవరం

చాటించాడు. మహారాజులందరూ ఉత్సాహాలకేరింతలు కొడుతూ వచ్చారు. కుంతి స్వయం వర సభలో ప్రవేసించింది. అజానుబాహువులు – విపుల వక్షస్థము – నేత్ర సోయగముగల పాండు మహారాజు గళసీమలో పూలమాల వేసి ఆతని వరించింది. వారిద్దరికి మహారాజు బ్రహ్మాండముగా వివాహం జరిపించాడు. మద్రదేశ రాజు శల్యమహారాజు సోదరి రూపగుణ శీలయవ్వనములు గల మాద్రిని పాండురాజున కిచ్చి వివాహం భీష్ముడుచేశాడు. దేవక మహారాజు కుమార్తెను విదురునికిచ్చి వివాహము జరిపించాడు భీష్ముడు మహావీర శూర తేజోమూర్తి పాండురాజు యిద్దరు భార్యలతో సంసార సుఖాల్లో తేలియాడాడు. యిక జైత్ర యాత్రకు బయల్దేరాడు కాశీ – మిథిలా – దశార్ణ– మగధ మొదలైన దేశాలను జయించి ఆ రాజులిచ్చిన స్వర్ణభూషాంబరాదులను తన పత్నుల కర్పించాడు పాండురాజు. యిలా యిద్దరు భార్యలతో ఉండగా యిద్దరు రాణులూ గిరినదీ ప్రాంతాలు చూడలన్న వారిని హిమగిరి ప్రాంతానికి తీసికొని వెళ్లి అచ్చటగల ప్రకృతి సౌందర్యాలను కుంతికిని మాద్రికి చూపిస్తూ అటవారితో యిష్టభోగాలు అనుభవిస్తున్నాడు.

ఒకనాడా గిరుల ప్రాంతములో దాంపత్య సుఖజీవనముగావించు లేళ్ల జంటలో ఒకదాని పై బాణం పాండురాజు వేశాడు. ఆ దెబ్బతో అది తన్నుకొని మానవవాక్కులతో "యింత పనిచేస్తావా రాజా? యీ పరిస్థితిలో ఉన్న నన్ను నిష్కారణముగా కొట్టావు. రతిక్రీడలో ఉన్నవారిని విడదీయరాదనే యింగిత జ్ఞానము లేనివాడివి. నీవు ప్రజల నెలాపరిపాలిస్తావు ? సరే నీకర్మ. నీవు కూడా కామాతురతతో కాంతను సమీపిస్తే నావలెనే మరణింతువు కాక! నేను కిందముడనే మహర్షినని ప్రాణాలు వీడిందా లేడి. భార్యలకు యీ చరిత్ర చెప్పాడు పాండురాజు. మీరు తిన్నగా మన నగరానికి వెళ్లండి. నేనిక్కడే ఆకులూ అలమలూ తిని తపము చేసికుంటానన్నాడు.

కుంతి – ప్రాణేశ్వరా! యిప్పుడు మన మీ హిమాలయ ప్రాంతమున తపస్సు చేసిన లాగే కదా జీవిస్తున్నాము. యింకా వేరే తపస్సేల? మీ ఆత్మను మీరు దర్శించండి. లేదా? మేము బ్రతికి బట్టకునుండడమేల? అనగా పాండురాజు సమ్మతించి యీ విషయాన్ని విదుర భీష్ములకు తెలియజేశాడు.

## కౌరవ పాండవుల పుట్టుక

పాండురాజు శతశృంగమను గిరిపై వాన ప్రస్థాశ్రమములో జీవిస్తూ అచటగల తపోనిధులందరకూ తలలో నాలుకగా ఉన్నాడు. మహర్షులు దుర్గమ ప్రాంతానికి వెళ్లుచుండగా పాండురాజు కూడా వారితో బయల్దేర వారు వద్దనివారించారు. వారు పాండురాజు చరిత్రను తపోనేత్రముతో జూచి" మహారాజా! మీరు చింతించక్కర్లేదు. మీ సతుల గర్భాన చారిత్రక పురుషులుద్భవించి, మీ వంశకీర్తి ఆచంద్రార్క నిలుపుతార"ని వెళ్లిపోయారు. పాండురాజుకుంతిని చూసి "కుంతీ!



సంతానము లేనివాడు చాలా హీనతననుభవిస్తాడు. అయితే దానికి ధర్మశాస్త్రాల్లో మహర్షులు కొన్ని మార్గాలు చూపించారు. పెండ్లియాడిన భర్త వల్ల కలిగిన కుమారుని "ఔరసు"డనీ, ఒకవేళ అలా అవకాశములేదా! ఉత్తమోత్తము నివలన సత్సంతానాన్ని పొందవచ్చు. వానిని "ప్రణీతు" డంటారు. వివాహానికి ముందు బిడ్డను కన్న అతనిని "కానీను"డంటారు. అందువలన భర్తమూలముగా సంతానము పొందలేక పోతే, గుణవంతుని వలన సంతానాన్ని పొందవచ్చు. అందువలన ఉత్తమ పురుషుని వలన నీవు సంతానాన్ని పొందు" అనగా కుంతి "ప్రభూ! యేమి మీ మాటలు? మీకై ఉన్న యీ శరీరము యింకొకరికి సమర్పింపలేను. మీతోనే నాజీవిత" మన్నది. పాండురాజు "భర్త చెప్పిన మాట వేదవాక్కుగా శిరసావహించుట కన్నా కాంతకు పాతివ్రత్యము మరేముంది? నేను సంతాన హీనునిగా చనిపోయి రౌరవాది నరకాలనుభవించడం నీకిష్టమా కుంతీ? నాకు సంతానము కలిగించి ఆనందింపచేయడమే నీ పాతివ్రత్యము. "ప్రాణేశ్వరా! నాబాల్యాన దుర్వాస మహర్షి నాకు వరము ప్రసాదించారు. యే దేవతనుపాసిస్తే ఆ దేవత వలన నాకు సంతానము కలుగుతుంది. అది యిప్పుడు మనకు అవసరానికి పనికి వస్తుంది" అన్నది కుంతి. పాండురాజు సమ్మతించాడు. "లోకాలన్నింటికీ సమవర్తి యమధర్మరాజును ఉపాసించగా ఆతని కరుణవలన తులారాశిలో సూర్యుడూ, జ్యేష్ఠానక్షత్రములో చంద్రుడు ఉన్న పంచమి తిథిని ధర్మరాజు కుంతికి జన్మించాడు.

## సుయోధన జననము

మహాతపశ్శాలి వ్యాస మహర్షి కటాక్షమువలన గాంధారిదేవి వందమంది బిడ్డలకు తల్లి అవాలని వరము పొందింది. ముందుగా కుంతికి సంతానము కలిగినట్లు విని మహా ఆవేదనతో తన పొట్టపై బాగా బాదుకుంది. దాంతో ఆమెగర్భము నుండి లోహము లాంటిది బయటపడింది. ఆ లోహాన్ని వ్యాస మహర్షి తడిపింపనూట ఒక్కముక్కలుగా అయింది. నేతి కుండలలో ఉంచి ఆ ముక్కలను జాగ్రత్తగా చూసుకుంటే సుతులుగా తయారవుతారని వారు చెప్పారు. యిలా కొన్ని రోజులు పోవగా ఒకటవ కుండనుండి సుయోధనుడు జన్మించాడు. ఆతడు జన్మించగా గాండ్రు గాండ్రుమంటూ గాడిదలు గగ్గోలు చేసి – అరవడం ప్రారంభించాయి. ఆకసము నుండి భయంకరముగా తెగి ఉల్కలు పడ్డాయి. యిటు వంటి జననష్టములు కలిగించేవి యెన్నో సూచనలు కలిగాయి.

ధృతరాష్ట్రుడు జ్యోతిర్విదులనడుగగా "మహారాజా! వీని జన్మము మీ వంశవినాశనానికి హేతువుగా కాన్పిస్తుంది. యిట్టి వానిని పారవేయడమే యేంతే నిక్షేమ"మని చెప్పారు. పుత్రవాత్సల్యముగల ధృతరాష్ట్రుడు వారి మాటలనే వినలేదు. తరువాత తక్కిన నూరునేతి కుండలనుండి తొంబది తొమ్మండుగురు మగవారు ఒక ఆడబిడ్డ జన్మించింది. ధృతరాష్ట్రునికి వైశ్యస్త్రీయందు యుయుత్సుడను వాడుపుట్టాడు.

కుంతిని జగత్ప్రాణుడైన వాయుదేవుని ఉపాసించమనగా, ఆమె వాయుదేవుని కరుణ భీమునీ, మహేంద్రుని కరుణ అర్జునునీ కన్నది. భీముడు పుట్టిన సరిగా పదహారవదినాన పాండురాజు కుంతి భీముని తొడపై పెట్టికూర్చొనియుండి మాటలాడు సందర్భాన భీముడు కుంతీచేచి చేయిజారి. రాతిబండపై పడగా ఆబండ పిండి పిండి అయింది. భీముడు మాత్రము చిరునవ్వు చిందిస్తున్నాడు. యిలాకుంతీ దేవి తన ముగ్గురు బిడ్డలతో ఆనందాన్ననుభవిస్తుండగా, మాద్రికూడా "ప్రభూ! నాకూ మాతృత్వం కావాలని" అనగా పాండురాజు కుంతిచేత ఆమెకు మంత్రోపదేశం చేయించాడు.

దేవవైద్యులైన అశ్వినీ దేవతలను మాద్రి ఉపాసింపగా వారివలన నకుల సహ దేవులు పుట్టారు.

### పాండురాజు నిర్యాణము

పాండుకుమారులు అయిదుగురూ యిలా అందముగా ఆనందాన్ని తల్లి దండ్రులకందిస్తున్నారు. వసుదేవుడు ఒకపండిత పురోహితుని చేత మేనల్లుళ్లకు విరివిగా కానుకలు పంపాడు;. విద్యా అస్త్ర శస్త్ర విద్యలు వారికి జాగ్రత్తగా నేర్పమన్నాడు. అంతలో వసంతము వచ్చింది వృక్షాలకు యెంతో అందముగా లతలల్లుకున్నాయి. గండుతుమ్మెదలు పూలలోగల మకరందాన్ని త్రావి మత్తెక్కి ఝుంకారాలు గావిస్తున్నాయి. సరస్సులు తామరలతో కన్నుల పండువుగా కానవస్తున్నాయి. ఆసమయాన పాండురాజు మానసమంతా కామాయత్తమయింది. మాద్రిని వనవిహారానికి తీసికొని వెళ్ళేడు. ఆసమయాన కుంతీదేవి బ్రాహ్మణ సమారాధనలో ఉన్నది

వలదు వలదని మాద్రి యెంతగాచెప్పి పారిపోయి తప్పించుకుందామని అనుకున్నా పరుగు పరుగునవచ్చి మాద్రిని గాఢముగా కౌగలించుకున్నాడు పాండురాజు. దానికి మాద్రి గోడున యేడ్చింది. తక్షణమే ఆతడు ప్రాణాలు వీడాడు. కుంతియేడ్చి తుదకు భర్తతో సహగమనానికి ఆయత్తమయింది. చుట్టు ప్రక్కల నున్న మునులందరూ చేరారు. కుంతిని సహగమనమునుండి వారు ఆపారు. మాద్రి మాత్రము యెంద రెన్నివిధాల చెప్పినా పాండురాజుతో సహగమనము చేసింది. అక్కడున్న మునులు కుంతీ దేవినీ- పాండవులు అయిదుగురనూ తీసికొని హస్తినాపురానికి వెళ్లారు. ప్రజలందరూ తండ్రిలేని పిల్లలనుజూచి కంటతడిపెట్టుకున్నారు. బాహ్లిక- భీష్మ - సోమదత్త మొదలగువారు ధృతరాష్ట్ర విదురులు యెదురువచ్చారు. మహర్షులకు నమస్కరించి తీసుకొని వెళ్లారు.

"గంగానందనా! మహాత్ముల కృప వలన బ్రహ్మచర్య వ్రతుడగు పాండురాజు యీపుత్రులనందాడు. ఆయన స్వర్గస్థుడయ్యాడు. ఆయనతో మాద్రి సహగమనము చేసింది. యివిగో! వారి అస్తులు. నీవు మీవంశాచారముగా తక్కిన అనంతర



విధులు పాండురాజునకు జరిపించు" అని యీకుంతీదేవిని- యీమెబిడ్డలను నీ సంరక్షణలో విద్యా బుద్దులు చెప్పించి పెద్ద చెయ్యి" అని వారు వెళ్లిపోయారు. ధృత రాష్ట్రానుమతితో విదురుడు ఆ అస్తికలను బహువిధాలంకారాలుగల రథముపై నుంచి యమునా నదీతీరానికి రాజవంశమువారూ- పౌరులూ విచారముతో ఆరథము వెన్నంటారు. అలా పది రెండు రోజులూ అంత్యకర్మలు జరిపి షోడశదానాలుచేశారు. అంబాలిక పుత్రశోకాన్ని భరించలేక భూమిపై వ్రాలింది. యిక కుంతీదేవి దుఃఖాన్ని ఆపగలిగేవారు లేక పోయారు. పౌరులంతా మహా వీరాధి వీరుడైన పాండురాజు చరిత్రను పాండవులకు విన్పించి వారిని తన్మయులను చేశారు. వ్యాసమహర్షి వచ్చి ముందుగా అంబాలికను పరామర్శించి- మాతృమూర్తి సత్యవతీ దేవిని సమీపించి "మాతా! పాండురాజు లేడు. అలా అని మనము యేవీ మానుకోలేముకదా! నీవు దిటము చేసికొని ఆతని ఆత్మ దివ్యస్వరూపాన్ని యీ కుమారులందు చూస్తూ వీరి అభివృద్ధి ఆ కాంక్షిస్తూ- అంబాలికా! నీవూ అలాగే నీమనుమలను జాగ్రత్తగా రక్షించండి గాంగేయుడున్నాడు. అవసరము పడిన మీరు మనస్సులో తలిస్తే నేను వస్తాను. నేను చేయ వలసి నదంతా చేస్తాను. తల్లీ! అన్నీ అనుభవించావు. యింక నీవు తపోదీక్షలో నీ తనువుకు ధన్యత చేకూర్చుకొనమని వ్యాసభగవానుడు వెళ్లాడు. అనంతరము సత్యవతి భీష్మని యింటి పెద్దగా ఉంచి తనకోడళ్ల యిరువురితో అరణ్యాన తపస్సుచేసి తనువులు ముగించారు.

కౌరవులూ పాండవులూ పాలూ నీరులాగకాక జలమూ తైలములాగ కలిసీ కలియనట్లు పెరుగుతూ ఆట పాటల్లో హాయిగా దినాలు సాగిస్తున్నారు. యేది యేమైనా ఆటల్లో మహాబలుడు భీమునిదే పైచేయి. సుయోధనాదులను కొడుతుండేవాడు. యమునానదిలో జలక్రీడలాడే సమయాన భీముని నీటిలో ముంచుదామని వచ్చిన కౌరవుల చేతికందిన వారినందరినీ పట్టుకొని నీటిలో ముంచి వారు ఊపిరాడక తన్నుకొన వారిని తెచ్చి గట్టున పడేసి "తిక్కకుదిరిందా ముండాకొడకల్లారా" అనే వాడుభీముడు. కౌరవులు మహావృక్షాలెక్కి ఆడగా క్రిందనుండి కాలుతో తన్న వారందరూ అక్కడనుండి పడేవారు. యిలా ఉండగా భీముని మాయోపాయముచేత యెలాగైనా చంపి తక్కిన వారినికొట్టి రాజ్యాన్ని మనమే పాలించు కుందామని కౌరవులందరూ పన్నాగము పన్నారు.

భీమునికి ప్రియముతో విషాన్నమిచ్చారు. త్రాళ్లతోకట్టి అగాధమైన మడుగులో పడేశారు; యివి ఆయనకేమీకాలేదు. కాలసర్పాలచేత కరిపించారు. వాటికోరలూడిపడ్డాయి. యిలా కౌరవులుగావించిన దుష్ట కార్యాలన్నీ భీమునికి యేమీకాలేదు. గాఢనిద్రలో ఉన్న భీముని గట్టిగాకట్టి ఒక హ్రదములో పడేశారు కౌరవులు. అలరసాతలము నాగలోకానికి వెళ్లాడు. అక్కడ అన్నీ క్రూర సర్పాలు కరవగా తెలివి వచ్చి కట్లు తెరచుకున్నాడు. భీముని దగ్గరకు వాసుకి సర్పరాజు

తన వంశీయుల నందరనూ తీసికొని వచ్చాడు. అందులో ఒక ముదుసలి నామనుమడు శూరసేన మహారాజు మనుమడు పాండురాజు కుమారుడని గుర్తించి వీని శరీరానికి యెట్టి ప్రమాదమురాని రసాయనము యిస్తాను. కౌరవుల దుర్మార్గాల వలననే యిచ్చటికి రాగలిగాడు.

భీముడు వాసుకి మొదలగు నాగరాజుల అనుగ్రహముతో అర్పించిన పదిభాండలనిండా ఉండే దివ్యరసాయనాన్ని సేవించి యెదురులేని మనిషిగా అయివచ్చాడు. ధర్మ రాజాదులు తమ తమ ఆటలు ముగించి యిండ్లకు చేరారు. భీముడేడని వారిలో వారను కొనుచుండగా దుఃఖముతో కుంతీ దేవి వచ్చింది. విదురుడు "అమ్మా కుంతీ! నీకొడుకులు పంచపాండవులు చిరజీవనులు వారికేమీ జరగదని వ్యాస భగవానులు చెప్పారు" అన్నాడు. భీముడు అప్పుడే రాగా వారందరూ పరమానందమందారు.

## అస్త్ర విద్య

భీష్ముడు కౌరవ పాండవులకే కాక యాబది ఆరుదేశాల రాకుమారులందరికీ హస్తినాపురములో వసతి- భోజన సదుపాయాలు యేర్పాటుగావించ కృపాచార్యులు వారందరికీ అస్త్ర శస్త్ర విద్యలు నేర్పించారు. అంతద్రోణా చార్యులు గొప్పధనుర్విద్యా పారంగతుడుగా ప్రఖ్యాతి పొందాడు. భీష్ముడు ఆతనిని కూడా హస్తిననుంచి కుమారులకు విద్యనేర్పించ యేర్పాటుగావించాడు. ద్రోణాచార్యులు పరశురామునిదగ్గర అస్త్ర శస్త్ర విద్యాపాండిత్యరహస్యా లన్నీ ఆపోశనలు పట్టాడు. అందువలన రాజకుమారులందరూ బాగా ఆతని శిక్షణలో రాణింపసాగారు. ద్రోణుడు తన చిన్ననాటిస్నేహితుడు ద్రుపదరాజు దగ్గరకువెళ్లి అవమానింపబడ్డాడు; అందరికన్న మిన్న అర్జునుడని ద్రోణుడు గ్రహించి, ఆతనికి అస్త్ర శస్త్ర విద్యారహస్యాలను జాగ్రత్తతో- అభిమానముతో నేర్పి ద్రుపదుని కూడా జయించగల వీరునిగా తయారుచేయాలని మనస్సులో నిర్మించుకున్నాడు. అదేసమయాన ఆరణ్యకుడైన ఏకలవ్యుడు ద్రోణాచార్యుల ప్రతిమను పెట్టుకొని అచంచల గురు భక్తి ప్రపూర్ణ మనస్కుడై సాటిలేని విలుకాడయ్యాడు. కౌరవ పాండవులు ఒకనాడరణ్యములో క్రూరమృగాలను సంహరిస్తుండగా

ఏకలవ్యుని చూచి వారికుక్క అరవగా ఏకలవ్యుడు దానిపై యేడుబాణాలు వేయ అదియేడుస్తూ పాండవుల దగ్గరకురాగా అందరూ ఆ విలుకాని నేర్పరితనానికి ఆశ్చర్యమందారు. ఏకలవ్యుని వివరాలు తెలిసికొని వచ్చారు. ఒంటరిగా అర్జునుడు "గురుదేవా! మీశిష్యుడట ఆతని అస్త్ర శస్త్ర విద్యా పాండిత్యము అమోఘముపేరు ఏకలవ్యుడు నాకన్నా ఆతడుగొప్పవాడని" బాధపడగా అర్జునుని తీసికొని అరణ్యములో యేకలవ్యుని దగ్గరకు వెళ్లారు. గురువు ఆతని కుడిచేయి బొటకనవ్రేలు కోరగా అది సమర్పించాడతడు.



## కుమార అస్త్ర విద్య

కౌరవపాండవులు అస్త్ర శస్త్ర విద్యల్లో ప్రావీణ్యం సంపాదించారు. వారికి పరీక్ష పెట్టాడు ద్రోణాచార్యులు. ఒక పక్షి బొమ్మను చేయించి శిష్యులందరినీ రప్పించాడు. ఒక వృక్షము కొనను దాన్ని ఉంచారు. "ధర్మరాజా! పైనున్న పక్షిని. తిలకించావా? అందరినీ చూశావా?" అనగా చూశానన్నాడు. అందరూ అలాగే చెప్పారు. ఒక్క అర్జునుడు మాత్రము " గురుదేవా! నాకు ఆపక్షితప్ప యింకెవ్వరూ కానరాలే" దనగా; "నాయనా! అందరి దృష్టీ చెదిరింది. నీకు యేకాగ్రత సిద్ధించింది. దాని తలను కొట్ట మనగా అర్జునుడు పక్షితల నేలకూల్చాడు. "భేష్ కుమారా!" అనిద్రోణుడు మెచ్చుకున్నాడు.

ద్రోణాచార్యులు ఒకమంచిముహూర్తాన కుమార అస్త్ర విద్యా ప్రదర్శనయేర్పాటు గావించాడు. అంతఃపురకాంతలకు ప్రత్యేకముగా చూడ్డానికి యేర్పాటు చేసి రంగస్థలము చాలా విశాలముగా చేశారు. మధుర మంగళగానా మృతాన్ని ఒలికించగా అస్త్ర శస్త్రాలు- గదాదులు అచ్చటకు తెప్పించారు ఆచార్యద్రోణులు. బ్రహ్మచారులందరూ కవచాలు దాల్చి ద్రోణాచార్యులకు ముందుగా వందనలర్పించారు. ఆయుధపూజ గంధ పుష్పాలతో జరిపించారు. ఆశ్వాలపైని స్వారి గావిస్తూ యుద్ధనైపుణ్యాన్ని కొందరు రాకుమారులు చూపించారు. కొందరు యేనుగులపై నుండియుద్ధ ప్రదర్శనగావిస్తున్నారు. అస్త్రములతో కొందరు- శస్త్రములతో ప్రదర్శన నిపుణత్వాన్ని చూపిన వారుకొందరు. యీ ప్రదర్శన తిలకించడానికి దేశదేశాలనుండి వచ్చిన ప్రజలకు యెంతో ఆనందముగా ఉంది. వీరికి ధృతరాష్ట్రుడు భోజనాదులను యేర్పాటుగావించాడు.

రంగస్థలమున ప్రదర్శన విశేషాలను గాంధారీధృతరాష్ట్రులకు విదురుడు చెప్తూతున్నాడు. తరువాత భీమ సుయోధనుల గదాయుద్ధం ప్రారంభమయింది. వారి ప్రదర్శన ప్రదర్శనగాకాక యుద్ధముగామారింది. అదిచూసిన ద్రోణుడు తాను కృపాచార్యులను భీమదుర్యోధనులను విడతీసి రంగమునుండి తప్పించారు. "అర్జునుడు ఆచార్యుల వారి పాదాలకు అభివందన లాచరించాడు. ప్రజలదృష్టులన్నీ అర్జునునుపై ఉన్నాయి. ద్రోణాచార్యులు ప్రత్యేకాభిమానముతో చెప్పిన విద్యను తూచా తప్పకుండా ప్రేక్షకుల కన్నులు మిరిమిట్లు గొల్పుతున్నట్లు తన విద్యా ప్రదర్శన నైపుణ్యాన్ని చూపిస్తున్నాడు "మేఘాస్త్రాన్ని వేయగా ఒకరిముఖము ఒకరికి కానరాకుండా రంగస్థలమంతా చిమ్మ చీకటయింది. వెంటనే అర్జునుడు వాయవ్యాస్త్రాని వేయ ఆమే ఘాలన్నీ ఆగాలికి దూదిపింజెల్లాగ చెల్లా చెదరయింది. ప్రేక్షకులు కరతాళధ్వనులతో తమ ఆనందాన్ని తెలిపేరు.

ఆగ్నేయాస్త్రము వేయ ప్రేక్షకులు భయపడ్డట్టు మంటలు లేచాయి. వెంటనే ఐంద్రాస్త్రముతో ఆమంటలు చల్లార్చాడు. అస్త్రశస్త్రాల్లో యెన్ని విన్యాసాలు గావించాలో అన్నిటినీ అద్భుతముగా అర్జునుడు చూపిస్తున్నాడు. అన్నీ అయిన తరువాత ప్రేక్షకుల

కరతాళధ్వనులు మిన్నుముట్టగా ద్రోణాచార్యులు రంగ మధ్యమునకు వచ్చి “ఓసభాస్తారు లారా! యీ నాప్రియ శిష్యుడు అర్జుననకు సాటి విలుకాడు యేవ్వరూలేరు. భారతవీరుడు అందరూ ఔనని పెద్ద పెట్టు ప్రేక్షకులామోదాన్ని తెలిపారు. యింతలో పెద్ద గర్జన విన్పించింది. అందరూ అటే దృష్టి పెట్టేసరికి ఒక మహావీరుడు రంగమధ్యస్థలానికి వచ్చాడు మహాతేజశ్శాలి. సహజకవచకుండల శోభితుడు మహోజ్వల తేజశ్శాలి – రెండవ సూర్యుని వలె ప్రకాశిస్తున్నాడు, కర్ణుడు. ఆ మహా వీరుని అందరూ ఒక్కసారిగా తిలకించి ఆశ్చర్యమందారు. “అతడు అర్జుననికి మించి అన్ని అస్త్రవిన్యాసాలు చూపించాడు. అందరూ ఆశ్చర్యపోయారు. “యిక గదా యుద్ధానికి వస్తావా? అని తొడకొట్టగా, అర్జునుడు ఆచార్యుని వంక చూడగా”.

ద్రోణుడుకానీ మన్నాడు. కర్ణార్జునులు గదా యుద్ధము చేస్తుండగా యిరువురు మహాయోధులగుట పిడుగులు పడ్డట్లు చూసినవారందరి గుండెలు అదిరిపోసాగాయి. అర్జునుడు ఓడిపోయినట్లుగా కనుపించ ద్రోణాచార్యులు కర్ణుని; కృపాచార్యులు అర్జునుని పట్టుకొని విడదీశారు. ద్రోణుడు కర్ణుణి చూసి “ఓయీ! నీవెవరవు? నీ తల్లిదండ్రులు – నీ కులము చెప్పు; నీవు సుక్షత్రియుండవైన నీతో యుద్ధము చేస్తా?” అనే శబ్దము వినిపింపగా ద్రోణుడు “యేమీ! నీవు కానీనుడవా? నీతో అర్జునుడు యుద్ధముగావిస్తాడా? సుక్షత్రియుడుగాని, ద్విజుడయిన గాని యీతనితో యుద్ధముగావింపగా అర్హతుంటుంది. అనగా! సుయోధనుడు తక్షణము వచ్చి, ఆచార్యా! యేరులజన్మంబు వీరుల జన్మంబు యెవరికి కావాలి? యీతడు క్షత్రియుడు కాడనిగదా మీవంక! యెవరక్కడ పవిత్ర యమునా నదీ జలముతో యిప్పుడే అంగరాజ్యాధిపతిగా యీతనిని గావిస్తున్నానని పవిత్ర తీర్థముతో కర్ణుని అంగరాజ్యాధినేతగా సుయోధను డభిషేకించాడు. కర్ణ సుయోధనులు పరస్పరము గాఢముగా కౌగిలించు కొన్నారు.

## కర్ణుడు

మహర్షులారా! పుట్టిన పసికందును కుంతి గంగానదిలో వదిలివేసింది అన్నాను. తరువాత వినండి గంగానదిలో సూతుడు – అతని అర్ధాంగి రాధమ్మ వారికి సంతానము లేదు. యెన్నోనోములు చేశారు. వ్రతాలు, దానాలు చేశారు. అలా ఉండగా ఒకరోజున ఆదంపతి గంగానదిలో స్నానము చేస్తుండగా ఒకపెట్టె కనుపించగా ఆ పెట్టెను తెరవగా అందు వజ్ర వైడూర్యాదులు – బంగారు కాసులు కాన్పించగా రాధా సూతులు ఆ బిడ్డ సహజ కవచకుండలాలతో రెండవ సూర్యుని లాగ ప్రకాసించిన ఆ బిడ్డకు “వసుషేణు”దని పేరుతో పెంచసాగారు. అతడు యెంత దూరములో నున్నా ప్రజలకు ముందుగా ఆబిడ్డని చెవులలో నున్న కుండలాలు ముందుగా ఆకర్షించేవి. అందువలన కర్ణములకాంతి ఆకర్షణచేత “కర్ణా! కర్ణా! అని ప్రజలు పిలుచుట చేత కర్ణుడయ్యాడు.



అలా దినదినాభివృద్ధి నందుతున్న కర్ణుని చూసి సూతదంపతి ఆనందోత్సాహాలందారు. విద్యాబుద్ధులు చెప్పి అనంతరం దేశములో గల రాజకుమారులందరికీ ద్రోణాచార్యులు అస్త్రశస్త్రాది విద్యలు నేర్పుచుండ భీష్ముడు హస్తినగరాన విద్యార్థులైన రాజకుమారులందరకూ భోజనాది వసతులు కల్పిస్తున్నారని విని అచ్చటికి కర్ణుని పంపారు. సూర్యభగవానుని వర ప్రసాదియైన కర్ణుడు అచ్చటి రాజకుమారులతో కలిసి విలువిద్య పూర్తిగా నేర్చుకున్నాడు. ఒకరోజు ద్రోణాచార్యుల దగ్గరకు వెళ్లి బ్రహ్మాస్త్రాన్ని ప్రసాదించమన్నాడు కర్ణుడు.

“కుమారా! సుక్షత్రియునకే బ్రహ్మాస్త్రము పొంద అర్హత ఉంటుంది. తక్కినవారికి అది తగ”దనగా; కర్ణుడు యెంతో బాధపడి యెలాగయినా బ్రహ్మాస్త్రము పొందాలని యెంచగా, యీద్రోణాచార్యులకే కాక భీష్మునికి కూడా గురువైన పరశురాముడు గుర్తువచ్చి అతని దగ్గరకు వెళ్లి విద్యనేర్పమని అర్థించాడు కర్ణుడు. కర్ణుని చూసి పరశురాముడు. ఔరా! యేమి యీతని రాజలక్షణాలు యిటు వంటివానిని కన్న తల్లి దండ్రులెంతవారో! “కుమారా! నీవెవరు?” అనగా కర్ణుడు అయ్యో! యిక్కడా యీ జాతిజాడ్యము యీతనికీ వదలలేదా?” గురువర్యా! ద్విజుడ” నన్నాడు కర్ణుడు.

సరే నీవు విద్యనభ్యసించమని పరశురాముడు కర్ణునకు అస్త్రశస్త్రాది విద్యలతో తన స్వంతమైన భార్గవాస్త్రము కూడా అభిమానముతో ఉపదేశించాడు. యిలా పూర్తిగా బ్రహ్మాస్త్రముతో పాటు సకలాస్త్రాలూ కర్ణుడు నేర్చుకున్నాడు. ఒకనాడు శిష్యుని తొడపై శిరసుంచి అలా ఉండగా పరశురామునకు నిద్ర వచ్చి గాఢ నిద్రాముద్రితుడయ్యాడు. మహేంద్రుడు దుష్టకీటకరూపముతో వచ్చి పరశురాముడు తలపెట్టిన కర్ణుని తొడను క్రిందనుండి దొలచగా రక్తము కారుచున్నా కర్ణుడు సహించి ఊరుకుండగా పరశురాముని శరీరమంతా తడిసి హఠాత్తుగాలేచి “భేష్ కుమారా! నీ క్షమాగుణ సంపత్తి” అని క్షణమాలోచించి “ఓరీ! నీ వెవడవు? ద్విజుడనని చెప్పినన్ను మోసగించావు. అది అలా ఉండగా, మహాతపస్వి యైన పరశు రామునకూ యీ జాతి మత భేదమేమి? లేకున్న కర్ణుడు ద్విజుడనని అస్త్ర విద్య నేర్చుకుంటాడా? నీ వలన నాకు అపఖ్యాతి వచ్చింది. దుష్టా! నేను నేర్పిన విలు విద్య నీకు జ్ఞప్తికి రాకుండుగాక!” అనగా; కర్ణుడు కాళ్లపై బడి “తమరు నేర్పినవిలు విద్య అంతానిష్ప్ర యోజనమైన నా జీవితమెందుకు?” అనగా కర్ణుని లేవనెత్తి కర్ణుని చరిత్రంతా తపోనేత్రమున చూసి “శిష్యా! నీకు నేనిచ్చింది వరమే ఔతుంది. నీవు ద్విజుడవుకావు అన్నాడు. గురుదేవుల ఆజ్ఞ తీసికొని తిన్నగా వచ్చాడు హస్తిపురికి. అర్జుననితో గదాయుద్ధం తరువాత మీకు తెలిసినదే కదా! మునీంద్రులారా!” అన్నాడు సూతుడు. తరువాత వినండి అని యీ విధముగా చెప్పసాగాడు. కర్ణసుయోధనులు ఆప్తమిత్రులయ్యారు. పాండవులతో ఢీకొనడానికి కర్ణుడు దొరికినందుకు సుయోధనుడు పరమానందమందాడు.

## అర్జునుని విజయం

ద్రోణాచార్యులు బ్రాహ్మణుడైనా తనను పగతో పరాభవించిన ద్రుపదరాజును నా దగ్గరకు తీసుకువచ్చి గురుదక్షిణ సమర్పించమని కౌరవపాండవులను కోరాడు. కర్ణుడు వెంటరాగా పాంచాలరాజుపై దుర్యోధనాధులు సైన్యముతో దండెత్తారు. యిరువైపుల వారు ఘోర అస్త్రశస్త్రాలు ఒకరిపై ఒకరు వేసుకొనగా ద్రుపదునిధాటికి సుయోధనాధులు పరాజితులయ్యారు. యిక అర్జునుడు ఆచార్యుల వారికి పాదాభి వందనగావించి నకులసహ దేవులతో బయల్దేర భీముడూ తోడయ్యాడు. అర్జునుడు ద్రుపదుని బంధించి గురు దేవుని పాదాలపై పడవేయగా "ఓహో! వీరు ద్రుపదమహారాజులా? యిలా బంధనతో వచ్చారే! మీరు నాచిన్న నాటి మిత్రులు. మీకు రావలసిన పాట్లాయివి? పోనీ! యికమనము హాయిగాచేయవచ్చు స్నేహం" అన్నాడు.

ద్రుపదుడు జరిగిన అవమానానికి సిగ్గుపడి యీ బ్రాహ్మణాధముని జయించే కుమారునికనాలి అని వెళ్లేడు.

## ధర్మ రాజు

పాండవులు దిన దినాభి వృద్ధియయి ప్రజామన్ననలందుచున్నారు. శీలము ధర్మము సత్యము గల ధర్మరాజును ధృతరాష్ట్రుడు యువరాజ్యాభిషేకము చేయక తప్పలేదు. భీమార్జునులు దండయాత్రలో మహారాజుల నెందరనో జయించి వారు సమర్పించిన ధనకనకాల రాసులతో హస్తినకువచ్చారు. ధృతరాష్ట్రునకు యీ విషయము కంటగింపయింది. విచారము కూడా పట్టుకుంది.

## కణికనీతి

తమ్ముని కొడుకులకు ప్రజల్లో పలుకుబడీ- పేరూ రావడం ధృత రాష్ట్రుడు జీర్ణించు కోలేకపోయాడు కణికుని పిలువగా "రాజచంద్రా! మనవిరోధులకు గల లోపాలు పట్టుకొని వారి నెలాగైనా నాశనముచేయాలి. మనవైరులను సమూలముగా లేకుండా చేయాలి. వారి సకల సంపదలూ యేలాగైనా మనవశము గావించుకొనాలి. యేలాగైనా వారిని నశింపచేయాలి. అంతవరకూ మనము నిద్రించరాదు. సర్వమూ త్యాగము చేసేవానివలెనే కన్పించి సమయమొచ్చినప్పుడు దెబ్బతీయాలి. వైరులతో ఆనందముగా మాట్లాడాలి. వారిని యెదిరించేలాగు మనము కను పించకూడదు. ఒకవేళ మనవైరి మనగృహానికి వస్తే ఆతనికి అతిథి మర్యాదలతో తీయని మాటలతో మైమరపించి దెబ్బతీయాలి ప్రజలందరూ గుమిగూడిన స్థలాల్లో తెలివి తక్కువ వాళ్ల వలె సంచరించాలి.

శత్రువులతో తీయగా మాట్లాడి అవసరమైనప్పుడు వారలను మట్టికరిపించాలి" అని చెప్పి వెళ్లి పోయెను.



## లాక్షా గృహం

భరత సింహాసనాసీనుడుగా ధృత రాష్ట్రుడు అంధుడు పనికిరాడు. యిక భీష్ముడు తన ప్రతిజ్ఞవీడడు. అందువలన ధర్మరాజే రాజవాలి. ప్రజల్లో యెక్కడ చూసినా ధర్మరాజు నామమే నాలుకల్లో నానుతుండడము దుర్యోధనుడు చూచి ఓర్చుకోలేక పోయాడు. ఒకనాడు ఆతడు ధృత రాష్ట్రునితో తనగోడంతా చెప్పుకున్నాడు. "తండ్రీ! నీ అంధత్వం మమ్మలనందరినీ అంధకారములో ముంచేసింది. ధర్మరాజు రాజైతే మేమందరం ఆతని సేవ చేయవలసిందే. యేడుస్తూ- మేమిక్కడ ఉండలేం యెక్కడ కోమమ్ముపంపండి. అక్కడ విరివిగా దాన ధర్మాలు చేసి ప్రజల్లో పలుకు బడి సంపాదిస్తాను. లేదా పాండవులను వారణావతానికి పంపండి అనగా "నాయనా! నా అభిప్రాయమూ అదేకాని భీష్ముడు విదురుడూ గొంతుక్కు అడ్డపడిన వెలక్కాయలాగ వారిద్దరూ ఒప్పుకోరు" అన్నాడు ధృత రాష్ట్రుడు.

"తండ్రీ! ద్రోణుడు కుమారు డశ్వత్థామను బట్టి అనుకూలుడు. భీష్ముడు యెటూ తేల్చలేడు. విదురునికి అంత స్వతంత్ర సాహసము లేదు. కనుక నీవు వారణావతానికి తొందరగా పాండవులను పంపు" అన్నాడు. యెలా అయితే పాండవులు తల్లితో వారణావతములో ఉండమని ధృతరాష్ట్రుడు పంపాడు. పాండవులు విదుర భీష్ములకు పాదాభివందనగావించి వెళ్లేరు. ముందుగా దుర్యోధనుడు వారణావతములో పురోచనునితో లక్కమేడ నిర్మించి అందులో పాండవులుండగా అర్ధరాత్రిదానికి నిప్పంటించి కాల్చమని వానికి చెప్పాడు సుయోధనుడు

పాండవులు వారణావతానికి వెళుతున్నారని హస్తిపురి ప్రజలు- ధృతరాష్ట్రుని- ధుర్యోధనునీ తిట్టి మేమందరమూ పాండవులెక్కడ ఉంటే అక్కడే ఉంటామని వారివెంట బయల్దేరారు. విదురుడు యెంతో బాధపడ్డాడు. "ధర్మరాజా! బాగా నీతి, రాజకీయ శాస్త్రము తెలిసినవారు శత్రుభయంకర బాధలనుండి బయట పడగలుగుతారు" అన్నాడు

అచ్చట వారందరూ మంగళ వాద్యాలతో పాండవులకు యెదురేగి పురము లోనికి తీసుకు వచ్చారు. పురో చనుడు అతి వినయముతో లక్కమేడలో యెంతో ప్రేమనటించి వారిని అందులో ప్రవేశ పెట్టాడు. ధర్మరాజు- భీష్ముడు- అర్జునుడు ముగ్గురూ యిది లక్కతో నిర్మించారు. మనమిందు కాలిపోవాలని ఊహాతో దుర్యోధనుడు యిందులో దింపాడు అనుకున్నారు. యిలా కాలముచక్రములా తిరుగుతుంది. విదురుడు ఖనకునిపంపి లక్కమేడలోనుంచి సొరంగముత్రవ్వి అరణ్యానికి ఆ దారి వెళ్ళునట్లుగా యేర్పాటు చేయు మనగా వాడట్లేచేశాడు. కుంతీ దేవి ఒకవ్రతముగావించి ఆవ్రతాంతములో విరివిగా భోజన సమారాధన ఆ ప్రాంత అరణ్యవాసులందరికీ చేసింది. అలా అచ్చటికి ఒక కులస్త్రీ తన ఐదుగురు సుతులతో బాగా త్రాగి పండుకున్నారు. పురోచనుడుగాఢ నిద్రలో ఉన్నాడు.

భీముడు ముందుగాలేచి భవనానికి నిప్పు పెట్టి సోదరులను తల్లితో ఖనకుడుత్రవ్విన బిలమార్గాన ప్రయాణము సాగించాడు. తల్లినీ నకులసహదేవులనూ యెత్తుకొని అరణ్యమార్గమున వెళుతున్నాడు. పాండవులు వారణావతమున అగ్నికి ఆహుతయ్యారని తెలిసిన పౌరులందరూ యేడుస్తూ ధృతరాష్ట్రుని జనమాతని వేనోళ్ల ఆడిపోసుకున్నారు. విదురుడు భీష్ములకు పాండవులు బ్రతికున్నారని రహస్యముగా తానుగావించిన విషయాన్ని చెప్పి ఆతని విచారం పోగొట్టాడు.

## హిడింబ

అలా అడవి దారిలో నడిచి అలసి ఒక దగ్గర బసచేశారు. అది ఘోరారణ్యము క్రూరమృగారావాలు తప్ప జనసంచారమేలేదు. "భీమసేనా! నీరుకావాలి" అనికుంతీ దేవి అనగా ఆతడు పెద్ద వృక్షమెక్కి చూడగా చక్రవాక పక్షులు సంచారము కానుపించింది. భీముడు తాను నీరు త్రాగి తామరడొప్పలో నీరుతీసికొని వచ్చాడు. అందరూ అలసిపోయి ఆరాళ్లపై పండుకొన్నారు. వారిని జూచియెంతో బాధపడ్డాడాతడు. అచ్చట కాపురమున్న హిడింబుడు తనసోదరి హిడింబతో "సోదరీ! మనకీ రోజుపండగ యెన్నాళ్లనుండో నరమాంసందొరికిందని" ఆరాక్షసుడు గంతులు వేశాడు. వారిని తీసుకొని రమ్మని హిడింబనిపంపగా ఆమెవచ్చి భీమునిచూసి మోహించింది.

"మహా భాగా! మీరెవరు? నా సోదరుడు హిడింబుడు మిమ్ము తినడానికి తీసుకురమ్మని నన్ను పంపాడు. మీ సౌందర్యము నన్ను మోహింపచేస్తుంది. నేను మీ సేవజేయడానికి అనుగ్రహింప" మని భీముని ప్రార్థించింది. "మా అమ్మా- నాకన్నపెద్దవారున్నారు. వారిని సంప్రదించకుండా నేను నిన్నెలా వివాహము చేసికొంటాను" అన్నాడు భీముడు. అక్కడ హిడింబాసురుడు పెద్ద అరుపుతో! "ఆకలికి నిన్ను పంపితే యిదా నీవుగావించు నిర్వాకం నిన్ను ముందు చంపుతానని" హిడింబమీద పడబోగా భీముడు అడ్డుపడి యిద్దరూ యుద్ధముగావించారు. మహావృక్షాలతో కొట్టుకొని తరువాత ముష్టియుద్ధం సాగించారు. యీ కోలాహలానికి అందరూ లేచి పోయారు. హిడింబ భయముతో కుంతీదేవి ప్రక్కలో దాగి జరిగినది వివరించింది.

భీముడు పిడుగుల్లాంటి ముష్టిఘాతాలతో ఆరాక్షసుని హతమార్చాడు. హిడింబ కుంతిని జూచి "పూజ్యురాలా! నీకుమారునిపై నామనసు పడింది. ధర్మరాజూ కుంతీ యిరువురూ ఒప్పుకొనగా భీముడూ హిడింబా యేకాంతసేవ జరిపారు. వారిరువురూ నదీతీరాల్లో వనాల్లో విహరింప వారికి ఘటోత్కచుడు జన్మించాడు. హిడింబ మహా భాగులారా! నా అవసరముకాని- నాకుమారుని అవసరముగాని కావలసిన మీరు తలచినంతనే వస్తా"నని కుమారునితో వెళ్లి పోయింది.



## బ్రాహ్మణవేషాల్లో

వ్యాసభగ వానుడు వచ్చి "కుమారుల్లారా! మీరు క్షమా గుణం గలిగి ఉన్న మీకే విజయము సిద్ధిస్తుంది. ఇక్కడకు దగ్గరలో ఏకచక్రపుర అగ్రహారముంది. అచ్చట మీరు నివసించండ"ని వారిని పంపాడు. పాండవులచట జీవనాన్ని సాగిస్తున్నారు. పాండవులందరూ యిష్టాగోష్టినుండగా వారున్న యింటివారియేడుపు వినిపించింది. కుంతీ దేవి వెళ్లింది. "నాధా! నేనే ఆ రాక్షసునికి ఆహారమౌతాను; అనగా "కాదు నేనే వెళతాను" అంటున్నాడు యింటియజమాని; కుంతి అడుగగా; "అమ్మా! యిచ్చట కొండగుహలో నరభక్షకుడు బకాసురుడున్నాడు. వాడికి ప్రతీ రోజూ రెండు దున్నపోతులూ బండినిండా అన్నము ఒకమనిషి ఆహారముగా వెళ్లాలి. యీరోజు మావంతు వచ్చింది" అన్నారు

కుంతిదేవి "అయ్యా! మీరెవ్వరూ బాధపడకండి నాకొడుకును వాని దగ్గరకు పంపితే- వాడిని కడతేర్చివస్తాడు. మీకష్టాలు తీరుతాయి" అనగా, "మీకు నాకు మారుని బలము తెలీదు. యేతల్లి యెందరు బిడ్డలున్నా తనకొడుకును చంపుకుంటుందా?" అని వారిని ఒప్పించి వచ్చి భీముడు దున్నలు కట్టిన బండినిండా అన్నమూ, తక్కిన ఆహారపదార్థాలూ గల బండిని తోలుకొని బకాసురుని గుహకు అల్లంత దూరాన బండినాపి పూర్తిగా భీముడు అన్నీతిని నీటినిసేవించి త్రేవని తేనుస్తుండగ రాక్షసుడు "ఆకలో! ఆకలో!" అని ఘోరంగా అరుస్తూ పొట్ట బాదుకుంటూ ఒకపెద్ద చెట్టుతో భీమునికొట్టాడు. అలా వారిద్దరు ఘోరయుద్ధము చేసిన అనంతరము ముష్టియుద్ధముగావింపగా భూమి బీటలువారింది. గగనము గడగడలాడింది. భీముడు వాడికాళ్లు పట్టుకొని బాగా త్రిప్పి నేలపై కొట్టగా వాని అరుపులకు అరణ్యాన గల క్రూరమృగాలన్నీ పారిపోయాయి. భీముని దెబ్బలకు బకాసురుడంతమైనాడు. యేక చక్రపురవాసులందరూ బకుని కళే బరము పర్వతములాంటి దాన్నిచూసి భయభ్రాంతులయ్యారు. భీముని వేయి నోళ్లకొనియాడారు. అందరూ ఆనందముగా పండుగ చేసికొన్నారు.

## ద్రౌపదీ కల్యాణము

ద్రుపద మహారాజు ద్రోణుని వలన పరాభవింపబడ్డాడు; ప్రతీకారమెలాగైనా తీర్చికోవాలని యెంచి యాజులను ఒక బ్రహ్మవేత్త " ద్రుపదమహారాజా! ద్రోణుని సంహారము చేయశక్తిలేదు. నీపుత్రుని వలన ఆతడు నశించే క్రతువున్నది. అనగా యాజుని చేత ఆయాగాన్ని పూర్తిచేయించాడు ద్రుపదుడు. హోమహవిస్సు యిచ్చి రాజపత్ని సేవిస్తే కుమారుడు కుమార్తె కలుగుతారని చెప్పేడు.

యాజుడు హోమగుండములో హోమముగావింపగా తక్షణము దివ్యతేజాన్ని నాలుగు దిక్కులకూ విరజిమ్ము కుమారుడు కుమార్తె దానిలో నుండి ప్రభవించారు. ధృష్టద్యుమ్నుడని బాలునికి, బాలికకు ద్రుపదునికిజన్మించుట ద్రౌపది అని, కృష్ణ

అని పేర్లు పెట్టారు;. కృష్ణ యవ్వనవతి అయింది. ఆమె స్వయంవరము దేశదేశాలకీ ప్రకటించాడు ద్రుపదమహారాజు. అదితెలిసిన పాండవులు స్వయంవరానికి బయల్దేరారు. అలా వెళుతూ గంగా నదీతీరానికి చేరారు. అంగార పర్ణుడనే గంధర్వుడు తనరాణులతో అట జలక్రీడలాతూ "ఓయీ! మీరిచటనుండి తొందరగా తొలగిపొండి లేకున్న ప్రాణాలుండ"వనగా అర్జునుడు "ఓరిమూర్ఖా! గిరులూ- తరులూ- వనాలు- నదులూ నీతాతగారివా? మేమిచ్చట స్నానాదిక్రియలు నిర్వర్తించి మరీ వెళతాం" అన్నాడు.

గంధర్వుడు అర్జునునిపై శర వర్షంకురిపించాడు. దానిని తప్పించుకొని అర్జునుడు అంగారపర్ణుని పై బ్రహ్మాస్త్రం ప్రయోగింపగా ఆతని రథాన్ని సారథిని గుఱ్ఱాలను నాశనం చేసి వానిని కట్టి పడవేసింది. వాడిని యీడ్చుకొని ధర్మరాజు దగ్గరకు తీసికొని వెళ్ళగా ధర్మరాజు కనికరించి విడిచి పెట్టాడు. అప్పుడు అంగారపర్ణుడు అర్జునునకు అనేక మంత్రాలను ఉపదేశించి ఆగ్నేయాస్త్రాన్ని బహుమానంగా యిచ్చాడు. సంవరుణుడు కురువంశానికే మూలపురుషుడు ఆతడు తపతిని పెండ్లియాడిన కథ, వశిష్ఠవిశ్వామిత్రులదివ్యచరిత్రలు వినిపించాడు, పాండవులకు మహాత్ముడగు ధౌమ్యమహర్షి పురోహితుడుగా యిక్కడే సంప్రాప్తించాడు.

అందరూ కలిసి ద్రుపదనగరానికి చేరారు. రాజ పురోహితులు దేశ దేశ మహారాజులనాకర్షింప మహత్తర శిల్పులతో కల్యాణమండపాన్ని కన్నుల పండువుగా కమనీయ అనల్ప శిల్ప రమణీయముగా యేర్పాటుగావించారు. సభామండపము మహారాజులతో కిటకిట లాడుతుంది. ద్రౌపదిని తీసికొని వచ్చి సోదరుడు ధృష్టద్యుమ్నుడు సభామధ్యకు వచ్చి "అదిగో! పైని మత్స్యయంత్రము అయిదుబాణాలతో దానిని పడగొట్ట గల వీరుని యీ మా సోదరి వరిస్తుంద"ని అటుచూపించి అదిగో సుయోధన దుశ్శాసనాదులు, ఆవంక అంగరాజు కర్ణుడు అని పేరు పేరుల అందరి రాజులజూపించాడు. భస్మధారులైనా పాండవులు నివురు కప్పిన నిప్పుల్లాగ వెలిగిపోతున్నారు.

శ్రీకృష్ణుడు బలరామునికి అరుగో పాండవులు బ్రతికే ఉన్నారన ఆతడెంతో ఆనందించాడు. మహా యోధులెవ్వరూ యెందరు యెంత ప్రయత్నము చేసినా కొట్టలేక పోయారు. ద్రుపదరాజు సభామధ్యకు వచ్చి

**ఉ. వీరులు లేరటో! విజయ విక్రమ సక్రమ విహారధీరసం**
**స్కారులు లేరటో! యిటకు సారమహత్తర శక్తిగల్గు స**
**ద్ధీరులు లేరటో! సభను; తెంపరులైయిటు వచ్చినారు మీ**
**తీరును జూడ నా సుతను దివ్యతహస్తము బట్టలేరటో!"**

అనే సరికి క్షాత్రవతేజముతో వెలుగంది నివురుగప్పిన నిప్పులాగున్న బ్రాహ్మణ వేషధారి అర్జునుడు లేచే సరికి బ్రాహ్మణులందరూ ఆనందముతో నుండగా అయిదుబాణాలూ సంధించి వేసే సరికి మత్స్యయంత్రము నేలకూలింది. వెంటనే



వచ్చి ద్రౌపది అర్జునుని గళసీమలో వరమాల వేసింది. రాజవర్యులందరూ పెద్ద పెట్టుగోల చేశారు. తమలో తాము సిగ్గుతో తలలు వంచుకున్నారు కొందరు. యిందరూ మొత్తముగా రాజకుమారులు వచ్చి ఒక్క పెట్టున పాండవుల పైకి రాగా భీమార్జునులు వారిపై వృక్షాలను పీకి కొట్టే సరికి వారందరూ చెల్లా చెదురయ్యారు. "ఓ బ్రాహ్మణ వీరా! నీ అస్త్రములు సంధానము అసామాన్యముగా ఉన్నాయి. నీవు నిజముగా బ్రాహ్మణుడవేనా?" అని కర్ణుడనగా; "మీ ఊహ తప్పు మాగురుదేవుల అనుగ్రహము అట్టిది. నేను నిజముగా ద్విజుడనే" అన్నాడు అర్జునుడు. అందరూ వెళ్లారు. అర్జునాదులు మామూలుగా యింటికి వచ్చేసరికి కుంతీదేవి యెదురేగి బిడ్డలారా! మీ గూర్చియే చూస్తున్నాన"నగా "అమ్మా భిక్షతెచ్చాం" అన్నారు. మామూలు ప్రకారంగా కుంతి అలా అయితే మీరందరూ సమానంగా తీసుకొండి" అన్నది. ద్రౌపదిని చూసి కుంతి ఆశ్చర్యపడి "అయ్యో! నానోట యిలాపలికించాడేమి భగవంతు" డనుకున్నది.

ధర్మరాజు - భీముడు - అర్జునుడు యీ సమస్య యెలాగ? తల్లి వాక్యం అసత్యంకారాదు; అని ఆలోచిస్తుండగా బలరామకృష్ణులు వచ్చారు వారు ముందుగా కుంతీదేవికి పాదాభివందనగావించారు. శ్రీకృష్ణుడు ధర్మనందనునకు నమస్సులర్పించాడు. తక్కినవారు వారిరువురికీ నమస్కరించారు. యింతలో ధృష్టద్యుమ్నుడు వచ్చాడు ద్రుపదునితో పాండవులని చెప్పగా అందరూ సంతోషించారు. ధర్మరాజు తల్లిగారి మాట శిరోధార్యమని చెప్పు చుండగా అక్కడకు వ్యాస మహర్షి వచ్చాడు. "ద్రుపద మహారాజా! యీ ద్రౌపదీ వివాహము ధర్మసూక్ష్మముతో కూడింది. యీమెకు అయిదుగురు భర్తలుండాలని పూర్వజన్మలోని రహస్యమని పాండవులు ఐదుగురుకూడా యీమెను వివాహము చేసికొనడం ధర్మ"మని వ్యాసులు వారు వెళ్ళారు.

అనంతరం ద్రౌపదిని పాండవులయిదుగురకిచ్చి ద్రుపదుడు పరిణయమును గావించాడు. అలా వారు పాంచాల దేశమున ఉన్నారు. యీ వార్త ప్రజలందరకూ తెలిసి ధ్రుతరాష్ట్రుని - దుర్యోధనునీ యెన్నో విధాల ఆడిపోసుకున్నారు.

## దుర్యోధన మంత్రాంగం

దుర్యోధనుడు - కర్ణుడు - ధృతరాష్ట్రమందిరాన శకునిని గూడి రహస్య మంత్రాంగం నడిపారు. "సుయోధనా! పాండవుల నెలాగయినా హతమార్చాలి కదా?" అని శకుని; "ఔను మామా?" అని దుర్యోధనుడు అని "పాంచాల దేశముపై దండెత్తి ద్రుపదునితో సహావారిని అంతం గావిద్దా"మన్నాడు" శకుని. అందరూ కూడ బలుక్కొనిననూ సోమదత్తుని కుమారుడు భూరిశ్రవుడు" సుయోధనా! శకునీ ప్రస్తుతము పాండవులు పాంచాలురతో కలిసి హాయిగా ఉన్నారు. శత్రుబలాన్ని మనము చూడకుండా యుద్ధానికి వెళ్లడం అనర్థం కనుక ముందు వెనుకలు బాగా ఆలోచించి అడుగువెయ్యడం" మంచిదన్నాడు. విదురుడు "వివాహముగావించు

కొన్న పాండవులను యిప్పుడిచ్చుటకు రప్పింపు" మనగా ధృతరాష్ట్రుడు మంగళకరమైన వార్తను విన్నాను. నాకెంతో సంతోషముగా ఉంది" అనగా; "మహారాజా! యీ అభిప్రాయం చివర వరకూ ఉంచండి" అన్నాడు విదురుడు.

"మహారాజా! మీ మాటలు చాలా వింతగా ఉన్నాయని కర్ణుడనగా; "కర్ణా! విదురుడు అక్కడున్నాడు కనుక అలా మాట్లాడవలసి వచ్చింది. లేకున్న పాండవులన్న నాకిష్టమా?" అన్నాడు. "సుయోధన మిత్రమా! మనకు అన్నీ ఉన్నాయి. కనుక ద్రుపదునిపై దండెత్తడమే మనము చేయాలి. అనగా ధృతరాష్ట్రుడు "భేష్ అంగరాజా! నీ బుద్ధిబలాన్ని మెచ్చుకోవచ్చు" అన్నాడు. భీష్ముని రమ్మని పిలువగా వచ్చి "నాయానా! ధృతరాష్ట్రా! యీ రాజ్యం పాండవులది. నీవు వారిని మాయచేసి తీసికొన్నావు. పాండవులూ – నీకొడుకులూ నాకు సమానులు. లక్కమేడలో పాండవులను దగ్ధంగా వించడానికి నీవే మూల కారణముగా ప్రజలందరూ కోడై కూస్తున్నారు. అందువలన నీతమ్ముని బిడ్డలను రప్పించి వారికి సగము రాజ్యమిస్తే నిన్నుజనులు విశ్వసిస్తారు లేకున్న యెవ్వరు నిన్ను నమ్మరు" అన్నాడు భీష్ముడు.

ఆమాటలు విన్న ధృతరాష్ట్రుడు యిక కాదనలేక "విదురా! నీవు వెళ్లి కుంతినీ – పాండవులనూ పాంచాలదేశము నుండి యిక్కడకు తీసికొనిరా!" అన్నాడు. ద్రుపదుని యింటనున్న పాండవులను కుంతీదేవిని విదురుడు హస్తినాపురానికి తీసుకువచ్చాడు. నగర ప్రజలందరూ పాండవులను జూచి పరమ సంతసముతో పూలతో మంచిగంధాన్ని చల్లి తమ ఆనందాన్ని వారికి అందించారు. ధర్మరాజు ముందుగా ధృతరాష్ట్ర మందిరానికి వెళ్ళి అంధరాజునకు అభివందనాలర్పించాడు. అనంతరం తమ తండ్రి భవనానికి వెళ్లాడు. కుంతీ ద్రౌపదులు అంతఃపురానికి నేగి గాంధారికి వందనలాచరించి ఆమె ఆశీరుపాయనలు తలదాల్చారు. యిలా రోజులు దొర్లుతున్నాయి.

భీష్ముల వారిని – పాండవులను తన దగ్గరకు పిలిచి ధృతరాష్ట్రుడు "ధర్మనందనా! నా సోదరుడు పాండురాజు తన స్వశక్తి మూలంగా యీ రాజ్యాన్ని యెంతో విస్తరింపచేశాడు. నా బిడ్డలు నా మాట వినడం లేదు. మీరైనా వింటారని నమ్ముతాను. మీ తండ్రి వాటా సగము మీరు పరిపాలించుకోండి ఖాండవ ప్రస్థం రాజధానిగా చేసికొని యేలుకోండి అన్నాడు. విదురా! ధర్మరాజుకు రాజ్యాభిషేకం చేయడానికి పండితుల – బంధుమిత్రులను పిలువుము. పవిత్ర జలాన్ని – భద్రజాతి దంతా వళాలను, పంచకల్యాణి గుఱ్ఱాలనూ, కిరీటాన్ని, భుజకీర్తులను రాజలాంఛనాలన్నింటినీ సమకూర్చు. మన పూజనీయ పెద్దలు వ్యాసులు వారిని పిలవండి. అందరినీ పిలిచారు వారు వచ్చారు. బాహ్లిక – భీష్మ – వ్యాస – శ్రీకృష్ణాదులతో ధౌమ్యమహర్షి పట్టాభిషేక మహము సశాస్త్రీయముగా నిర్వర్తింప చేశారు.



పట్టాభిషేకానంతరం ధృతరాష్ట్రుడు "నాయనా! ధర్మరాజా! యింక నీవు సోదరులతో కూడి ఖాండవ ప్రస్థములో హాయిగా ప్రజలను పరిపాలించుకో! నీతో రావలసిన వారున్న వారందరినీ తీసికొని వెళ్లు. శ్రీకృష్ణుడు క్రొత్త నగరాన్ని మయ బ్రహ్మచేత యేర్పాటు చేయించాడు. నగరము తిన్నని వీధులతో ప్రాకారాలతో మండపాలతో ఉద్యానవనాలు – జలముతో నిండిన కేళీ సరస్సులు – క్రీడాద్రులన్నీ విశ్వకర్మ నిర్మించాడు.

అటువంటి నగరాన శ్రీకృష్ణుడు ధౌమ్యుల వారి సుముహూర్తాన పాండవులు మంగళ వాద్యఘోషలతో నగర ప్రవేశము గావించారు. కవులు – పండితులు విద్వాంసులకు ఉచిత రీతి సమ్మానించి వారి దివ్యాశీస్సులతో ధర్మరాజు వెలిగిపోయాడు. అనంతరము శ్రీకృష్ణుడు మేనత్తకు వందనలాచరించి. ఆశీస్సులంది ద్వారకకు ప్రయాణించాడు. ఒకనాడు బ్రహ్మమానస పుత్రుడు, సంగీత సాహిత్య శబ్ద బ్రహ్మవిదుడు. త్రిలోక సంచారి రాగా ధర్మరాజు సపరివారంగా యెదురేగి వారిని తోడ్కొని వచ్చి, ఉచితాశీనునిగావించి అర్ఘ్య పాద్యాదులచేత పూజించినాడు. ద్రౌపది పాదాభివందన చేసింది. "ధర్మరాజా! నీవిక్కడ నగర నిర్మాణముచేసి రాజ్యాభిషిక్తుడువుగా ఉండడం నాకెంతో ఆనందమయింది. నీకు కొన్ని ధర్మరహస్యాలు చెప్పాలి. మీరు సోదరులైదుగురూ ఒక్క ద్రౌపదిని వివాహం చేసికున్నారు. దీని వలన మనస్పర్థలు రావచ్చును.

అందుకు గాను ఒక మార్గాన్ని చెప్పుతాను మీరందరూ దానిని అనుసరించండి. మీ యైదుగురకూ ఒక్కొక్కరి దగ్గర ద్రౌపది ఒకయేడు సంసారాన్ని నిర్వర్తిస్తుంది. ఒకవేళ మీలో యీనియమము తప్పి ఆమె భవనానికి వెళ్లితే పదిరెండు నెలలు బ్రహ్మచర్య వ్రతముతో అరణ్యవాసముగావించాలి" అని సుందోపసుందుల కథను చెప్పాడు. వారి నాశీర్వదించి నారదమహర్షి వెళ్లాడు.

**నియమపాలన**

నారదమహర్షి చెప్పినట్లు పాండవులు వర్తిస్తుండగా హఠాత్తుగా ఒకడు అర్జునుని దగ్గరకు వచ్చి "ప్రభూ! నా యావులను యెవరో దొంగిలించా"రనగా అర్జునుడు ఆలోచించకుండా తొందరగా గృహములోనికి వెళ్లాడు. అక్కడ ద్రౌపదీ ధర్మరాజులు యేకాసనమ్మీద ఉన్నారు. అర్జునుడు నియమాతిక్రమణ జరిగిందని వనవాసం చేయాలని అనుకొని. ఆదొంగలను కొట్టి గోవులను వానికిచ్చి ధర్మరాజు దగ్గరకు వచ్చి "ప్రభూ! నేను వనవాసానికి వెళ్లాలి. అనుమతించండి?" అనగా "అర్జునా జ్యేష్ఠుడు పితృదేవుని వంటివాడు. తల్లి దండ్రుల దగ్గరకు బిడ్డలు యేసమయంలో నైనా వెళ్లుట తప్పుకాదని ధర్మరాజు యెంత చెప్పినా అర్జునుడు వినలేదు.

అర్జునుడు గంగా తీరాన ఆశ్రమము నిర్మించుకొని గంగాస్నానం గావిస్తూ – హోమముచేస్తూ ఉండగా! రసాతలంనుంచి వచ్చిన నాగరాజు కుమార్తె "ఉలూచి"

అర్జునుని చూసి మోహించి ఆతనిని నాగలోకానికిగొంపోయింది. అర్జునుని ప్రక్కచేరి తనమనస్సు విప్పింది. అర్జునుడు యెంతకాదన్నా వినకతుదకు ప్రాణత్యాగం గావింపనున్న ఆమె కోర్కె అర్జునుడు తీర్చాడు. ఆమె తెల్లవారక ముందు గంగానది ఒడ్డున చేర్చింది. ఆమెకు ఇలావంతుడను పుత్రుడు అర్జునుని వల్ల కలిగాడు. హరి ద్వారం – హిమబిందు – గయా – కాశీ మొదలైన పవిత్ర క్షేత్రాలూ అనేక దేశాలూ దర్శించి మణిపురాధిపుని పుత్రిని వివాహం చేసికొని, ఆమెకు ఒక కుమారుని అనుగ్రహించి – సౌభద్రతీర్థము చేరాడు అర్జునుడు.

దానిలో అర్జునుడు స్నానము చేయనెంచగా అచ్చటగల మహర్షులు అర్జునుని వారించారు. నాయనా! దీనిలో గొప్ప మొసళ్లున్నాయి. నీవు నీట దిగవద్దు అనగా అర్జునుడు ఆనీటిలో దిగాగానే ఒక పెద్ద మొసలి అర్జునుని కాలు పట్టుకొనగా గట్టిగా దానిని రెండు చేతులతో లాగి ఒడ్డున పడవేసేసరికి అది ఒక సుందరాంగి అయింది. వీరు నలుగురు యక్షకన్యలు ఒక మహర్షిని అవమానింపగా ఆయన శాపము వలన యిలా అయ్యారు. ఆమె తక్కిన ముగ్గురకూ శాపాన్ని తొలగించమని ప్రార్థింపగా అలాగే చేశాడు. అనంతరము గోకర్ణేశ్వరుని ఆరాధించి పడమరగా వెళ్లి ప్రభాస తీర్థం చేరాడు అర్జునుడు.

## సుభద్ర వివాహము

విజయుడు తన నగరానికి దగ్గరకు వచ్చాడని శ్రీకృష్ణునికి తెలిసివచ్చి అర్జునుని రైవతాద్రిపై నివాసము యేర్పాటు గావించాడు. తరువాత ద్వారకకు తీసుకువెళ్లాడు. రైవతాద్రిపై మహోత్సవాలు జరుగుతున్నాయి. తన చెలులతో సుభద్ర అక్కడకు వచ్చింది. అర్జునుని కన్ను ఆమెపై పడడము గమనించిన కృష్ణుడు "అర్జునా ఆమెను వివాహము చేసుకుంటావా?" అనగా ముసిముసి నవ్వులు నవ్వాడు అర్జునుడు. ధర్మరాజు – మాతృదేవి – భీమసేనులకు వర్తమానమంపి వారి మాట ప్రకారం. సుభద్రను తీసుకుపోవడానికి కృష్ణుడు రథము సిద్ధము చేయించాడు. సుభద్రరావడము అర్జునుడు ఆమెను రథముపై నుంచి ప్రయాణము సాగించాడు. అది తెలిసి బలరామాది యాదవులు అర్జునుని పైకి వెళ్లబోవగా!

సోదరా! అర్జునుడు యేమీ తప్పుచేయలేదు. ఆతడు మన మేనత్త కుమారుడే కదా! వారిద్దరూ చిన్ననాటి నుంచీ పరస్పరం ప్రేమించుకున్నారు. క్షత్రియవీరోచిత రాక్షసవివాహమున సుభద్రను తీసుకు వెళ్లాడంతే!" అనగా అందరూ చివరకు సమ్మతించారు. అప్పుడు సుభద్రార్జునులకు బలరామకృష్ణులు మహావిభముతో వివాహము జరిపించారు. తరువాత నూతన దంపతి వెళ్లి కుంతీ దేవికి – ధర్మరాజ భీమసేనులకు వందనాలర్పించారు. తరువాత ద్రౌపది ఆశీస్సులందింది సుభద్ర.

యిలా ఇంద్ర ప్రస్థపురాన నూతన దంపతి ఆనందసాగరాన తేలియాడ బలరామకృష్ణులు సుభద్రకు అనేక అలంకారాదులన్నీ తెచ్చి యిచ్చారు. సుభద్ర అభిమన్యుని కన్నది. ధర్మరాజు ఆసంతసముతో కవి పండిత విద్వద్బృందాలకు



విరివిగా బహూకృతులందజేసి ఆనందించాడు. పాండవుల పత్ని ద్రౌపదికి 1. ప్రతి వింధ్య; 2. శ్రుతసోమ; 3. శ్రుతకర్మ; 4. శతానీక; 5. శ్రుతసేనులు వరుసగా జన్మించారు. ధర్మరాజు ఆబిడ్డలకు జాతకర్మాదులు వ్రాయించాడు. అర్జునుని దగ్గరే వారైదుగురూ అస్త్రశస్త్రాది విలువిద్యలు నేర్చుకున్నారు.

## మహేంద్ర వనదహనం

కృష్ణార్జునులు హాయిగా ఉండగా; అగ్ని హోత్రుడచటికి వచ్చి వారి చేతర్చితుడయి మహాత్ములారా! మహేంద్రుని ఖాండవనములో అనేక ఓషధులున్నాయి. మహర్షులు గావించు హోమాలలో గల నేయిని తిని నాజీర్ణకోశము మందగించింది. ఆ ఓషధులను భక్షించే అవకాశాన్ని నాకు కల్గించండి" అని ప్రాధేయపడగా అలాగే అన్నారు. శ్వేతకిరాజు పుష్కరకాలము గావించిన అఖండహోమమే యీ అజీర్ణానికి కారణమన్నాడు. "మహాత్మా! అగ్నిదేవా! నా దగ్గర తగిన బాణాలు లేవనగా; "అర్జునా! యిదిగో! గాండీవము. అక్షయ తూణీరాలు. తెల్లని మేలిగుఱ్ఱాలు నాలుగు; మహారథము" యిది అని వాటిని అర్జునునికి ప్రసాదించాడు అగ్నిహోత్రుడు. సుదర్శన చక్రము – కౌమోదకి అనే గదను శ్రీకృష్ణునికిచ్చాడు. యిలా యిద్దరూ ఖాండవ వనం చుట్టూ తిరుగుతున్నారు. అగ్నిహోత్రుడు వేయినాలుకలతో ఆవనాన్ని భక్షిస్తున్నాడు. ఇది తెలిసిన మహేంద్రుడు పుష్కలావర్తమేఘాలను పంపగా ఒక్క చినుకు నేల పడకుండా అర్జునుడు ఖాండవ వనమంతా గట్టి ఇల్లు బాణాలతో యేర్పాటు గావించాడు. మయుడు – మందపాల మహర్షి, ఆయగ్నిలో దహింపబడలేదు. వారు కృష్ణార్జునులకు కృతజ్ఞతలు చెప్పి వెళ్లిపోయారు.

**అని వైశంపాయనుడు చెప్పిన మహాభారతములో ఆది పర్వం సంపూర్ణం.**



# సంపూర్ణ మహాభారతం



## సభా పర్వము

మయ బ్రహ్మ మహాశిల్పి కృష్ణార్జునులను చూసి "మహాత్ములారా! మీరు నాకు ప్రాణదానం గావించినందుకు మీకు మంచి సభా భవనము అపూర్వమైంది నిర్మించి యిస్తానన్నాడు. సరేనన్నారు. కృష్ణార్జునులు. మయుడు ఒక మహాగదను భీమునికి; దేవదత్తశంఖము అర్జునునకు; అగ్నిహోత్రుడు అనుగ్రహించాడు. సఖాభవనం ముగించాడు. ఆమయసభ ఒక అపూర్వ బ్రహ్మ సృష్టినికూడా తిరస్కరింపచేశాడు. యిక్కడ ఒక విశేషముంది. మయుడు వాస్తు బ్రహ్మ; శ్రీకృష్ణ పరమాత్మ కూడా వాస్తు బ్రహ్మయే. యీ యిద్దరూ కలిసి ఒక అవగాహనకు వచ్చి మయసభను నిర్మించారు. వాస్తు శాస్త్రప్రకారంగా ఈశాన్యములో గంగ ఉండి తీరాలి. నీరు ఉన్నట్లు భ్రాంతి పడేలాగ చేశాడు ఆగ్నేయ దిశ పెరగ కూడదు. బాగా పెంచినా పెంచనట్లుగా కాన్పిస్తుంది.

వాయువ్యమున అగ్ని ఉండరాదు. అగ్నిగుండమున్నది కానికానలేనట్లు భ్రాంతి కల్పించాడు. దీనికి కారణం ముందు పాండవ పతనము జరగాలి. అనంతరము దుర్యోధన సర్వనాశనము అదే మయ శ్రీకృష్ణులవాస్తువ్యత్యస్త మయసభా నిర్మాణము.

"అనేక ఉద్యానవనాలు – సరోవరాలు అన్నీ ముల్లోకాల్లోలేనివన్నీ యిందున్నాయి ధర్మరాజా! దీని గృహప్రవేశము చేసే ముందు శాంతి ప్రక్రియలు ముఖ్యముగా చేయాలని"చెప్పి మయుడు వెళ్లాడు. ధర్మరాజు కొన్ని వేలమందికి



భోజనాలు యేర్పాటు చేశాడు. శాంతి హోమాలు జరిపించాడు. వేదనాదాలు మంగళవాద్యాలు మిన్నుముట్టాయి. అలా అట్టహాసముతో ధర్మరాజు మయ సభలో ప్రవేశించాడు.

### రాజుధర్మం

ఒకనాడు నారదమహర్షి ధర్మరాజును చూడవచ్చాడు. వచ్చిన మహర్షికి యెదురేగి అర్ఘ్యపాద్యాదులిచ్చి తీసికొనిన మీదట మహర్షి ధర్మరాజును జూచి "కౌంతేయాగ్రజా! నీ పరిపాలనలో ప్రజలందరూ హాయిగా ఉన్నారా? ముఖ్యముగా రాజుకు సామ – దాన – భేద దండోపాయాలు అత్యంతావశ్యకాలు; యిచ్చట ధర్మరాజుకు రాజధర్మాలు మహర్షి యెన్నో ఉపదేశించాడు. సరిగా రామాయణము అయోధ్యాకాండము నూరవ సర్గలో అయోధ్యకు శ్రీరాముని తీసికొని వెళ్లడానికి సేనలతో మంత్రి – మహర్షులతో భరతుడురాగా భరతునకు రాముడు చెప్పిన రాజశాస్త్రాన్నే యిక్కడ నారద మహర్షి చెప్పడం విశేషము. అక్కడ వందశ్లోకాలూ – సరిగా యిక్కడ వేదవ్యాస మహర్షి వ్రాసి వాల్మీకుల వారికి పరోక్ష శిష్యుడని పించుకున్నాడు.

యిలా ధర్మరాజుకు నారద మహర్షి చెప్పిన రాజశాస్త్రం వ్రాయడం అధిక ప్రసంగమౌతుందని విరమించాను. అనంతరం ధర్మ రాజును జూచి మహర్షి ధర్మనందనా మీ పితృపితామహులు పరిపాలించినట్లు పాలనచేసి మంచి కీర్తినార్జించు. అని చెప్పి తరువాత యిలా చెప్పాడు "ధర్మనందనా! నీతండ్రి స్వర్గలోకాన నన్నుచూసి "మహర్షి వర్యా! నాకుమారులు రాజ్యపాలన బాగా చేసికుంటున్నారా? నేనిక్కడ హాయిగా ఉన్నాను కాని రాజసూయ యాగాన్ని వారచ్చట చేసిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నాకిట లభిస్తాయి. అందువలన నాకుమారులను రాజసూయ యాగాన్ని అచ్చట చేయమని నీవు వారికి చెప్పమన్నాడు. అందువలన మీరు రాజసూయ యాగం గావించి నీ తండ్రికి స్వర్గ సుఖ స్వేచ్ఛా భోగాలు అనుభవింపచెయ్యి" అని నారదుడు వెళ్లేడు.

### జరాసంధ సంహారం

వెంటనే ధర్మరాజు శ్రీకృష్ణుని దగ్గరకు దూతను పంపగా శ్రీకృష్ణుడు వచ్చాడు. ఆతనిని చూచిన పాండవులు పరమానందమందారు. అందరూ సమావేశమయ్యారు. అప్పుడు కృష్ణుడు "పెద్ద బావా! ధర్మరాజా! మనము ముందుగా జరాసంధుని వధించాలి. తరువాత ఆతనిని అనుసరించి ఉన్న ఆతని స్నేహితులందరూ మనకు వశమౌతారు" అనగా! "కృష్ణా! ఆయనెవరు?" అనగా బృహద్రథ మహారాజు మగధ సామ్రాజ్యాభిషిక్తుడై యజ్ఞ యాగాలు చేసి మహేంద్రుని మించాడు. ఆతనికి యిద్దరు భార్యలు చండకౌశిక మహర్షి యిచ్చిన ఫలాన్ని సగభాగాలుగా సేవించి రెండు ముక్కలుగా ఒక బిడ్డను కన్నారు. ఆ ముక్కలను పారేశారు. అదేశ రక్షణచేసే జరయను దేవత రెండు ముక్కలనూ చేర్చి బిడ్డను బ్రతికించింది. అందుకే

“జరాసంధుడయ్యాడు ఆ బిడ్డను పెద్ద చేసి యాయగా ఆజరాసంధుని బృహద్రథుడు రాజుగా చేసి తాను తపస్సుకు వెళ్లాడు. యిది ఆతని శక్తి. కాని సామాన్యుడు మాత్రము కాదు. అని భీమార్జునులతో కలిసి బ్రాహ్మణ వేషాలతో ముగ్గురూ కలిసి వెళ్లారు. జరాసంధుడు ఒక రాక్షసుని సంహరించి, వాని చర్మముతో భేరీలు మూడు చేయించాడు. అవి ఆ పురాన వైరి రాజులు ప్రవేశించిన వెంటనే వాటంతటవే ఘోరమైన శబ్దాలుగావిస్తాయి. అని చెప్పి కృష్ణుడు వాటిని ముందుగా విరగగొట్టించాడు. బ్రాహ్మణులుగా పూమాలలు దాల్చి జరాసంధుని దగ్గరకు వెళ్లారు. ఆతడు అతిథి పూజగావించాడు. “అయ్యా! తమరెవరు? వేషాలు విప్రులది. బాణాలు క్షాత్రవ ధర్మాలు” అనగా “జరాసంధా! మేము క్షత్రియులమే. నీవు యెందరో రాజులను అధర్మవర్తనుడవై బంధించావు. నీదుర్మార్గాలకు అంతులేదు. ధర్మ రక్షణ మాకర్తవ్యము. నీతో యుద్ధము గావించడానికి వచ్చాము. యీ బంధించిన యిందర రాజులనూ యీ యాగమున బలిచేయడానికి సిద్ధముగా ఉన్నాము. నిన్ను హతమార్చడమే పని. నీవుమాలో ఒకరితో ద్వంద్వ యుద్ధముగావించు. లేదా, రాజులందరినీ విడిచిపెట్టు” అను శ్రీకృష్ణుని జూచి మీలో యీ బలముగల వానితో యుద్ధము గావిస్తానని భీముడూ జరాసంధుడూ చేతులు కలిపారు. యిరువురు రెండు మదగజాల్లా ఢీకొని ద్వంద్వయుద్ధంగావించారు; మహాపర్వతాలు రెండు ఢీకొన్నట్టుగా భయంకరముగా ముష్టియుద్ధముగావించారు.

యెంతగా యుద్ధము చేసి వానిని చీల్చి రెండు ముక్కలుగా చేసి పారవేయగా ఆరెండు చెక్కలూ అతుకుపోయి “ఓరీ భీమసేనా! రా అని జరాసంధుడు లేచి వచ్చాడు. భీమునికి ఆశ్చర్యము అలసిపోవడము రెండూ ఒక్కమారే జరిగాయి. భీముడు శ్రీకృష్ణుని వైపు చూడగా కృష్ణుడు గడ్డి పరక రెండుగా చీల్చి’ అటువైపుది యిటు, యిటువైపుది అటు పారవేసి చూపాడు. భీముడు జరాసంధుని నేలపడేసి తనకాలితో నొక్కిపట్టి వాని కాళ్లను లాగి రెండుగా చీల్చి ఒకభాగం ఒకవైపు, యింకొక ముక్క యింకొక వైపు వేయగా వాని శరీరము కలవడానికి వీల్లేక జరాసంధుడు చనిపోయాడు. యిలా జరాసంధుడంతమందాడని తెలిసిన రాజులు. ప్రజలు వేనోళ్ల పాండవులను కీర్తించారు.

నకుల సహదేవులు రాజులందరనూ గెల్చి వస్తువులూ – వాహనాదులను లెక్కలేనన్ని తెచ్చారు. రాజమిత్ర – బంధు – ఆప్తజనాలకు లేఖలు వ్రాశారు. శ్రీకృష్ణపరమాత్ముడు. ముందుగా పూజనీయుడైన వ్యాస మహర్షిని మనస్సులో సంకల్పించి నంత వ్యాసులవారు ప్రత్యక్షమయ్యారు. పాండవులు – శ్రీకృష్ణుడూ యెదురేగి పూజించి అర్ఘ్యపాద్యాదులిచ్చి తీసికొని ఉన్నత పీఠాన ఉంచి ధర్మరాజు “మహర్షి వర్యా! యీరాజసూయ యాగము యెలా చేయాలో సందేహముగా ఉన్నదనగా వ్యాస మహర్షి నవ్వి



**“తే॥ పుండరీకాక్షునకు నాల్గు భుజములట్లు**
**కలరు నల్వురు తమ్ములాకంసవైరి**
**యాప్తబంధుడుతోడునైయలరి నాడు**
**ధర్మజా! యేడి నీ పాటి ధన్యతముడు?”**

నీకు సందేహమా? రాజన్యులందరికి సందేశ మీయగలవాడివి” అనగా “తాతా! మీ అనుగ్రహ ఆశీస్సులు సంపూర్ణముగా ఉంటే చాలు”నన, అలాగే అని వ్యాసుల వారికి ఆధ్యక్ష్య పీఠాన్ని యిచ్చాడు. యాగము ప్రారంభమయింది.

ధౌమ్య మహర్షి సమర్థులందరినీ తెచ్చి యెవరిని యేస్థానములో ఉంచాలో అలా ఉంచాడు; యాగ పరిసర ప్రదేశమంత కల్యాణగానాలతో నిండిపోతుంది. సమస్త శాస్త్రజ్ఞులు వారి వారి పాండితీ ప్రకర్షతను చూపిస్తున్నారు. భీష్మద్రోణులు సర్వాధిపత్యము వహించాడు. కురుకుల పెద్దలు బాహ్లిక – సోమదత్త – ధృతరాష్ట్రాదులు ఉచితాసనాలంకృతులై ఉన్నారు. నాలుగు దిక్కుల నుండీ వచ్చిన జనసందోహానికి లోటు లేకుండా భోజనము సదుపాయాలు, వసతులూ సమకూర్చారు. యిలా ధర్మరాజు పేరు దశదిశలందు మార్మోగిపోయింది. భీష్ముడు “ధర్మనందనా! యాగాంత మయింది. యాగ అగ్రతాంబూలము ముందుగా యెవరికి యివ్వాలో చెప్పు”మన్నాడు భీష్ముడు “కృష్ణుడే” అన్న ధర్మరాజు శ్రీకృష్ణుని పూజించాడు.

## శిశుపాల వధ

శిశుపాలుడు కోపముతో హఠాత్తుగా లేచి “ధర్మజా! యేమి నీసాహసం? ముదిమిచే మది దప్పిన యీ భీష్ముని పలుకులూ నీకు వేదాలు? యిందరు మహారాజులు – యిందరు పెద్దలుండగా యీ గొల్లవానికి అగ్రతాంబూలమా? నీవేదో బంధువువు. అని వచ్చిన మాకు యింతటి అవమానము గావిస్తావని అనుకోలేదు. యీ దాశార్హుడు పూజార్హుడా?” అనగా “నాయనా! శిశుపాలా! యిలా పరుష వాక్కులతో పరమాత్ముని నిందించడము నీవంటి వానికి తగునా?” అన్నాడు “మహారాజా! యీతుంటరి మాటలతో మనకేమిపని? వీడిని దునిమోస్తానని సహదేవుడనగా భోజ – యదువంశరాజులు లేచారు.

ధర్మరాజు తనయాగము యేమౌతుందో అనుకొనగా, భీష్మాదులు “నాయనా! యేమీ కాదు. అంతా శ్రీకృష్ణుడే చూసుకుంటాడు” అన్నారు. “ఓయీ గాంగేయా? గో – స్త్రీవధ మహాపాపమని శాస్త్రాలు చెప్పుతున్నాయి. ధేనుకాసురుని, పూతనను చంపిన యీ నికృష్టుడా నీకు పూజార్హుడు? అని శిశుపాలుడు మితిమీరి పెద్దలందరినీ దూషింపగా కృష్ణుడు చక్రము వేయగా అది శిశుపాలుని తల ఖండించింది. అలా యాగం పూర్తయింది. దుర్యోధనుడు తానొక్కడే మయ సభను చూడ బయల్దేరాడు. అక్కడ మయుని వాస్తువ్యత్యస్తం దుర్యోధనునకు తెలియక యీశాన్యమున సరోవరముందునని కట్టు పుట్టము యెత్తుకొని ప్రవేశించాడు; దక్షిణమున

మామూలుగా నడుస్తుండ అక్కడ సరస్సులో పడిపోయాడు. భీమసేనాదులు నవ్వారు. సిగ్గుతో దుర్యోధనుడు తలవంచుకున్నాడు.

మయుని రచనా చమత్కృతితో మణిస్థగితద్వారము మూసి ఉండగా తెరచిన దనుకొని వెళ్లగా దుర్యోధనుడు అక్కడా తలకు దెబ్బతగిలి పడ్డాడు. మహాబాధతో హస్తిపురానికి వెళ్లి పాండవులు గావించిన యీ పరాభవము యెలా భరించాలి అని విచారిస్తుండగా శకుని వచ్చి" అల్లుడూ! యెందుకింత చిన్నదానికి విచారము? మనము ప్రతిక్రియ చేయలేమా?" అన్నాడు. అంతేకాదు నాలుగు దిక్కుల గల రాజులందరినీ జయించి రాజసూయముచేసిన ధర్మరాజు సంపదలన్నీ ఒక్క ఆటతో కట్టు. అది యేర్పాటు చెయ్యి" అన్నాడు శకుని. దుర్యోధనుడు ధృతరాష్ట్రుని దగ్గరకొచ్చి "తండ్రీ! పాండవులకు పట్టపగ్గాలు లేకుండా ఉన్నాయి. ధనమా? రాజ్యమా? కీర్తియా? అన్నిటితో అమరేంద్రునిలాగున్నారు. నేను బహుళ పక్ష చంద్రుని లాగ రోజు రోజూ అన్నివిధాలా క్షీణిస్తున్నానని విచారము వెలిబుచ్చాడు. "దీనికి ఉపాయం? ధృత రాష్ట్రుడనగా ప్రక్కనే ఉన్న శకుని "మహారాజా! మీరు ఊ అంటే ఒక్క క్షణములో వారి సంపదలన్నీ మీకు సమర్పిస్తా"నన్నాడు. ధృతరాష్ట్రుడు ధర్మరాజును తీసుకు రమ్మని విదురుని పంప ధర్మరాజు చెప్పినవి విని కూడా సోదరులతో ధృతరాష్ట్రుని దగ్గరకు వచ్చాడు. దుర్యోధనుని సభాభవన ప్రవేశానికి అందరితో వెళ్లాడు. ఆ రాత్రి గడిచింది. మరునాడు "ధర్మరాజా! నీకత్యంత ప్రావీణ్యతగల ద్యూతక్రీడ ప్రారంభిద్దామా?" అన్నాడు శకుని. ధర్మరాజు యెంతగాకాదన్నా శకుని ఆతనిని మెత్తగా ఒప్పించాడు. మాయలమారి శకునితో ధర్మరాజు ఆడిన ఆటలన్నీ ఓడిపోతున్నాడు. ఓడిన కొలదీ పౌరుషము, పంతం యెక్కువై అన్నిటినీ ఓడిపోయిన ధర్మరాజు తన సోదరులందరనూ ఓడిపోయాడు.

విదురుడు "మహారాజా! దుర్యోధనడు చేస్తున్నది దుష్టబుద్ధిగాని యిదిద్యూత క్రీడా కాదు. నీవిప్పుడు వెంటనే నివారించక పోతే సర్వనాశనమౌతుందన్నాడు. దానికి ధృతరాష్ట్రుడు మాటాడలేదు. "దుర్యోధనా! యిది న్యాయముకాదు. ధర్మమూర్తి ధర్మరాజును యిలా ఘోరముగా సర్వ సంపదలూ శకుని మాయాద్యూతములో ఓడించడం నీవినాశనానికి అన్నాడు" "నీవెప్పుడూ వాళ్లను కీర్తించడం మమ్మల్ని పరాభవింపడం మొదటి నుండీ నీకు అలవాటే. నీకు పెద్ద తనం యిచ్చిన కొలదీ మితిమీరుతున్నావు నీ సలహా సహాయ సంప్రదింపులు మాకెంత మాత్రమక్కరలేదు. శకుని అన్నీ గెలుస్తున్నాడని ధృతరాష్ట్రునికి పరమానందముగా ఉంది. ద్రౌపదిని కూడా ధర్మరాజు ఓడిపోయాడు. పెద్ద లందరూ గల ఆ సభలో "విదురా! మాకు దాసీ ద్రౌపదిని యిక్కడకు తీసుకురా?" అని దుర్యోధనుడనగా; ద్రోణాచార్య భీష్మ మొదలైన పెద్దలందరూ తలలు వంచుకొని అచ్చటి నుండి లేచి వెళ్లిపోయారు.



## ద్రౌపదీ వస్త్రాపహరణం

విదురుడు వెళ్లలేదు. ప్రాతగామిని పంపాడు దుర్యోధనుడు. ప్రాతగామి మాటలు విన్న ద్రౌపది. యిదినిజమా? సోదరులందరినీ ఓడిపోయాడా?" ఔనన్నాడు నేను ఏకవస్త్రను సభలోనికి రారాదని చెప్పమన్నది. దుర్యోధనుడు "దుశ్శాసనా! నువ్వు వెళ్లు ఆమెను యీడ్చుకురా?'' అన్నాడు. ''నీవు యెలా ఉన్నామాకభ్యంతరములేదు. నిజముగా ఏకవస్త్రవా? లేక వేషము వేశావా?" అని సభలోనికి ద్రౌపదిని దుర్మార్గుడైన దుశ్శాసనుడు యీడ్చుకువచ్చాడు. "ఓసభాస్తారులారా! ఒక కులస్త్రీకి యింతటి అవమానము జరుగుతుంటే మీ అందరూ చూస్తున్నారా?" అనగా; అక్కడే ఉన్న భీముడు కన్నులనిప్పులు రాలుస్తూ "ధర్మరాజా! కులటకైనా జరుగరాని పరాభవము యీకులస్త్రీకి జరుగుతుంది. మమ్మందరనూ ఓడినా సహించాము. మా సహనము యెంతవరకు?" అని రోజుకున్నాడు భీముడు. యిందరూ యేమీ అనలేదు దుర్యోధన తమ్ముడు వికర్ణుడు లేచి "ఓమహామహులారా! మీరందరూ యేమి చూస్తున్నారు? ద్యూతములో తనను తాను ఓడిపోయిన తరువాత, యింకొకరిని పందెమొడ్డడానికి తనకు అర్హత ఉండదు.

ద్రౌపదిని ఒడ్డడానికి ధర్మరాజుకు హక్కులేదనగా! కర్ణుడు "వికర్ణా? నీయంతటి ధర్మ సూక్ష్మాలు యిక్కడున్న పెద్దలెవ్వరికీ తెలియకనే యెవ్వరూ మాట్లాడలేదా? నీవున్న కొమ్మను నీవే నరుక్కుంటున్నావు. యిక ఊరకుండు" అన్నాడు. దుర్యోధనుడు "ఐదుగురు భర్తలుగల యీమె విపరీతపు పతివ్రత. యీమె కట్టిన పుట్టాలు ఊడదీయ" మనగా సిగ్గూ మానమర్యాదలూ, స్త్రీయని కూడా జంకూ గొంకూ లేని దుశ్శాసనుడు ద్రౌపది చీరకొంగు పట్టుకొని లాగుచుండగా "కృష్ణా! ఆపద్బాంధవా? కరుణావరుణాలయా! పాహిమాం పాహి అని" రెండు చేతులు పై కెత్తి ప్రార్థింప ఆ సమయాన శ్రీకృష్ణపరమాత్మ రుక్మిణీ దేవితో చదరంగం ఆడుచుండ ద్రౌపది కేక విన్పించ" అక్షయం" అన్నాడు. రుక్మిణి యేమని అడుగ విషయం వివరించాడు. దుశ్శాసనుడు లాగి పారవేస్తున్నాడు ద్రౌపది చీరలను. ఆచీరలు పెద్ద కొండంతలయ్యాయి.

సభలో ఉన్నవారందరి కళ్లూ యీ వింతను చూసి నమ్మలేక పోయారు. భీముడు కట్టు త్రెంపిన మదగజములాగలేచి "ఓకురువంశ పెద్దల్లారా! మహా సభలో గల సభాస్థారులారా! యిందరు చూస్తుండగా ద్రౌపదీదేవి చీరలు లాగిన యీ దుష్ట దుశ్శాసనుని యుద్ధరంగాన గుండెలు చీల్చి వీడి క్రొన్నెత్తురు త్రాగుతా"నని ఘోర ప్రతిజ్ఞ గావించాడు. దుశ్శాసనుడు చీరలు లాగిలాగి నేలకూలబడ్డాడు. ద్రౌపది సభవారికి నమస్కరించి "మహామహులారా! యింతవరకు యేచరిత్రలో కులస్త్రీకి జరగని పరాభవము జరిగినది. మీరందరూ మీనేత్రాలతో చూశారుకదా? యిది భారత జాతికే తలవంపు; యిచ్చట ధర్మము తెలిసిన వారు ధర్మాన్ని వివరించండి?" అనగా భీష్ముడు "రాజపత్నీ! ధర్మము చాలా సూక్ష్మాతి సూక్ష్మమైనది. యిది మహానీయులే నిర్ణయింపలేకపోయారు.

యిప్పుడు దీనిని గూర్చి చెప్పగలవాడొక్క ధర్మరాజే తక్కిన వారికి తెలీదు" అన్నాడు భీష్ముడు. యిలా ఉండగా ధృతరాష్ట్రుని తీసుకొని అక్కడకు వచ్చాడు విదురుడు. ఓరీ దుర్యోధనా? యెంతపని చేశావురా? యీ మనకురువంశానికి పెద్ద కోడలికే యిలా చేశావురా దుష్టా? అమ్మా! నీవు పవిత్రవు నీకేమి కావాలో కోరుకొమ్మనగా; ద్రౌపది ధర్మరాజును బంధవిముక్తుని గావింపమన్నది? అలాగే అంది. నా భర్తల అస్త్రశాస్త్రాల నిప్పింపమన అలాగే అని మరల కోరుమనగా "మహారాజా! క్షత్రియ కాంతకు రెండు వరాలు కోరుకొనే హక్కుంది. మూడవది కోరకూడ"దన్నది ద్రౌపది. ధర్మరాజును జూచి ధృతరాష్ట్రుడు "ధర్మనందనా! మీ ధనకనక వాహనాది ద్రవ్యాలన్నీ మీవి మీరు తీసికొనండి. జరిగినది పీడకలగా మరచిపొండి" అన్నాడు.

## రెండవసారి జూదం

పాండవులు అలా వెళ్లగానే దుష్టచతుష్టయం మరొక పన్నాగం పన్నారు. దుర్యోధనుడు ధృతరాష్ట్రుడు దగ్గరకేగి "తండ్రీ! పాండవులు యిక్కడ ఉన్న మాకు శాంతిలేదు. భీమార్జునులను చూస్తే నాకు గుండె దడ. అందువలన ధర్మరాజును మరల జూదమాడ వర్తమానము పంపండి. దీనిలో ఓడినవారు పదిరెండేండ్లు అరణ్యవాసం ఒక యేడు అజ్ఞాత వాసం నియమము పెట్టండి?" అనగా ధృతరాష్ట్రుడు యెంతసేపో ఆలోచించి చివరకు పుత్రుని పైగల గ్రుడ్డి ప్రేమతో చివరకు ఒప్పుకున్నాడు. ధర్మరాజు రెండవమారు కూడా ద్యూతములో ఓడిపోయాడు. కుంతీదేవికి అందరూ నమస్కరించి అరణ్యవాసదుస్తులతో ఐదుగురు ద్రౌపదీదేవి –ధౌమ్య మహర్షితో బయల్దేరారు. ధృతరాష్ట్ర దుర్యోధనులను ప్రజలందరూ యెంతగానో నిందించారు. సంజయుని పిలువగా "మహారాజా! యేమియీ విపరీతం? మొదట జూదం జరిగింది మరల రెండవమారా? యిదంతా మీ ఉపేక్ష మూలంగా జరిగింది కాదంటారా? యింటి కోడలు – యేకవస్త్రను సభామధ్యను చెప్పరాని అవమానము కావిస్తారా? మీకుమారుడు యెలా ఆడిస్తే మీరలా ఆడుతారా? యిదంతా మీకు కట్టికుడుపుతంది. "సంజయా! నేనేమి చేయుదును? నామాటవారు అహంకారులై వినరు. నేనేమి చేసేది?" అన్నాడు.

**ఇది మహాభారతములో సభా పర్వం ముగిసింది**





# సంపూర్ణ మహాభారతం

## అరణ్య పర్వము



ధౌమ్య మహర్షితో ద్రౌపదీ సహితులైన పాండవులు కామ్యకవనం చేరారు. ధౌమ్యుడు "ధర్మరాజా! త్రిమూర్తి స్వరూపుడు ప్రత్యక్ష దైవము, ఆరోగ్య ప్రదాత సూర్యభగవానుని ఉపదేశిస్తానని యిలా చెప్పాడు.

**శ్లో॥ ఓం సూర్యోఽ ర్యమా భగస్త్వష్టా పూషాఽ ర్కస్స వితారవిః**
**గభస్తిమానజః కాలో మృత్యుర్ధాతా ప్రభాకరః"**

అలా సూర్యోపాసన ధర్మరాజు గావింపగా సూర్యుడు ప్రత్యక్షమైనాడు. ఒక అక్షయపాత్ర ఆతనికిచ్చి "కుమారా! మీకు యీ పదిరెండు సంవత్సరాలూ సర్వపదార్థాలునూ మీకిది యిస్తుంది; నీ అర్థాంగి భుజించిన తరువాత ఆరోజు మరేదీ యివ్వదు. అది శిరోధార్యముగా స్వీకరించాడు ధర్మరాజు. ఆరోజు నుండి ఆకలి కలవారందరికీ అన్నదానం చేయసాగాడు.

యిలా యిక్కడుండగా కర్ణుడు దుర్యోధనునితో "మిత్రమా! అరణ్య వాసం గావించు పాండవులనక్కడే సంహరిద్దాం. యిలా ఉండగా వ్యాసుల వారురాగా దుర్యోధనాధులు పూజించారు. "నాయనా! పాండవులూ – మీరూ అన్యోన్యంగా కలిసి ఉండడానికి బదులు కలహించుకోవడం మనకే తలవంపుకాదా?" అనగా; యింతలో మైత్రేయ మహర్షి అక్కడికి రాగావ్యాసులవారు సుయోధనా! యీ మహర్షులు వాక్యామృతం గ్రోలమని" వెళ్లిపోయాడు. ధృతరాష్ట్రుడూ మైత్రేయులవారిని

పూజించి కూర్చుండబెట్టి "మహాత్మా! అరణ్యమున పాండవులెలా ఉన్నారు? పాండవులు ధర్మసత్యవంతులని తెలిసి మహాత్ములైన తపోనిధులు వారిని చూడ్డానికి వచ్చారు.

మహారాజా! దుర్మార్గులైన నీ కొడుకులు చేసిన గొప్పవనికి ఆదివ్యపురుషలందరూ యెంతగానో విచారించి, యింత దుర్మార్గులు యీ భూమ్మీద ఉన్నారా? ఉంటే వారెంతగొప్పవారో చూడమని నన్ను పంపించారు. అందుకు వచ్చాను. "సుయోధనా! నీదురుసుతనమూ మూర్ఖతా అందరికీ తెలుసింది. కిమ్మీరుని భీముడు చంపాడు. రాజులందరూ చాలవరకు వారిపైమొగ్గుచూపుతున్నారు. అందువలన పాండవుల మీద నీవు కత్తి కట్టినా నీకు శ్రేయస్కరము మాత్రం కాదు" అన్నాడు.

దుర్యోధనుడు మైత్రేయ మహర్షి వాక్యామృతాన్ని వినక నిరాదరణ చూపిస్తూ తొడ చరచాడు. దానికి మహర్షి ఉగ్రుడై "ఓరీ దుష్టదుర్యోధనా! నాహితోపదేశాన్నే నిరాకరించావురా! భీముడు నీ తొడలను విరుగ గొట్టి నిన్ను నశింపచేయుగాక" అని శాపమీయగా ధృతరాష్ట్రుడు ఆతని కాళ్లపై బడివేడికొన వారి అర్థరాజ్యం వారికిస్తే యీ శాపము వర్తింపదు. లేదా తప్ప"దని వెళ్లాడు.



**శ్రీకృష్ణపరమాత్మ**

కృష్ణుడు పాండవుల అరణ్యవాసము తెలిసి అక్కడకు యదు – వృష్ణి – భోజులతో దుర్యోధనుని తిడుతూ వారలను చూడ్డానికి వెళ్లారు. అందరూ యెదురేగి వచ్చిన వారిని సగౌరవ మర్యాదలతో సత్కరించారు. ధర్మరాజుకు కృష్ణుడు నమస్కరించి "బావా ! సుయోధనుని బంధుమిత్ర పరివారముతో చంపి నీకు పట్టాభిషేకము జరిపిస్తా"మన్నాడు. "సోదరా! మహాబలవంతులగు ఐదుగురు పాండవులున్నా నాకీపాట్లు తప్పలేదు. నీ సోదరి యిలా శోకాగ్నితో దహింపబడవలసిన దేనా?" అని పైట చెరగుతో కన్నీరుతుడుచుకుంటూ అన్నది. అంతా విన్న శ్రీకృష్ణుడు "సోదరీ! నీవు కొన్ని నాళ్లే యీ క్లేశాలనుభవిస్తున్నావు. కౌరవకాంతలు నీకన్న మిన్నగా బ్రతికున్నంతకాలము దుఃఖాలను అనుభవిస్తారు. నీవింక కొద్ది కాలము ఓపికపట్టు" అన్నాడు.

అనంతరం శ్రీకృష్ణపరమాత్మ యిలా అన్నాడు. పూర్వము నలచక్రవర్తి కూడా యిలాగే ద్యూత క్రీడలో సర్వము కోలుపోయాడు. యిది యెవరిని పట్టు కొంటుందో వారందరూ తుదకు బికారులయ్యారు. జూదము సర్వ ఐశ్వర్యాలను హరించుకుపోతాయని శాస్త్రాలు వేనోళ్ల చెప్పుతున్నాయి. పాండవులు భీమార్జున నకుల సహదేవులు శ్రీకృష్ణునకు పాదాభివందనలు గావించారు. శ్రీకృష్ణుడు ద్వారకకు వెళ్లాడు. భీమాదులు "ప్రభూ! మీరెందరి మహనీయులనో యింతకు ముందు దర్శించారు. సర్వమూ తెలిసిన మీయిష్టము వచ్చిన మన కనుకూలస్థలాన్ని చూడండి. అక్కడే మనముందాం" అన్నారు.



నిర్మలజలాలూ ఫలపుష్పాలతో, మహాత్ములతో యీద్వైతవనం మనకు వాసయోగ్యంగా ఉంటుంది. అందుచేత మనము అక్కడే ఉండడము మంచిదని ఒక పవిత్రమైన సరస్సు దగ్గరకు వెళ్లేడు ధర్మరాజు. అక్కడ దివ్యర్షులెందరో సిద్ధపురుషులు గల దానిని చూసి అక్కడ గల మహాత్ముల ఆశీస్సులందుకొని సుమసౌరభము నాలుగు దిక్కులకు విరజిమ్ముచున్న భీమార్జున నకులసహదేవులు ద్రౌపదీ అందరూ ధర్మరాజు చుట్టూ కూర్చున్నారు.

తపో తేజస్సును నాలుగు దిక్కులకూ పంచినవాడు, మహత్తర తపః సంపన్నుడు మార్కండేయ మహర్షి వచ్చేసరికి ధర్మరాజు భయభక్తి వినయ సంభ్రమాలతో యెదురేగి అర్ఘ్య పాద్యాదులిచ్చి పూజించి ఉన్నత స్థలములో కూర్చుండ బెట్టాడు. అందరూ వలయంగా మహర్షికి కూర్చున్నారు. "ధర్మరాజా! యీనీ పరిస్థితి చూస్తే పూర్వము శ్రీరాముడు జ్ఞాపకము వస్తున్నాడు. కౌశల్యాకుమారుడు రాముడు అస్త్ర శస్త్ర విశారదుడే కాక సర్వశాస్త్ర పారంగతుడు. న్యాయ ధర్మదయాగుణ శోభితుడు. నీవు కూడా ఆతని వలెనే ధర్మాలాచరించి అందరికీ అభిమానపాత్రుడవయ్యావు. ధర్మము సూర్యుని కన్నా మిన్నయిన శోభనిస్తుంది.

నీ వనవాసాంతమున కౌరవులగెలిచి ధర్మరాజ్యాన్ని స్థాపిస్తావు. నీధర్మమే నీకు కవచమని వెళ్లిపోయాడాతడు; ద్రౌపది ధర్మరాజును చూసి యెంతగానో బాధపడుతూ "మహారాజా! "ఆదుష్ట దుర్యోధనుని మూలముగా మీకిన్ని యిక్కట్లు ప్రాప్తించాయి. ధర్మమార్గాన ఉన్న మీరీ అరణ్యాన యిన్ని బాధలు పడుతుంటే, దుర్మార్గులయిన దుష్టచతుష్టయము హాయిగా సర్వభోగాలతో తులతూగుతున్నారు. మీ క్షమాగుణము మా అందరినీ కట్టిపడేసింది. యిందరమూ యేమి చేయలేకుండా ఉన్నాము" అనగా "పాంచాలీ! మనిషికి కోపము మరణముతో సమానమైంది. పతనానికి ముఖ్యహేతువు క్రోధమే, వైరులను జయించడానికి క్రోధము సాధనముకాదు. అగ్నిని ఆర్పడానికి అందులో నేయి పోసినట్లే" అని ద్రౌపదికి చెప్పేడు ధర్మరాజు. అదే సమయమున వ్యాసులువారు రాగా అందరూ వారికి పూజలు చేశారు "ధర్మరాజా! భీమార్జునులు నీరెండు భుజాలు. భీష్మ – ద్రోణ – కర్ణులన్న నీమనస్సు ఆందోళన చెందుతుంది. కానీ యేమీ భయము వద్దు. దానికి మార్గము నేను చెప్పుతానన్నాడు. అంతేకాదు అర్జునుడు యమవరుణ కుబేర మహేంద్రాదుల వలన – పరమశివుని వలన అస్త్రశస్త్రాలు పొందడము యీవనవాసము వలనే జరుగుతుంది" అని వెళ్లెను.

ఒకనాడు ధర్మరాజు అర్జునుని పిలిచి "నాయనా! కౌరవులందు – కర్ణ అశ్వత్థామలు సకలాస్త్రాలు తెలిసినవారు. వారిని జయించడం చాలా కష్టం వ్యాసులవారు ఒక దివ్య మంత్రాన్ని యిచ్చారు. అదినీకు యిస్తాను. నీవు ఉత్తరానికి వెళ్లి మహానియమముతో తపస్సుచేసి మహేంద్రుని ప్రత్యక్షంచేసికొని ఆతనిచేత అభేద్య ఆయుధాలు పొందు;, అనగా, ధౌమ్యాదులకు వందనలాచరించి హిమాచలం

చేరి – గంధమాదనగిరిదాటి అనేక వన – పర్వతాలు దాటి “ఇంద్రకీలగిరిని చేరాడు. ఒక ధ్వనిని విని నలుదట్లు పారజూడ ఒక మహర్షి జడలతో శరీరమునిండా విభూతితో నున్న ఆతడు “అర్జునా! యిది అతిప్రశాంత స్థలము. యిచ్చట కామక్రోథాదులకు తావులేదు. యిక్కడకు అస్త్రాలతో రాకూడదు. అవన్నీ విడువు” అనగా అర్జునుడు రెండు హస్తాలూ జోడించి భయభక్తి వినయముతో నిలువబడ ఆతడు మహేంద్రుడయ్యాడు. కుమారా! నీకు కావలసినది కోరమనగా “అస్త్రాలుకోరాడు; సరే పరమశివుని గూర్చి నీవిక్కడ తపస్సు చేస్తే ఆతడే నీకేమి కావలసిన అస్త్ర శస్త్రాలు అనుగ్రహి”స్తాడని అంతర్థితుడయ్యాడు.

## పాశుపతాస్త్రం

ఇంద్రకీలాద్రి శిఖరాన అర్జునుడు మహాతపస్సు చేయసాగాడు. కాలి బొటనవ్రేలిపై నిలిచి వాయుభక్షణతో కఠోర తపోదీక్షలో తన శరీరాన్ని మరచి ఉండడం చూసి పరమశివుడు పాండవ మధ్యముని పరీక్షించాలని కోయరూపాన్ని ధరించి అర్జునుని దగ్గరకు రావడం, ఆ సమయానికి మూకాసురుడు అర్జునుని చంపడానికి రాగా, పరమ శివుడూ – అర్జునుడూ యిద్దరు చెరి ఒక ప్రక్క దానిపై బాణాన్ని వేశారు. వరాహరూపాన ఉన్నవాడు భూమిపై పడ్డాడు. అమ్మవారితో భూతగణాలతో వచ్చిన పరమశివుని చూసి “యేమి నీసాహసం? యింత భయంకరాటవిలో కాంతలతో వచ్చావా? నేను వేసిన పందికై నీవూ బాణాము వేశావు జాగ్రత్త” అన్నాడు అర్జునుడు. “ఓయీ! మా వేషాలు చూడలేదా? ఆరణ్యకులం యీ ప్రాంతమంతా నా యధీనం నా భూమికి వచ్చి నన్నే భయపెట్టుచున్నావా? రా! నీకు సత్తా ఉంటే అని పరమశివుడు బాణాన్ని తీయబోవగా అర్జునుడాతని పై బాణాలు వేశాడు. అవన్నీ వామకరముతో పారవేశాడు పశుపతి. యిద్దరూ బాణాలు వేసుకొని అనంతరం ముష్టియుద్ధంచేయగా అర్జునుడు క్రిందపడిమూర్ఛపోయాడు. లేచి తేరుకొని పరమేశ్వరుని అనేక విధాల నుతించాడు. నీవు వరము కోరుకొమ్మనగా “తండ్రీ! నాకు పాశుపతాస్త్రాన్ని అనుగ్రహహింపమని అర్జుననకు ఆమంత్రాన్ని అస్త్రాన్ని ప్రయోగోపసంహారాలన్నీ ఉపదేశించి పరమ శివుడు అంతర్ధానమయ్యాడు. అలా అర్జునుడు మహానందముతో స్తోత్రముచేయగా యమవరుణ – ఇంద్ర కుబేరులు ప్రత్యక్షమై అనేకాస్త్రాలు అర్జుననకు ప్రసాదించారు.

## అప్సరోంగన ఊర్వశి

తరువాత మహేంద్రుడు మాతలితో పంపిన రథముపై అర్జునుడు అమరలోకము వెళ్లి అక్కడ నృత్య –నృత్యగాన విద్యా సాగరుడైన చిత్రసేనుని దగ్గర కొంతకాలము ఆవిద్యలార్జించాడు. అక్కడ అర్జునుని హృదయోల్లాసానికి ఊర్వశి నాట్య ప్రదర్శన మహేంద్రుడేర్పాటు చేశాడు. ఆరాత్రి అర్జునుని దగ్గరకు ఊర్వశి వచ్చి తన శృంగారాంగ వైభవాలన్నీ చూపింప అర్జునుడు యెదురేగి ఆమెకు వందనలర్పించాడు. ఆమె ఆతనిపై బడగా దూరంగా అర్జునుడు తప్పుకొని “మాతా!



నీవు నాకు తల్లివి. నా తండ్రి మహేంద్రుని చేపట్టినదానవు” అనగా ఊర్వశి మహాకోపముతో “నిన్ను కోరి రాగా నన్ను తిరస్కరిస్తావా? నీ నిండు మగతనము నీటగలియ నపుంసకత్వమున స్త్రీలకు నృత్యగానవిద్యలు నేర్పుతూ కాలము గడపు” అని శాపమిచ్చి వెనుదిరిగి పోయింది.

అర్జునుడు అలోచిస్తుండగా అమరేంద్రుడు వచ్చి “విజయా! ఊర్వశి శాపం ఓ యేడు నీకు అజ్ఞాతవాసంలో పనికి వస్తుందని మార్చాడు. యిచ్చట పాండవులూ ద్రౌపదీ అయిదు సంవత్సరాలైంది. అర్జునుడు రాలేదని యెంతగానో బాధపడుతున్నారు. యింతలో అక్కడకు వచ్చిన బృహద్రథమహర్షిని పూజించి “మహాత్మా! మాలాగ మున్నెవ్వరైన కడగండ్లు గాంచారా?” అని ప్రశించారు. ధర్మరాజా! నీవేనయం నలచక్రవర్తి పడరాని యిడుములు పడ్డాడు. సర్వమూ ద్యూతములో ఓడిపోయి అరణ్యాన కట్టుబట్టలేక భార్యను కూడా విడిచిపెట్టాడు. తరువాత రాజ్యాన్ని భార్యను పొంది సుఖమనుభవించాడు. ధర్మన్యాయవర్తులు కడగండ్లు పాలయినా అనంతరం ఆనందాన్ని పొందుతారు.

యిలా కొన్నాళ్లు జరుగగా తీర్థయాత్రలకు బయల్దేరారు గంధమాదన పర్వతము యెక్కుచుండగా ఒక పెద్ద పెనుగాలి రేగింది. ఆజంఝూమారుతానికి మహావృక్షాలు నేలకూలిపోతున్నాయి. ఆకసము బ్రద్దలైనట్టు పర్వతాలందుగల పెద్ద బండరాళ్లు ఒకదానిపై యింకొకటి పడి అగ్ని పుట్టి అక్కడ అరణ్యాలనన్నిటినీ దహిస్తున్నాయి. ద్రౌపదిని ఒకచేత్తో యింకొక చేత్తో పెద్ద వృక్షాన్ని పట్టుకున్నాడు. ధౌమ్యుడు తక్కిన వారంతా ఒక దగ్గర కూర్చొని ఆ గాలి వేగానికి ముడుచుకు పోయారు. గాలి తగ్గింది వర్షం విద్యుత్కాంతులతో కుండపోతగా కురుస్తుంది. ఆనీరంతా ఒక పెద్ద నదిలా ప్రవహించడం ప్రారంభించింది. తరువాత అంతా పూర్తిగా తగ్గిపోవ ప్రయాణాన్ని సాగించారు. ఆముండ్ల గొడిరాళ్లపై ద్రౌపది నడవలేకపోయింది. ఆమెను జూచి యెంతగానో బాధపడి ధర్మరాజాదులు ముఖముపై ఆమెకు నీళ్లు చిమ్మి శైత్యోపచారాలు చేయ కొంతవడికి తేరుకుంది. ముందు మంచు పర్వతాలు యెలా వెళ్లాలన్న ధర్మరాజు మాటలో భీముడు ఘటోత్కచుని స్మరింపగా వచ్చి పిన తల్లికి పెద తండ్రికి తక్కిన వారికి వందనలర్పించి, తాను ద్రౌపదిని భుజాలపై యెక్కించుకొని, తన శిష్యులకు కనురెప్పపాటుకాలములో పాండవులనూ తక్కినవారందరినీ గంధమాదన గిరి శిఖరాన దింపారు ఆగిరి గరుడ గంధర్వకిన్నెరుల విహారభూమి. పుష్ప – ఫలాలతో – కనులపండువుగా, చిలుకలూ, గోరువంకలూ, నెమిళ్ల నాట్యాలూ వారలా తిలకిస్తూ నరనారాయణుల ఆశ్రమస్థలాలు దర్శిస్తూ, అలా ఉండగా ఒక సరస్సు కనులపండువుగా కమలాలతో నిండి ఉంది.

## హనుమన్న

భీముడాకొలనిలో దిగి యీదులాడి శంఖాన్ని పూరించాడు. ఆశబ్దానికి గుహల్లో నిద్రిస్తున్న సింహాలు గర్జిస్తూ పారిపోసాగాయి. మదించిన ఏనుగులు

ఘీంకారాలతో పారిపోతున్నాయి. అచ్చట తపస్సు గావిస్తున్న హనుమ యీ శంఖధ్వని మా తమ్ముడు భీమసేనుని దని గ్రహించాడు. కొంచము పరీక్షగావిస్తానని వృద్ధ మర్కట రూపుతో త్రోవకడ్డముగా పండుకున్నాడు. భీముడు వచ్చి "ఓముసలి వానరమా! దారి కడ్డముగాపడుకున్నావు లెగు" అనగా; "నాయానా! నావాలాన్ని తొలగించి వెళ్లు నాయనా?" అనగా భీముడు ఎడమచేత్తో యెత్తబోయాడు. రెండుచేతులతో యెత్తినా లేవలేదు. అప్పుడు భీముడు "మహనీయా! తమరెవరో శలవివ్వండి?" అనగా "సోదరా! అంజనాదేవి గర్భాన వాయువు కన్న బిడ్డను నాపేరు హనుమన్న అనగా భీముడు హనుమకు పాదాభివందనగావించి భక్తితో హస్తాలు జోడించి

> **"కోరికలేని వాడయినగూడ, అజస్రము రాముసేవలో**
> **తీరికలేనివాడు; తరితీపులు చూపులు జూచువాడు; శ్రీ**
> **తారక రామనామము హృదబ్జమునన్నెలకొల్పువాడు; మా**
> **కోరిన కోర్కెలన్ని యొనగూర్చెవాడు ప్రసన్నుడయ్యెడిన్"**

అనగా భీముని దగ్గరగా తీసికొని హనుమ శ్రీరామకథ చెప్పి "నీవు సౌగంధిక పుష్పానికి వచ్చావుకదూ?" అనగా ఔనన్నాడు భీముడు. యీ మార్గంకాదు అచ్చటికేగి ఆ పుష్పాల అధిదేవతల ప్రార్థన చేసి, వారిదివ్యానుగ్రహాన్ని పొందిన తరువాతనే పుష్పాలను కొయ్యాలి అని చెప్పాడు హనుమ. భీముని కోరికతో రామాయణమునాటి హనుమ రూపాన్ని చూసి ఆశ్చర్యమంది ఆతని ఆశీస్సులతో బయల్దేరాడు. ఒక దివ్య సరోవరం జలపక్షులకోలాహలం దానికి రక్షించే యక్షులు, రాక్షసులతో రక్షింపబడుతున్నది. అక్కడివారు భీముని సంగతి అంతా తెలిసి "యీ సరోవరం యక్షరాక్షసులకు రాజు కుబేరుని ఆజ్ఞలేనిదే దీనిలో యెవ్వరూ దిగరాదు" అనగా భీముడు" యది ప్రకృతి సిద్ధమైన సరస్సు. వర్షాధారం – అలాంటప్పుడు దీనిపై కుబేరుని అధికారమా?" గట్టిగానవ్వాడు. అది విన్న కుబేరుడు యీతనికి యెవరూ అడ్డుచెప్పవద్దు" అన్నాడు. అలా భీముడు కాలసినన్ని కమల పుష్పాలను తీసికొని సరోవరం నుండి ఒడ్డుకు వచ్చాడనగా – మహా జంఝామారుతం కుంభవృష్టి ప్రారంభమయింది. అక్కడున్న పక్షులు యిదేదో ప్రళయ మని పరుగులు తీశాయి. చీకటి కూపములాగుంది ప్రకృతి అంతా ఆసమయాన ధర్మరాజు – ఘటోత్కచునితో సోదరులతో అక్కడకు వచ్చాడు. అర్జునుని కోసము వారందరూ యెదురుచూడసాగారు. భీముడు కలిశాడు. ఘటోట్కచుడు తన అనుచరులతో కూడా వెళ్లాడు. యిలా ఉండగా భీముడు లేని సమయాన ఒక రాక్షసుడు జటాసురుడు బ్రాహ్మణ రూపముతో వచ్చి ధర్మరాజు అనుమతితో నుండి పాండవులు లేనప్పుడు, వారి అస్త్రాలు, ద్రౌపదిని పట్టుకుపోవగానుండగా, సహదేవుడు గట్టిగా కేకవేశాడు. పరుగు పరుగున భీముడు వచ్చాడు. "ఓరి దుర్మార్గుడా!" అని వానిని అరచేతితో గ్రుద్దాడు. వాడా దెబ్బతో చచ్చాడు. వారందరూ అలా నడుస్తూ ముందుకు



సాగుతుండగా దేవలోకము నుండి అర్జునుడు వచ్చాడు. ముందుగా ధౌమ్యునికి వందన మాచరించాడు. ధర్మజ, భీములకు నమస్కరించి, తమ్ములను దగ్గరకు తీసికొని అమరేంద్రుని పురాన ఉన్న అయిదు సంవత్సరాల్లో ఉన్న వింతలన్నీ వారికి వివరించాడు.

అనేక అస్త్రాలను పొందిన సంగతినీ నివాతకవచ – కాలకేయ ఘోర రాక్షస సంహారం వివరించి వారందరికీ ఆనందాన్నందించాడు. యిక పదిరెండు సంవత్సరాల వనవాసము పూర్తికా వచ్చింది. అక్కడున్న గంధమాదన పర్వతాన్ని దాటి హిమాలయము, యమున పుట్టిన స్థలాన్ని దాటి ఒక వత్సరకాలము అక్కడనివసించారు పాండవులు. అక్కడ కొండచిలువ రూపాన ఉన్న నహుషుడు భీముని పట్టుకొనగా భీముడు తప్పించలేక విలవిలలాడ ధర్మరాజు వాని ప్రశ్నలకు ధర్మరాజు జవాబు చెప్పగా నహుషుడు మామూలు రూపుదాల్చ, పాండవులు ఆతని ఆశీస్సులంది భీమునితో కలిసివచ్చారు.

## కలియుగం

పాండవులకు మార్కండేయ మహర్షి అనేక పూర్వరాజన్యుల చరిత్ర లెన్నో చెప్పాడు. తరువాత కలియుగాన్ని గూర్చి యిలా చెప్పాడు. "ధర్మరాజా! కలికాలంలో మనుజులు నాస్తికులౌతారు. వర్ణాశ్రమ ధర్మాలన్నీ మంటకలిసిపోతాయి. బ్రాహ్మణులు – తపస్సు స్వాధ్యాయాలన్నీ విడిచిపెడతారు. బాల్యమరణాలతో రోగాలతో యెంతో బాధపడతారు. స్త్రీలు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో చేయరాని పనులన్నీ చేస్తారు. విచ్చలవిడిగా అందరూ మద్యపానాసక్తులౌతారు. కొన్ని సంవత్సరాల వరకూ వర్షాలుండవు. తరువాత సప్తభాస్కరులుదయించ ఆ వేడికి నదులూ – నదాలూ – సాగరాలూ యెండిపోతాయి. తరువాత పదిరెండు సంవత్సరాలు యేకధాటిగా వర్షం కురుస్తుంది. మొత్తం భూమంతా జలముతో నిండి యుంటుంది. ఆ ప్రళయకాలజలముపై వటపత్రశాయిగా యోగనిద్రలో నుండే నారాయణుని దర్శనం నాకు కలుగుతుంది. అనగా "మహాత్మా! మీరప్పుడు దర్శించిన కలియుగ విషయాలు యింకా వినాలనగా; "యుధిష్ఠిరా! ఆ కలియుగములో నున్న మనుజులందరూ పాపాత్ములు. అల్పజీవులు. అబద్ధాలకోరులు. మూర్ఖులు వర్ణసంకరులు. విపరీతమైన హత్యలు, గోవధ – మానవవధను లెక్కలేనన్ని రోగాలు గలవారే!

భార్యాభర్తల కలహం – పిల్లలు తల్లిదండ్రులను గౌరవింపరు. అన్నదమ్ముల కలహాలు – పాలకులు దుస్స్వార్థపరులై ప్రజలు సొమ్ము రక్తమాంసాలను తింటారు. దుర్మార్గులు – మూర్ఖులు – రౌడీలు పరిపాలకులు – సత్సంప్రదాయాలు సాగరములో కలసిపోతాయి. ధర్మకర్మలునశించాయి. యెక్కడ చూసినాహత్యలే. పల్లెలుపాడయి పట్నాలు విపరీతముగా పెరిగి జనకోలాహలము యెక్కువౌతుంది. రవి – గురు – చంద్రులు ఒక్క కాలాన కర్కాటకములో పుష్యమీ నక్షత్రమున ప్రవేశించిన సమయమే కృతయుగ ప్రారంభం. అప్పుడు మరల నెలకు మూడు వానలు పడి ప్రజలు రోగ

యాతి బాధలు లేక భూమిసస్యశ్యామలమౌతుంది. అప్పుడు ధర్మక్రియలన్నీ మామూలుగా జరుగుతాయి. పూర్వం దాల్భ్య మహర్షి మహేంద్రునికి వివరించిన విషయాలు నీకు చెప్తాను.

విరోధులతో యిష్టముగా ఉండరాదు. మిత్రులతో దూరంగా ఉండరాదు. పరులను నిందించకుండా, ఒకరి దగ్గర దేహి అనకుండా ఉన్నవాడే పురుషుడనబడతాడు.

**ధర్మవ్యాధుడు**

పూర్వము కౌశికుడను ద్విజుడు తపస్సుగావించేవాడు. అలా ఉండగా చెట్టుపై నున్న పక్షి ఆతనిపై రెట్టవేసింది. ఆతడు కనులెఱ్ఱజేయ అది నేలపడి చనిపోయింది. మామూలు ప్రకారం భిక్షాటనకు ఆతడు వెళ్ళి ఒక గృహమున "భవతీభిక్షాందేహి" అని వాకిట నిలిచినాడు. "ఆగండి" అనగా, యింతలో ఆమె భర్తరాగా, ఆయన పాదాలకు నీరిచ్చింది. ఒక పీఠము మీద కూర్చొనగా ఆతడు కడుపునిండా తినిన వరకూ విసన కఱ్ఱతో విసరింది. అప్పుడు కౌశికునకు భిక్షతేగా, ఆతడు మండిపడి "యిదేనమ్మా! నీ ఆతిథ్యం?" అన్నాడు "నీకోపాగ్నికి మండిపోవడానికి కొంగనుకాను" నాభర్త నాకు ముఖ్యము. ఆతడే నాకు సర్వదేవాతా స్వరూపం. మీరు ధర్మవిషయాలు తెలుసుకోవాలన్న మిథిలాపట్టణాన గల బోయ ధర్మవ్యాధుని దగ్గరకు వెళ్ళు" అనగా కౌశికుడు అక్కడకు వెళ్ళాడు. అక్కడాతడు అనేక మృగాలమాంసాలన్నిటినీ తన అంగడిలో విక్రయిస్తున్నాడు.

కౌశికుడు "అయ్యా! మీరు ఉత్తమ ద్విజులు, మిమ్ము యిక్కడకు పంపిన మహాసాధ్వీ శిరోమణికీ మీకు వందనాలు, అనగా కౌశికుడు ఆశ్చర్యపోయాడు. ఆతని తీసికొని ధర్మవ్యాధుడు గృహమున అర్ఘ్యపాద్యాలిచ్చి పూజించాడు. తన వృద్ధ తలిదండ్రులను సేవించి దేవతలనూ, అతిథులనూ పూజిస్తూ, తాతలనాటి నుండి వచ్చే కులవృత్తిని విడువక - దాన ధర్మాలాచరిస్తూ నీతి తప్పక ఆపై యున్న అందరి భోజనాలు అయిన తరువాత నేను భోజనంగావిస్తాను. కొడుకు తప్పుచేస్తే తండ్రియే తగినట్లు దండనము విధిస్తాడు. సత్యాల హింసలు నాకు రెండు నేత్రాలు యీ మాంస విక్రయం హింస అంటారా? శాకాహారములో అనేక పురుగులు చచ్చిపోతాయి. యీ ప్రకృతిలో ఒక దానిపై ఒకటుండి బ్రతుకుచున్నాయి. ధర్మసూక్ష్మము అవగాహన చేసికోవడం చాలా కష్టతరం. నాతల్లి దండ్రుల నిరంతర సేవే నాకీ జ్ఞానాన్నిచ్చింది." అన్నాడు.

**సత్యభామ**

ఒకతరి ద్రౌపదిని చూసి సత్యభామ "వదినా? మహాత్ములైన నీ భర్తలైదుగురూ పొర పొచ్చాల్లేక, నీయందు సమాన అనురాగరసాన్ని నింపి ఉంటారు కదా దానికేదైనా మందూ, మంత్రాలున్నాయా? దీని రహస్యం కొంచంనాకు వివరించు?" అన్నది. ఆ మాటవిని ద్రౌపది చిరునవ్వు చిందించి "వదినా! నీవు ఆమాయకురాలవనాలో,



తెలివైన దానవనాలో నాకేమీ తోచలేదు. భర్తానురాగానికి మందులూ, మంత్రాలెందుకు? ఆనవసర విషయాలకు వెళ్ళను. కఠినముగామాట్లాడను. అందరితో అస్తమానమూ మాట్లాడను. వారిమనస్సునుగ్రహించి మసలుకుంటాను. యింటికి యెవరు వచ్చినా, వారికి యెదురేగి వారిని గౌరవముతో పలకరించి వారికి చిరునవ్వుతో వడ్డించి తినిపిస్తాను. మా అత్తగారిని గౌరవించి ముందు వారికి సేవచేస్తాను. యిలా యిక్కడ ద్రౌపది సత్యభామకు చేప్పిన పతివ్రతాధర్మాలు, రామాయణములో అరణ్యములో సీతమ్మకు అనసూయాదేవి చెప్పిన శ్లోకాలే.

అందువల్ల అన్నిటికీ రామాయణమేమూలము. వాల్మీకి మహర్షికి పరోక్షశిష్యుడే వ్యాసమహర్షి. వ్యాసమహాభారతములో లేనిదిలేదు. సర్వము అందునిక్షిప్తమైయున్నాయి.

**ఘోషయాత్ర**

పాండవులు బహుప్రశాంతితో అరణ్యాన మహర్షుల యొక్కసేవలో కాలము వెళ్ళబుచ్చుతున్నారు. ఒక ద్విజుడు చెప్పగా పాండవులు వనాల్లో యెన్నో బాధలననుభవించుచున్నారని ధృత రాష్ట్రుడు కూడా దుఃఖించాడు. అర్జునునికి స్వశరీరముతో అమరేంద్రుని ఆహ్వానం ఆతడు అనేక దివ్యాస్త్రాలందడం విని మరీ బాధపడ్డాడు. ఆసమయాన కర్ణ సుయోధనులు వచ్చిచూచి "మహారాజా! యేమి యీవిపరీత విచారం? శత్రువులెవ్వరూ లేక యెంతో హాయిగా ఉంటే మీరెందుకు విచారిస్తారు? మనవైరులింక తలెత్తలేరు. అందుకు మనమెంతో ఆనందించాలి" అని మనపశుసంపద అరణ్యములో ద్వైతవనాన ఉన్నాయి. ఒకమారు ఆ గోవులను చూచిరావాలని అనుజ్ఞ యిమ్మనగా! "నాయనా! ప్రస్తుతం పాండవులు ద్వైతవనములో ఉన్నట్లు వర్తమానము వచ్చింది. అందు వలన మీరటకు వెళ్ళడము మంచిది"కాదన్నాడు.

మేమువారి దగ్గరకు వెళ్ళమని చెప్పి దుర్యోధనుడు తన అనుచరులందరతో అట్టహాసముగా, అద్భుతాలంకారాలతో భయల్దేరాడు. సింహశరభ-శార్దూలాది గండక భయంకర భీకర మృగాలను చంపి అక్కడ ఒక సరస్సులో జలక్రీడా వినోదియగు చిత్రసేనుడను గంధర్వుని అనుచరులు, కౌరవులను దూరముగా పొమ్మన్నారు. యుద్ధమునకు సిద్ధమయ్యారు. చిత్రసేనుడు వారినందరనూ బంధించాడు. యీ విషయాన్ని తెలిసిన ధర్మరాజు భీమార్జునలకు యీ విషయము తెలిపి దుర్యోధనుని విడిపించమన్నారు. అమరేంద్రునితో తన సంబంధము తెల్పి దుర్యోధనుని విడిపించారు. "కాగలకార్యం గంధర్వులే తీరుస్తారనే" లోకోక్తి దీని వలననే పుట్టింది. ధర్మరాజు అనునయించి పంపగా దుర్యోధనుని కదియెంతో పరాభవమయింది. పాండవులను పరాభవించడానికి వెళ్ళిన దుర్యోధనుడే పరాభవింపబడడం పుండుపై కారంజల్లినట్లయింది.

"మామా!నేనిప్పుడు చచ్చిపోతా"నన్నాడు. కర్ణుడు "మిత్రమా! వారి అరణ్య అజ్ఞాతవాసానంతరం పాండవులను నేనేవధిస్తానన్నాడు. నేను దిగ్విజయ యాత్రచేసి యాబదియారు దేశాలు నీ పాదాక్రాంతులైనట్లు నేను గావిస్తానన్నాడు" వెంటనే భూమండలముపై నున్న రాజులందరినీ గెల్చి, వారి ధనకనక వాహనాలు గొని తెచ్చి సుయోధనుని ముందుంచాడు కర్ణుడు. దుర్యోధనుడు తన పురోహితుని అడుగగా, మొన్ననే జరిగిన మీ వంశాన రాజసూయం మరల జరపడం పనికిరాదు. అదిగాక ధర్మరాజు జీవించియే యున్నాడుకదా" అని "మహారాజా! నీవు వైష్ణవయాగాన్ని చేయవచ్చు" అని చెప్పగా అది యేర్పాటుచేసి దానిని చూడడానికి పాండవులకు వర్తమానమంపేడు. ధర్మరాజు ద్వైతవనానగల మృగాలు తగ్గిపోతున్న కారణము వలన తనపరి వారముతో" కామ్యక వనానికి వెళ్ళేడు

అప్పటికి సరిగా పాండవ వనవాసం పదునొకండు సంవత్సరాలయింది.

## దుర్వాసుడు

దుర్యోధనుడు దుర్వాసునికి అతిధ్యమిచ్చి సంతుష్టుడైన తరువాత ఆతనిని పాండవుల దగ్గరకు పంపాడు. శిష్యప్రశిష్యులతో పాండవులున్న స్థలానికి వచ్చాడు దుర్వాసుడు. "నాకూ నాశిష్యులకూ భోజనము కావాలి. స్నానముచేసివస్తాము" అన్నాడు. భోజనాలందరూ ముగించి ద్రౌపది కూడా భోజనము చేసి పాత్రనుకూడా కడిగింది. ద్రౌపది విచారించి తుదకు శ్రీకృష్ణపరమాత్మను ఆత్మలో వేడుకుంది. అక్కడే ప్రత్యక్షమై "సోదరీ! చాలా ఆకలిగా ఉంది. ఒక్క అన్నం మెతుకైనా చాలును పెట్టమన్నా"డు. అన్నయ్య మొత్తంకడిగేశాను. అని అడుగున ఉన్న ఒక్క అన్నం మెతుకు దొరికింది. దాన్ని పరమాత్మ తిన "దుర్వాసుడు-శిష్యులందరూ దీనితో తృప్తులగుదురుగాక" అన్నాడు. నదిలోస్నాన సంధ్యాదిక్రియలు నిర్వర్తించుకొనిన తరువాత శిష్యులందరూ గురు దేవా! మాకడుపులన్నీ నిండిపోయి ఉన్నాయి.

అందరూ పొట్టలునిండిపోగా నేలపైబడి దొర్లి నడువలేక నడువలేక అక్కడనుండే బయల్దేరి వెళ్లిపోయారు. వారొస్తారని ద్రౌపదీ దేవి యెంతగానో యెదురుచూస్తుండగా రాలేదు. తరువాత విషయమంతా తెలిసింది. పాండవులెవ్వరూ లేనిసమయాన సైంధవుడు ద్రౌపదిని చూసి మోహించి నా కోర్కెతీర్చమన్నాడు. "అన్నా! నీవు నాకు సోదరుని వరుస వాడివి" అనియెంత చెప్పినా వినకుండా ఆమెను రథంపై బలాత్కారంగా యెక్కించుకొని తీసుకు పోతుండగా పాండవులకు తెలిసి వెళ్లి సైంధవుని తీసుకొనివచ్చి ఒకప్రక్క మీసము ఒకప్రక్క తలగొరిగి తలకు సున్నపు బొట్లుపెట్టి గాడిద మీద వానిని ఊరేగించిన తరువాత భీముడు చంపుతాననగా ద్రౌపది అడ్డుపడి "మన దుస్సల ఒక్కగానొక్క ఆడపడుచు ఆమెముఖముచూసి యైన వీనిని విడువండి?" భీముని బ్రతిమాలుకోగా చిరాకుగా ఖడ్గము పడేసి సైంధవుని ముఖముపై ఉమ్మి "చీ! నీచుడా? నీదీ బ్రతుకేనా?" అని విడిచి పెట్టాడు. ఆ అవమానంతో పరమశివుని గూర్చి ఘోరమైన తపస్సు చేసి



అర్జునుని తప్ప తక్కిన వారి నెదిరించే గొప్పవరము పొంది. తన దేశానికి పోయాడు. అలా ఉండగా ఒకనాడు. "మహర్షివర్యా! మాలాగ వనవాస బాధలు పడిన వారున్నారా?" అని అడగుగా "ధర్మరాజా! శ్రీరామచంద్రుడు నీకన్న దారుణమైన కష్టాపడి అనంతరం పట్టాభిషిక్తుడైనాడు. అలాగే నీవూ వనవాస-అజ్ఞాతవాసాలానంతరము కౌరవుల గెల్చిపట్టాభిషిక్తుడవౌతావు" అనిమార్కండేయ మహర్షి అన్నాడు. ద్రౌపది యెన్నో బాధలుపడుతుందనగా "నాయనా! సావిత్రీ మహాసాధ్వి పడిన పాట్లు చెప్పలేనన్ని- తరువాత సత్యవంతుని తో కూడి హాయిగా ఉంది. తరువాత యీామె కూడా అలాగే ఉంటుంది సందేహములేదు" అన్నాడు మహర్షి. వనవాసము ముగుస్తున్న సమయాన యముడు యక్షప్రశ్నలుకు జవాబు ధర్మరాజు చెప్పగా, అజ్ఞాతవాసమున యెవ్వరూ తెలిసికొనలేనట్లు యముని చేత ధర్మరాజు అనేక వరాలు పొంది, యాత్రసాగించారు.

**ఇది మహాభారతములో అరణ్య పర్వం ముగిసింది**



# సంపూర్ణ మహాభారతం

## విరాట పర్వము

పదిరెండువత్సరాలు వనవాసానంతరము అజ్ఞాతవాసప్రారంభమునకుముందు తమను గౌరవాదరాభిమానాలను జూపించు విరాటరాజు మత్స్యదేశరాజు దగ్గర యెవరు యేవేషాలతో అక్కడరహస్యముగా ఉండాలో ముందుగా యేర్పాట్లు గావించుకున్నారు.

ధర్మరాజు– నేను కంకు భట్టు పేరుతో మహారాజు దగ్గర ద్యూతక్రీడలాడి ధర్మరాజు దగ్గర ఉండేవాడినని వారులేక యిలా వచ్చానని చెప్పుతాను.

భీముడు– వంటలుచేసిన వలలునిగా మధురమైన భక్ష్యభోజ్యాలు తయారుచేసి పాండవుల దగ్గర ఉండేవాడిని వారిప్పుడు లేక యిలా వచ్చానని చెప్పుతాను.

అర్జునుడు– అమరలోకాన నృత్యనాట్యాలు నేర్చుకున్నాను. నపుంసకత్వముతో బృహన్నలనామముతో అంతఃపురాన కన్యకలకు నాట్యము నేర్పుతాను.

నకులుడు– తామ్రగ్రంథి పేరుతో గుఱ్ఱాల రక్షణలో ఉంటాను.

సహదేవుడు– గో సంరక్షణలో తంత్రీపాలనామముతో ఉంటాను.

ద్రౌపది– అంతఃపుర కాంతలకు అనేక రకాల కేశాలనలంకరించి సైరంధ్రి పేరుతోఉంటాను. తరువాత పరివారాన్నంతా ధర్మరాజు విడిచిపెట్టాడు. "ధర్మజా! రాజసభామర్యాదలు చాలామెత్తగా– అతికఠోరంగా ఉంటాయి. రాజదర్బారులో నీవులే అనకూడని స్థలములో కూర్చోవాలి. రాజుకు యెదురాడకూడదు. అంతః



పురవాసులతో మరీ దగ్గరగాని– మరీ దూరంగాని ఉండకూడదు. రహస్య విషయాలను– బయటకు రానీయరాదు." అని ధౌమ్యమహర్షి చెప్పి పాండవులచే దివ్యహోమముగావించి వారికి శుభముకలుగు నట్లుదీవించి, వెళ్లారు

పాండవులు మత్స్యదేశ దిశగా ప్రయాణాన్ని సాగించారు. ధూళి ధూసరితముగా మీసాలు గడ్డాలూ పెరిగాయి మత్స్యదేశము సమీపానికి వచ్చి నడువలేననగా భీముడు యెత్తుకొని కొంత దూరం ద్రౌపదిని మోశాడు. "అర్జునా! యీ బాణాలతో మనము నగరానికి వెళ్లకూడదు" అనగా; "అదియే శ్మశానం. అచ్చట జమ్మి చెట్టుపై యీ ఆయుధాలను ఉంచుదాము." అని అందరి ఆయుధాలు ఆ చెట్టుపై గట్టిగా కట్టారు.

నగరసమీపాన ధర్మరాజు దుర్గను ఉపాసించాడు. అచటగల గంగానదిలో స్నానముచేసి తర్పణాలు విడిచి– ధర్మ దేవాతా ప్రార్ధనను గావించి బ్రాహ్మణ వేషాలు వేసి బయల్దేరారు. విరాటరాజు దూరాన్నుంచి ధర్మరాజును జూచి" సభాసదులారా! ఆవస్తున్న మహాపురుషుని చూచారా! యీ భూమినంతా పరిపాలించే మూర్ధాభిషిక్తునిగాలేడూ?" ధర్మరాజువచ్చి "మహారాజా! దైవయోగాన సర్వ సర్వసంపదలూ పోయి మీ దగ్గర ఉండడానికి వచ్చాను. నేను ద్విజుడను. నా నామం కంకుభట్టు ద్యూత విద్యా విశారదుడను. ధర్మరాజా వారి ఆస్థానాన ఉండేవాడిని అనగా "ద్విజరాజా! నీకుకావలసినవి కోరుకో" అన్నాడురాజు. "రాజచంద్రా! బుద్ధి హీనులతో నన్ను వాదానికి పెట్టవద్దు. ద్యూతక్రీడలో వచ్చేధనాన్ని వెంటనేనాకివ్వాలి" అన్నాడు కంకుభట్టు.

తరువాత భీముడు వలలుని రూపంతో వచ్చాడు. సైరంధ్రిగా ద్రౌపది రాగా అన్నీ తెలిసికొన్నది:– "మహారాజపత్నీ! నేనుసైరంధ్రిని– నన్ను ధర్మరాజుపత్ని ద్రౌపదీ దేవిమెచ్చుకొనేది" అని అనగా "అమ్మా! నీ అతిలోకసౌందర్యాన్ని చూసి స్త్రీలే మోహాంధులయ్యేలాగున్నావు" అనగా సాధ్వీమణీ! గంధర్వులైదుగురు నా భర్తలు నాకన్నులకు రెప్పల్లాకాపాడతారు అన్నది. "తామ్రగ్రంధినామముతో నకులుడు గుఱ్ఱాలను రక్షించేటట్లు, సహదేవుడు "తంత్రీపాలుని" పేరుతో పశు సంరక్షకుడుగా ప్రవేశించారు. "బృహన్నల" పేరుతో అర్జునుడు నాట్యాచార్యుడుగా, అందరూ అక్కడచేరారు. ధర్మదేవత పరిపూర్ణ అనుగ్రహముగా అందరూ అన్నివేషభాషలతో విరటుని కొల్వుకూటములో కుదిరారు.

**యిక్కడొక అంతరార్థముంది.**

పాండవులు జనపదముల నున్నా యెవరికీ తెలియకుండా ఉండాలి. అది ముఖ్యముగాపాటించాలి. కౌరవులు వీరిని వేయికళ్ల వెతికి గాలించి పట్టుకొనే ప్రయత్నములో ఉంటారు. కారణం? అజ్ఞాత వాసములో పాండవులు దొరికి పోతే మరల పదిరెండుసంవత్సరాలు అరణ్యావాసం ఒకయేడు అజ్ఞాతవాసం చేయాలి. శకుని వేసిన మడతపేచీ యీ రాజకీయం. యిక ఐదుగురూ అయిదురకాలగా

కుదరడం– అంతఃపురాన యేమారువేషాలతో నైనా వచ్చి కౌరవుల పంపిన స్త్రీలను జాగ్రత్త పసికట్టి పట్టుకోవడానికి అంతిపురిలో సైరంధ్రీవేషములో ఉన్నద్రౌపది; రాజాస్థానములో యెప్పుడేమి జరుగుతుందో వెంటనే తెలిసికొనడానికి కంకుభట్టుగా ధర్మరాజు; వంటశాలలో ప్రవేసించి అక్కడయేదయినా గందరగోళం సృష్టించకుండా ఉండడానికి వలలుని రూపుతో భీముడు. యిక గోవుల పరిరక్షణ– గుఱ్ఱాలు యిలా నకుల సహదేవులు; బృహన్నల రూపములో నాట్యా చార్యుడుగా అర్జునుడు; యిలానలువైపులా కౌరవులు యెత్తులు చిత్తుచేయాలని అతిజాగ్రత్తగా చూసి అజ్ఞాత వాసం సంవత్సరమూ నిర్వహించడము సామాన్యమైన పనికాదు. యింత అర్థమును వ్యాసభగవానుడు తనప్రతిభా ప్రాభవాలను సర్వతో ముఖముగా తనమహా భారతసాగరాన్ని తయారు చేశాడు. ప్రపంచ భాషల్లో యింత పెద్దగ్రంథము యేభాషలోనూ యెక్కడాలేదు.

అక్కను చూడ్డానికి వచ్చిన సింహ బలునికి ద్రౌపదీ దేవి కంటబడింది. మెల్లగా ఆమె దగ్గరకు వచ్చాడు "సుందరీ! యెవరివి? యిలా నికృష్టముగా నీ వెందుకు జీవిస్తున్నావు. నీ శరీరలావణ్యం యేదేవతా స్త్రీలందూలేదు. నామనస్సు నిలువకుండా ఉన్నది. నీ నడుము ఒంపులు– నీపెదవికెంపులు– నీతొడ– నీనేత్ర సోయగం. ఆహాహా! ఓహోహో! యిక్కడెందుకు? నీవు నా సుందరభవనములో దాసదాసీలు సేవలు చేయగా ఉండుము. నీవొకరికి సేవచేయకూడదు." అని దగ్గరకు చేరబోగా సైరంధ్రి– యెన్ని విధాలగానో చెప్పింది" వినకుండా, "నే నెవరినో నీకు తెలీదు. నన్నుకాదని నీ విందుండలేవు" "అప్పా! యీ దీనుని కనికరించు. యీమెను నాకు యేర్పాటుచేయి'' అనగా ''తమ్ముడూ! నీవేల చెడెదవు. పరకాంతావ్యామోహితునికి వంశనాశనమౌతుంది. వాడూ నాశనమౌతాడు" అనియెన్ని విధాల బోధించినా సుధేష్ణాదేవి కీచకుడువినలేదు. వినక అక్కా! నీవూ నీ రాజ్యమూ నన్నుకాదంటే యేమౌతుందో తెలుసునా? ముందు మీరునాశనమౌతారు. ఆమెను నా దగ్గరకుపంపు" అని విసురుగా వెళ్లాడు కీచకుడు.

సైరంధ్రిని చూచి "అమ్మా! నీవు యేమీ అనుకోకుండా మాతమ్ముడు దగ్గర ఉన్న మంచి మధువు మంచి పానీయాలు తెచ్చిపెట్టు నాకు తలదిమ్ముగా ఉంది యెవరూ తేవడానికి లేరు నీవువెళ్లి తెచ్చిపెట్టు"మనేసరికి "మహారాణీ! మొదటే నీకు చెప్పాను. నీ చకృత్యాలు నేను చేయనని" అన్నది సైరంధ్రి. "మాలినీ! నీకే బాధాలేదు తొందరగావెళ్లి తీసుకురమ్మన్నది. యిక తప్పదని మాలిని కీచకుని భవనానికి అడుగులు పడక పోయినా నెమ్మదిగా వెళుతూ సూర్యదేవుని ఉపాసించింది. కీచకుని యింటిలో అడుగు పెట్టేసరికి, కీచకుడు యెదురువచ్చి "సైరంధ్రీ ! యిదిగో యీ పర్యంకము నీకొరకే యెదురు చూస్తుంది. నామనస్సులో గల కామాగ్నిని నీ చల్లని మాటలతో చల్లార్చు" అనగా మాలిని "ఓరీ నీచకీచకా! యేమిరా నీ పొగరు?



పవిత్రక్షత్రియవంశాన జన్మించిన నన్ను కోరుతున్నావురా! యిదిగో నీ అక్కకు మద్యముకావాలని నన్ను పంపింది. యియ్యి వేగము నేనువెళ్లాలి" అనగా! "మాలినీ! మద్యాన్ని పట్టుకొని వెళ్లడానికి చాలమందున్నారు. నామన్మథాగ్నిని చల్లార్చు" అని కీచకుడు మాలినీ చీర చెరగు పట్టుకోబోగా ద్రౌపది విదళించ దానితో వాడు ఒకమహావృక్షములాగ భూమిపైపడ్డాడు. ద్రౌపదిని వెన్నాడగా ఆమె రాజదర్బారుకు వెళ్లింది. అక్కడవారందరూ కీచకుని నీచప్రవృత్తికి యెంతోబాధపడ్డారు. అక్కడున్న భీముడు ఆవేశము పట్టలేక అక్కడ ఉన్న ఒకమహావృక్షమును పీకగా ఉన్న భీముని జూచి ధర్మరాజు సమయభంగమవుతుందని ఓ వలలా! ఆవృక్షము పూసి, కాసి, పండి ఉంది. అది నీవు కట్టెలకు ఉపయోగింపకుము. ఊరావలగల చెట్లు వంట కట్టెలకు ఉపయోగపడేవి చాలా ఉన్నాయి." అని రెండర్థాలుగా పలికిన ధర్మరాజు మాటలకు భీముడు కోపాన్ని తగ్గించుకున్నాడు.

మాలిని "రాజనగా ప్రజలందరికీ తల్లీ తండ్రి వంటివాడు. తనరాజ్యములో జరుగు అక్రమాల నాపించాలి. యిటువంటి నీచుని దండింపలేని రాజు ఉన్నా ఒక్కటే! లేకున్నా ఒకటే కదా! అయ్యో! యీసభలో ఒక స్త్రీకి జరుగుచున్న యింత ఘోరావమానాన్ని చూస్తూ ఊరుకున్నారేమి? విరటుని జూచి "రాజచంద్రా! సర్వసమర్థులైన నా భర్తలే నన్ను కాపాడలేనప్పుడు యింకొకరు నాకు రక్షకు లేలాఔతారు?" అనగా! సైరంధ్రీ! నీ పరిస్థితేమిటో తెలియని యీ సభలో వారు యేమిచేస్తారు" అన్నాడు. అప్పుడు ధర్మరాజు లేచి "ఓకాంతామణీ! నీవీసభలో యిలా మాట్లాడరాదు. నీ భర్తలకు అన్నీ తెలుసు. అవసరము పడిన నిన్ను తప్పక రక్షిస్తారు. నీవు అంతఃపురానికివెళ్లు ఓర్పుతోనుండు" అన్నాడు;. ద్రౌపది మహాకోపాన్ని జీర్ణించుకో లేకపోయింది. "మాలినీ! యేంజరిగింది?" అనగా, "మీ తమ్ముడు చేసిన పరాభవం" అని యేడ్చింది ద్రౌపది. "సైరంధ్రీ! యేడవకు వాడికి కాలము మూడింది. లేకున్న నీవంటి శీలవతిని యింతఘోరంగా పరభవిస్తాడా?" అందిసుధేష్ణ, వీడికి యేపోగాల ముందో తెలీదు. లేకున్న యింత పొగరుపట్టి మాట్లాడతాడా!" అంది.

ఆ రాత్రి ద్రౌపది, అర్జునుడు, భీముడు కలిశారు. కీచకుడు గావించిన కృత్యాలకు అడ్డులేవు. వాడిని అంతము చేస్తాను. రేపు రాత్రి పదిరెండు గంటలకు నర్తనశాలకు రమ్మని చెప్పు. తరువాత వాడికథ నేనుముగిస్తానని ముగ్గురూ యెవరి స్థానాలకు వారు వెళ్లేరు. తెల్లవారింది. సుధేష్ణ ఉద్యానవనాన మాలిని ఒంటరిగా ఉండడం చూసిన కీచకుడు పరుగున వెళ్లాడు. ద్రౌపది వాడి వైపు ఓరచూపులు చిందించింది. దాంతో వాడు ఉబ్బి తబ్బిబ్బులయ్యాడు. "దగ్గరకురాబోకు. రాత్రి పదిరెండు గంటలకు ఒంటరిగా నర్తనశాలకు... అన్న ద్రౌపది వాక్కులువిని కీచకుడు యెగిరి గంతులేశాడు. యీ... రాత్రికి జౌను పగలందరూ చూస్తారుకదా? అర్ధరాత్రి– జౌనౌను. అర్ధరాత్రి సమయాన జనసంచారముండదు– భేష్ ఒంటరిగా– యిది

మరీబాగుంది. నర్తనశాల- అబ్బ యెంత మంచి స్థలం? బాగా బాగుంది. యింతలో ద్రౌపది అంతఃపురానికి వెళ్లింది. కీచకుడు తనలో యెప్పుడు ప్రొద్దుకుంకుతుంది? యెప్పుడు చీకటి పడుతుంది? యెప్పుడు అర్ధరాత్రి?" యిలా ఆవేదనపడి సరిగా అర్ధ రాత్రి సమయాన అలంకారాలన్నీ ధరించి అంతిమ శ్వాస విడిచే యోగముగల కీచకుడు-

నర్తనశాల దగ్గర మనుష్య సంచారములేదు. అంతా గాఢాంధ కారం. ముందుగా భీమసేనుడూ, ద్రౌపదీ నర్తనశాలకు వచ్చారు. మహా కామాంధకారముతో, అంధకారము గూడా అలముకొన శయ్యకుచేరాడు కీచకుడు "మాలినీ! నీవెప్పుడూ యెరగని శృంగార సాగర గంగాతరంగాలలో తేలియాడిస్తాను. యింక నీవు స్వర్గ సుఖాలే అనుభవిస్తావు" అనగా, భీముడు కీచకుని పట్టుకొని నేలకేసికొట్టాడు రెండు మత్తగజాల్లాగ, రెండు శార్దూలాల్లాగ యిద్దరు పిడికిడి పోట్లు పొడుచుకొని, పిడిగ్రుద్దులతో, కాళ్లతో తన్నుకొనుచుండ భూమంతా అదిరిపోయింది. భీముడు వానిని చంపి, వాడిపొట్ట చీల్చి దానిలో వానితల గట్టిగా తూర్చి మాంసపు ముద్దగా తయారుచేశాడు; ద్రౌపది అంతిపురముచేరింది. నగరములో గల జనులందరూ వచ్చి కీచకుని చూచి వానికాళ్లూ చేతులూ తలాయేమీ కానక గంధర్వులిలాగే వారి విరోధులను చంపుతారని, యీదుష్టునికి మంచిశాస్తి జరిగిందని అనుకొన్నారు. ఉపకీచకులకు యీ విషయం తెలిసి, మనసోదరునితో దీనినీ కాల్చేద్దామని ద్రౌపదిని బంధించి శ్మశానానికి కీచక శవానితో కూడా తీసుకుపోతుండగా, భీముడు ఒక మహావృక్షాన్ని పీకి దాంతో ఉపకీచకులందరినీ కొట్టిచంపాడు. యిలా వుండగా తెల్లవారిం తరవాత విరాట రాజుకు, సుధేష్ణకు "మరికొద్ది రోజులలో మావారు నన్ను తీసుకుపోతారు. మీ ఆశ్రయమున యిన్ని రోజులూ బ్రతికాను. యీ నాలుగు దినాలూ యెలాగో నన్నేమనకండి" అని వినయముతో అన్నది. యిలా ఉండగా దుర్యోధనుడు పాండవులెక్కడ యీ అజ్ఞాత వాసము గావిస్తున్నదీ తెలుసుకు రమ్మనగా చారులువచ్చి మహారాజా! పాండవులజాడ యేమీ తెలియలేదు. వారు అరణ్యాన యేక్రూర మృగములవాతో పడి ఉంటారని చెప్పారు. భీష్మద్రోణులు "సుయోధనా! ధర్మమూర్తులైన పాండవులు చనిపోలేదు. వారు సమయము కొరకు నిరీక్షిస్తుంటారు. యింతలో శకుని వచ్చి" అల్లుడూ! యెందుకింతగా తలలు పట్టుకొని ఆలోచిస్తారు. పాండవులున్నచో పాడి-పంటలుంటాయి. అటువంటి దేశము ఒక్కవిరాటు దేశమే ఉంది. కనుక విరాట నగరాన పాండవులు తప్పక ఉంటారు. సింహబలుడైన కీచకుని, ఉపకీచకులనూ ఒక గంధర్వుడు చంపాడనగా, ఆతడు భీముడై ఉంటాడు.

విరటునికి పశుసంపదమెండు. మనము ఆగోవులను పట్టుకొన్న పాండవులు తప్పక విరాటరాజుకు సహాయముగా వస్తారు. అప్పుడు మనకు వారు తేలికగా పట్టు బడతారన్నాడు. మన సుశర్మకు విరాటురాజు విరోధి. ఆకారణమున దక్షిణము వైపున్న గోవులను పట్టుకొన సుశర్మను పంపి, మరునాడు భీష్మద్రోణ, కృప- అశ్వత్థామ



కర్ణాది మహా వీరులతో మరునాడు ఉత్తరమున గల పశువులను తరలింప తప్పకుండా పాండవులు వస్తారు" అనగా, సుయోధనుడు "మామా! నువ్వు సమస్యలకే సమస్యవు. నీతల యీబ్రహ్మకాక మరోబ్రహ్మ నిర్మించాడేమో!" అనగా, "అల్లుడూ! నీ అభిమానమంతే!" అన్నాడు శకుని.

"కౌరవులు వచ్చారు సోదరా! కంకుభట్టుకు- తామ్రగ్రంధికి- వలల- తంత్రీ పాలులకు రధాలూ- కవచాలు సిద్ధము చేయండి" అనివిరాట రాజు ఆజ్ఞచేశాడు. సేనా బలాలన్నీ ముందుకు పోతున్నాయి. యుద్ధము ఘోరాతి ఘోరముగా సాగతుంది. మహా యోధులకిరీటాలతో తలలు నేల రాలగా భూమంతా నవరత్నమయముగా ఉంది. సుశర్మను విరాటుడు స్వయముగా తానే యెదుర్కొన్నాడు. విరటుని రథాలను విరగ్గొట్టి సుశర్మ ఆతనిని బంధించాడు. ధర్మరాజు "భీమసేనా! యిన్నినాళ్లూ మనకు ఆశ్రయము కల్పించిన విరాట రాజును సుశర్మ బంధించాడు. వెంటనే వెళ్లి ఆతని విడిపించి మనము కృతజ్ఞతను చూపించాలి" అనగా నకుల సహదేవులతో భీముడు వెళ్లి సుశర్మనూ సారధినీ రథాన్ని కొట్టారు. దాంతో ఆతడు రణానికి వెన్నిచ్చి పారిపోయాడు.

భీముడు సుశర్మను బంధించి తీసుకొని వెళ్లగా, ఆతనిని విడిచి పెట్టమని ధర్మరాజు చెప్పాడు. విరాటుడు భీమ నకుల సహదేవ ధర్మరాజులను దర్బారుకు పిలిచి విరాటుడు తనకు సుశర్మనుండి బంధ విముక్తులను గావించారని యెంతో మెచ్చుకొని వారికి చీని చీనాం బరాలు- నవరత్న స్థగిత నూతన సువర్ణ భూషణాలనూ, యింకా యెన్నో బహుమానాలను అందజేశాడు. దర్బారులో గల వారందరూ యెంతో సంతోషించారు. ఆతని ఔదార్యాన్ని అందరూ యెంతగానో శ్లాఘించారు. ధర్మరాజాదులు గూడ తమకు విరాట రాజు జరిపిన సన్మానానికి సంతోషసాగరతరంగాలలో తేలియాడారు. అలా దక్షిణ గోగ్రహణము ముగిసింది.

**ఉత్తరుడు**

"కురుసేన మన ఉత్తరమున గల ఆలమందలను తోలుకుపోతున్నారు. మహారాజు మొదలైన వారంతా దక్షిణ దిక్కులో సుశర్మతో యుద్ధంచేయడానికి వెళ్లారు. యిప్పుడు మీరే మాకు పెద్దదిక్కు. యెవ్వరూలేరు". అని అంతఃపురకాంతల మధ్యలో గల విరాటురాజు కుమారుడు ఉత్తరకుమారుని చూచి గవాధ్యక్షుడు పలికే సరికి "ఎవరు వారు? యెక్కడివారు? యెందరు? వారిపేరులు చెప్పండి?" అని ఆతడు గంతులు వేస్తూ యిటూ అటూ తిరుగుతూ పలికే సరికి, గవాధ్యక్షుడు "యువరాజా! భీష్ముడు- ద్రోణుడు- కర్ణుడు- అశ్వత్థామ" అనగా; "ఓస్ యింతేనా? వారందరినీ యెదిరించి, యెక్కడి వారినక్కడ పడగొడతాను. కాని తగిన సారధి లేదే? ఉన్నాడంటారా? వెంటనే పిలిచి రథాన్ని సిద్ధంచేయమనండి" అన్నాడు ఉత్తరుడు.

అదివిన్న అర్జునుడు ద్రౌపదిని పిలిచి, అర్జునునికి సారధ్యం చేసిన బృహన్నల ఉన్నాడని చెప్పమన్నాడు. అలా చెప్పే సరికి ఉత్తరుడు "ఛీ! ఛీ! యెంత అన్యాయం

పేడి నారథ సారథా?" అని సరే అని చెప్పగా "యువరాజా! ఉత్తరను పంపి యేర్పాటు చేస్తానని" మాలిని వెళ్లింది. "గురుదేవా! తమరు మా అన్న ఉత్తరకుమారునికి రథసారధ్యం చెయ్యాలి. కౌరవులు వచ్చిగోవులు తోలుకు పోతున్నారు" అనే సరికి బృహన్నల ఉత్తర కుమారునితో బయల్దేరి వెళ్లాడు. రథాన్ని సిద్ధంచేశాడు. ఉత్తర "అన్నయ్యా! కౌరవతలపాగాలకు గల రంగు రంగుల కుచ్చులు కత్తిరించి తేవాలి. వాటిని నేను ఆట బొమ్మలకు కట్టి ఆడుకుంటాను" అన్నది. అలాగే అన్నాడు బృహన్నల.

అర్జునుడు అతివేగముగా రథాన్ని పోనిచ్చాడు. ఉత్తరుడు కౌరవసేనను చూశాడు. "బృహన్నలా! రథాన్ని ఆపు. యీ మహా వీరులు ద్రోణ– భీష్మ– కర్ణాదులను జూచే సరికే నాకు గుండెదడ పట్టుకుంది. కాళ్లు ఒడుకుతున్నాయి. రథాన్ని వెనక్కు త్రిప్పు. నిలబెట్టు" అన్నాడు ఉత్తరుడు. "ఉత్తరకుమారా! క్షత్రియుడు యుద్ధరంగంలో వెన్ను చూపరాదు. అలా అంతిపురాన ఆడవాళ్ల దగ్గర మాట్లాడావు. మనము యిప్పుడు వెనక్కి వెళితే వారందరూ నవ్వరా?" అన్నాడర్జునుడు. "బృహన్నలా? రథాన్ని ఆపు. ముందుకు పోనీకు. బ్రతికుంటే చాలు. మా అమ్మకు నేనొక్కడినే కుమారుడను." అనిక్రిందకుదిగి పారిపోతున్నాడు ఉత్తరుడు.

అర్జునుడు రథాన్ని నిలిపి క్రిందకుదిగి నాలుగడుగుల్లో ఉత్తరుని పట్టుకొని రథముపై వానిని కూర్చుండ బెట్టాడు. శ్మశానం దగ్గర రథాన్నినిలిపి "కుమారా! అదిగో! ఆ చెట్టుపై నున్న గాండీవమునాకియ్యి?" అనగా ఉత్తరుడు చూచి "బృహన్నలా! అదిగో! శవము. ఆవిగో పాములు" అని చెట్టుదిగి పోయాడు. అర్జునుడు యెలా అయితేనేమి ఉత్తరుని మరల చెట్టెక్కించాడు. ఉత్తరుడా బాణాలను చూచి కన్నులు జిగేలు మనగా. అర్జునుడు "నా నామాన్ని స్మరించుకో!" అనగా "అర్జునా! ఫల్గుణా!" అన్నాడు ఉత్తరుడు. "బృహన్నలా! యి వేమిటి" అన్నాడు. సువర్ణకాంతులతో సూర్య తేజస్సుతో నున్నదే గాండీవము. దానికి లక్షలాది ఆక్షయతూణీరాలవిగో వెలిగిపోతున్నాయి. బ్రహ్మ ఒక వేయివత్సరాలు దీనిని ఉపయోగించి– ప్రజా పతికిచ్చాడు ఆతడు కొన్ని వందల సంవత్సరాలు వాడి యింద్రునికిచ్చాడు. ఆయింద్రుడు ఎనభై సంవత్సరాలు వాడి సోమునికిచ్చాడు. సోముని వద్ద అయిదు వందల యేళ్లుంది. తరువాత వరుణునికిచ్చాడు. ఆతడు అగ్ని హోత్రునికిచ్చాడు. ఖాండవవనాన్ని కాల్చు సమయాన అగ్నిదేవుడు నాకు బహుమానముచేశాడు. యిది నా దగ్గర అరువదియైదు సంవత్సరాలుంటుంది" అని అర్జునుడు చెప్పగా ఉత్తరుడు పరమానందమందాడు. "ఉత్తరా! నీవు రథాన్ని నడుపు, నేను కౌరవుల పనిపడతానన్నాడు అర్జునుడు.

గాండీవధారియై అర్జునుడు వస్తుండగా ద్రోణాచార్యులు "భీష్మాచార్యా! ఆవస్తున్న వానికెంత సాహసం? మనమీదకే వస్తున్నాడే!" అనగా "అవును సమయందాటింది. భయముగాని, సంశయముగాని అక్కరలేదు. అర్జునుని



యెదుర్కొనే శక్తి యెవరికీలేదు" అన్నాడు భీష్ముడు. పరమేశ్వరునే యెదిరించిన ఫల్గునునితో యెదుర్కొనడానికి యిక్కడెవరున్నారు?" అనగా కర్ణుడువచ్చి "ఆచార్యా! నేనున్నాను. అర్జునుడేకాదు. ఆతని తాతనైనా యెదిరించి గెలుస్తాను. యెప్పుడూ విరోధులను పొగడుట మీకల వాటేకదా?" అన్నాడు. "తాతా! యెంత తెంపరిగా వస్తున్నాడు అంతతొందరగా అర్జునుడు అరణ్యానికి తిరిగి వెళ్లడానికే యింత ఆరాటం" అన్నాడు దుర్యోధనుడు.

"దుర్యోధనా! సూర్యాది గ్రహాల గమనాలు చాలా చిత్రముగా ఉంటాయి. ఆ సంగతి సామాన్యులకు అర్థంకాదు. కళ– కాష్ట– ముహూర్తదిన, పక్ష– మాస– వత్సరక్రమములో కాలపురుషుడు పరిభ్రవిస్తుంటాడు. కూలంకష జ్యోతిర్విదులకుగాని యీ విషయం అవగాహనకురాదు. రెండుసంవత్సరాల ఆరు మాసాలకు ఒకనెల అధిక మాసము వస్తుంది. ఆవిధముగా గణితముచేస్తే సరిగా యీ రోజుకు పదమూడు సంవత్సరాలూ పూర్తి అయి అయిదుమాసాల పదిరెండుదినాలు అధికముగా అయింది. అందువల్ల పనికిమాలిన మాటలు కట్టి పెట్టి వెంటనే యుద్ధానికి అందరూ సిద్ధపడండి" అన్నాడు భీష్ముడు.

ఆచార్యద్రోణులు సేనలకు మధ్యలో; రెండు ప్రక్కలలో అశ్వత్థామ కృపాచార్యులు; సేనముఖ భాగాన కర్ణుడు యిలా కౌరవులందరూ అర్జునుని యెదుర్కొనడానికి పకడ్బందీగా పట్టు సాధించుకొనడానికి అర్జునుని యెదిరించడానికి సిద్ధముగా ఉన్నారు. "ఉత్తరా! అదిగో! కౌరవులు. తొందరగా వారిమీదకు రథాన్ని నడిపించు,, అనగా ఉత్తరుడు వాయు వేగముతో రథాన్ని తోలుచున్నాడు. ధనస్సుమ్రోయించి అర్జునుడు దేవదత్తాన్ని పూరించాడు. ఆభయంకర శబ్దానికి ఉత్తరుడు రథముపై పడి పోయాడు. గుఱ్ఱాలు కూలి పోయాయి. కౌరవులకు గుండెలు దడదడలాడాయి. కౌరవ సేనలప్రక్కనక్కలు రోధిస్తున్నాయి. వాళ్లపై గ్రద్దలు తిరుగుతున్నాయి. ఏనుగులూ– గుఱ్ఱాలూ యేడవడం ప్రారంభించాయి. అర్జునుడు భీష్మద్రోణులకు ఒక్కొక్కరి పాదాలకూ, చెవులకూ రెండేసి బాణాలు వేసి నమస్కారాలు, కుశలవార్తలూ అడిగినట్లు ముందుగా ప్రయోగించాడు.

దానికి ఆయిరువురూ ఆనందించి, అర్జునునకు "విజయాభవ!" అని దీవించారు. గాండీవములో వెలువడిన బాణాలకు కౌరవ సేన– వీరులూ తట్టుకోలేక పారిపోతున్నారు. యింతలో కర్ణుడు వచ్చాడు. కర్ణార్జునులు భీకర సంగ్రామం గావించారు. అర్జునుని బాణఘాతాలకు కర్ణుడు మూర్ఛనందగా, దుర్యోధనుడువచ్చాడు. ఆతనిపై బాణాలు వేయగా బాధపడి ప్రక్కకురథాన్ని నడిపించాడు. యింక యిలాకాదని అర్జునుడు యింద్ర దత్తమైన సమ్మోహనాస్త్రము కౌరవులమీద ప్రయోగింపగా కౌరవులందరూ చాపలా భూమిపై పడిపోయారు. స్పృహలేకుండయ్యారు. "ఉత్తరా! నీవు తొందరగా వెళ్లి, కర్ణ– అశ్వత్థామ– దుర్యోధన, దుశ్శాసనాదుల తలపాగాకుచ్చులను కోసుక రమ్మనగా రథముదిగి వెళ్లి ఉత్తరుడు

అలాగే వాటన్నిటినీ కోసుకు తెచ్చిరథమెక్కాడు. అలా పరాభవాన్ని పొందిన తరువాత అందరూ హస్తినా పట్టణానికి వెళ్లారు.

## ఉత్తరాభిమన్యుల వివాహం

అర్జునుడు గాండీవాన్ని యథాస్థానములో ఉంచాడు. ఉత్తరుని రథానికి తన జెండాతీసి, సింహపుజెండాను తగిలించి రథాన్ని ఊరువైపు పోనిచ్చాడు. ఉత్తరుడు. గోపాలకులు ముందుగా ఊరిలోనికి వెళ్లి "మనయువరాజు ఉత్తర కుమారుడు కౌరవులందరినీ గెలిచి ఊరిలోనికి వచ్చుచున్నారని తెలిపారు. దర్బారులో విరాటరాజు ఉత్తరుడేమయ్యాడని అడగగా ఉత్తరము వైపు గోవులను తోలుకు పోతున్న కౌరవుల మీదకు యుద్ధానికి వెళ్లాడని తెలిసిన విరాటుడు సింహాసనముపై కూలబడ్డాడు. యింతలో దర్మరాజు వచ్చి "మహారాజా! బృహన్నల సారధ్యములో ఉన్న ఉత్తరకుమారునికి మేలేజరుగుతుంది" అన్నాడు

యింతలో గోపాలుడు వచ్చి "మహారాజా! మనయువరాజు కౌరవులను గెల్చి విజయ శ్రీతో వేంచేస్తున్నా"డనగా, అదిరిగంతులు వేస్తూ! యీ వార్తమన నగరమంతా చాటింపు చేయండి" అని "కంకుభట్టుగారూ! యీ ఉత్సాహ సమయాన పాచికలాడుద"మనగ ధర్మరాజు వద్దని యెంత అనినా వినక పోగా యిరువురూ పాచికలాడు చుండగా "భట్టుగారూ! చూశారా మా ఉత్తరుడు కౌరవమహా వీరులందరినీ గెల్చాడు" అనగా; "మహారాజా! బృహన్నల సారధిగా ఉంటే యెవరైనా జయిస్తారు" అన్నాడు ధర్మరాజు. "అంటే మా ఉత్తరుడు అంత చేతగానివాడా?" అని కోపముతో విరాటుడు పాచిక వేయగా ధర్మరాజు లలాటానికి అది తగిలి రక్తం వచ్చింది.

అక్కడే ఉన్న ద్రౌపది తనపైట చెరగుచించి ధర్మరాజు రక్తాన్నితుడిచి కట్టు కట్టింది. "సైరంధ్రీ! యేమది" అన్నాడు విరాటుడు. మహాశీల దయా ధర్మ వంతుడూ, సత్యవంతుడూ అయినవాని రక్తపు బిందువులు యెన్ని నేల మీద పడితే అన్ని సంవత్సరాలు వర్షముపడదు. ఆరాజ్యమంతా క్షామముతో నాశనమౌతుంది. అందుకు యిలాగావించాను అన్నది. యింతలో ఉత్తరుడు వచ్చాడనగా, విరాటుడు తీసుకు రమ్మని చెప్పాడు. ద్రౌపదితో ధర్మరాజు "నీవు అర్జునుని అక్కడే కొంతసేపు ఉంచు. నాముఖాన్ని చూసి యేమి చేసినా చేయగల"దని చెప్పాడు. విరాటుడు ఉత్తరునికి యెదురేగి తొడపై కూర్చొనగా "నాయనా! మహా వీరులు కౌరవులనే గెలిచావా?" అనగా తండ్రీ! ఒక దివ్య పురుషుని సహాయము వలన గెలిచాను.

ఆయన రేపు తప్పక యిక్కడికి వస్తాడు. భీముడు– ధర్మరాజు రాత్రి కలిసి విరాటుని దగ్గర తమ స్వస్వరూపములు తెలియ జేయాలని అనుకున్నారు. సూర్యభగవానుడు ఉదయ పర్వతానికి తన అరుణారుణకిరణాలతో కాంతు లందిస్తున్నాడు. ఉదయ సాంధ్య క్రియలు నిర్వర్తించి మహారాజ వస్త్రాద్యలంకారాలతో విరాటుని దర్బారుకు వచ్చారు. ధర్మరాజు మహాతేజస్సుతో విరటుని సింహాసనముపై



కూర్చున్నాడు. తక్కిన పాండవులు రాజులు కూర్చొనే గద్దెలపై కూర్చున్నారు. విరాటుడు తన సింహాసనముపై కూర్చున్న ధర్మరాజునుగని కోపావేశుడై "ఓయీ! కంకా! నా సింహాసనముపై కూర్చొనడానికి నీ కెంతసాహసము" అనగా ప్రక్కనే ఉన్న అర్జునుడు లేచి మహాత్యాగి, ధర్మ సత్యవ్రతానుష్ఠితుడు. అస్త్ర శస్త్ర రాజనీతి కోవిదుడు అగు యీ మహా పురుషుడు మహేంద్రుని చింతామణీ పీఠాన్ని అధిష్ఠించి ముల్లోకాలూ పరిపాలించడానికి తగిన శక్తి సామర్ధ్యాలు గలవాడు సర్వప్రజా హృదయాలను రంజింపగల పాండవాగ్రజుడైన ధర్మజుడు యీ చిన్న గద్దె నెక్కడానికి తగడా?" అన్నాడు

విరాటరాజు అద్భుతాశ్చర్యానందాలతో తక్కినవారేరి?" అనగా అర్జునుడు. సైరంధ్రిని వలచిన సింహబలుని వానితమ్ములందరనూ చంపినవాడు పాకశాస్త్రజ్ఞుడు వలలుడే భీమసేనుడు; అశ్వరక్షకుడు తామ్రగ్రంధి నకులుడు; తంత్రీపాలుడు సహదేవుడు; మహాసాహసి అస్త్ర శస్త్ర విద్యా పారీణద్రుపదరాజ ప్రియపుత్రిక సైరంధ్రియే ద్రౌపదీ దేవి;" అని అర్జునుడు కూర్చుండగా; భీముడులేచి, "మీ అంతః పురాంగనలకు నృత్య, నాట్య విద్యాచార్యుడు బృహన్నల అర్జునుడని చెప్పాడు. ప్రక్కనే ఉన్న ఉత్తర కుమారుడు వచ్చి "మహారాజా! వీరాధి వీరుల భీష్మద్రోణ, అశ్వత్థామ– కర్ణ సుయోధనాధులందరనూ గెలిచి మనగోగణాలను తరలించిన దివ్యపురుషుడే విజయుడు" అని చెప్పాడు.

అది వినిన తోడనే విరాటరాజు మహానంద సంభరితుడై ధర్మరాజుకు పాదాభి వందనగావించి "మహాభాగా! యీ రాజ్యము మీకు నాముద్దుల కుమారితోకూడా అర్జునునకు సమర్పిస్తున్నాననగా; అదివినిన అర్జునుడు "విరాట రాజా! ఉత్తరకు విద్యాబుద్ధులు నేర్పాను. అందువలన యీమెను నాకుమారునికి ధర్మపత్నిగాచేస్తా" నన్నమాటకు ఉత్తరకుమారుడెంతో ఆనందతరంగిణిలో మునిగాడు. విరాటరాజు శుభలేఖలు అందరికీ వ్రాయ నగరానికే పెండ్లివేడుక వచ్చింది.

విరటుని గౌరవాదరాభిమానాలను పొందిన పాండవులు ఉపప్లావ్యపురములో ప్రవేశించి తమకొరకు యెదురు చూస్తున్న పౌరులాదరింపగా హాయిగా అక్కడున్నారు. యిక విరాటుని నగరము శోభాయమానముగా తయారయింది. వీణా వేణు మృదంగ వాద్యాలు. యెక్కడజూచినా పవిత్రవేదనాదాలు, మంగళాంగనల మధుర స్వరాలు. నృత్యనాట్య, నృత్తవిన్యాసాలొలికిస్తున్నారు. నగరపౌరులందరకూ ప్రతిగృహమునా వివాహ వేడుకలు జరిగినట్లుగా అలంకారాలు చేసికొన్నారు. శ్రీకృష్ణపరమాత్మ ఆశీస్సులతో వేదమంత్రాల మధ్య ఉత్తరాభిమన్యుల వివాహం అత్యద్భుతంగా జరిగింది. వివాహానికి వచ్చిన వారంతా యీడూ జోడూ అన్నీ బాగున్నాయని వేనోళ్లకీర్తించారు.

**ఇది మహాభారతములో విరాటపర్వం ముగిసింది**



# సంపూర్ణ మహాభారతం



## ఉద్యోగ పర్వము

వివాహము యెంతో ఆనందముగా యిలా జరిగిన తరువాత దగ్గరబంధు మిత్రులందరు తప్ప తక్కిన వారందరూ యెవరి యిండ్లకు వారు వెళ్లిపోయారు. ఆమరునాడు శ్రీకృష్ణ పరమాత్మ అందరినీ అవలోకించి అనురాగముతో యిలా అన్నాడు. విరాటుని సభా భవనములో శ్రీకృష్ణుడు విరాట– ద్రుపదరాజులకు దగ్గరగా బలరామ, సాత్యకులతో కూర్చున్నారు. ఆవల ధర్మార్జున నకుల సహదేవులు, మరికొంత దూరాన యాదవ వీరులందరూ, అభిమన్యుడూ, ఉపపాండవులూ, విరాటునికుమారులు అందరూ కూర్చుని ఉన్నారు. శ్రీకృష్ణ పరమాత్మ అందరి వైపు చిరునవ్వుతో చూస్తూ–

“సభాసదులారా! యిప్పుడొక మనకందరికీ అవసరమైన సమస్య పరిష్కరించాలి. శకుని మాయా మోస తాంత్రిక ద్యూతక్రీడలో ప్రథముడు. వాని మాయలో పడి మనధర్మరాజు సర్వస్వమూ గోలుపోయాడు. నియమాన్ని పాటించి పదిరెండు సంవత్సరాలు వనవాసము, ఒకయేడు అజ్ఞాత వాసముగావించి వచ్చారు. పాండు రాజు వాటా పాండవుల అర్ధ రాజ్యము వారికి దక్కాలి. యీపని సామరస్యపూర్వకముగా జరగాలి. తనకు ధర్మముగా రావలసిన దానినే ధర్మరాజు ఆశిస్తాడు. యికదుర్యోధనుడు అంతశాంతియుతముగా వీరికి రాజ్యభాగము యియ్యడు. తప్పక యుద్ధము జరుగును. యికవారి బలము వారికి, వీరిబలము వీరికీ ఉంది. మంచి మాటనేర్పరి, సంయమనము కలవానిని దూతగా పంపాలి. ఆవలివారు కోపోద్రేకులైనా శాంతితో వీరి మాటలువిని వారికి తగినట్లు నచ్చ చెప్పగలగాలి. అటువంటి వానినే రాయ బారిగా పంపాలి” అన్నాడు.



సాత్యకిలేచి మనరాయబారి దుర్యోధనునిసభలో వారికిజడిసి నట్లుండనక్కర్లేదు. పాండవులకు రావలసిన రాజ్యము దుర్యోధనుడీయకపోతే వారినందరినీ కట్టి ధర్మరాజు దగ్గర ఉంచుతాను. ద్రుపదుడు “సాత్యకిమాటలు ధర్మబద్ధముగా ఉన్నాయి. వృద్ధరాజు దుర్యోధనుని మాటలకే తాళమువేస్తాడు. అలా అందరి అభిప్రాయాలూ విని శ్రీకృష్ణ పరమాత్మ యిలా అన్నాడు. మాకు కౌరవ పాండవులూ ఆత్మ బంధువులే. “ద్రుపదమహారాజా! పూజనీయ పెద్దలు మీపురోహితులను పంపండి” అన్నాడు. అందరూ యెక్కడి వారక్కడకు వెళ్లారు.

ద్రుపదమహారాజు తనపురోహితునిచూసి “మహాత్మా! మీరు బుద్ధిలో బృహస్పతి వంటి వారు, మంచి పండితులు, విజ్ఞాన వీరులు, మహనీయులు, మంచి వాక్కులు కలవారు. దుర్యో ధనుని సంగతి మీకు తెలియనిదికాదు. అంధరాజు ఆతనిమాటకే ప్రాధాన్యత యిస్తాడు. యిటు ధర్మరాజు మీకు తెలిసినవాడే. అందువలన మీకు నేను యెక్కువగా చెప్పనక్కరలేదు. గ్రుడ్డిరాజు తనహృదయము మార్చుకొని వీరి అర్ధరాజ్యం వీరికి యిస్తే చాలామంచిది. లేదా యుద్ధము సిద్ధమే!” అనిపంపాడు. అర్జునుడు రాజులందరకూ తమవైపు రావలసినదిగా దూతలనుపంపి” తమకు సర్వమూ సమకూర్చు శ్రీకృష్ణపరమాత్మ దగ్గరకు తానే స్వయముగా బయల్దేరాడు. అంతకుముందే కృష్ణుని దగ్గరకు చేరుకున్నాడు దుర్యోధనుడు. ముందుగా కాళ్లవైపున్న అర్జునుని జూచి క్షేమ సమాచారాలడిగి” తలవైపున్న దుర్యోధనుని జూచి క్షేమ సమాచారము తెలిసుకున్నాడు కృష్ణుడు. “సుయోధనా! నీవు ముందు వచ్చావు. కాని అర్జునుని ముందుగా నేను చూశాను. అదికాక చిన్నవానికి ముందుగా అవకాశమివ్వాలి. మీరిరువురూ నాకు కావలసిన వారే; నా పేరసైన్యము పదివేల మంది ఉన్నారు. వారందరూ ఆహవశూరులు. నేనుమాత్రం యుద్ధముచేయను. అటు వంటి నేనొకవైపు. అర్జునా! నేనుకావాలా? ఆపదివేల మందికావాలా? చెప్పు?” అనగా అర్జునుడు. “నీవుయుద్ధము చేయవద్దు. అస్త్రాలసలే పట్టవద్దు. నాకు మాత్రమునీవే కావాలికృష్ణా!” అన్నాడు అర్జునుడు. దుర్యోధనుడు మనసులో “అమ్మయ్యా! యీ పదివేలమంది నారాయణ వీరులను అర్జునుడు కోరుకుంటాడేమో అనుమానించాను. కాని అలాచేయలేదు. అని బలరాముని దగ్గరకు వెళ్లాడు. “శిష్యా!మాతమ్ముడు విరాట నగరానాడిన మాటలు నాకేమీ రుచించలేదు.

అయినా కృష్ణుని విడువలేనుకదా! అదికాక నీవూ– భీముడూ నాకుశిష్యులు. నేను యీ యుద్ధములో యెవరివైపూరాలేను. క్షత్రియ వంశసంజాతుడవు. నీకొకరి సహాయమెందుకు? వెళ్లిరా!” అన్నాడు కృతవర్మ ఒక అక్షౌహిణీసేనతో నీవైపు వస్తానన్నాడు దుర్యోధనునితో. కృష్ణుడు “అర్జునా! నేను ఆయుధాన్ని పట్టను, యుద్ధముచేయను” అని యెంతస్పష్టముగా చెప్పినా విన్నావుకావు” అనగా! “బావా! నీయుద్ధము నాకక్కర్లేదు. నీవుంటేచాలును. ఉన్నది పుష్టి మానవులకు, తిన్నదిపుష్టి పశువులకు అన్నారు. అంతేకాదు నీకటాక్షమునాపై ఉంటే చాలును” అను అర్జునుని కృష్ణుడు కౌగిలించుకున్నాడు– అర్జునుడు వెళ్లిపోయాడు.

## శల్యుడు

యీశల్యుడు స్వయముగా నకుల సహదేవులకు మేనమామ. అంతేకాదు. మహావీరుడు కూడా! దుర్యోధనుని దగ్గరకు శకునివచ్చి "అల్లుడూ కొంపమునిగింది" అనగా; "మామా! యేం జరిగింది?" అన్నాడు. నకుల సహదేవుల మేనమామ శల్యుడు తనసేనతో పాండవుల వైపు యుద్ధానికి సిద్ధముగా వస్తున్నట్లు మనవేగులు వారు చెప్పారు. నీవు ఒకకృష్ణుడు, ఒక అర్జునుడు, ఒకభీముడుగూర్చి ఆలోచిస్తున్నావు. యిక శల్యుడే పాండవుల పక్షముగా వెళితే కృష్ణుని వంటి రథ సారథినీ, అర్జునుని వంటి విలుకాడిని, భీముని వంటిగదాయుద్ధ వీరునీ యెదుర్కొని వలసి వస్తుంది?... మధ్యలో అందుకొని "మామా! నన్నిప్పుడేమి చేయమంటావ్" అనగా; సుయోధనా! శల్యుని యేనుగులకు, గుఱ్ఱాలకు, సేనకు, వారు వస్తున్న దారిలో మజిలీలు దగ్గర సరిపడగా, ఆహారపదార్థాలు పుష్కలంగా నీవు యేర్పాటు గావిస్తూ ప్రచ్ఛన్నంగా నీవువారికి కనుపించకుండా వారితోనే రావాలి. యివన్నీ యెవరు యేర్పాటుగావిస్తున్నారో ఆతనికి తెలియరాకుండా, హఠాత్తుగా శల్యుడు "యివన్నీ యెవరు యేర్పాటుగావిస్తున్నా?" రనే సరికి నేనే మామా! అని ఆతన్నివశముచేసి కొన్న మనకు యుద్ధములో చాలా కలిసి వస్తుంద"ని శకుని చెప్పే సరికి దుర్యోధనుడు యెగిరిగంతులు వేశాడు. యిప్పుడే యేర్పాట్లు గావిస్తానన్నాడు. యిలా శల్యుడు దారిలో తనకు యింతచక్కగా యేర్పాట్లు ధర్మరాజే చేస్తున్నాడనుకొన్నాడు. "యింతగా మాకు యేర్పాట్లుగావించే వారికి యేమికావాలో యీయడానికి సిద్ధముగా ఉన్నా"నని శల్యుడనే సరికి అక్కడే ఉన్న సుయోధనుడు వచ్చినమస్కరించి "మామా! యివన్నీ మీకు నేనే యేర్పాటు చేశానని" అనే సరికి శల్యునికి పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్లయి, తమాయించుకొని "అల్లుడూ! నీకేమి కావాలో కోరమనగా" సుయోధనుడు "మామా! నీవే నావైపు విచ్చేసి యుద్ధముగావించాలి" అనగా, యికశల్యుడు మారు మాటాడకుండ "సరేలే" అన్నాడు. యీ విషయం పాండవులకు తెలిసి భీమార్జునులు నిప్పులు త్రొక్కుతున్నారు. శల్యుడు ఉపప్లావ్యముచేరాడు. ధర్మరాజాదులు వచ్చిన శల్యునికి తగినట్లు అతిథిసత్కారాలు చేసి ముభావముగా ఉన్నారు.

"ధర్మ రాజా! నీ ధర్మమే నీకు శ్రీరామరక్ష! నీవు సత్యధర్మాలను విడువకుండా సాధుసజ్జన మహర్షుల దివ్య బోధలూ, వారి ఆశీస్సులతో యింతగా వనవాసాన్ని, అతిక్లేశాలతో కూడిన అజ్ఞాత వాసాన్ని అతిక్రమించావు" అన్నాడు శల్యుడు. ధర్మరాజు "మామా! నీవు సుయోధనునికి మాటయిచ్చావు యుద్ధానికి సహాయము చేస్తానని" ఆమాట మాత్రము నిలబెట్టుకో! మేమెంతో ఆ కౌరవులూ నీకంతే. శ్రీకృష్ణునితో సమానమైన సారధ్య సామర్థ్యము నీకే ఉంది. యికనిన్ను కోరింది ఒక్కటే కర్ణార్జునుల యుద్ధసమయాన నీవు తప్పక కర్ణునికి సారధ్యంచేయాలి. ఆసమయాన నీవు మనవిజయుని ఒక కంట కనిపెట్టమని నిన్నర్థిస్తాను" అనగా; "అల్లుడూ! నువ్వునాకింతగా చెప్పాలా? మా అమ్మాయి ద్రౌపదికి వారుగావించిన పరాభవము మరచి పోయాననుకున్నావా?" అన్నాడు శల్యుడు.



మహారథుడు సాత్యకి, ధృష్టకేతువు, జరా సంధుని కుమారుడు సహదేవుడు, పాండ్యరాజు, ద్రుపదుడూ, మొదలగువారంతా వారివారి సేనా సమూహముతో ఉత్సాహముతో ధర్మరాజుకు సహాయముగా వచ్చారు. సుయోధనుని తరపున భగదత్తుడు కిరాటులు, శల్య భూరిశ్రవుడు, కృతవర్మ సింధు సౌవీరరాజులు, కాంభోజుసు దక్షిణులు యవన శకట, విందాను విందులు వీరందరూ వారి వారి సేనలతో వచ్చారు. యితరత్రా సుమారు మూడక్షౌహిణుల సేనతో దుర్యోధనునికి సహాయముగా వచ్చారు. మొత్తం వీరందరూ పదకొండు అక్షౌహిణుల సైన్యము దుర్యోధనునిది.

ద్రుపద పురోహితుడు హస్తినలో అడుగుపెట్టి భీష్మ, ధృతరాష్ట్ర విదురాదులను కలిసి వారికి పాండవుల విషయాన్ని తెలిపాడు. "ధృతరాష్ట్రమహారాజా! మీరూ పాండురాజు సోదరులు. మీపెద్దల రాజ్యానికి యిద్దరూ వారసులే. అయినా పాండవులకు పాలియ్యకుండా దుర్యోధనాదులు పరిపాలించుకొనడము మీకు బాగా తెలిసిన విషయమే! దుర్యోధనుడు శకునితో మాయాద్యూతంలో పాండవుల ఆస్తినంతా దోచుకొని శీలవతి ద్రౌపదిని దారుణ పరాభవాన్నిగావించారు. వారి పట్ల దైవశక్తిఉంది. నీకొడుకు చేసిన దారుణ కృత్యాలన్నీ వారి పట్ల నిష్ఫలాలయ్యాయి. పాండవులు వారి శక్తి సామార్థ్యాలతో రాజ్యాన్ని విస్తరింపజేశారు. యుద్ధమన్న యిష్టపడని వారు పాండవులు. అందు వలన దుర్యోధనునకు మీరు యెలాగైనా నచ్చ జెప్పి యీ యుద్ధాన్ని ఆపండి. పాండవ బలం యేడక్షౌహిణులు. మీ బలము పదునొకండక్షౌహిణులు. శ్రీకృష్ణ పరమాత్మ వారి పక్షమైయుండ ముల్లోకాలు కలసి వచ్చినా పాండవులను యెదిరించుటకల్ల. కానవారి తండ్రి భాగము వారికిచ్చి యీ యుద్ధాన్ని నీవే నివారింపచేయగలవు" అనగా; "మహనీయా! మీమాటలు వజ్రపుతునకలు. శిరోధార్యాలు. అర్జునుడు అమరేంద్రుని కూడా జయించాడు" అనగా, అడ్డముగా కర్ణుడు వచ్చి "విప్రపుంగవా? జూదమున మాయయేముంది? జూదమాడుటే చెడ్డపని దానిలో శకుని గెలిచాడు. మరిఓడిన సొత్తు మరలకోరవచ్చునా?" అనగా; "కర్ణా! నీవంటి వారి వల్లనే దుర్యోధనుడలా తయారయ్యాడు; మీరందరూ కలిసి గోగ్రహణాన ఒక్క అర్జునుని యేమి చేయగలిగారు? పది చెప్పవచ్చు ఒక్కటి చేయడం కష్టము" అన్నాడు భీష్ముడు. ధృతరాష్ట్రుడు "మహాత్మా! యింతయేల? మేమందరమూ బాగా యోజించి, ధర్మరాజుకు వర్తమానము పంపుతామని చెప్పండి" అని ఆతనికి ఘనసత్కారాలు గావించిపంపారు.

## సంజయ రాయబారం

ధృతరాష్ట్రుడు సంజయుని పాండవుల దగ్గరకు రాయబారానికి పంపుతూ "సంజయా! నీ వెలాగైనా వారికి బాగా మృదు మధురవాక్కులతో లాలించి, యుద్ధములేకుండా చేసుకురావాలి" అన్నాడు. కృష్ణార్జులున్న భవనానికి ఉపప్లావ్యము

చేరిన సంజయుడు వెళ్లాడు. ఆతనిని వారిరువురూ సాదరముగా ఆహ్వానించారు. మరునాడు దర్మరాజావారి ధర్బారులో ధర్మరాజుకు నమస్సులర్పించి సరస సంభాషణానంతరము "ధర్మరాజా! చాల రోజులకు నిన్నుచూచే భాగ్యము నాకు కలిగింది. మీపెదతండ్రి మీ యందరినీ చూచి యోగక్షేమాలు తెలిసికొనిరమ్మని నన్ను పంపించాడు" అనగా; "సంజయా! మాపెదతండ్రి ధృతరాష్ట్ర మహారాజుకు మాపై అపారమైనప్రేమ. అందువలననే మేమిలా ఉండగలుగుతున్నాం. మా తాతపూజనీయులు భీష్మాచార్యులూ, మాగురుదేవులు ద్రోణాచార్యులవారూ,.

గురువులు కృపాచార్యులవారూ, గురు పుత్రులూ అందరూ క్షేమమేనా? రాధేయుడూ గాంధారేయుడూ భీమార్జునులను తలచుకుంటున్నారా?" అనగా; "మహాత్మా ధర్మనందనా! మీపెద్దతండ్రి ముసలితనము వలన పిల్లల ఆకతాయితనాన్ని అరికట్టలేక, ఆ నాటిద్యూతకృత్యాన్నే పదిమారులు తలచుకొని మీకు జరిగిన అన్యాయానికి ఆహర్నిశలూ ఆరాట పడుతూ ఆత్మలో కుమిలి పోతున్నారు. మీరు సత్య ధర్మవర్తనులని తనను చూడవచ్చిన వారందరికీ చెప్పి యెంతో బాధపడతారు. సరే అందరూ ఉండగా నీవూ నీసోదరులూ శ్రీకృష్ణుడు ఉండగా నామాటలు నాలుగూ వినండి. "సంజయా! అందరమూ యిక్కడున్నాము. అందరినీ నీ వెరుగుదువు" అనగా; "అందుకే మహారాజు నన్ను పంపాడు. మీరు శాంతులనీ, బలము కలవారనీ, అధర్మవర్తనులు కారనీ, నాకు బాగా తెలుసు. మీవంశం పాలమీగడ వంటిది. దానిలో జన్మించిన నీ గూర్చి వేరే చెప్పనక్కరలేదు. సర్వజనమూ యుద్ధము వలన నాశనమౌతారు. సరే, నీవు అజాతశత్రువువు. అటువంటి నీవు యుద్ధం చేయలేవు.

శ్రీకృష్ణ పరమాత్మకు వందన చందనలందించి యింకా యిలా అన్నాడు. అర్జునునకునమస్సులు. యీసభలోగల పెద్దలకు నమస్కారాలు; పిన్నలకు ఆశీరుపాయనాలు. మీతాత భీష్మాచార్యులు యెప్పుడు శాంతి ధర్మాలనే కోరుచున్నారు" అనగా; ధర్మరాజు "సంజయా! నీమాటలలోగల అంతరార్ధం అర్ధం కాలేదు. యుద్ధము యుద్ధమని యెన్నో మార్లు నీవే అంటూ, అదిమంచిది కాదనీ నీవే అంటున్నావు. యిక మాకురావలసిన రాజ్యసగము భాగం సరసంగా సంతోషంగా యిస్తే యిక సంగ్రామ మనే శబ్దమే ఉండదుకదా? మీ మహారాజు తనకుమారులకు అనేక రాజభోగాలు కల్పించి, మాకు మాత్రమెందుకీయడు? ఆతడప్పుడే మార్గము తప్పకుండా ఉంటే యింతజరిగేది కాదుకదా! అన్నీ అతనిలో ఉంచుకొని తియ్యని మాటలతో మాకు నీతిని బోధించడానికి నిన్నుపంపాడు.

ఆతనికి తనకుమారుడే తప్ప యావత్ప్రపంచమూ యేమైనా అక్కరలేదు. యికనీ రాయబారము తాబేలు వీపుపై పిల్లలు కొడుతుండగా, ఆదారి వెంట ఒకసన్యాసి వెళుతూ ఆ పిల్లల దెబ్బలకు అదిచావలేదు. అతనికి బాధ కలిగింది. ఆతడు అహింసావ్రతుడుకదా! అందుకాతడు ఆపిల్లలను చూసి పిల్లల్లారా మీరుదానిని తిరగవేసికొట్టండి, అనగా వారలాగే తిరగవేసి తాబేలును కొట్టగా



అదిచనిపోయింది. పిల్లలందరూ గంతులేస్తూ పోయారు. సన్యాసి చాలాసంతోషముగా వెళ్లాడు. అలా ఉంది సంజయా నీరాయబారం" అన్నాడు ధర్మరాజు. శ్రీకృష్ణుడు "సంజయా! నీవింత వరకు చెప్పావు. నేను విన్నానంతే. నాకు పాండవులూ–కౌరవులూ బంధువులుగా సమానమే. కానినాకిక్కడ బంధుత్వముకన్నా సత్యధర్మాలే మిన్న. అవి యెక్కడుంటే నేనక్కడ తిష్ఠవేసి కూర్చుంటాను.

మీ మహారాజు ప్రేమను యెంతమధురంగా చెప్పావో నాకు తెలుసును. నువ్వుయిన్ని చెప్పావు. అహంకారి, గర్వము గల దుర్యోధనుని గూర్చి వొక్కమాట కూడా యీసభలో చెప్పలేదు. యెందుచేత? నీవు మహాలౌక్యుడవు. మరీలౌక్యము సౌఖ్యాలను సర్వనాశనము గావిస్తుంది. వీరికి రావలసిన అర్ధరాజ్యమూ యివ్వకుండా మంచి మాటలతో మరిచిపోవాలా? వీరు యింతటి వారైయుండి వారిని యాచించాలా? యిక్కడ చెప్పిన నీతులు వారికి చెప్పలేవా? ద్యూతం రాజులకు క్రీడ. అయితే అంతమాత్రాన నిండు సభలోవారి సతీమణిని వివస్త్రను చేయాలా? దుర్మార్గ దుశ్శాసనుడు అంతగాద్రౌపదీ దేవిని అవమానింప ఆనీచుని యేమనగలిగాడు మీమహారాజు? కర్ణుడు దుర్యోధనాది దుష్టులందరూ యేమన్నారు.



నామాటలు వింటే కొన్నాళ్లు మనగలుగుతారు. లేకుంటే అంతే. యిలా యెంతదుర్మార్గంగా ఉన్నా మీమహారాజును మీరు వీడరు. శత్రుసంహారమే వారికి కావాలి. తమ్ముని పిల్లలనుకూడా తనబిడ్డలలాగ ఆదరించమని చెప్పండి. "ధర్మరాజా! శ్రీకృష్ణుడే స్వయముగా వచ్చి యీసమస్యను పరిష్కరిస్తే అంతకన్నామాకు కావలసిన దేముంది? యికమీ అందరూ నేను వెళ్లడానికి అనుజ్ఞను యివ్వండి" అని సంజయుడనగా; ధర్మరాజు "సంజయా! నీవు విదురుని బోలిన విద్వాంసుడవు. విజ్ఞుడవు. నీనోట అవాచ్యములురావు. యిక తాత భీష్ములవారికి గురుదేవులు ద్రోణాచార్య కృపాచార్యుల వారికి యెంత దుర్మార్గులైనా దుర్యోధన దుశ్శాసనాదులకు వారికి తగిన మిత్రుడు కర్ణునకూ వారందరి క్షేమము కోరుచున్నానని చెప్పు.

కురువృద్ధులందరికీ వందనలందించానని చెప్పు. మాకురువంశానికి విశ్వాస పాత్రులుగా, మావంశాభివృద్ధినాకాంక్షించు సేవక భావుకులందరి కుశలమడిగినట్లు చెప్పు. మాపితామహుడు మహనీయ మాననీయుడు భీష్మాచార్యుల వారికి ప్రత్యేకముగా చెప్పు. "తాతా! మాకురువంశానికి మూలమునువ్వు. నీవులేకున్న మాతండ్రులుగాని మేము యిలాతీర్చిదిద్దబడేవారముకాము. నీధర్మనిరతికి మనవంశమే జోహారుగావించాలి. తండ్రికొరకు తన సౌఖ్యాలనన్నిటినీ తృణ ప్రాయముగా విసర్జించినవారు యీ ప్రపంచ చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయుటకు నీవొక్కడవే! తండ్రిలేని బిడ్డల మమ్ము చేరదీసి మాకు విద్యాబుద్ధులు చెప్పించిన నీ ఋణము మేమెన్నిజన్మలెత్తినా తీర్చగలమా?" అనిచెప్పు. దుర్యోధనునికి "వీరాధి వీరులైన పాండు కుమారులను సామాన్యముగా జూచికొని శీలవతి పతివ్రతాలలామను మహా సభలో పరాభవించావు. ధర్మరాజు వాటిని చూచీ

చూడనట్టు విడిచిపెట్టాడు. రేపు భయంకర ప్రళయాన్నిమించి రాబోవు మహాయుద్ధ మహమ్మారిని ఆపడము నీచేతిలో ఉంది.

పరుల సంపదకొరకు దురాశపడి పచ్చని కొంపకు నిప్పు పెట్టుకు. సంధిని పాటించి, రంధిని నిలుపు. నీకు మహావీరులు సహాయంగావిస్తే, మాకు సర్వకాల సర్వావస్థల్లో రక్షణ కల్పించడానికి ధర్మదేవత ఉంది. ఒకవేళ అర్ధరాజ్యం యీయడానికి యిష్టములేదా? మా అయిదుగురకూ అయిదు ఊళ్లయినా యియ్యి." అన్నాడు. అర్జునుడు "సంజయా! మేము మాత్రం బాల్యమునుండీ నిన్నెరుగుదుము. మేము మొదటి నుండీ కౌరవులకు మేము చేసినవన్నీ తప్పులే. మేము దుర్మార్గాలే గావించాము నీవెరుగుదువు" యికనీవు హాయిగావెళ్లు" అన్నాడు. సంజయునికి రాజమర్యాదలుచేసి ధర్మరాజు పంపాడు.

ధృతరాష్ట్రుని దగ్గరకు సంజయుడు వెళ్లి "మహారాజా! ధర్మనందనుడు నీకువందన లర్పించేడు. యేమి చేసినా మీరే అని సర్వమూ నీయందే ఉంచారు. ఆ కర్ణశకుని దుర్యోధన దుశ్శాసనాదులతో యుద్ధమంతనాలు గావిస్తున్నారు. కన్న బిడ్డలు కత్తి కట్టుకు కూర్చుంటే, చెప్పలేని తండ్రి చెప్పలేని కష్టాలు పాలౌతాడు. దుర్యోధనుని కోతిని చేసి శకుని ఆడిస్తున్నాడు. యింతకన్నా మీకు నేనేమి చెప్పాలి? పాండవులకు ఒక్కధర్మ దేవతేకాదు, ప్రపంచమంతా వారికి రక్షగా నిలుస్తుంది. భీమసేనుడు సింహములాగ విరుచుకుపడబోతే ధర్మరాజు మాటలనే బోనులాపుతున్నాయి. ధర్మరాజు మెత్తనిపులి. కోరలు పెరికిన పులైతే బాధలేదు. మెత్తనిపులి యేక్షణాన విజృంభిస్తుందో యెవరికి తెలుస్తుంది?

యికవారు యుద్ధరంగమునకు వచ్చారా? మనమేమీ చేయలేము. తరువాత దుర్యోధనాదులకు పాండవులు చెప్పిన విషయాలు విపులంగా వివరిస్తాను. సంజయుడు చెప్పిన మాటలు విన్న ధృతరాష్ట్రునకు నిద్దురపట్టక విదురుని పిలిపించాడు. విదురుడు వెంటనే వచ్చాడు. "మహామాత్యా! పాండవుల దగ్గరకు వెళ్లి వచ్చిన సంజయుడు వారి మాటలు నేను విన్న దగ్గరనుండీ నాకు కంటిపై రెప్పపడలేదు. మనస్సు, శరీరమూ యేమీ బాగులేదు. నీవేమైనా మధురమంగళ వాక్కులు తెలిపి మండుచున్న నాగుండె మంటలను కొంచము శాంతింప చేయాలి. యేమియోగాని యింత దారుణమైన బాధ యింతకముందెప్పుడూ పడలేదు. నాకుబ్రతుకు మీదలేదు. యెందుకోభయము కలుగుతుంది. యీభయాన్ని పోగొట్టగలిగే వాడివి నీవొక్కడివే!

## విదురు నీతి

"ప్రభూ! మీమాటలు వింటుంటే నా కాశ్చర్యముగా ఉంది. తనకంటే బలముగల గలవానితో విరోధం పెంచుకున్న బలహీనుడు; ఐశ్వర్యము పోగొట్టుకున్నవాడు, యితరుల సంపదలను దోచుకోవాలనుకున్నవాడు, కాముకునికి నిద్రపట్టదన్నారు పెద్దలు. యిందులో గలవాటిలో యే ఒక్కటీ మీలోలేవుకదా? యితరుల సంపద తీసుకొనే బుద్ధి మీకులేదుకదా?" అనగా విదురుడు "యిందులో యేవీనాకులేవు. నీవుబుద్ధి శాలివి, ధర్మనందను అభిప్రాయము నువ్వు చెప్తూతావని రమ్మన్నాను." అనే ధృతరాష్ట్రుని మాటలువిని "ప్రభూ! ధర్మరాజు నీతమ్ముని కుమారుడు. వినయ నయవివేకశాలి. రాజశాస్త్రాన్నాపోశనము పట్టినవాడు. మహామాత్యుడు. అటువంటివాడు వేరొక విధముగా ఉంటాడని మీకెందుకింత సందేహం? ఆందోళన? మీరు పాండవులకు యెంత అపకారము చేయ్యాలో అంతాగావించారు. వారిభాగము వారికియ్యడం మీకున్యాయము.



మీరెవరినైతే బాగానమ్ముతున్నారో వారేమిమ్ము నట్టేటిలో ముంచుతారని తెలియలేకపోతున్నారు. మనిషికి క్షమా గుణసంపత్తి అత్యంతావసరం. ధర్మరాజు మిమ్మెప్పుడూ పితృభావముతోనే పూజిస్తున్నాడు; మనిషిమంచి మార్గములో ప్రయాణిస్తే ఆతనికి సుఖశాంతులకు లోటెప్పుడూ ఉండదు. ఎదిరినిగౌరవించి, మనస్సు నిర్మలముగా ఉంచుకున్నవానికి నిత్యమూ శాంతితోనే ఉంటాడు. ఐశ్వర్యము- విద్య- వంశము యీమూడు దుర్మార్గులకు యెంత చెడ్డకలిగిస్తాయో, మంచి వారికంతమేలు చేకూరుస్తాయి. యెంతటి అస్త్ర శస్త్ర ప్రవీణుడైనా ఒకప్పుడు వానిగురి తప్పవచ్చును. కాని రాజ్య శాస్త్రము తెలిసిన వాని బుద్ధి బలము విరోధుల రాజ్యాన్ని సమూలముగా నాశనముగావిస్తుంది.

తన స్వాధీనములో బుద్ధినుంచి, సమానంగా సౌఖ్యకష్టాలనుభవిస్తూ, నాలుగు శక్తులనూ తెలిసికొని, ఉద్వేగాన్ని తగ్గించి, ఉత్సాహాన్ని పెంచుకొని, యింద్రియాలను విచ్చల విడిగా పోనీయక సప్తవ్యసనాలకూ పాలుపోక (జూదము- త్రాగుడు- వేట- పరుషవాక్కు- దండనము- పరస్త్రీ యందుమోజు- దుర్వ్యయము) వీటియందు యెవరు జాగ్రత్తగా ఉంటారో, వానికి సర్వసంపదలూ లభిస్తాయి. ఒంటరి ప్రయాణం, అందరూపడుకుండగా మేల్కొనడము, శాంతివంతులను చేతగాని వారిగా భావించడము, కూడదు. పరుషవాక్కులు పనికిరావు. అపాత్రదానం మంచిదికాదు. ఆత్మస్తుతి పనికిరాదు. మనము యేపరిస్థితులందున్నా చెడుమార్గాన వెళ్లకూడదు.

వియ్యము- కయ్యము- నెయ్యమూ సమానులతోనే గావించాలి. బాధలను లెక్కచేయరాదు. జీవితములో యెంతటి బాధలనైనా యెదుర్కొనాలి. విరోధి అయినా సహాయమర్థించినప్పుడు, తప్పకుండా సహాయము చేయాలి. పరుల భాగ్యాలను చూచి బాధపడుటే మహారోగము. పరుల సుఖాలు చూచి ఆనందించాలి. హిత మిత వాక్కుకావాలి. మాటలే మూటలిస్తాయి. మాటలే మంత్రాలవుతాయి. మాట యేమైత్రి, మాట యేశత్రువు, నరకబడిన వృక్షము మరలచిగురించవచ్చు. మనస్సు విరిగితేమరి అతకబడదు. బాణము శరీరములో గుచ్చుకున్న తీయవచ్చు, మాటను మాత్రము తీయలేము. సత్కార్యాలకన్న సత్య, ధర్మాలుగల సన్మార్గము మిన్న. నీతిగల జీవితమే అన్నీసమకూరుస్తుంది. పాండవులు నీతి- ధర్మాలు తప్పని మార్గాన్ని ప్రయాణిస్తారు.

అటువంటి వారిని చేర దీసి వారికి రావలసిన అర్ధరాజ్యము నీవుయివ్వడం మంచిది. చేసినమేలు మరిచిపోయిన వారికంటే హీనులు సృష్టిలో మరొకరులేరు. మీతమ్ముడు పాండురాజు మీమీద యెంత గౌరవ భావము ప్రేమతో ఉండే వాడో మీకు తెలియనిదికాదు. అరణ్యములో వృక్షాలు చిన్నవి పెద్దవీ అయినా బాగా ఉంటాయి. విశాలప్రదేశాన ఒకవృక్షము యెంతగొప్పగా పెరిగినా, పెనుగాలులకు కూలిపోతుంది. అలాగే మనము యెంతగొప్ప వారమయినా బంధుమిత్రులతో కలిసి ఐకమత్యముగా లేకున్న యెందుకూ పనికిరాని వారమవుతాము. మనవిరోధులు మనలను తేలికగా మట్టు పెట్టగలుగుతారు. పాండవులు మీరన్న యెంత గౌరవాభిమానాలో మీకు తెలియనివికావు. మహారాజా! యింతవరకూ నేను చెప్పిన వాక్యాల్లో యేమైనా పొరపాటుంటే మీరు తప్పకచెప్పండి.

ధృతరాష్ట్రుడు "మహామంత్రీ! నీవునీతి కోవిదుడవు, వివేకశాలివి, నీమాటలున్యాయ సమ్మతాలు. కాని నాకు పుత్రప్రేమ అలాంటిది" అన్నాడు. "పోనీ, అర్ధరాజ్యానికేమి, కనీసము అయిదుగురకు అయిదు ఊళ్లయినా యిప్పించండి. యెన్ని భోగ భాగ్యాలనను భవించినా యీశరీరము, యుద్ధమువల్లో, ఆది వ్యాధులవల్లో గల అంతరార్ధము మీరుగ్రహించాలి" అనగా; ధృతరాష్ట్రుడు "నీతికోవిదా! నాహృదయం నీగొప్పవాక్కుల వలన కొంత శాంతించింది. ఇక ఆధ్యాత్మిక విషయాలు చెప్పితే మరికొంత మనస్సు శాంతిని పొందుతుంది" అనగా; ప్రభూ! నేనెరిగినంత వరకూ నీకు వివరించాను. తరువాత సనత్సుజాత మహర్షి మూలముగా వినండి"

అనగా! "మహామంత్రీ ఆదివ్యపురుషుని దర్శనము నాకు యెలాలభిస్తుంది?" అనగా; విదురుడు హృదయ పూర్వకముగా ధ్యానించగా సనత్సుజాతమహర్షి అక్కడే ప్రత్యక్షమయ్యాడు. ఆతనికి అర్ఘ్య పాద్యాదులిచ్చి పూజించారు. ఆసనముపై కూర్చుండబెట్టి, ధృతరాష్ట్రుడు "ఆధ్యాత్మిక విద్య తమరునాకు అనుగ్రహించండి? "ధృతరాష్ట్రమహారాజా! ముందు రాగద్వేషాలు వదలాలి. చావు అనగానే చనిపోతారు. యీ శరీరము పంచభూతాలతో యేర్పడి, అనంతరము పంచభూతాల్లో కలిసిపోతుంది. అదే జీవిచనిపోవడం. ఆత్మనిత్యమైంది. దానికి చావుపుట్టుకలులేవు. పరమాత్మ అదే. పరమాణువులను పోలిఉంటుంది. యిది యెవరు తెలిసికొంటారో, వారికి చావనిన భయముండనే ఉండదు.

మనస్సునిర్మలము చేసికొన్నవారికి రాగద్వేషాలంటవు. అటువంటి వారికి చావు పుట్టుకల భయముండదు" అని అదృశ్యుడయ్యాడు మహర్షి. ధృతరాష్ట్రుడు నిద్రలోకి మెల్లగా జారుకున్నాడు.

## సంజయు సందేశం

మహారాజు దర్బారులో అందరూ ఉండగా సంజయుడు ప్రవేశించాడు. ధృతరాష్ట్రునకు వందనలందించాడు. "మహారాజా! నేను ఉపప్లావ్యములో ధర్మరాజును దర్శించాను. వారిక్కడవారినందరనూ కుశలప్రశ్నలను అడిగారు- అనంతరము



శ్రీకృష్ణుని దర్శించాను. సుభద్ర, సత్యభామలనందరనూ కలిశాను. వారి పుత్రులూ ఆమందిరములోనికి వెళ్లరు. అయినా ఆమందిరానికి ఆనందముగా ఆహ్వానించారు. అచట బంగారు పీఠాన్ని నాకు వేయగా నేను దానిని నా హస్తముతోతాకి దానిపై కూర్చున్నాను. వారేది భోంచేస్తారో అదే నాకూ పెట్టారు. నాకు ఖరీదైన బట్టలు యిచ్చారు. నేను వచ్చినపని అంతా వారికి వివరించాను. వాసుదేవుడు "సంజయా! మీమహారాజ దర్బారులోనా వాక్కులుగా యివి వినిపించు" అన్నాడు. ధర్మరాజుకు ఆగ్రహము వస్తే ప్రళయముకన్నా దారుణమయింది. మంచి వారికి దానధర్మాలు చేయమను. బంధువులూ, ఆత్మీయులకు యీయవలసినవీ, చెప్పవలసినవీ చెప్పమను. భార్యా బిడ్డలకు చెప్పవలసినవి చెప్పమను. సరిగా పదమూడుసంవత్సరాలకు ముందు అందరూ ఉండిద్రౌపది పరాభవాన్ని పొందింది. యిక ఆమెలా ఆమెను పరాభవించిన వారందరకూ తగినట్లు జరగాలి. దుర్యోధనునికి కర్ణుడు పెద్దదిక్కని మిడిసిపడుతున్నాడు. అర్జునుని నేత్రాలు చింతనిప్పులు లాగున్నాయి. అరణ్యమున ధర్మరాజు రాత్రి బండలపై నిద్రపోయేవాడు. దుర్యోధనుడు దీర్ఘ నిద్రాముద్రితుడౌతాడు.

మేము అయిదుగురమూ అవసరములేదేమో! సింహకిశోరాల్లార మా అభిమన్యుడు. ఘటోత్కచుడు, ఉపపాండవులే వారికి సరిపోతారు. యికద్రుపదమహారాజు, ధృష్టద్యుమ్నుడు, సాత్యకి వారి బంధు మిత్ర ఆప్తపరివారాలతో ఊచకోతకోయడానికి సిద్ధముగా ఉన్నారని చెప్పు. భీష్ముడు మాశిఖండి వంతు. అన్యాయాలతో, అక్రమాలతో మమ్మంతము చేయదలచు కౌరవులందరూ అంతమౌతారని చెప్పుము. పరమేశ్వరుని ప్రసాదమైన పాశుపతాస్త్రము జాగ్రత్తగా ఉందనిచెప్పు. నకుల సహదేవులు, భీముని గూర్చి చెప్పనక్కరయేలేదు. చిన్న నాటినుండి అతన్ని రుచి చూసిన వారేకదా!

ముల్లోకాలను పుక్కిటపట్టగల శ్రీకృష్ణపరమాత్మ ఉండనే ఉన్నాడు." యిలా అనగా ధృతరాష్ట్రుడు "సంజయా! నీ వాక్యాలన్నీ సత్యాలే, ఇందరెందుకు? భీముడొక్కడంటేనాకు గుండెదడ! ఆతని గదాదండం కాలపాశమని నాకు తెలుసు. నాకు రాత్రులలో కన్నుల నిండా నిద్రపట్టనే పట్టదు. భీష్మద్రోణుడాది యోధ వీరులు, పాండవులన్న యెంత అభిమానమున్నా మన ఉప్పు పులుసూ తిని మనవైపే ఉండి మనకన్ని విధాలా సాహాయ్యము చేస్తున్నారు. దుర్యోధనుడుకు ముందుచూపులేదు మందచూపేతప్ప. ఆదిక్కుమాలిన ద్యూతములేకున్న మనకు యింత వచ్చేదేకాదు. చెప్పితే వినడు. జూదము ప్రారంభమున విదురుడు వివరించినది వినక పోవడం వలన అదే జరిగింది" అనగా;

"మహారాజా! యిప్పుడున్న బుద్ధి మీకున్న చాలును. అన్నీ సామరస్యంగానే జరుగుతాయి. వారు సర్వదేశాలు జయించి ఒక్క ద్యూతము మూలంగా అరణ్యాలు పట్ట వలసి వచ్చింది. యింతజరిగినా, గంధర్వుడు దుర్యోధనాదులందరినీ కట్టేసి

తీసుకు పోతుంటే పాండవులే పంతమూహింపక విశ్వాసముతో విడిపించారు" అనగా; దుర్యోధనుడు "సంజయా మీ అందరిమాటలూవిన్నాను. నాకు నవ్వాలో యేడవాలో అర్ధముకాలేదు. ఆమాయదారి మల్లన్న, మంత్రాల మరిడియ్య ఆనల్ల గొల్లవాడు పాండవులకు బాసటగాఉండి నామీదకు వస్తాడంటారు. నాకున్న మహనీయులను మీ రెప్పుడూ చెప్పరు. ఒప్పుకోరు. గురువైన పరశురామునే జయించిన. తాత భీష్మాచార్యులవారు. ప్రపంచములోనున్న రాజులందరికీ అస్త్ర విద్య నేర్పిన ఆచార్య ద్రోణులు, యెదురులేని యేకైక ధనుశ్శాలి కర్ణుడు, కృపాచార్యులు. గురుపుత్రుడు మహాయోధుడు అశ్వత్థామాదులు, యిక్కడ పదునొకండౌక్షౌహిణులు బలమంతా నా గూర్చి ఆహవరంగాన అసువులు బాయనున్నారు. వీరందర దగ్గర ముష్టిపాండవుల దగ్గర వారు నాలుగు దిక్కులను జయించామన్నారు యింతా యేరితే వారికి ఏడౌక్షౌహిణుల సేనేగదా! మీరే చెప్పండి? నేను గొప్పో పాండవులే గొప్పవారే! యెప్పుడు చూసిన ఆగాలికి ధూళికి పుట్టిన భీమునే చెప్తూతారు. గదాయుద్ధాన నాతోసమానుడా? కాదుగదా? యిక అర్జునుడంటారా? నామిత్రుడు కర్ణుడున్నాడు పదిమంది అర్జునుల నెదిరించువాడు. ఇంద్రదత్త శక్తి గలవాడు" అన్నాడు దుర్యోధనుడు. "మహారాజా! భీష్ముడు శిఖండిపాలు; ధృష్ట ద్యుమ్నునిపాలు ద్రోణాచార్యులు; నీకొడుకులందరూ భీమునిపాలు; అర్జునునిపాలు అశ్వత్థామ కర్ణులు; మీమనుమలందరూ అభిమన్యునిపాలు; యిది పాండవులకు మీయందున్న అభిమాన బహుమానం" అనగా; సంజయా! నా కుమారులకు పోగాలం వచ్చిందంటావు" అన్నాడు ధృతరాష్ట్రుడు;

"మీరందరూ మాగురించి మంచిమాట మాట్లాడరు. వారుమాకంటే యెలాగ గొప్పవారు కాగలరు. మాకందరికీ గురువొక్కడేకదా! యీరాజ్యాన్ని హాయిగా పరిపాలించుకొని మేము రాజ భోగాలను భవిస్తాము. పాండవులు దేహీ అనిదేవిరింపక తప్పదు. నేను నా ఆత్మ బలముతో మాట్లాడుతున్నాను. మీరు విన్న వన్నీ గాలి మాటలు, పుకారులే" అనే దుర్యోధనుని దగ్గరకు పిలిచి ధృతరాష్ట్రుడు కూర్చుండ బెట్టుకొని నాయనా! మీరూ పాండవులూ అన్నతమ్ముల బిడ్డలు, అందు వలన పరస్పర ఆదరాభిమానాలతో యెవరిరాజ్యాన్ని వారు పాలించుకుంటే పెద్దవారము మేమెంతో ఆనందిస్తాము." అనగా; "తండ్రీ! అన్నియెడలానాకు దుశ్శాసన కర్ణులుండగా నాకు యేభయములేదు. పాండవులకు. సూది మొనమోపినంత భూమికూడా నేనీయను" అనగా; "కుమారా! వారికి దేవతలందరూ సహాయము గావిస్తారు" అనగా; "తండ్రీ! మానవులకు దైవాలు సహాయము చేస్తారా?" నాకు నమ్మకము లేదన్నాడు" సుయోధనుడు.

ఉపప్లావ్యములో శ్రీకృష్ణుని భవనమున ధర్మరాజు, సోదరులు ఆప్తులూ అందరూ దర్బారు తీర్చారు. "వాసుదేవా! మమ్మెుక మంచి బాటలో ప్రయాణంగావించిన వాడివినీవు. మాకు రావలసిన సగభాగము మేముపుచ్చుకొనాలి.



దానిమూలముగా కౌరవ పాండవులము హాయిగా సుఖజీవనము సాగించు కొనవచ్చును. యుద్ధము ఆగిపోతుంది. మాకు ఐదు ఊళ్లువారిస్తే సరిపోతుందన్నాను. యుద్ధములో జయము మాదే అని యెవరూ చెప్పలేరు. అపజయముకన్నా చావేమిన్న. నీవు మా రెండుకుటుంబాలకూ రాయ బారంనడిపితే దుర్యోధనుడు నీమాటకు విలువిస్తాడు. అని నాకు నమ్మకముంది.

కాని మరల దుర్మార్గులైన వారి దగ్గరకు పంపకూడదనే నాభావం." అనగా; "ధర్మరాజా! కౌరవులలో నామిుందునిలబడువారున్నారా? యెందుకునీకాసందేహం? అధర్మవర్తనులైన వారిని అంతముచేయడమే అత్యంతావశ్యకత భీష్మద్రోణాది పెద్దల సమక్షముల అంత లేసి ఆఘాయిత్యాన్ని చేశారంటే వారుమనుషులా? రాక్షసులా? దుష్టులపై ప్రేమ చూపించడం ఆర్యులనూ, అధికులను అవమానించడమే అవుతుంది. మిమ్మెంత చేయగరాని పనులు చేశారు? ప్రజలందరూ వారిని నిందిస్తూ కోడై కూస్తున్నారు. వారికి సిగ్గులేదు. అటువంటి దుష్టకీటకాలను యేరినశింపచేయాలి. విడిచిపెట్టకూడదు.

నీవు చెప్పింది ఒకందుకు మంచిదే. అక్కడున్న మీకురుకుల పెద్దలందరకూ మీ వినయనయాది భావము తెలుస్తుంది. వారిదుర్మార్గాలు తేట తెల్లమౌతాయి. యింతకూ సుయోధనాదులు సంధికా? రంధికా? కృతనిశ్చయులై యుండుట? అచ్చటవారి బలా బలాలు అన్నీమనకు తెలుస్తాయి. యికనేను సంధి జరగడానికి యెన్ని రూపాలున్నాయో అన్నిమార్గాలలోనూ వారికి బోధిస్తాను. లేదా! వ్యతిరేకమైన ఆ పరిణామము వేరుగా ఉంటుంది. దుర్యోధనుడు కొన ఊపిరి ఉన్నంత వరకూ మీకురాజ్యము యివ్వడు. అదినాకు బాగా తెలుసు. ఐనా కడసారిగా ఒక్కమారు నొక్కి చెప్పాలి" అన్నాడు భీముడు "వాసుదేవా! నీవు ముందు యుద్ధమే తప్పదనడము నాకనుమానముగా ఉంది. మాకు హెచ్చరికా? సరే! దుర్మార్గ దుర్యోధనుడు సంధిచేయడనే నాయభిప్రాయము. వాడికి మాకౌరవగౌరవము అక్కర్లేదు.

పాలూ నీరూ కలిసినట్లుగా మీరుమేమూ అన్నదమ్ముల బిడ్డలము గనుక కలిసి అన్యోన్యానురాగాలతో బ్రతుకుటమంచిదని నామాటగా చెప్పు" అను భీముని మాటలకు కృష్ణుడునవ్వి, "యేమీ యీ మాటలు భీమసేనుని వేనా? లేక... నేనుకలగంటున్నానా? యెప్పుడూ యుద్ధమునే కాంక్షించే యీతనికి యింత పిరికితనమేల వచ్చింది?" అనే సరికి మహాకోపముతో "కృష్ణా! యేమన్నావు? పిరికితనమా? అవునులే గొల్ల వంశోద్భవుడనగు నాకు శౌర్య మెక్కడుంటుంది? నేనెందుకు అలా అన్నానో నీకుబోధపడలేదు. నేను అన్నమాటకు కట్టుబడి ఉన్నానో! లేక పిరికివాడినో నీకేమితెలుసు?" అని మండిపడ్డాడు భీముడు; ధర్మరాజు "వాసుదేవా! మంత్రముతో కట్టుబడియుండే కాలసర్పాన్ని లేపుటభావ్యమా?" అనగా; "ధర్మరాజా! చూడు" అనికృష్ణుడు భీముని భుజముపై చేయివేసి "బావా భీమసేనా! నీవులేక ఆ కౌరవసాగరాన్ని యింకించిన వారెవ్వరున్నారు? ద్రౌపది పరాభవ

దావానలాన్ని చల్లార్చువారెవ్వరు? యేదో మాటవరుసకు అలా అన్నానంతే. నీవు లేకున్న కౌరవులతో ముందుగా యుద్ధము గావించువారేరీ?" అనిసముదాయించాడు. భీముడు "నందనందనా! పూజనీయులైన మా అన్నగారి ఆజ్ఞా బద్ధులమేగాని మేముపిరికి వారము మాత్రముకామని నీకు తెలియును. "అర్జునా! నీయభిప్రాయం" కృష్ణుడనగా; "మాధవా! పెద్దవారు చెప్ప వలసిన వన్నీచెప్పారు. యింకావేరేనా అభిప్రాయమేముంటుంది? అయినా యిలా అన్నాని చెప్పు. దుర్యోధనా! నిండు సభలో శీలవతియైన ద్రౌపదిని పరాభవించిన దావానలం మాగుండెల్లో మండుచునే ఉంది. దానికి ప్రతిక్రియగా మీ కౌరవులనందర హతమార్చిన గాని అది చల్లారదు.

అంతేకాదు గాండీవ- పాశుపతాస్త్రాదులు మీకొరకే యెదురు చూస్తున్నాయి. అర్ధరాజ్యమిచ్చి సోదరన్యాయాని కొచ్చావా? మంచిదే. లేదా నీకు చావుతప్పదని చెప్పు బావా!" అన్నాడు. "నకులా! నీయభిప్రాయం?" "మహాత్మా! బావా! నాయభిప్రాయం వేరుగా యేముంటుంది. సర్వాంతర్యామివి. నీకు తెలియనిదేముంది? అయినా! దుర్యోధనునికి యీ సరికి బుద్ధిరావాలి. నిన్నకాక మొన్న జరిగిన ఉత్తర గోగ్రహణ పరాభవము గుర్తుంటుంది. తరువాత విదురాది నీతిజ్ఞులు, భీష్మద్రోణాది పెద్దలు చెప్పినవి తలకెక్కిన తరువాత పరమాత్ముడవైన నీ దివ్యవాక్కులతో దుర్యోధనుడు దారికివస్తాడనే నమ్మకము నాకు బాగాఉంది. తరువాత దైవేచ్ఛ" అన్నాడు.

బుద్ధికి బృహస్పతి వంటి చిన్నబావ సహదేవా! నీ వాక్కులు ఆమోఘములు గదా! నీవూ చెప్పు" అనగా; "సర్వలోకాలలో గల రహస్యాలన్నీ యెరిగిననీకు, నాయభిప్రాయమే యెరుగవా? చెప్పమన్నావు కదా! విను. సుయోధనా! నేను చెప్పినవి బాగావిని ఆలోచించు. నీవిప్పుడు మా అర్ధరాజ్యమూ యిచ్చినా మేము తీసికొనము. కారణం? రెండవద్యూతములో పణముయేమని? యెవరు ఓడిపోతే వారు వారి అర్ధరాజ్యాన్ని విడిచి పదిరెండుసంవత్సరాలు అరణ్యానికి, ఒక సంవత్సరము అజ్ఞాత వాసానికి వెళ్లడం. అంతే. అంతవరకూబాగుంది. మేము మా అర్ధరాజ్యాన్నివిడిచి వనవాస, అజ్ఞాతవాసాలు నియమము ప్రకారము జరిపాము. మా అన్నలు నీవూ, కొంచము అలోచించకుండా మా అర్ధరాజ్యము మాకిస్తే చాలును అంటున్నారు. అదిమనకేనష్టము. సుయోధనా! పదమూడు సంవత్సరాలు మా అర్ధరాజ్యము ఫలసాయము నీవుహాయిగా అనుభవించావు.

అలాజరగడానికి వీల్లేదు. ద్యూతమున నియమము పదమూడు వత్సరాలు జరపడమే. అప్పుడు మా సగరాజ్యాన్ని మీరు వాడుకున్నారు. అలాచేయరాదు. కనుక. మీరూ పదమూడేడులు, యిప్పుడు మారాజ్యముతో పాటు మీరాజ్యమూ మాకిచ్చియ్యాలి. మా, మీరాజ్యాలను మేము పదమూడు సంవత్సరాలు పరిపాలించాలి. అప్పుడు మీరు మాకు యిచ్చిన అర్ధరాజ్యాన్నీ యిస్తాము. యిదీ



నియమము. కనక మా సపాలురాజ్యాన్ని నీవిప్పుడిస్తే మాకేనష్టము" అని చెప్పుబావా? అన్నాడు సహదేవుడు. కృష్ణుడు "ధర్మనందనా! సహదేవుని రాజకీయము. మనమెవ్వరమూ ఊహించలేని విషయాన్ని చెప్పాడు" అనగా పాండవులు ఒకరి మొకము ఒకరు చూసుకొని ఆశ్చర్యము పొందారు. సహదేవుని భుజముపై చేయివేసి "సహదేవా! అందరికన్నా చిన్నవైనా, ఆలోచనలో మిన్నవు" అనగా "తమ ఆశీస్సుల వలన" అన్నాడు.

"సోదరీ! ద్రౌపదీ! నీమాటలు" అనగా; "విన్నావుగా వారిమాటలు. నన్ను రేపితే కందిరీగలు తుట్ట. ద్రుపదుని హోమవేదికాగ్నిలో పుట్టావు. యిక భారత సామ్రాజ్యాధీశ్వరుల యిల్లు మెట్టేను. అటువంటి నన్ను మనిషి అన్నవాడెవడూ చూడలేని, చూడరాని, ఊహించరాని అవమానం. నిండుకొలువులో గావించిన ఆకౌరవాధములు, నీచులు విడిపోయి యున్న జుట్టును చూపించి, పవిత్రరాజసూయాధ్వర అవభృదస్నాన పవిత్ర యీ శిరోజాలను పట్టుకున్నవాని గుండెలను నిలువునా చీల్చి, ఆక్రొన్నెత్తురు కొంతత్రావి, మిగిలిన రక్తముతో అభ్యంగన స్నానము గావించనిదే నాపగ చల్లారుతుందా సోదరా? నువ్వే చెప్పు" అన్నది.

అనగా వామహస్తము పట్టుకొని, "నీవువేరు, సుభద్రవేరుకాదు నాకు. మీరిద్దరూ రెండునేత్రాలు. నీవు పదమూడువత్సరాలే బాధతో యేడ్చావు. కౌరవకాంతలు బ్రతి కున్నంత వరకూ యేడ్చేకాలము దగ్గరకొచ్చిందమ్మా!" అని ఓదార్చాడు శ్రీకృష్ణుడు. "ధర్మరాజా! మనవారందరి అభిప్రాయాలూ విన్నాను. అక్కడ పరిస్థితిని బట్టి యేమి చేయాలో అలా మాటలాడిచేస్తాను. పెద్దలందరకు మీపరిస్థితులన్నీ వివరిస్తాను. వారుగావించిన దుండగాలు, దురాగతాలు అన్నీ చెప్పుతాను. సంధిలేదా! రంధేకదా జరుగుతుంది. మీరందరూ నాకాజ్ఞయియ్యండి. మీ అంతరాత్మలందుగల ఆకాంక్ష నాకు శ్రీరామరక్ష!" అని ధర్మనందనా వందనాలు. రేపేమంచి సుముహూర్తం. అనగా; అందరూ లేచి వాసుదేవుని కొంతదూరము సాగనంపారు.

## శ్రీకృష్ణ రాయబారం

శ్రీవ్యాసుల వారి మహాభారతములో యీ "శ్రీకృష్ణ రాయబారం" ఒక విశిష్టతను సంతరించుకొంది. అంతేకాదు శ్రీకృష్ణపరమాత్మ రాయబారము నడపడానికి కౌరవసభలో యేమి జరుగుతుందో, పరమాత్మ నోటివెంబడి యేదివ్యవాక్కులు వస్తాయోవిని తరించాలని అక్కడకు దేవతలు, నారదాది మహర్షులు యెందరో వచ్చారు. శ్రీకృష్ణుడు ఉపప్లావ్యమునుండి బయల్దేరిన ఆదినము "రేవతీ నక్షత్రము" ఆశ్వయుజ మాసమున రేవతీ నక్షత్రము చతుర్దశి చివర- త్రయోదశితిథి చివరలో గాని వస్తుంది. త్రయోదశి ప్రయాణానికి చాలా మైత్రీముహూర్తాన శ్రీకృష్ణుడు రాయబారానికి ప్రయాణమయ్యాడు.

శ్లో।। "మైత్రే ముహూర్తే సంప్రాప్తే మృద్వర్చిషి దివాకరే
కౌముదే మాసి రేవత్యాం శరదంతే హిమాగమే"

తెల తెల్ల వారుచండగా ఉషఃకాలసమీపాన నిర్మలమగు గగనాన (తీక్ష్ణములేని కిరణాలతో) మృదువుగా ఉండే సూర్యుని వెల్గు గల ఆశ్వయుజ మాసము (కౌముదీమాసం) శరదృతువు అంతిమ సమయాన శ్రీకృష్ణుడు రాయబారానికి ప్రయాణమయ్యాడు. వాసుదేవుడు హస్తినకు వెళ్లడానికి రథాన్ని అధిరోహించే సరికి అనేక రకాల అపశకునాలు తోచాయి. "మాధవా! హస్తినలో ముందుగా మామాతృమూర్తిని దర్శించి, మా యోగక్షేమాలు తెలిపి, ఆమెసమాచారాన్నీ తెలిసికో" అన్నాడు. కృష్ణుని రథానికి శైబ్య- సుగ్రీవ- మేఘపుష్ప- వలాహకా"లను అశ్వాలు ముందుకు దూసుకు పోవడానికి సిద్ధముగా ఉన్నాయి. మంగళవాద్యాలు ఘోరునమ్రోగుతున్నాయి. కల్యాణులు మంగళహారతులర్పించారు. ధర్మరాజు "వాసుదేవా! సర్వమూ జయమగుగాక!" అన్నాడు భీమార్జున నకుల సహదేవులు వందనములందించి వెనక్కి మరలిపోయారు.

దారకుడు పరమాత్మ ఆజ్ఞతో రథాన్ని నడిపిస్తున్నాడు; ప్రకృతి అంతా అతిప్రశాంతిగా ఉంది. బాలభానుడు గగనానికి వెళ్లే సరికి వాసుదేవుని రథం సుదూరం ప్రయాణించింది. మార్గములో నారద- పరశురామ- జమదగ్ని మొదలైన దివ్యఋషులు శ్రీకృష్ణ పరమాత్మ దర్శనముచేసికొన్నారు. వాసుదేవుడు రథము నుండి క్రిందికి దిగి వారందరికీ వందనలందించాడు. శుభయోగ కుశల ప్రశ్నలు అనంతరం "మహర్షులారా! తమ వంటి దివ్యర్షుల దర్శనము మాకన్నీ శుభ సూచకాలే" అన్నాడు కృష్ణుడు. "నందనందనా! భీష్మ- ద్రోణాదులు, కురుపెద్దలు గల ధృతరాష్ట్రుని దర్బారులో మీ వాక్యామృతము వినాలని మాకందరికీ సంతోషం. అందుకే బయల్దేరా"మని నారదుడు పలుకగా; "తప్పక దయచేయండి" అనికృష్ణుడని, వారి ఆశీరుపాయనలంది ముందుకుసాగాడు.

కృష్ణుడు కుశస్థలంచేరాడు. సూర్యభగవానుడు అస్తాద్రికిచేరాడు. అచ్చటగల మహనీయులందరూ వాసుదేవుని దర్శనము జేసికొని, అనంతరము మాగృహము పావనము చేయండి అని యెవరికి వారే కోరగా కృష్ణుడు సుందర మందహాస వదనార విందముతో వారిని సమాధాన పరచి నగరానికి దూరప్రదేశమున డేరాలు వేయించి, వారలకు విశ్రాంతి తీసికొనమని, కుశస్థలిలో గల మహనీయుల గృహాలకు వెళ్లి వారి వారి స్వాగత సత్కారాలు అందికొని, వారికాశీస్సులిచ్చి వారలను పంపాడు.

పరమాత్మకు శస్థలిలో ఆరాత్రి గడిపాడు. వాసుదేవుడు హస్తినకు వస్తున్నాడని ధృతరాష్ట్రునకు వర్తమానము రాగానే సుయోధనునిపిలిచి నగరమంతా కల్యాణ శోభ వచ్చేలాగ అలంకరింప ఆజ్ఞాపించాడు. హస్తినలో యెవరి యిల్లు చూసిన వారిపెద్ద కూమర్తె పెండ్లిలా అలంకరించారు. అంతేకాదు రహదారులన్నీ ముత్యాలతో



ముగ్గులువేశారు. కస్తూరితో కలయంపు జల్లారు, నవరత్నాలతో తోరణాలు ప్రధాన మార్గాలన్నిటా కట్టారు. పౌరులు శ్రీకృష్ణ పరమాత్మ దర్శనం గావించుకొని జన్మ జన్మల్లో గల పాప పంకిలాలను పోగొట్టుకోవాలని ఉవ్విళ్లూరుచున్నారు. ఉషోదయానికే వాసుదేవుడు వృకస్థలానికి వస్తాడని అక్కడ విడిదిని అందచందాలతో అలంకరించారు. "విదురా! పరమపావనమైన వాసుదేవుని పాదాలు మన నగరానికి మంగళాలుకలిగిస్తాయి. కనుక ఆతనికి నవరత్న సువర్ణ ఆభరణాలూ, పంచకల్యాణి గుఱ్ఱాలను భద్రదంతావళాలను అనేక సుందరీమణులను బహుమానముగా ఇస్తాను" అన్నాడు గ్రుడ్డిరాజు.

ఆమాటలు విన్న విదురుడు "మహారాజా! శ్రీకృష్ణునికి యిలాంటివన్నీ లంచాలిచ్చి లోబరచుకోవాలనుకున్నావా? అలాంటి పప్పులేవీ ఉడకవు. యింతెందుకు అర్ధరాజ్యం మాని అయిదూళ్లకుదిగిన పాండవులకు యివ్వ వలసినవి సమర్పిస్తే యెంత బాగుంటుంది? అయినా యింతమంచి బుద్ధి నీకుపుట్టిందంటే నమ్మలేక పోతున్నాను. ఆకృష్ణుడు నీవు సమర్పించే వేవీ తీసికోడు. ఆతనికి అతిథిమర్యాదలు మాత్రము హృదయ పూర్వకముగా చేయించండి. అంతేచాలును. "ధృతరాష్ట్ర మహారాజా! వాసుదేవుడు చెప్పిన వాక్యాలు మీరందరూ జాగ్రత్తగావిని, ఆతడు చెప్పినట్లు చేస్తే ఆతనిని మేరు వెక్కించినంతగా సంతోషిస్తాడు. ఆతని దివ్య వాక్యామృతము వినాలని నారదాది మహర్షులెందరో మన నగరానికి విచ్చేశారు. నాలుగు దిక్కులనుండి మహారాజులు వచ్చారు" అన్నాడు.

"దుర్యోధనా! శ్రీకృష్ణునికి నీవేమీ చేయలేవు అడ్డదారులు త్రొక్కి అపహాస్యం పాలవకు" అన్నాడు భీష్ముడు. కొలువు ముగించారు. "మరునాడు శ్రీకృష్ణ పరమాత్మకు ఘనముగా స్వాగతము యివ్వడానికి ధుర్యోధనుడు చేశాడు. హస్తిన రాజమార్గమంతా కృష్ణుని రథం వచ్చే సరికే మార్గము రెండు వైపులా మంగళ వాద్యాలు మ్రోగుతున్నాయి. పుణ్యస్త్రీలు మంగళ గీతాలతో హారతులిస్తున్నారు. వేదాశీర్వాదం, విద్వత్కవుల ఆశీరు పాయనము చాలా చక్కగా వినిపిస్తున్నాయి. ఆమధుర మంగళమూర్తి దర్శనానికి పౌరులు భవనాలపైకెక్కి, ఒకరిపై యింకొకరునిలిచి తిలకింప సాగారు. అలా రథం రాజమందిర ద్వారము దగ్గర నిలిచింది. పరమాత్మ దిగేసరికి భీష్ముడు- ద్రోణుడు- విదుర సంజయులు యెదుర్కొన్న ధృతరాష్ట్రుడు వాసుదేవుని హస్తము పట్టుకొని లోనికి తీసుకొని వెళ్లాడు. దుర్యోధనుడు సభామండపమున ఒకమూల పెద్దస్తంభము దగ్గర ఒక సువర్ణ ఆసనము వేయించాడు. కృష్ణుడు ఆ ఆసనము మీద ఆసీనుడయ్యాడు. వేదపండితులక్కడే ఆయనకి అర్ఘ్యపాద్యాదులర్పించారు. అంతాముగిసిన అనంతరము పెద్దలకు వందనలు, పిల్లలకు ఆశీస్సులర్పించాడు. ధృతరాష్ట్రునికి వందనలర్పించి "మహారాజా! నేను విదురునింట బసచేస్తాను. యిచ్చట నన్ను చూడాలన్నవారు, నేను చూడాలను కున్నవారూ ఉన్నారు. వారి నందరినీ చూడాలి.

ముందుగా కుంతీదేవిని దర్శించి పాదాభివందనగావించాడు. కుంతి మేనల్లుని హస్తాలు పట్టుకొని పాండవుల పాట్లు పరిపరివిధాల వివరించి కన్నీరు కారుస్తూ ఉంటే ఆమెకు తగినట్లుచెప్పి ఓదార్చాడు. అల్లుడూ, యేమి యీ అన్యాయం? నాకుమారులు పదిరెండు సంవత్సరాలు మహారణ్యాల్లో కాయలూ, దుంపలూ, ఆకులూ, అలములుతిని, బండరాళ్లపై పండుకొను గతి వచ్చిందా? కన్న తల్లిని కనులార చూసుకొను యోగానికైనా నోచుకొనే భాగ్యము లేదా? సరే! వారందరూ క్షేమమేకదా? ద్రుపదరాజనందిని అగ్నిహోత్రునిలో పుట్టి పరమపావనులైన భర్తలను కట్టు కొని పలు బాములకు లోనయింది. ఆమె సుఖియేనా? వారలా అడవుల పాలై అక్కడ అగచాట్ల పాలై అలమటిస్తుంటే, ఇక్కడ దాయాదుల పజ్జ వారు యేది పెడితే అదేతిని వారు యీసడించినా, నోటికి వచ్చినట్లు ఆడిపోసుకుంటుంటే నోరు మెదపకుండా నేను యీ పదమూడువత్సరాలూ, వారికన్న మిన్నగా దెప్పిపొడుపులు అనుభవించాను.

కౌరవ పెద్దలుగాని, మహారాజుగాని, గాంధారిగాని వారెవరూ యేమీ అనలేదు. పరమపాపులు వారింట ఉండి వారికూడు తినడమే నాకు యెక్కువ బాధకలిగిస్తున్నాది అల్లుడూ! త్వరలో నా పుత్రులను నేనుకలుసుకొనే యోగముందా? ధర్మరాజు మరల సామ్రాజ్యాభిషిక్తుడౌతాడా? నాకు చెప్పి నా బాధకొంచము తగ్గించు" అనగా వాసుదేవుడు కుంతీ దేవిని ఊరడిస్తూ, "అత్తా! కొంచము ఓపికపట్టు, దేనికైనా కాలము, కర్మమూ కలిసిరావాలికదా? "నీ బిడ్డలకు యేమి చెప్తూతావు?" వాసుదేవా? మా ధర్మరాజుకు "కుమారా! నీవు సుక్షత్రియ వంశసంజాతుడవు. నీవూ యెంతగానో ఉపేక్షిస్తున్నావు? యిది రాచకులానికే కళంకం; భీమసేనా! నీవు యింతగా యెందుకాలోచిస్తున్నావు? మేమందరమూ నీవేమాకు పెద్దదిక్కనుకున్నాం. యింక విజృంభించు; విజయా! నీవు అమరేంద్రుని, ప్రమదేంద్రులను గెల్చినవాడవు, నీ పాశుపతాస్త్రం, గాండీవాలకు తగినపని కల్పింపవా?;

అన్నిటికి నీవే సమర్థుడవున్నావని నాకు నిబ్బరము. ధర్మదేవత ఆశీస్సులతో, నీ దోహదముతో త్వరలో రాజ్యాన్ని పాలించుకొనే యేర్పాటు చెయ్యి; అనగా కుంతీదేవి; "అత్తా! నీవునాకు చెప్పనక్కరయేలేదు. నా బావలు సంగతి నాకు తెలుసు. త్వరలోనే యుద్ధములో నీ కుమారులు కౌరవులనందరనూ చంపి రాజ్యాన్ని పరిపాలించుకుంటారు." అనిచెప్పి వాసుదేవుడు అక్కడ నుండి వెళ్లిపోయాడు. శ్రీకృష్ణుని దుర్యోధనుడెంతగానో పట్టు పట్టినా భోజనానికి రానని సున్నితముగా తిరస్కరించాడు. "సుయోధనా! యిక్కడ పవిత్ర హృదయుడైన విదురునిగృహములో ఉంటాను" నీ ఆదరణ నాకు నచ్చింది. నీవువెళ్లు అని కృష్ణుడు వెళ్లాడు.

ముల్లోకపాలకుడైన శ్రీకృష్ణ పరమాత్మ దుష్టుడైన దుర్యోధనుని మూలాన తనగృహానికి వచ్చి పావనము చేశాడని పొంగిపోయాడు విదురుడు. కవులూ పండితులూ మహాపురుషులూ వాసుదేవుని దర్శించి పునీతులయ్యారు. విదురుడు



కృష్ణునకు పర్యంకము యేర్పాటుగావించి "పరమాత్మా! దుష్టచిత్తుడు, దురుద్యోగి, దుర్మార్గుడు దుర్యోధనుడు నీవాక్కులు వింటాడా? వినడు. వాడికి పాండవుల కన్నా యెక్కువ సేనా బలముందని ద్రోణభీష్మాదులు తన వైపు ఉన్నారని మహాగర్వంతో కన్నూ మిన్నూ కానకున్నాడు" అనగా; "మహనీయా! సంధి రంధిగా తయారవుతుందని తెలుసు. అయినా పెద్దలు మీ అందరి సముఖాన చెప్పాలి కదా! యుద్ధమన్న సర్వనాశనమని తెలుసు. ఒక్క దుర్యోధనాదులు కాక దేశములో గల రాజు లందరూ నశించుతారు. వారి భార్యా బిడ్డలందరూ యేడుస్తారని బాధ పడుతున్నాను. పెద్దలు దుర్మార్గునికైనా చెప్పాలని అంటారు, నీయభిప్రాయము?" అనగా "వాసుదేవా? నీ అభిప్రాయమే నాది" అన్నాడు.

సూర్యభగవానుడు వస్తున్నాడని చుక్క పొటుక్కున పొడిచింది. ప్రకృతి పరిమళాలను విరజిమ్మింది. మంగళ వాద్యాలు పరమాత్మను లేపాయి. లేచిస్నానాది క్రియలు నిర్వర్తించుకొని దర్బారు దుస్తులతో అలంకృతుడయ్యాడు వాసుదేవుడు. దుష్ట చతుష్టయము కర్ణ, శకుని, దుర్యోధన, దుశ్శాసనాదులు కలిసి వచ్చారు. వాసుదేవునికి రాజదర్బారు గూర్చి వివరించారు. రథముపై అధిష్ఠించి కృష్ణుడు వెళ్లాడు. నారదాది మహర్షులు రాగా భీష్ముని చేత వారికి అర్ఘ్య పాద్యాదులిప్పించాడు. కర్ణదుర్యోధనులిద్దరూ ఒక్క పీఠముపై కూర్చున్నారు.

## శ్రీకృష్ణుడు- కౌరవదర్బారు

సభాసదులందరూ మహదానందపూరితులై శబ్దములేకుండా శ్రీకృష్ణ పరమాత్మను కన్నులు కరువు తీరగా ఆపాదమస్తకమూ తిలకించి పులకించి పోతున్నారు. సభ నిస్తరంగ సాగరములా ఉంది. అప్పుడు కృష్ణుడులేచి "మామా! సత్యవతీ పౌత్రా! తమకు నేను చెప్పలసిన వాడనా? అని పాదాభివందనగావించాడు. నీతమ్ముని కొడుకులు, నీ కుమారులూ కలిసి అన్యోన్యానురాగముతో ఉండడం నీ వల్లనే జరుగుతుందని నేనిక్కడకు వచ్చాను. భరతవంశానికి పెద్దవు నీవు. నీవు యేది చేస్తే అదే జరుగుతుంది. లేదా, యుద్ధమే సిద్ధమైతే రాజులందరూ మరణిస్తారు. యీ సామ్రాజ్యాధిపత్యమునీది. భూపతులు వారి శిరస్సులపై అలంకరించే నవరత్నస్థగిత స్వర్ణకిరీటకాంతులతో నీకు నిత్యనీరాజనము సమర్పిస్తున్నారు.

పవిత్రమైన నీ హృదయముతో దురాలోచన చేయక దూరాలోచన చేస్తే రాజులందరూ బ్రతికి బట్టకడతారు. మరొక్కమాట. గాండీవి పాశుపతాస్త్రము, భీముని ఉద్దండ చండప్రచండ గదాదండాన్ని యెదుర్కొనడానికి పరమశివునకు కూడా సాధ్యముకాదేమో! అందుచేత నీ కుమారులు మహావీరులే. వీరూ వారూ కలిసి నీ పాదసేవచేస్తే కలిగే ఆనందం అందరినీ ఆహవాగ్నిలో యింధనాలు చేయడం నీకిష్టమా? యిక పాండవులు తండ్రిలేక నీ నీడనే యింతకాలమూ బ్రతికారు. అయిదుగురూ ఏక కంఠముగా మా పెద్దతండ్రికి పాదాభివందనలందించండి అని యెంతో నీయందున్న భక్తి భావముతో సాగనంపేరు. మానుండి యేమైనా మా

పెద్దతండ్రికి బాధకలిగితే మమ్ము క్షమాగుణముతో క్షమింపమని వేడుకొనుచున్నాము. ఓ సభాస్థారులారా! మీరందరూ వినండి ధర్మం నశిస్తున్న సమయాన, అసత్యం సత్యముపై స్వారిగావించుసమయాన దాని వల్ల వచ్చిన చెడ్డను అనుభవించియే తీరాలి

పాండురాజు జయించిన రాజ్యాన్ని వారికిచ్చి మీరాజ్యాన్ని మీరు హాయిగా పాలించుకొనండి. ధర్మరాజు నాలుగు దిక్కులలో గల రాజలోకాన్ని జయించి, నీకు సామంతరాజులుగా చేశాడు. అది కన్నుకుట్టి నీ సుతులు మాయల మారి శకునితో మాయద్యూతాన్ని ఆడించారు. దాని మూలముగా ద్రౌపదీ సాధ్వికి మహాసభలో బట్టలూడదీశారు. యింతకన్నా ఘోరము యేమైనా ఉందా? దానిని ఆ దారుణ కృత్యాన్ని చూసి అన్నగారి ఆజ్ఞకు బద్ధులైపోయారు భీమాదులు, యిది నీకు తెలియనిదికాదు. యీ విధముగా కృష్ణుడు తన వాక్చతుర్యముతో రాయబారాన్ని కౌరవ మహాసభలో విన్పించగా సభవారందరూ యెంతో పరమానందమందారు.

జమదగ్ని యిలా చెప్పాడు "సుయోధనా! పూర్వము దంభోద్భవమహారాజు గొప్ప వీర విక్రమధీర శూర శిఖామణి. యికవాని అహంకారానికి మేరలేదు. అందరినీ యుద్ధానికి ఆహ్వానించేవాడు. యీ భూమ్మీద తనంతటి వీరుడుగాని గొప్పవాడులేడని మురిసిపోయేవాడు. బ్రహ్మను కూడ లెక్క చేసేవాడుకాదు. యిలాదేశ సంచారం గావిస్తూ. గంధమాదనగిరిపై పరిపూర్ణ తపోయోగములో ఉన్న "నరనారాయణు"లను చూచి నవ్వి వీరు నా వీరత్వానికి భయపడి యిలాతపోదీక్షలాగ నటిస్తున్నారు. ఐనా, నేను విడిచి పెడతానా?" అని యుద్ధానికి రమ్మన్నాడు. అంతట ఆమహార్షులిరువురు వీడి తెలివిలేమికి బుద్ధి చెప్పాలని ఒక గడ్డిపోచను మంత్రించి వానిపై వేశారు. ఆరాజు తనసేనతో భయంభ్రాంతినంది వెనుదిరిగి పరుగుపుచ్చుకున్నాడు.

అలా వాడి పొగరుబోతుతనాన్ని, వీరత్వాన్ని ఒకగడ్డి కాడతో త్రుంచినవారెవరో కాదు. శ్రీకృష్ణార్జునులు. అందువలన అహంకరించేవాడల్ల ఆ రాజులాగ అంతముకాకమానడు. అన్నాడు. తరువాత నారద, కణ్వమహర్షులిద్దరూ చెప్తూతూ. నారదమహర్షి "సుయోధనా! అందరకూ జగడాలు పెట్టిన నేనే నిన్ను యీ యుద్ధమాపమని చెప్తూతున్నానంటే దానిలో గల అంతరార్థాన్ని నీవేగ్రహించుకో!" అన్నాడు. అలా చెప్పగా దుర్యోధనుడు "మహర్షులారా! తమందరికీ వందనాలు. తమరు నాహితముకోరి చెప్పిరి. యేది యేమైనా, విధి వ్రాత యెలా ఉంటే అలాగే జరుగుతుంది." అన్నాడు.

"అల్లుడూ! విన్నావుగా యీ దుర్యోధనుని వాక్కులు, వాడు వినడు, తక్కిన వారిని విననీయడు. నా మాట అంటే మొదటే వానికి వెగటు. అందు వలన నా నేత్రాలేకాదు. నామాటకూడా గ్రుడ్డిదయింది. యిదినా పరిస్థితి. నీవు మాకు



ఆత్మబంధువువు. నా కుమారులందరినీ, యెలా మంచిమార్గములో పెడతావో నీదే భారము. నేను కన్నులులేని గ్రుడ్డివాడిని, దుర్యోధనుడు కన్నులున్న గ్రుడ్డివాడయ్యాడు" అన్నాడు ధృతరాష్ట్రుడు. "సుయోధనా! గురుముఖతః సమస్త శాస్త్రాలూ అధ్యయనముగావించావు. యెందుకింత దురూహ, దుర్మార్గ చరిత్ర? దురాగతాలే రక్షణచేస్తాయనుకుంటున్నావేమో! యింత తెలిసిన నీవు దుర్మార్గబాటలో ప్రయాణింపకూడదు. బుద్ధిలేనివారు చెప్పినట్లునడిస్తే నీవు సర్వాపదలలో పడతావు. మీకౌరవ పెద్దలు, మీతండ్రి, మాహాత్ములైన మహర్షులు యిందరూ చెప్పితే వినని నీజన్మ యెందుకు. ఎడారి జీవితమౌతుంది. గమ్యముండదు.

ధార్తరాష్ట్రాగ్రజా! నీరూ పాలులాగ పాండవులూ, నీవూ కలిసుంటే యీ భూమిపై మిమ్మెదిరించే వారున్నారా? అన్నదమ్ములైన వారిని మాత్రము దూరంచేసికోకు. వారుమహా సమర్థులు, భీముడు చండప్రచండ భండన గదాదండడు. అర్జునుడు పరమశివునే పడ గొట్టిన ధీరపుంగవుడు. మీ వంశాభివృద్ధికోరు. తానున్న కొమ్మనే నరికి వేసి నట్లు వంశనాశకుడవై మనుటకన్న చావేమేలు" అన్నాడు; భీష్ముడు "కుమారా! మీ జనకుని మాటలాలించి, వాసుదేవుని వాక్కులు మీకూ వారికి ఆచరణీయాలు. నేను బ్రతికుండగా యీ యుద్ధము వద్దు. శ్రీకృష్ణుని వాక్కులు శిరోధార్యాలు" అనగా "కృష్ణా! నా జన్మ యెటువంటిదో తేలీదు. యీ పెద్దలందరూ నన్ను నానామాటలన్నవారే. నీవూ అదేబాటలో నడుస్తున్నావు. నా బుద్ధే అంత.

ద్రోణాచార్యులు "కుమారా! మేమందరమూ, మీవీ వారివీ యోగ క్షేమాలు కోరేవారిమే. యీ శ్రీకృష్ణుని మాట శిరోధార్యంచేసికో. నీకుమంచికీర్తిలభిస్తుంది. చరిత్రలో సువర్ణాక్షరాలతో భవిష్కత్కవులు నిన్ను గూర్చి వ్రాస్తారు. సర్వజన యోగ్యముగా ఉండేబాటలో ప్రయాణించు. నా మాటకూడా విశ్వసించి వారి భాగము వారికి యిచ్చేయ్యి" అన్నాడు. "నాయానా! యీ పెద్దలందరూ నీహితవును కోరే చెప్పుచున్నారు." అనగా; "వాసుదేవా! నీకుతెలుసుకదా! జూదమేమాయ. దానిలో సిద్ధహస్తుడు. అటువంటప్పుడు శకునిచేత మాయద్యూతము ఆడించానని, దానిలో ఓడిపోయాడు. అవస్థల పాలయ్యాడు. అంతములో జూదగాడికి దురవస్థలు యెప్పుడు తప్పవు. అదీ మానెత్తి పై పెట్టారు మీరందరూ.

వారుకయ్యానికి కోళ్లలాగ కాలు దువ్వుతూ, మా మీదకు వస్తే మేమేమిచేయాలి? మాకు తెలియని తనములో భీష్ముడూ, మా తండ్రి వారికి అర్ధరాజ్యాన్ని కట్ట బెట్టారు. అదేనిజమంటున్నారు. అదెంత మాత్రము నిజముకాదు. ధర్మ రాజును యువరాజుగా చేశారు. ఆగద్దెను రుచిమరిగిన ఆతడు యిప్పుడు కూడా అదేకోరుతున్నాడు. వారికి సూది మొనమోపినంత భూమి కూడా, పాండవులకీయనని స్పష్టముగా చెప్పు" అనే సరికి కృష్ణునికి అరికాలు మంటనెత్తికెక్కి మండిపడి "సుయోధనా! యుద్ధమునకే సిద్ధపడుచున్న నీవు, యెవరెవరున్నారో జాగ్రత్తగా కాపాడు కొమ్ము. నువ్వు చేసినన్ని అన్యాయాలు యెవరూ చేయలేదు.

నీకు జ్ఞానము వచ్చిన దగ్గరనుండి యెలాగైనా పాండవులను అంతము గావించాలనే అహోరాత్రాలూ ఆలోచన. దానితో రాత్రి నీకు నిద్దుర పట్టదు. సుక్షత్రియ సంజాత ద్రౌపదిని అంతగా పరాభవించావు. ప్రపంచ చరిత్రగాలించు. నీవు గావించిన ఘోరకృత్యాలు యెవ్వరైనా, యెప్పుడైనా చేశారేమోచూడు.యింతచేసి నేనేమీ చేయలేదని వాదించుచున్నావు" అంటుండగా దుర్యోధనుడు, దుశ్శాసనుడు మొదలగువారంతా సభలోనుంచి జారుకున్నారు. యిదంతా తిలకిస్తున్న భీష్ముడు, యీ దుష్టులందరూ ఆవలికి వెళ్లడం చూస్తుంటే వీరికేదో మూడినట్లుంది? యింత మంది పెద్దలున్న యీ సభనుండి, యింతమంది వీరందరూ పోయారంటే యేదో పెద్ద కుట్ర పన్నుతున్నారను కొంటాను. దేనికైనా సమర్థుడు వాసుదేవుడున్నాడు" అనుకొని "పెద్దలారా! మనమింత మందిమి చెవ్వులు చిల్లులు పడ్డట్లు చెప్పగా, యేమీ వినక సభలో నుంచి వెళ్లి పోయాడు సుయోధనుడు.

దుర్మార్గులను సంహరించితే మిగిలిన వారు మంచి వారౌతారు. విదురుడు ధృతరాష్ట్రుని అనుజ్ఞతో గాంధారీ దేవిని దెచ్చిసభలో మహారాజు ప్రక్కను కూర్చుండ బెట్టేరు. ధృతరాష్ట్రుడు "దేవీ! నీ పెద్దబిడ్డ యిందరు మహాపురుషులున్న యీ సభనుండి వెళ్లిపోయాడు;. వాడికి మాతృహృదయముతో మందలించి వాసుదేవుని దివ్యవాక్కులు వినినట్లు చేస్తే హాయిగా ఉంటాడు" అనగా; "మహారాజా! జ్యేష్ఠసుపుత్రుడు చేస్తున్నవన్నీ అన్యాయాలని అందరికీ తెలుసునుకదా! వాడిని అలా ఉంచండి. పాండవులు మీతమ్ముని బిడ్డలు వారికి హృదయ పూర్వకముగా మీరేమియిచ్చినా కాదనడానికి యెవరికి హక్కుంటుంది? మొదటి నుండీ వాడికి దుష్టులతో చెలిమి. అయినా చెప్పుదాం" అనిగాంధారీదేవి దుర్యోధనుని పిలిపించి తనప్రక్కను కూర్చుండ బెట్టుకొని "కుమారా! యేమి యీ అన్యాయం?

యింతమంది పెద్దలు గల యీ సభలో వీరందరూ నీ శ్రేయము కోరి నీకు హితముపదేశిస్తున్నారు. పాండవులకు మహాబలముకు తోడు దైవశక్తీ నిండుగా ఉంది. అందరికీ తెలిసిన విషయమే. కుమారా! యేల యీదౌర్భాగ్యపు బుద్ధి" అని యెంతగానో చెవునిల్లు కట్టుకొని చెప్పింది. కాని వెంటనే సభలో నుండిపోయి, శ్రీకృష్ణుని మనమిక్కడ బంధిస్తే అక్కడ పాండవుల తెగులుకుదురుతుం"దని కర్ణ దుశ్శాసనాదులకు చెప్పాడు. ధృతరాష్ట్రుడుకు యివేమీ తెలియవు. విదురుడు "మహారాజా! శ్రీకృష్ణుని కట్టడానికి నీ కొడుకు దుష్టపన్నాగము పన్నుతున్నాడు. నాశనమయే రోజేమో యిది" అన్నాడు. "మామా! నీ కుమారుల ఊహలు చాలా బాగున్నాయి. యిక నీవు శలవిస్తే వెళతాను.

ధృతరాష్ట్రుడు విదురుని పంపి దుర్యోధనాదులను సభలోనికి రప్పించాడు. "దుర్మార్గుల్లారా! యేమి మీసాహసం? బడబానలాన్ని మూటకడతారా? మరి శ్రీకృష్ణుని బంధించుతారా? మీకేదో మూడింది. లేకున్న యింత దారుణ కృత్యానికి సాహసిస్తారా? అనగా శ్రీకృష్ణుడు తన విశ్వరూపాన్ని చూపించాడు. ఆతని లలాటన



వాణీనాధుడు; రుద్రుడు వక్షమ్మీద, ముఖభాగాన అగ్నిదేవుడు, ప్రక్కలలో అష్ట దిక్పాలురు మరుత్తులు, సురసిద్ధసాధ్య విద్యాధరగణాలు, యిలాముల్లోకాలన్నీ వాసుదేవునియందు కానవస్తుంటే, కోటి సూర్యుల ప్రకాశాన్ని ప్రళయకాలాగ్నినీ అక్కడ సభాసదులు తిలకించ లేక, కన్నులు మూసుకున్నారు. భీష్మద్రోణ కృపాచార్యవిదురాది పెద్దలందరూ ఆసనాలనుండి లేచి జయజయనాదాలతో దిక్కులు పిక్కటిల్లినట్లు కరతాళ ధ్వనులుగావించారు. నారదాది మహర్షులు పరమానందముతో వాసు దేవునకు జోహారులర్పించారు. ధృతరాష్ట్రుడు "పరంధామా! నాకు దివ్య నేత్రాలిచ్చి నీ విశ్వరూపాన్ని చూసి తరించే భాగ్యం కలిగించ"మని చేతులెత్త అలాగే అనగా ధృతరాష్ట్రుడు "మాధవా! నీ దివ్యరూపాన్ని చూశాను. మరల యీ భౌతిక వస్తువులను చూడను. నీవిచ్చిన దివ్యనేత్రాలు నీవుతీసికొమ్ము"నగా అలాగే చేశాడు శ్రీకృష్ణుడు. రథముపై నుండి సభవారందరికీ నమస్సులర్పించాడు. అందరూ యెక్కడివారక్కడకు వెళ్లారు.

"అంతా తిలకించారు కదా! యీ కౌరవసభలో జరిగిన దంతా ధర్మనందనునకు వివరించాలికదా!" అని కృష్ణుడు మేనత్త కుంతీ దేవి దగ్గరకు వెళ్లి "అత్తా! సంధి రంధిగా మారింది. దుర్మార్గులు, పొగరుబోతుల దగ్గర రాయబారం ఫలిస్తుందా? ఆహవాగ్నిలో వారందరికీ ఆహుతి అయ్యేపోగాలం అత్యంత దగ్గరగానే ఉంది. యింతకూ నీ కుమారులకిచ్చు సందేశమేమిటో చెప్పు" అనగా! "అల్లుడా! సుక్షత్రియునకు పరాక్రమము ముఖ్యముగాని పరాన్నభుక్తం మంచిదికాదు. మతిలేనివారు యెదిరి దయకొరకు అఋులు సాచుకొని కూర్చుంటారు. తన వంశగౌరవమును, కీర్తిని నిలుపకొనలేని భీమార్జునుల జీవితాలెందుకు? నీవు యీ దుష్టుల దగ్గరకు రాయబారానికి రావడం యెంతయోగమో, కాలమాడించే నాటకమనుకొంటారు.

మా యింటి పరువు బజారుపాలు కాకుండా చూడమను. కృష్ణుడు పాదాభివందనగావింప కుంతీదేవి ఆశీస్సులర్పించింది. పెద్దలందరికీ వందనలర్పించి రథముపై కర్ణుని తీసుకొనివెళ్లాడు. అప్పుడు కృష్ణుడు కర్ణుని జూచి "కర్ణా! నీ వెవరివో నీకు తెలియునా? తెలీదుకదూ!

**గీ.** **నిన్ను నవమాసములు మోసి కన్నపడతి**
**రాధకాదోయి, పెంచిన దాదికాని;**
**నాదుమేనత్త కుంతి కన్నది గదోయి**
**కన్నెరిక మందు నిన్ను భాస్కరుని కరుణ"**

కర్ణుడు "నిజమా మాధవా?" కృష్ణుడు "దివాకరుని సాక్షిగా నిజము."
"కృష్ణా! పరిహాసము కాదుకదా? యదార్థమా ?
"వారిజనాభ ! నీవలన పాండవులేవరు నాకుతమ్ములై
నారటా? యీ సుయోధనుడు నా పెద తండ్రి కుమారుడేగదా?

కూరిమినాదు సోదరులగూడి, సుయోధను సార్వభౌముగా
భారతసింహ పీఠినిలుపందగు నెంతయదృష్ట శాలినో!

అహో! అ జాత శాత్రవుడైన ధర్మరాజు; నాగాయుత బలుడైన భీమసేనుడు; విజయుడగు అర్జునుడు; అభిమాన ధనులైన నకుల సహదేవులు, నాకు తమ్ములా కృష్ణా! నీవునాతో పరిహాసమాడ లేదుకద! పోనీ పరిహాసమైనా క్షణికమగు నీ యానందము నా జీవితానికే వెలుగు బాట. కృష్ణుడు "కర్ణా! నువ్వుండగా ఆసుయోధనుడా సార్వభౌముడు? అలా యెప్పుడూ జరుగదు. జరుగనీయను" అనగా, కర్ణుడు నవ్వి "కృష్ణా! యేమి నీ తొందర? యిదివిను నేనొకనాడు అతిసామాన్యుడుగా నున్న సమయాన నాకంగరాజ్యమిచ్చి తన పంచ ప్రాణములలో ఆరవ ప్రాణముగా నన్ను జూచుకొను చున్న ఆసుయోధనుడే నాతనుధనమానప్రాణాలకు అధిపతి. ఆతనిని విడిచి ఒక్క క్షణము కూడా ఉండలేని ఆప్తమైత్రి మాది." అనగా, బావా! నువ్వు కడవరకూ బాగా ఆలోచించు

**"రాజసూయ మహా ధ్వర ప్రవర్తకుడైన**
**ధర్మ సుతుండు కై దండనొసగ;**
**ఉద్దండసత్వ మహోదగ్రుడగు వాయు**
**తనయుండు ధవళ ఛత్రంబుపట్ట;**
**చండప్రచండ కోదండ భండనుడైన**
**సురరాజ సూతి చామరము వీవ;**
**ప్రతివీరగర్వ నిర్వాపను లశ్వినీ**
**తనయులు స్వర్ణవేత్రములు దాల్ప;**
**"మంగళము కర్ణ సార్వ భౌమా!" యటంచు**
**భక్తి మై యాజ్ఞ సేని నివాళు లెత్త;**
**మంత్రినై నేను నీకు నమస్కరింప;**
**అధివసింపవె భరత సింహాసనమున"**

అనగా కర్ణుడు త్రుళ్లిపడి కృష్ణా! నా తమ్ములు ధర్మజాదులు నా చెప్పుచేతలనే యుంటారా?" కృష్ణుడు "ఇక నీ యాజ్ఞ సుగ్రీవాజ్ఞ" అనగా, కర్ణుడు "నందనందనా! అలాగైన నేనింక యేమి చేయాలి?" కృష్ణుడు యింకే ముంటుంది? నీవు నాతో వచ్చి నీ తల్లినీ, తమ్ములనూ, నీ బాహువులలోనికి తీసికొనుటే" కర్ణుడు "బావా! అలాగైన తొందరగా నడువు" అనగా, కృష్ణుడు "ఆసుయోధనాదుల నందరినీ హతమార్చుటకు పూనుకొనినట్లే" అనగా; కర్ణుడు ఆశ్చర్యముతో "బావా! నేను చక్రవర్తి నగుటకు సుయోధనాదులనందరనూ చంపవలెనా? యెందుకు?" కృష్ణుడు నీకు రాజ్యము దక్కడానికి; "ఆహా! యింత చతుర రాజకీయ వేత్తవు నీవైనావా?

కృష్ణా మరియిక్కడ పప్పులో అడుగు వేశావే? "కుంతికి పెద్ద పుత్రుడు డిడిగో మనకర్ణుడు"నగా, సుయోధనుడు తనవేత్ర దండాన్ని ప్రేమతో తెచ్చి నాకిస్తాడు.



మా యిరువురకూ కొంచమైనా భేదములేదు; మీరు మిక్కిలి మిత్రమా! నా కెంత మంచి వార్త చెప్పావని అభినందిస్తాడు కూడా? లేదా, మీరు నాశిరముపై నలంకరించిన ఆకిరీటాన్ని నేనే స్వయముగా ఆతని పవిత్ర శీర్షమున అలంకరిస్తాను. మా యిద్దరకూ భేదములేదు. యీ విశ్వ సామ్రాజ్యమంతా మా హస్తాల్లోనే శాశ్వతముగా ఉంటుంది;. యింక జాతి వైరము లేకుండా ఉంటాము. నీ మాట ప్రకారము ధర్మరాజాదులు కూడా నా మాటకాదనరు. భారత సింహాసనాధీశుడు రాధేయుడైనా, గాంధారేయుడైనా ఒకటే కదా?

నేను కానీనుడనే యైనా, పాండురాజ జ్యేష్ఠుడను నేనే రాజును. సుయోధనాదులు కావాలంటే వారికీయిస్తాను, ఒకవేళ ధర్మరాజాదులుకావాలన్న వేర్వేరు రాజ్యాలు వారికీ యిస్తాను, అందరకూ అంతా యిచ్చేసి హాయిగా అడవులకు వెళతాను. మహర్షి జీవితాన్ని గడుపుతాను. కృష్ణుడు "ఆహా! యేమి యీ కర్ణునివాక్కు? నాకు మాట రాకుండాచేశాడే! ఆలోచించి, "బావాకర్ణా! నిజము నీ దగ్గరనేను దాచనేల? భరతసింహాసనముపై నిన్నధివశింప చేసినా కౌరవులను తప్పక వధించి తీరాలి. మాకు కౌరవనాశనము కావాలి; లేకున్న నీ వేల? మా కోరిక తీర్చి చిరకీర్తినార్జించు" అను వాసు దేవుని మాటలు విన్న కర్ణుడు ఆశ్చర్యమంది,, "కృష్ణా! నీ నిర్ణయాన్ని చెప్పావు. నా నిర్ణయాన్నీ విను. సుయోధనుని రక్షణయే కాక ఆతన్ని సేవించడానికి నాహస్తాలు అంకితమయ్యాయి. ఆతనికై తల్లినిగాని, సోదరులనుగాని, పుత్రులనైనా విడిచిపెడతాను. అయినా ధర్మరాజుకు నన్ను చేపట్టుటకన్న మిన్నగా, కౌరవ నాశనమునే యెక్కువగా కాంక్షించుచున్నాడన్న మాట, యిది నిజముకాదా? నిజముగా నాయభ్యుదయాన్ని, దేశకల్యాణాన్ని అభిలషించిన వాడవైన మాధవా? ధర్మరాజుకుగాని, సుయోధనునికి గాని నా జన్మరహస్యము మాత్రము చెప్పకు.

ఆలించి వాసుదేవుడు "కర్ణా! యింత అగాధహృదయము నీకు న్నట్లు యిప్పుడే తెలిసింది. నీ యిష్టానుసారముగానే చేస్తాను.

**"భరము తగ్గుత భూమికి; భ్రాతృవధయు**
**జరుగుగావుత; ధాత్రి నల్చెరగులందు**
**గలుగు రాజులు నాశమ్ముగాంచుగాత!**
**సత్యధర్మంబు లీరెండు జయముగనుత!"**

## కుంతీదేవి

అయ్యో! నేను యెన్నాళ్లీ దాయాదులకొంపలో వారల చేత యెత్తి పొడుపులకు గురియై మనువృత్తి కూడుతినాలి? నాదుఃఖాన్ని యెన్నాళ్లు దిగమ్రింగాలి? సకలసామ్రాజ్యాధికారాన్ని హస్తగతము చేసికోవలసిన మా ధర్మరాజు పదిరెండు సంవత్సరాలు మహారణ్యవాసమనుభవించి, దుర్భేద్యమైన అజ్ఞాతవాసమనుభవించి, యిప్పుడుపప్లావ్యములో తమ్ములతో భార్యతోనున్నాడు. అయ్యో! బిడ్డలారా! మీరుపడవలసిన పాట్లాయివి? అమ్మా ద్రుపదనందినీ! అగ్నిగుండాన

ఆవిర్భవించావు. మహేంద్రు సమానులైన అయిదుగురు భర్తలు గల నీకే యీపాట్లు తప్పలేదు. నీవు నా తలపుకు వస్తే నా గుండె చెరువైపోతుంది; కర్ణుని చూసి

**"కన్నకడుపును పెంచుకోగల యదృష్ట**
**మబ్బ కున్నను మానె; "బిడ్డా" యటంచు**
**హృదయమవియగ యేడ్చుటకేని నోచు**
**కొనని నిర్భాగ్యురాలనైతిని కుమార!"**

కుంతీ దేవిని జూచి కర్ణుడు "యీరాధేయుడు నమస్కరించు చున్నాడు. కుంతి కర్ణుని అక్కున జేర్చుకొని అయ్యో! బిడ్డా! నీ కెంతటిగతి పట్టింది? నీవురాధేయుడవా? కన్నీటితో ఆతని శరీరమంతా తడుపును. కుమారా! బాలభానుని ప్రతిరూపమైన నిన్ను గంగలో గలిపిన దౌర్భాగ్యురాలను. పాపిష్టిదాన్ని, నాపై నున్న కోపాన్ని వీడి తల్లి గర్భాన మరల చేరుకోరా! రారా! కుమారా!" అనగా, కర్ణుడు! "తల్లీ" యేడుస్తావెందుకు? నీవు కనిననాడే యీకర్ణుడు చనిపోయాడు. చచ్చిన బిడ్డడు తిరిగి వస్తాడా? గర్భశోకమే యీ కర్ణుని రూపము. యీ రాధేయుడు కౌంతేయుడెలా అవుతాడు? యింక నీయడియాస విడువు" అనగా; కుంతీదేవి "అంతమాటనకు నాయానా? నీ తమ్ములను చూచుకొందువుగానిరా!" కర్ణుడు "యేల యీ మొసలికన్నీరు? తల్లి గర్భము నుండి భూమిపై పడిన పిండము మరల తల్లి గర్భాన అతుక్కుంటుదా? అందుచేత యీ కర్ణుని కలలోగాంచిన కాన్పుగా తలచుకొమ్ము మరల యీ విపరీతానికేమంటావు?

కర్ణుని కన్న గర్భమే కర్ణవిరోధిని ప్రసవించింది? నీ నిర్ణయమేదో నాకు తెలీదుకాని; నా నిర్ణయాన్ని మాత్రమువిను; కర్ణుడు నా కొడుకంటావా? కర్ణువిరోధిలేదు; కర్ణవిరోధియే కావలెనంటావా? కర్ణుడు లేదు; అందు వల్ల కర్ణుడుగాని కర్ణవిరోధిగాని ఒక్కడే నీకు దక్కుతాడు పంచపాండవులనడానికి;" అనగా కుంతీ దేవి యేడుస్తూ కన్న కడుపువని నిన్ను యాచింప వచ్చాను. లోకములో "దానకర్ణు"డని పేరు మోశావుకదా! అందు వల్ల నాకు "పుత్రభిక్ష"ను పెట్టు నీ కెంతో పుణ్యముంటుంది" అని కుంతి పైట చెరగు చాచింది.

కర్ణుడు "పాండుపత్నీ! పుత్రభిక్ష యెవరికి? నేను నీ పుత్రుల్లో చేరను కదాతల్లీ?" అనగా; "నాయనా! నీ నిర్ణయానికి తిరుగు లేదా?" కర్ణుడు "లేదు"; "ఆలాగైన కుమారా! దానకర్ణుని యాచించి శూన్యహస్తాలతో తిరిగిపోయిన దీనురాలు ఒక్క నీ కన్న తల్లే యని నీ చరిత్రలో లిఖింప బడుతుంది" అనగా; కర్ణుడు– యీ కర్ణుని జీవితమే అంత తల్లీ! యీ సృష్టిలో నుండే పరాభవం, పరాజయం, శోకము, నిరాశ, యీ నిర్భాగ్యునియందు గూడుకట్టి ఉన్నాయి తల్లీ! సూర్యభగవానునికీ, సుక్షత్రియకాంతకు పుట్టి కడకు సూతుడుగా బ్రతుకుతున్నాడీ కర్ణుడు. మహేశానుడైన, చక్రవర్తిని కాగలిగిననూ, వక్రవర్తినయ్యాను. అర్ధులపాలిటి కల్పవృక్షాన్నైన నేనే మాతృ దేవిని నిరాకరించాను. దౌర్భాగ్యముతో ప్రారంభమైన యీ కర్ణ చరిత్ర,



కన్నీటితో ప్రారంభమైన కౌంతేయుని దుఃఖగాధకు ముగింపు కూడా అలాగే కావాలి. అన్యాయముగా. అకారణముగా, గురుశాపానికి తలొగ్గాను. యిపుడు మా మాతృశాపముగూడా ఒడిగట్టాను. నన్నుశపింపు తల్లీ! శపింపు; నన్ను సర్వనాశనము చెయ్యి. ఆలోచించి, తల్లీ నీ హృదయం పాషాణమా? పుట్టిన వెంటనే నన్ను చంపాలని చూశావు కదూ? నీ మాతృ ప్రేమలో నా కెప్పుడూ పాలు లేదు. నిజముగా నీ మాతృప్రేమలో పాలుఉంటే కుమారాస్త్ర విద్యా ప్రదర్శన సమయాన నిందుల పేరోగములో నన్నందరూ "సూతసుతు"డని నిర్ణయించే సమయాన నా తల్లివే అయితే బరితెగించి,లజ్జా సంకోచాలు వీడి కట్టలు తెగి పెల్లుబికిన పుత్రవాత్సల్యాన "వీడు నా కొడుకు నాప్రేగు త్రెంచికొని పుట్టాడు, నారక్తములో రక్తము" అని యెలుగెత్తి యేడవా? పుత్రహత్యకు పాల్పడి ఉందువా? యిప్పుడుకూడా నీ యవసరము కొరకు వచ్చావు, నా మీదపుత్ర వాత్సల్యముతో రాలేదు. వెళ్లు తల్లీ! వెళ్ళు;" అని కుంతిని పంపాడు కర్ణుడు.

### కర్ణుడు- సూర్యుడు

ఒక రోజున కర్ణుడు యమునానదిలో సూర్యుని ఉపాసిస్తా! హేభువనత్రయగేయా! లోకబాంధవా! శుభకరా! దివాకరా! దుర్భరమాయాంధ కారహస్తి హర్యక్షా! పద్మినీ మానసచోరా! దురాచారదూరా! కుజనశిక్షా! సజ్జనపక్షా! పాహిమాం! పాహిమాం! పాహి! దివాకరా! భువనాల నీ కరకౌశలాన్ని లాలించి, పాలించి, పెంచిన కరుణా వరుణాలయుడవు, తండ్రీ! దాన దయా శాంతి హృదయమున నాకు ప్రత్యక్షమగుము" అని ప్రార్థిస్తుండగా సూర్యమండలమునుండి "కుమారా! కుమారా!" అనుపిలుపు కర్ణునకు వినిపించింది.

కర్ణుడు ఆశ్చర్యముతో "ఔరా! అపూర్వమైన యీ పిలుపు యెచ్చటిది? అశరీరవాణి "కుమారా! నాకూ పాండుపత్ని కుంతీ దేవికీ నీవుజన్మించావు. నీవు అజేయుడవని తెలిసి నిన్నువోనగించి, నీ సహజకవచకుండలాలను అపహరించడానికి అదుగో! మహేంద్రుడే వస్తున్నాడు. వాటిని నీవు అతి జాగ్రత్తగా కాపాడుకో" అనగా; దానికి కర్ణుడు పరమానందముగా "ధన్యోఽస్మి సూర్యదేవా! యీమాట తమరివేనా? నేను నిజముగా సూర్య దేవునకే జన్మించినవాడనా? అలాగైన నా జన్మయెంత ధన్యమయింది. సుక్షత్రియకాంత కుంతీ దేవికీ లోక బాంధవుడైన సూర్యదేవునికీ జన్మించానా? సంతోషము. మరల అశరీరవాణి "నాయనా! అమరేంద్రుడు వస్తున్నాడు" అనగా కర్ణుడు "తండ్రీ! లోక బాంధవా! నీ పుత్రవాత్సల్యానికి జోహారు. తమరు నాకిలా సెలవిస్తారా?

**"శత్రువైనను చే సాచి యాచింపనే**
**దైన లేదనకిత్తు ననుట యొకటి;**
**బాలుర, వృద్ధుల, పడతుల దెగటార్ప**
**నాయుధం బెత్త బోననుట రెండు;**

సత్య ధర్మంబుల సంరక్షణకు బ్రాణ
మైననర్పించెద ననుట మూడు;
భూసుర, దేవ, గో పూజ లొనర్చకే
యన్నంబు ముట్ట బోననుట నాల్గు;
గండు మీరిన మొనగాండ్ర కాళ్లరాచు
దనుక విల్లెక్కు దింపబో ననుట యైదు;
పంచప్రాణమ్ము లీయైదు వ్రతములగుట
బ్రహ్మకైనను నను ద్రిప్ప వశమె దేవ?"

అనగా; సూర్యుడు "నాయనా! నీవ్రతానికని నీ జీవితాన్నే నీ చేతులతో త్రుంచుకుంటావా?" అనగా; కర్ణుడు "తండ్రీ! లేదని చెప్పలేను, సరే మహేంద్రుడంతటి వాని హస్తము క్రిందయి, మీదయి నాహస్తము ఉన్న దాని కన్నా యింకేమికావాలి? యీ జీవితము శాశ్వతమా? ధర్మము శాశ్వతమ? మీరే చెప్పండి నా ప్రణతులందుకొండి" అన్నాడు కర్ణుడు. సూర్యుడు "నీ కర్మము నీ వనుభవించు" అన్నాడు. వెంటనే దేవేంద్రుడు బ్రాహ్మణవేషముతో వచ్చి

"బ్రాహ్మణ విధేయా! రాధేయా! దేహిమాందేహి" అనగా; కర్ణుడు "భూసురనేతా! నమస్సుమనస్సుమాలు యెదురుగా వెళ్లి దయచేయండి. సురేంద్రుని వంటి తమదర్శనము వలన ధన్యుడనయ్యాను. దేవేంద్రుడు- యీతడు నన్ను గుర్తు పట్టలేదుకదా?" అనుకున్నాడు. కర్ణుడు "మహాత్మా! తమరేదో ఆలోచించు చున్నట్లున్నారు. మిమ్ము రిక్తహస్తాలతో పంపుతాననా?" అనగా దేవేంద్రుడు "మహనీయా! కర్ణా! నీ కవచకుండలాలు నాకీయాలి. అవియిచ్చి నీ తల్లి దండ్రుల పుణ్యాన్ని కట్టుకో!" అనగా; ఆనందముతో కర్ణుడు "భూసురోత్తమా! యింత మాత్రానికేనా సందేహించారు? తన ఖడ్గమును తీసి కోసి సహజకవచకుండలాలుతీసి దేవేంద్రుడు రెండు హస్తాలు సాచగా కర్ణుడు ఆతని హస్తాలలో ఆనందముతో ఉంచాడు; దేవేంద్రుడు "దాన ధౌరేయా! యిదిగో! శక్తిని తీసి నేను నీకిచ్చే అపూర్వ విభవాన్ని స్వీకరించు" అనగా; కర్ణుడు మహాత్మా! నేనిచ్చు వాడినేగాని పుచ్చుకొను వాడనుకాను" అని యిరువురూ సందేహిస్తుండగా; సుయోధనుడు వచ్చి "మిత్రమా! అమరేంద్రునంతటి వారి యభ్యర్థన నిరాకరించొద్దు. అంతేకాదు నారాజాజ్ఞ అంగీకరించు,, అన్నాడు; కర్ణుడు రెండుహస్తాలూ సాచగా, దేవేంద్రుడు శక్తి బాణాన్ని పుచ్చుకొని "మహేంద్రా! నా తప్పును మన్నించండి?" అని వేడికొన్నాడు. ఆవిధముగా కర్ణుడు తన సహజకవచకుండలాలు దేవేంద్రునికి సమర్పించాడు. దేవేంద్రుడు కర్ణుని త్యాగనిరతికి పట్టరాని ఆనందముతో కర్ణుని యెంతగానో అభినందించాడు కర్ణదుర్యోధనులూ ఒక ప్రక్క ఆనందమూ, ఒకప్రక్క విషాదమందారు. చివరకు విధి యెలాచేస్తే అలా జరుగుతుందని సరి పెట్టుకున్నారు.



## రాయబార రహస్యం

హస్తిన రాయబార విఫలం గూర్చి ధర్మరాజాదులతో వాసుదేవుడు కూర్చొని యిలా చెప్పాడు. ధర్మనందనా! మనం చెప్పిన మాటలు వారువినరు. వారిగొంతు కలు పలకవు. అటువంటి అహంకార దుర్మార్గ, దుర్మదాంధుల దగ్గరకు వెళ్లడము మందేతప్పు. నక్క కల్యాణము పలుకుతుందా? "వాసుదేవా! అచ్చటి పెద్దలు వానికి చెప్పలేదా?" అన్నాడు ధర్మరాజు. "ధర్మజా! చెప్పవలసినదంతా సానునయముగా చెప్పాను. వారు వింటారా? దుర్యోధనునికి నామాట ఒకలెక్కా? నారదాది మహర్షులు భీష్మాది కురువృద్ధులు యెంతగానో చెప్పారు. సభలోనుంచి లేచి వెళ్లిపోయాడు. ధృత రాష్ట్రుడు కూడా యెంతగానో చెప్పాడు. కురువంశం, శంతన మహారాజుతో అంతరించిపోకుండా, గాంగేయుడైన భీష్ముడు దీన్ని ఉద్ధరించాడనీ, పాండురాజు తనబాహుబల సంపన్నతతో రాజ్యాన్ని యెంతో అభివృద్ధిగావించి, యీ సింహాసనముపై నన్ను నిలిపాడని యెంతగానో గాంధారీ దేవితోసహా చెప్పాడు.

ద్యూతము వలన వారి రాజ్యము మీకువచ్చింది. నియమం ప్రకారం వారు అరణ్య అజ్ఞాత వాసాలు పూర్తి చేసి వచ్చారు. వారి సగరాజ్యము వారికి యిచ్చీమని యెంతగానో చెప్పాడు. "వాసుదేవా! యుద్ధము తప్పదు. కౌరవ వంశనాశనానికి నామనస్సంగీకరింపదు" అన్నాడు ధర్మరాజు. నీకే కాదు నామనస్సూ అంగీకరించదు. అర్జునుడు "బావా! మహాత్ముడవు నీవు. నీయభిప్రాయమెట్లో అలాగే కానియ్యి" అనగా "మాధవా! విజ్ఞుడైన ద్రుపదమహారాజు సలహాకూడా తీసికొందాం" అర్జునుడు "గురు దేవుని అంతమందించడానికే ఆవిర్భవించిన ధృష్టద్యుమ్నుని సైన్యాధ్యక్షునిగా చేయాలి భీష్ముని కొరకే మన శిఖండి ఉండనే ఉన్నాడు" అన్నాడు.

"ధర్మరాజా! మనకన్నిటా ధృష్టద్యుమ్నుడున్నాడు. ద్రుపదవిరాట, సాత్యకి, చేకితాను. ధృష్టకేతు, జరా సంధుని కుమారుడు సహదేవుడు మొదలైన వారంతా ఉన్నారు. అక్షౌహిణీపతులు వీరు" అన్నాడు కృష్ణుడు. విజయలక్ష్మిని వేడుకతో వివాహమాడడానికి వీరులందరూ వివిధ గతులతో వీరావేశముతో వెనుకచూడకుండా పవిత్ర కురు క్షేత్రరంగానికి యుద్ధానికి ప్రయాణిస్తున్నారు. పుణ్యాంగనా సమూహముతో ద్రౌపదీ దేవి, వేద వేత్తలందరూ యెదురుగా వచ్చారు. కురుక్షేత్రము సమీ పానగల హిరణ్మనీ నది ఒడ్డున గుడారాలు వేసి సేనలకు విడిదియేర్పాటు గావించారు.

యెప్పటికప్పుడు గూఢచారుల వలన పాండవుల సంగతిని తెలిసి కొనుచున్న దుర్యోధనుడు దుశ్శాసన, కర్ణ, శకుని వారి అభిప్రాయానుసారంగా యుద్ధానికి సాగడానికి వారిని పిలిచి మంతనాలు సాగించాడు. వీరందరూ కలిసి కౌరవసైన్యాధ్యక్షునిగా భీష్మ పితామహుని అభిషేకించడానికి నిర్ణయించి, భీష్ముల వారిని పిలిచారు. భీష్ముడు "సుయోధనా! ముందుగా నా మాటవిను. నీవూ అటు

పాండవులూ సమానమే. నేను వారిని హింసించడానికి నా చేతులాడవు. మరొకటి కర్ణుడు రణరంగాన ఉంటే నేనుండను. ఆతడో లేక నేనో ఉండాలి. యిద్దరమూ ఉండడం కుదరదు" అనే సరికి "మిత్రమా! నీ కీవిషయాన్ని యింతకు ముందే నేను చెప్పాను. యీ గాంగేయుడు వచ్చినా హృదయ పూర్వకముగా యుద్ధము చేయడు. పాండవులన్న వల్ల మాలినప్రేమ. యిదిగో! నా నిశ్చయాన్నివిను. యీ భీష్ముడు భూమిపై పడే వరకూ నేను యుద్ధ భూమిలో అడుగుపెట్ట"నన్నాడు కర్ణుడు. సుయోధనునకు యిటునుయ్యి, అటుగొయ్యి. అయినా యెట్టకేలకు శకుని మాటప్రకారము భీష్ముని కౌరవసేనా నాయకునిగా అభిషేకించారు. దుర్యోధనుడు తనసేనల నన్నింటిని కురుక్షేత్రానికి పంపాడు. పాండవుల దగ్గరకు బలరాముడు వచ్చి యేది జరగకూడదని వాంఛించానో అదే జరగబోతుంది. భీమసుయోధను లిద్దరూ నా శిష్యులే! గదాయుద్ధములో సుశిక్షితులే. వారిద్దరు పోట్లాడనేను తిలకించలేను. నేను తీర్థయాత్రలకు వెళ్ళుచున్నా"నని వెళ్లేడు. ఆతరువాత రుక్మిణీ దేవి పెద్దన్న రుక్మివచ్చి "అర్జునా! యీ యుద్ధానికి భయపడుతున్నావా? నేనున్నాను. నీ వైరులనందరనూ హతమారుస్తా"నన్నాడు.

"అయ్యా! మేమెవ్వరికీ భయపడము. నీవు తొందరగా వెళ్ళిరా!" అన్నాడు అర్జునుడు. అలాదుర్యోధనుని దగ్గరకు వెళ్లగా ఆతడూ అవమానంగావించగా రుక్మి వెళ్లిపోయాడు. "ధృతరాష్ట్రమహా రాజా! శకుని కుమారుడు ఉలూకుని, మీ కుమారుడూ, శకుని, కర్ణుడూ ఆలోచించి పాండవులదగ్గరికి రాయబారానికి పంపగా, ఆతడక్కడ అనరాని దుర్భాషలాడాడట. అదివిన్న పాండవులాతనియేమీ చేయకుండ" ఓరీ! నీవు శకునికి తగిన కుమారుడవు శనివి. అంచేత తొందరగా వెళ్లి వారి నందరనూ యుద్ధానికి రమ్మని చెప్పు,, అన్నారు. యీ విషయం మీకు తెలియకుండా చేశారు.

ఆ తరువాత యేమి జరిగిందో చెప్పమనగా "కౌరవసేనలో గల యుద్ధ వీరులందరినీ భీష్ములవారు నిర్ణయించి కర్ణుడు కవచకుండలాలు పోగొట్టుకున్నాడు. పరశురాముని శాపము, వివేకము లేక పోవడం వలన కర్ణుడు "అర్ధరథుడు" అనగా, ఆతడుమండిపడి పాండవులన్న యీతనికి ప్రేమతో నన్నర్ధ రథునిగావించాడు. అందువలన యీ గాంగేయుడు భూపతనమైతే రణరంగా నడుగుపెడతాను. అంత వరకు యుద్ధ భూమికి రా"నని శపథంగావించాడు" అన్నాడు సంజయుడు. అలా అనగా "తాతా! మీ యిద్దరనే నమ్ముకొని యుద్ధానికి సిద్ధమైతే, మీరిద్దరూ యిలా పోట్లగిత్తల్లాగ పోట్లాడుకుంటే నాకింక దిక్కెవ్వరు?" అనివాపోయాడు.

సుయోధనుడు "గంగానందనా! మనవిరోధులను మట్టుపెట్ట డానికి తమకు యెంత కాలము పడుతుంది?" అనగా; అది నేనేలా చెప్పగలను? అందులో వాసు దేవుడు వారిపక్షములో ఉన్నాడు. అసాధ్యుడర్జునుడు, నేను బ్రతికుంటే పదిరోజుల్లో



వారినందరనూ అంతమందించగలనని" అన్నాడు. ద్రోణాచార్యులూ అదే మాట పలికాడు. పదిరోజులు పడుతుంది" అశ్వత్థామ. యిలా అనగా సుయోధనుడు సందిగ్ధావస్థలో పడ్డాడు. అయినా నిబ్బరముకోలుపో"లేదని సంజయుడు చెప్పాడు. అక్కడ అర్జునుడు "ధర్మనందనా! కౌరవసేనకన్నామన వారెవ్వరూ తక్కువకారు. మనవారిలో మహా సమర్థులున్నారు. మనలోగల యోధవీరులు ఉత్సాహముతో యుద్ధానికి ఉరకలు వేస్తున్నారు. అందువలన నీవు సంపూర్ణ విజయాన్ని సాధిస్తావని ఆనందంగా ఉండమన్నాడు గాండీవి.

**ఇది మహాభారతములో ఉద్యోగపర్వం ముగిసింది**



# సంపూర్ణ మహాభారతం

## భీష్మ పర్వము

కురువను మహాత్ముడు నూరు అశ్వమేధాలు గావించిన పవిత్ర భూమినే "కురుక్షేత్ర"మన్నారు. ఆయన వంశంలో ఉద్భవించిన వారినే కౌరవులన్నారు. పాండురాజు పుత్రులైనందు వల్ల పాండవులయ్యారు. అటువంటి కురుక్షేత్రమున కౌరవసేనలు పదకొండు అక్షౌహిణులు ఒక ప్రక్క వేరొక ప్రక్క పాండవులసైన్యం ఏడక్షౌహిణులు, విడిసి ఉన్నాయి. యెవరిసైన్యమో తొందరగా తెలిసికొనడానికి గుర్తులు కూడా దాల్చారు. యువవీర సైనికులు ఉవ్విళ్లూరుచున్నారు.

### యుద్ధములో నియమాలు

వీరులందరూ యుద్ధనియమాలు తప్పక పాటించాలి. నియమాతిక్రమణగావించిన వారెంతవారైనా దండింపబడతారు. సాయంసమయమయ్యేసరికి యుద్ధమును ఆపెయ్యాలి. యుద్ధానంతరకాలాన పరస్పరము సుహృద్భావముతో మెలగాలి. గుఱ్ఱాలను సంరక్షించే వారిని, యుద్ధాల భేరీలు మ్రోయించే వారిని, చంపరాదు. రథాలతో, రథాలున్నవారు, యేనుగులతో యేనుగులున్నవారు, గుఱ్ఱాలతో గుఱ్ఱాలున్నవారు యుద్ధముచేయాలి. కాల్బలము కాల్బలముతో సాగించాలి. మాటలతో పరుషవాక్కులు పలికే వారిని యెట్టి పరిస్థితులలోను చంపరాదు. పారిపోతున్న వారిని నిరాయుధులను, యేడుస్తున్న వారిని యెట్టి పరిస్థితుల్లో చంపరాదు. బాగాబడలిపోయిన వారినీ, త్రాగి ఉన్న వారిని కవచాలు లేని వారినిచంపరాదు.



నేలమీద పడిపోయిన వారిని చంపరాదు. యిలా నిర్ణయము చేసికొన్నారు. యిలా ఉండగా ధృతరాష్ట్రా! మనము అనుకున్నదొకటి, జరిగినది మరి ఒకటి అన్నీ దుశ్శకునాలే కానవస్తున్నాయి. సంధ్యాకాలాల్లో సూర్య భగవానుని చుట్టూ కబంధ దేహాలు విపరీతంగా కాన్పిస్తున్నాయి. కార్తీక పూర్ణిమనాడు చంద్రమండలమంతా తేజస్సులేక మాసిపోయి ఉంది. కోయిల కూతలు చెవులు బ్రద్దలయ్యేస్థితిలో ఉన్నాయి. రక్తమాంసాలను మేఘాలుకురుస్తున్నాయి. అరుంధతీ నక్షత్రము వశిష్ఠమహర్షిని దాటి పోతుంది. శనిగ్రహము రోహిణిని ఘోరముగా పీడిస్తుంది. సూర్యుని మ్రింగడానికి రాహువు యెదురు చూస్తున్నాడు. సప్తర్షిమండలమంతా కాంతి హీనమై ఉంది. బృహస్పతి శ్రవణా నక్షత్రములో, శుక్రుడు పూర్వాభాద్రలో, శని పూర్వఫల్గునిలో ఉన్నారు.

త్రయోదశినాడే సూర్యగ్రహణము వచ్చింది. సాగరములో నున్న జలమంతా ఎఱ్ఱగా రక్తవర్ణముగా కానవస్తున్నాయి. సాగరుడు తనహద్దునతిక్రమింపగా ఆలోచిస్తున్నాడు. ఆవుకు గార్ధభాలు, గుఱ్ఱాలకు ఆవులు, దూడలను, నక్కపిల్లలను కుక్కపిల్లలూ ప్రసవిస్తున్నాయి. గ్రద్దలకు తలపై కొమ్ములు మొలుస్తున్నాయి. కలువపూలు వృక్షాలపైన పూస్తున్నాయి. గోవుల పొదుగులనుండి రక్తధారలు వస్తున్నాయి. మాతృదేవినే పిల్లలు ప్రేమిస్తున్నారు. మారణహోమాగ్నిలో రేపు అందరూ ఆహుతి అవడానికి సంసిద్ధులైయున్నారు. యీముప్పుతప్పాలంటే అప్పా! నీ చెప్పు చేతల్లో" ఉందన్నాడు. "మహర్షి వర్యా! మీకు వందనలు; నా పిల్లలు నా మాట వినే పరిస్థితి దాటిపోయింది. యిక యుద్ధమే శరణ్యము అందువలన తమరునాకు యీరణరంగములో విజయాన్ని పొందేవారి శుభశకునాలెలా ఉంటాయో నాకు వివరించండి. "ధృత రాష్ట్రకుమారా! త్రేతాగ్నులు అతి నిర్మలంగా పొగలేకుండా పైకి జ్వాలలు సువాసనా భరితంగా వెలుగులు చిమ్ముతుంటాయి. పక్షులు ఆనందంగా కిలకిలారవాలతో చెవులకింపుగా మధురముగా పలుకుతాయి మదగజాలు ఘుంకారాలు చేస్తూ అశ్వాలు సకిలింపులతో, యెవరివైపు ఉంటాయో వారే జయిస్తారు. ఉత్సాహము ఉరకలు వేస్తూ, కేరింతలు కొట్టే వారివైపే జయముంటుంది. కుమారా! నీకా మారణహోమాన్ని తిలకించాలని ఉందా?" అన్నాడు; "దివ్యర్షీ! నాకొడుకుల, మనుమల చావునుచూడలేను" అనగా; వ్యాసమహర్షి " నీకు యుద్ధ విశేషాలు, వీరుల హృదయాల్లో గల భావాలన్నీ సంజయుడు చక్కగా చెప్తుతాడు.నేనాతనికి అన్నివిషయాలూ గ్రహించే శక్తిని అను గ్రహిస్తున్నా"నని వెళ్లిపోయాడు.

### భూగోళం

వ్యాసమహర్షి దివ్యశక్తినిచ్చాడు సంజయునిజూచి ధృతరాష్ట్రుడు సంజయా! యీ భూగోళముపై యేవిశేషాలున్నాయో! యేరాజులు యుద్ధాలుగావించారో నాకు వివరించు" అన్నాడు. "రాజేంద్రా! యీ ధరణిపై ఉండే జీవరాసులు, అనేకానేక

వస్తువులు పంచభూతాలతో తయారయ్యాయి. యిందులో కదిలేవి, కదలకుండా ఉండేవని రెండురకాలు. అలాగే స్వేద జరాయువులు. కొన్నిగ్రామాల్లోగల మనుజులకు దగ్గరగా ఉన్న మేక, కోడి–పిల్లి మొదలైనవి. అరణ్య వాసులు సింహాశరభ శార్దూలాదులు; నిలిచి ఉండేవి వృక్షాలు, కొండలు మొదలగునవి. అలాగే గాయత్రీ మహామంత్రాక్షరాలు యిరువదినాలుగు. సరిగ్గా యీ భూమికి మధ్యభాగాన బంగారు పర్వతము మేరు పర్వతముంది. యీగిరీంద్రుడు

యెనభైనాలుగుయోజనాల యెత్తు, పదియారువేల యోజనాలకైవారంతో ఉంది. దానికి చుట్టూ భద్రాశ్వకేతుమాలాది ద్వీపాలున్నాయి. యీ భరత ఖండాన్ని పృథువు, ఇక్ష్వాకుడు, యయాతి, మాంధాత, అంబరీషుడు శిబి, పురూరవుడు, దిలీపుడు, గాధి మొదలైన చక్రవర్తులు పరిపాలించారు. యిక్కడలెక్కలేనన్ని మహానదులెన్నో ఉన్నాయి. అలాగే యెన్నోజనులున్న స్థలాలున్నాయి. రాజులేనప్పుడు యీ భూమి గూర్చి నిరంతరమూ విరామములేకుండా, యుద్ధాలు చేస్తుంటారు. మానవుడు కృతయుగములో నాలుగువేల వత్సరాలు; త్రేతాయుగములో మూడువేల వత్సరాలు; ద్వాపర యుగములో రెండు వేలయేళ్లు; కలియుగాన లెక్కలేదు. యెందువల్లననగా, పుట్టగానే గిట్టిన వాళ్లుకొందరు, పది, యిరవై ముప్పై యాభైవందయేళ్ల వరకూ కొందరు బ్రతుకుతారు. వందపైని కొందరే ఉంటారు.



పుణ్యాత్ములు, సత్యవాక్పరాయణులు, బలముగలవారు జనించారు. వేలు మందివారున్నారు; త్రేతాయుగాన మంచివారు, మర్యాదస్తులు. సత్య ధర్మ వ్రతులు పుట్టారు. ద్వాపరయుగాన అన్నిజాతుల వారందరూ యుద్ధవాంఛ గలిగియున్నారు. కలియుగాన అల్పబలులు, ఆవేశపూరితులు, అబద్ధాలవారు, పిసినారు, మాయావులు, యెదుట వారిని మోసముచేయడమేపనిగా బ్రతికిన వారు, జారులు, చోరులు, యిష్టానుసారంగా తిరిగినవారు కలిలో ఉంటారు. కలియుగం చాలాదారుణమైంది. దీనిలో పరమదుర్మార్గులంతా పుడతారు. యీర్ష్యాళువులు, లోభూలూఉంటారు. దురభిమానము, దోషులు, పరమ పాపాత్ములందరూ యీ కలిలో ఉంటారు.

అని సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్పాడు.

## భారతయుద్ధ ప్రారంభం

కురుక్షేత్రయుద్ధ భూమి పాండవసేనలు బారులు తీర్చి ఉన్నాయి. పాండవ సర్వసైన్యాధ్యక్షుడు ధృష్టద్యుమ్నుడు శంఖాన్ని పూరించాడు. ఆటోపముగా వచ్చాడు. "ఓ పాంచాల– మత్స్య, మగధ, పాండ్య కేకయాది పాండవచమూపతులారా! ధర్మ రాజా వారిని కొలిచే గొప్ప భాగ్యాన్ని మీరందరూ మీకండలు నీరైనట్లు ఖడ్గాలూ, బాణాలు వేసి వైరివీరులను చెండాడాలి; లేదా రక్తాలు చింద కరవాలాలతో వైరులచెండి రణభూమిలో కూలి, స్వర్గ భూమిలో హాయిగా విహారము చేయడంగాని రాచబిడ్డకు ప్రయోజనం.



అంతేకాదు దేశ కల్యాణానికి, వీరరక్తాన్ని ధారపోయాలి. వీరునికి విద్యుక్తధర్మం. అందులో ప్రజానాయకుడైన నారాయణుని ఆదేశాన ప్రజలందరు కోరుకున్న యుధిష్ఠిర మహారాజు పాదాలపై హృదయ రక్తాభిషేకం యెంతో పేరుతెస్తుంది. ఖండ ఖండాలుగా ముక్కలై యున్న యీ ఆర్యావర్తాన్ని ఒకటిగా చేయడానికి ప్రజా బాంధవుడు అజాత శత్రుని స్వారాజ్యమందు ప్రతిష్ఠించడానికి కురుసామ్రాజ్యాన్ని నాశనముగావించడానికి సుయోధన సార్వభౌమత్వాన్ని చీల్చడానికి నేడు మాధవుడెత్తిన విప్లవపతాక ప్రళయనర్తనము చేస్తుంది. ఆపతాక ఛాయలో ధృష్టద్యుమ్నుని భీషణ దుందుభి మేఘగర్జనగావిస్తుంది. వేగముగా లేవండి? మీరుత్తేజితులవండి. మీ మీ ఆయుధాలతో విజృంభించండి. నాయడుగులలో. అడుగులువేస్తూ వచ్చే వీరులకు యేయాపదలూ కలుగవు. కన్నాకువలె వారిని రక్షిస్తాను.

నన్నూ మిమ్మూ కాయడానికి గాండీవధారి బీభత్సుడున్నాడు. ఆతనికా ముల్లోకరక్షకుడు పుండరీకాక్షుడొక్కడే రక్ష. యుద్ధము ప్రారంభ మౌతుంది. నియమాన్ని అతిక్రమిస్తే దండన తప్పదు. అందులో సర్వ సైన్యాధ్యక్షుడనగు నాయానతి అధిగమించడానికి మీకేకాదు మీ రాజులకు కాదు, పాండవులకైనా స్వతంత్రములేదు. మీ ధైర్య సాహసాలపై నా ఆధిపత్యము, నా ఆధిపత్యముపై యుధిష్ఠిరుని విజయము, యుధిష్ఠిరుని విజయముపై శ్రీ కృష్ణభగవాను డాదేసించిన దేశాభ్యుదయము నిర్భరములై యున్నాయి. పిరికి గుండెలున్నవారు శిబిరము నుండి తొలగిపొండి; కౌరవుల హితవు తలచు వారూ వేగముగా తొలగిపొండు; సంధికావాలన్న వారూ తొలగిపొండు.

యిక పాంచాలురకొక ప్రత్యేక సందేశం. పాంచాల వీర శార్దూలములారా! యీ మహా యుద్ధము కౌరవపాండవ కలహమేకాక పాంచాల కౌరవ యుద్ధమనే విజ్ఞులు పేర్కొంటారు. అయితేనేమి అదీ సత్యమే! చూడండి! నిలువునా రెండుగా చీలికలైన పవిత్ర మాతృభూమి ఒక్కమారు కనులు విప్పి చూడండి. ఏమీ? మీలోచనాలు అశ్రుపూరితాలవలేదా? మీశిరాలు పాతాళముదాకా క్రుంగిపోలేదా? మన "అహిచ్ఛత్రము, మన ఉత్తరపాంచాలము, ద్రుపదరాజ భుజస్కంధము నుండి బలాత్కారముగా హరించి, ద్రుపదవిరోధి ద్రోణునకు కౌరవులు పట్టము గట్టిన మన జన్మభూమిని చూడండి. ప్రతీకార చర్యగావించండి. ఉచ్చైశ్శ్వరముతో గంభీర ప్రణవనాదాన్నిగావించండి. పాంచాల విభజనానికి– పాంచాలీ మానభంజనానికి ప్రతీకారము– పాంచాలదేశాక్రమణానికి– పాంచాలీ కేశగ్రహణానికి ప్రతీకారము– యిక విజృంభించండి.

యుద్ధభూమిలో తన శిబిరాన అర్జునుడు శిరస్త్రాణము, కవచమును ధరించుచు భారతదేశ గౌరవము పోగొట్టి వైర ఘీంకారము చేయు దుర్యోధనుని ప్రోత్సాహంతో కర్ణుడు కాలపృష్ఠ బాణాతో అనేక ప్రల్లదనాలతో విఱ్ఱ వీగుతున్నాడు;

యెదిరినిల్చి నేడు గాండీవము దాల్చిన యీ విజయుడు యెదుర్కొననున్నాడు. ద్రౌపదిరాగా, "పాంచాలీ మాచిన్నన్న అప్పుడే యుద్ధానికి వెళ్లాడా" అన్నాడు అర్జునుడు. "ఓ- చాలాసేపయింది" అనగా "ఔనౌను యుద్ధానికి ఉరకలేస్తున్నాడు" అర్జునుడన్నాడు. ద్రౌపది "ఆతడురణానికి వెళ్లాలన్న పెండ్లికేగిన కన్నాముచ్చటే; "అదిగాక మా చిన్నన్న అన్న నీకభియానమెక్కువ" అని అర్జునుడు చిరునవ్వు నవ్వాడు. "అలాగెందుకంటారు? మీరైదుగురూ సమానరూపులే" ద్రౌపదికి;. అది కాదుకృష్ణా! నాయభిప్రాయము, దుర్యోధనునితొడలు విరగ్గొడతానని. దుశ్శాసనుని గుండెలు చీల్చిరక్తం త్రాగుతానని ప్రతిజ్ఞచేశాడుకదా! అందు వలన నీకు ప్రీతి... ...

ధర్మరాజురాగా అర్జునుడు నమస్కరింప అర్జునుని తలపైతన కుడిచేయిఉంచి "విజయముపొందుదువుగాక!" అనగా "విజయులెప్పుడూ విజయులే!" అన్నది ద్రౌపది; "పాండురాజ- ధృతరాష్ట్రుల సంతానము యీ నాడీవిధముగా దాయభాగాలకొరకు ఒకరిగొంతులనొకరు కోసికోవడం విజయా! లోకము యెంతనీచముగ చూస్తుందో!" అని ధర్మరాజనగా "అగ్రజా! యేలయీశుష్కభావాలు? అదిగో! వైరివీరుల భేరపటహధ్వానాలు? ఉత్తేజాన్ని పొందండి? అంతేకాదు మనసేనాని ముక్కాకలు తీరినవాడు. అనేక రకాల వ్యూహాలను పన్నగలశక్తి సామర్థ్యాలు కలవాడు. ప్రచండవిక్రముడు. ఆతని శిక్షణలో మనసేన భీమునిచేత రక్షింప బడుతున్నాయి. అడిగో! ధృష్టద్యుమ్నుని తిలకించండి వజ్రవ్యూహాన్ని పన్ని యుద్ధాన్ని ప్రారంభించి, భీమసేనుని సేనకు అగ్రభాగాననిలిపాడు" అన్నాడు అర్జునుడు. "అర్జునా! అలాగని మనము నిర్లక్ష్యము వహింపరాదు.

తన చావును తనగుప్పిట్లో దాచుకున్న. ఉద్దండ సత్యవంతుడు పితామహుడు; అఖిలాస్త్ర శస్త్ర విద్యారహస్యాలు పుక్కిటం బట్టిన ద్రోణాచార్యులు అప్రతిమానశౌర్యాన్ని నుగ్గుపాలతో త్రావిత్రేన్చినవాడు రాధకొడుకు; అరిలోక భీకరమైనరణ ప్రౌఢత్వాన్ని ఆటగా నేర్చిన అశ్వత్థామ; దుస్సహ ప్రతాపుడు దుస్ససేనుడు; భూరిశ్రవస్సు మహాబలుడు; శల్య, భగదత్తులు వికర్ణ- సైంధవులు- యిలా యెందరో మనప్రతి పక్షములో ఉన్నారు. అందులో చిన్ననాటి నుండి నీ మీదకక్షతో ఉన్నాడు." అనిధర్మ రాజనగా; అగ్రజా! మీరు సందేహించకండి. మనకూ మహాబలులున్నారు. అదిగో పాంచజన్యధ్వని పరమాత్ముడగు శ్రీకృష్ణుడు మీరు అనుజ్ఞయివ్వండి?" అన్నాడు అర్జునుడు.

వ్యాసమహర్షి దుర్యోధనుని దగ్గరకువచ్చి "కుమారా! సుయోధనా! రాధేయుడులేని గాంధారేయుడు లేడనివదంతి. యిక్కడనిన్నొక్కడినే చూచుచున్నాను" అనగా? "నిజము అది యిలాపరిణమించింది. భీష్మపతనా నంతరవే రణాంగణమున అడుగిడతానని ప్రతిజ్ఞచేశాడు" అన్నాడు సుయోధనుడు. "తప్పక అలాగే జరుగుతుంది. పచ్చని శాంతి ధామములో దారుణాగ్నిని రగుల్కొల్పి తుదకు



వైరిఘృతాహులతో పోషించి చివరకు చివరకు జ్వాలా విజృంభణ సమయాన విశ్వాసఘాతుకము- విద్రోహాచరణము" అన్నాడు వ్యాసులవారు. "మహాత్మా! తమరు కర్ణుని గూర్చే తెలుపుచున్నారా? ఆమహోదారుని స్నిగ్ధస్నేహము- అమృతప్రేమ- తమకు తెలీదు మునీంద్రా? ఆ అకళంకుని హృదయాన్ని సంశయమునందుటా! వెలుగు నీడల్లా ఉన్న మామైత్రియందా కుశంక" అన్నాడు సుయోధనుడు; "పోనీ రారాజా! కర్ణుని భుజబలాన్నే స్వశక్తి నమ్మి యుద్ధానికి సిద్ధమయ్యావా? ఇపుడు నీ యభిప్రాయము చెప్పు. భీష్ముడు అజేయుడేకాడు అమరుడు కూడా! అందు వలని కర్ణుని నిష్ప్రయోజకుడు అయ్యాడా? కర్ణుని బలమే అభిలషిస్తావా? భీష్ముని పతనాన్ని కోరుతున్నావా?" అనగా; సుయోధనుడు. "కానిందు నాకు భీష్ముడూ కావాలి, కర్ణుడూకావాలి, ఆతని అంతరాత్మను నేనుగ్రహించక పోలేదు, చిరకాల జీవితమున విరక్తి చెందుతున్నాడు. ఆతడు వీరమరణాన్నే ఆహ్వానించుచున్నాడు.

కర్ణుడు రణభూమిలో నున్న ఆతనికి వీరమరణం రాదని అలాచేశాడంతేగాని కర్ణునిమీద ఆతనికెట్టి విరోధమూలేదు. రాధేయుని మహోజ్వల ప్రతాపమేనాకు చేయూత" అనగా; "నాయానా! కర్ణుడే నీకు విజయాన్ని కట్ట బెట్టునను కుంటున్నావా?" అనగా; "మునీంద్రా! నాసంపూర్ణ విశ్వాసం, అనుభూతి, అదినాకేతెలుసు. భానుమతిని రాక్షస వివాహమున తెచ్చుటకు. యీ విశాలభారతవర్షమున, నేనేక చక్రాధి పతినవడానికి కర్ణుని స్వార్థరహిత మహోదార స్నేహ ప్రవృత్తేకారణము" అన్నాడు సుయోధనుడు. వ్యాసమహర్షి " యెలాగైన కర్ణుడు లేకుండా నిన్ను కలవాలని యుద్ధ భూమికి వచ్చాను. నాయాప్త వాక్యాన్ని ఆలిస్తావా?" అనగా సుయోధనుడు "అవశ్యము. దివ్యర్షులహితాన్ని శిరోధార్యముగా స్వీకరిస్తాను. యెన్నడేని తమవాక్కును తిరస్కరించానా మునీంద్రా? భరతరాజ్య ప్రతిష్ఠకు భంగకరమూ, కురువంశగౌరవాన్ని కించపరిచింది, సుయోధను సహజాభిమానానికి భంగముచే కూర్చునది. తాము శెలవిస్తారా? శంతన వంశానికి తాముివిశేషించి హితైషులుకదా!" అన్నాడు సుయోధనుడు; "సుయోధనా! అప్రతిమాన ప్రతిభావంతుడవోయి, వాక్చాతుర్యముతో నా ఉద్యమానికే ఎదురుగట్లు వేస్తున్నావు. యాధాశక్తి యత్నిస్తాను, అర్థిస్తాను" అన్నాడు వ్యాసమహర్షి.

"ఆజ్ఞాపించండి ఋషీంద్రా!" "వత్సా! ఆలోచించు. ధృతరాష్ట్ర పాండురాజు లీవిధంగా పుత్రాకృతులై పరస్పరము పోరాడ్డం కౌరవ వంశానికే తలవంపుకాదా?" అన్నారు వ్యాసమహర్షి; సుయోధనుడు "కాదని యెవరంటారు?" వ్యాసులు "యీసమరాన్ని నివారింపలేరా?"; సుయోధనుడు "ప్రేరేపకులు నివారింప లేకేమి?" "ప్రేరేపకుడవు నీవుకావా?"; సుయోధనుడు "కృష్ణుడు- పాంచాలి- యుధిష్ఠిరుడు" అనగా; "అజాతశత్రువు రణపరాఙ్ముఖుడు- శాంతి ప్రియుడు" అన్నాడు వ్యాసమహర్షి; "భ్రమ, అదే ఆతని ఘనత, బాహ్యమున శాంతి ప్రియుడు. ఆంతర్యములో రాజ్యకాంక్షి రక్తపిపాసి. విప్లవవాది" అను సుయోధనునితో, "తన అర్థరాజ్యానికి... "సుయోధనుడు

అర్థరాజ్యము... అర్హత" అన్నాడు సుయోధనుడు; "పాండు సంతతి" అనగా! కాదు మునీంద్రా! కుంతీసంతతి. అగుగాక కురురాజ్యమవిభాజ్యమని యెరుగరా తమరు? అగ్రజుడే రాజ్య పాలకుడని తెలియదా తమకు? కనిష్ఠులకు రాజ్యార్హతలేదని తమకు తెలుసునుకదా? యెన్నడూ లేని న్యాయం యీనాడు వచ్చిందేమి? కౌరవ పాండవుల కొరకీనాడు భరతసామ్రాజ్యము రెండు ముక్కలుకావాలి; కౌరవరాజ్యము తిరిగి నూరుప్రక్కలుకావాలి; ఇదిసంభవమా? సామ్రాజ్యాన్ని ఖండఖండాలుగా చీల్చివేయుట మీయభిమతమా?" అన; వ్యాసులువారు "పాండురాజభివృద్ధి చేసినదేకదా?" అనగా; యేమీ! ధృతరాష్ట్రునకు ప్రతినిధిగా రాజ్యమేలినంతమాత్రాన, అన్నకొరకు యుద్ధములో పాల్గొన్నంతమాత్రాన అర్ధరాజ్యాధిపత్యమా? ఇదేటి న్యాయము? భీమార్జునులార్జించిన విజయాలు ధర్మరాజువికావా? దుస్ససేనాది విజయాలు నావికావా?" అన్నాడు సుయోధనుడు. 'ఇకపాండుసంతతి అనిపించుకొనుచున్న యీ వీరపంచకము నీడలేక అల్లాడవలసిందేనా?";

సుయోధనుడు "రారాజునకది యప్రతిష్ఠకాదా? ఏలాగైనావారు పాండురాజ నామాన్ని పితృపదములో కలుపుకొని యున్నారుకదా? వారు నా బంధువులే! వారికేకొరతాయుండదు. నూటనల్వురు సోదరులకును నూటనాల్గు మణిమయ భర్మసౌధాలు; అఖండ దివ్యవైభవము, అగణితధనసంపత్తి;" అనగా; "కుమారా! పౌరుషశాలియైన క్షత్రియుడు ఒకరి యేలుబడిక్రింద మనువృత్తి నాశిస్తాడా?" అని వ్యాసులవారనగా; "యీనియమము సామ్రాజ్యవిస్తరణానికికాక, సామ్రాజ్య విచ్ఛిన్నానికే దారితీస్తుంది. అదిగాక, స్వతంత్రపదానువర్తులు కాగోరుదురా? అదినాకూఘనతే?; ధర్మరాజాదులేవురే కాదు. దుస్ససేనాదులు తొంబది తొమ్మండుగురును కూడ ధరాచక్రము మీద విరుచుకొనిపడి. నూట నాలుగు ప్రత్యేక రాజ్యాలు నిర్మించుకొనమనండి, నేనుకాదంటానా? నాకూ కీర్తేకదా? అంతటి బల వంతులు యీ రాజ్యాన్ని ముక్కలు చేయనేల?" అన్నాడు.



వ్యాసుల వారు "ఐదుగురకు ఐదూళ్లిమ్మన్నారుకదా? అలా నీవెందుకుచేయవు?" అనగా; "మహాత్మా! యిదేకృష్ణ- యుధిష్ఠిరుల రాజకీయతంత్రము. ఐదుగ్రామాలు పాండవులకు; తొంబది తొమ్మిదిగ్రాములు నా సోదరులకూ, ధారపోయమందురా? తామే స్వయముగా అడుగుచున్నారు. నూరుగ్రామాలూ పాండవులకే ధారపోస్తాను" అనగా; "ముఖప్రీతికి" అన్నారు వ్యాసులు; "కాదు... మనఃపూర్తిగా తమపాదాలుసాక్షిగా" సుయోధనుడు; వ్యాసులు "ఇది నిజమా సుయోధనా? కృష్ణుని రాయబారసమయాన నీవంగీకరిస్తే యీ ప్రళయముండేదా?" వ్యాసులనగా; సుయోధనుడు "కృష్ణరాయబారము! సంధిగావించడానికా! సైన్య సమీకరణమైన తరువాత సంధి బేరాలా? ద్రౌపదీ భీమార్జునులకు రణోత్సాహాన్ని కల్పించి మాటవరుసకు హస్తినకు వచ్చాడు కృష్ణుడు. అంతేకాదు మొదటి నుండి మా నేరాలే అందరికీ చెప్పి, మమ్ము ఉద్రిక్తులచేయడమా



శాంతి దౌత్యము?" అనగా; "ఆకృష్ణుని రాయబారము విఫలమైనా యీ కృష్ణుని రాయబారమేల సఫలముకారాదు?" అనగా; సుయోధనుడు "మహర్షివర్యా! భూసురులకు సహస్రాధిక అగ్రహారాలు దానమిచ్చే యీ రారాజు" అహిచ్ఛత్ర- బాహ్లిక- అంగరాజ్యాలతో ద్రోణ, బాహ్లిక- కర్ణుల సత్కరించే కౌరవ ప్రభుత్వము యీనాడు దాయల కైదూళ్లనీయ నిరాకరించిందనే తామూనమ్ముచున్నారా? ఋషీంద్రా! ఆ అయిదుగ్రామాలనాటకము తమకుతెలియవు, "కుశస్థలి- మాకంది- వారణావతం- హస్తినాపురం- ఇంద్రప్రస్థం" యివి; వీటిలోగల పరమరహస్యం తమరువినండి. "కుశస్థలి" యాదవులగెల్చి కర్ణుడు స్వాధీనముగావించుకున్నది; "మాకంది" మేము ద్రుపదుని జయించి ద్రోణాచార్యులకు గురుదక్షిణగా సమర్పించే "అహిచ్ఛత్రమండలానికి" రాజధాని; "వారణావతం" ఒకప్పుడు పాంచాలుర దునుమాడి, విజయస్మారకముగా భీష్ముడు కైవశముగావించుకొన్నది. ఇక "హస్తినాపురం" కౌరవసామ్రాజ్యానికే కాదు భరతసామ్రాజ్యానికే రాజధాని;

ఇంద్రప్రస్థము పాండవులదే. అయినా ద్యూతములో గెల్చుకున్నాంకదా! ఇప్పుడు తమరే శలవివ్వండి. కృష్ణధృష్టద్యుమ్నుల ప్రోద్బలముతో పాండవులు కోరేవి గ్రామాలా? సంగ్రామాలా? భీష్మ- ద్రోణ- కర్ణులను మా నుండి విడదీయడానికి మాలోమాకు అంతఃకలహాలు రేకేత్తించడానికి పన్నే కుటిలవ్యూహముకాదా?" వ్యాసులు "పోనీలే రాజకీయప్రసక్తి విడిచి, కుటుంబగౌరవం భ్రాతృన్యాయం మన మేల పెంచరాదు?" అనగా; "భ్రాతృత్వమా? అదిసంభవిస్తుందా? లాక్షాగృహములో వారలమేము బంధించామని, మామీద అవినీతి ఆరోపణలు ప్రచారాన్నిచేసి, మా జీవితాలను కళంకితము చేసిన పాండవులతో మాకు కలుస్తుందా? మాతో వారుకూడి ఉండగలరా? వచ్చిన స్వాగతిస్తాము. ప్రత్యుత్థానముతో భీష్మద్రోణుల పజ్జ ధర్మరాజుకు; కర్ణదుశ్శాసనాదుల ప్రక్క భీమాదులకు ఆసనాలు వేయిస్తాను. ఐక్యకంఠముతో యశోగీతిక లాలపింతుము. రమ్మనండి" అన్నాడు సుయోధనుడు. వ్యాసులుమౌనం వహించారు.

సుయోధనుడు- రారు, రాగోరరు. పాండవులకు ప్ర-త్యే-క-రా-జ్య-మేకావాలి. బాహ్లికాదులలాగ భరతవంశమునుండి చీలిపోయి ప్ర-త్యే-క-గోత్రాన్నే ప్రతిష్ఠించాలి. వారి ఆశయమిదే. కౌరవుల పొత్తువారి కక్కర్లేదు. కౌరవుల సొత్తు మాత్రమేకావాలి. మహాత్మా! యశోఽవా; మృత్యోఽవా! నాకు శలవియ్యండి నమస్కరించి వెళ్లాడు సుయోధనుడు. వ్యాసులు నిట్టూర్పుతో అభిమాని- గర్వి- సుయోధనా!

**ఏలినాడవు భూమి, నేక చక్రముగ రా**
**రాజు నామంబు సార్థకముగాగ;**
**పాలించినాడవు ప్రజల తండ్రియవోలె**
**భారతాన్వయ యశోవర్ధనముగ;**

అణచినాడవు శత్రుగణముల నేత్రాంత
రక్తరేఖలె శస్త్రరాజిగాగ;
తనిపితివీప్సితార్థంబుల నఖిలార్థి
జనముల కల్పభూజమవుగాగ;
శిష్ట రక్షణమును, దుష్ట శిక్షణమ్ము
సలిపినాడవు; వేల్పులు సంత సింప"
జన్నము లొనర్చినాడ; వీవన్నియెడల
సుకృతివే; దుష్కృతివి పాండుసుతుల యెడల"

వ్యాసులువారు పోవును.

## గీతోపదేశం

యుద్ధభూమిలో రెండుసేనల మధ్యప్రదేశము కృష్ణార్జునులు వచ్చి కృష్ణుడు మునికోల త్రిప్పుచు "మేఘము గొప్ప పర్వతముపై తిరగ్గా దానిలోనుంచి వచ్చే మలక మెఱుపులాగ విరోధుల పికపకచేసి, భూమీ, ఆకాశాన్నంటకుండా పరువులెత్తుతుంది మనరథము. ఒడుపులు బాగా తెలిసికొని కాచుకోవోయిబావ" అన్నాడు కృష్ణుడు. అర్జునుడు నవ్వి "పదునాల్గు లోకాలనూ బంతుల్లా త్రిప్పగలవు నీ చిటికెనవేలితో; నీవు యీ అర్జునుని రథాన్ని త్రిప్పడంగొప్పా మాధవా?" అన్నాడు అర్జునుడు. కృష్ణుడు "అర్జునా! మనరథమిప్పుడు ఉభయసేనల మధ్యలో నిలిచింది. అదిగో! కౌరవసేనావాహిని చూశావా? ఉత్తుంగ తరంగాభీల ప్రళయ జలనిధిలా "పంచనద- కురుజాంగల- రోహితకారణ్య- గంగాకూలాల్లో యెలావ్యూహాలు తీర్చి ఉన్నాయెా; భీష్మ- ద్రోణాది పురాణ వీరుల్నిచూడు. సమరోత్సాహంతో నవయౌవనుల్లాగ కేరింతలాడుచున్నారు. ముందుగా నీవెవరితో సమర ప్రారంభంగావించాలో నిశ్చయించుకో! కానీ నీ ప్ర-త్య-క్ష-వి-రో-ధి కర్ణుడు" అనగా; "బావా! రణభూమినుండి తిరోహితుడైనట్లున్నాడు. యిపుడు మొట్టమొదటిగా యెవరిపై బాణప్రయోగం చేయాలో ఆలోచించుకుంటాను" అన్నాడు అర్జునుడు.

ఇక్కడ సామాన్యంగా అందరకూ తెలియని పరమరహస్య మొకటుంది. రామాయణం- సుందరకాండ- 27వసర్గలో హనుమ సీతమ్మ వారున్న వృక్షపు కొమ్మపై నుండి యోగవేదాంత మంత్ర శాస్త్రములన్నీ సంపూర్ణముగా సాధించిన వృద్ధురాలే కాక ప్రబుద్ధురాలైన "త్రిజట" అనే రాక్షసిపై ఆవేశించి హనుమ ఆమె చేత సీతారామలక్ష్మణులు నాలుగుయామాల్లో యెలావచ్చారో లంకకు రాబోయే విపత్తులు సర్వమూ ఆమెచేత పలికించాడు. అలాగే మహా వీరసింహుడైన అర్జునుడొక్కడే ఉత్తర గోగ్రహణము సమయాన భీష్మద్రోణాది మహా యోధుల నందర నెదిర్చిగెల్చాడు. యిప్పుడిక్కడ అర్జునుని జెండాపై ఉన్నాడు. హనుమద్బ్రహ్మ అవడం వల్ల రా బోవున దంతా అర్జునుని వాక్కులతో పలికించాడు. యిక కథా భాగాన్నివినండి. అర్జునుడు "ఆతడు పెద్దతాత, అదిగో! అతడే గురువు, ఆతడు



తమ్ముడు, ఆతడు ముత్తాత, ఆతడు సోదరుడు, ఆతడు బావ, ఆతడు మేనమామ, ఆతడు కుమారుడు, ఆతడాప్తుడు, యిందులో నాకు కానరాలేదు. బావా! నన్నుచూడనీ, యీ యుద్ధభూమంతా బంధువులచేత నిండి ఉంది. అని అర్జునుడనగా; కృష్ణుడు "యేమోయ్ బావా! యుద్ధవీరులను జూచి వారందరినీ బంధువులుగా పరిచయం చేసికొనుచున్నావు? యిది వివాహరంగంకాదు, యుద్ధరంగం" అనగా; అర్జునుడు

"బావా! నాకువిరోధు లెవ్వరూ కాన్పింపరేమి?" అనగా; కృష్ణుడు "అర్జునా! నీకనులకు రాగతుషారముక్రమ్మింది. తేరి చూడు మోయి" అన్నాడు; అర్జునుడు "పరిహాసమా బావా? విను మనుమలమని యెత్తికొని ముద్దులాడిన గంగానందనుని యెడదలో కరకుటమ్ములు వేయనా? తన విద్యమర్మమంతా చెప్పిన ద్రోణాచార్యుల కుత్తుకు నా కత్తితో కోయడం? ముత్తాత మాకులపెద్ద ముదుసళ్లలో ముదుసలి బాహ్లికుని శరీరములో బాణాలు వేయాలా? తండ్రిలేని పిల్లలమైన మమ్ము పెంచిన పెద తల్లి గాంధారీ దేవి కడుపులో కార్చిచ్చు పెట్టాలా? స్వజనాలు, బంధుజనులు, వీరందరను నా స్వార్థసుఖాలకు బలిచెయ్యడమెలాగ? యిలాంటి నెత్తురు కూటిని ఆశించడము కంటే అడవిలో గడ్డి తినడము మంచిది కదా బావా?. "ఓహో! నీకు కాంతారవాసన పోలేదను కుంటాను. అర్జునా! యేమిబంధువులయ్యా బంగారములాంటివారు;

లక్కమేడలో కాపురము పెట్టి నడిరేయి మీరందరనూ చంపాలని నిప్పుపెట్టినవాడు, మాయ ద్యూతాన మీ సామ్రాజ్యమంతాహరించి, అతి దైన్యముగా కానలకంపించువాడు, పడతిని సిగపట్టినడి రచ్చకీడ్చి, భయము లేక కోకలను ఊడ బెరికినవాడు; ఐదూళ్లు చాలని వేడు కున్న కొలది యుద్ధానికే జెబ్బ చరుచువాడు, కొడుకు దుండగాలన్నింటికీ ఊకొట్టిన గ్రుడ్డివాడు; కన్నులున్న గ్రుడ్డివాడు; భళిర! కత్తులు రాపాడువేళలో నేడు నీకు బంధు లయ్యారాబావా? యేమి బంధువులయ్యా?" అన్నాడు కృష్ణుడు. "బావా! వారి దుర్మార్గ ఫలాన్ని వారే అనుభవిస్తారు. గతము మరచుట ఉత్తమము. ఐన బావా! మారణాస్త్ర ప్రయోగముగాక అన్యసాధనమేలేదా? అనగా కృష్ణుడు"లేదు. సామ-దాన-భేదాలకు తరువాత దండనమే. మారణమే వైరానికి పరమావధి.అమృతానికి ముందు హాలా హలము పుట్టినట్లు, శాంతికి ముందు, కల్యాణానికి ముందు భీషణ సంఘర్షణం, ఉద్వేల రక్తపాతం. ప్రపంచకల్లోలము. అర్జునా! జగత్పితకు కూడా ఆయుధ ధారణ మావశ్యకమే. వ్యర్థవాగ్వాదము, వృథా కాలహరణము. అప్పుడర్జునుడు "బంధువధయే వీరత్వమైతే, అట్టివీరత్వాన్ని నేను తృణీకరిస్తాను. బావా! నన్నేల ప్రోత్సహిస్తావు?" అన్నాడు అర్జునుడు; కృష్ణుడు "ఏమీ? నిన్నెవ్వరు ప్రోత్సహించారోయీ? నీకు నీవేకయ్యానికి కాలుదువ్వావు. కౌరవులు నీకేనా ఆప్తబంధువులు? నాకుమాత్రంకారా? నేను స్వయముగా సుయోధనునితో వియ్యమందాను. బాల్యస్నేహాన్ని తలచుకొని నీకు సూతకృత్యమొనర్చినందులకా యీ నిష్ఠురము? మధ్యనా కెందుకీ అపవాదం?

బంధునాశనానికి నేనెందుకు? రథికోత్తమా? నీ చుట్టాలను నువ్వు చక్కగా చూసుకుంటావో! కానకేగి కసవే మేస్తావో! నాకెందుకు? ధర్మరాజు మొదటినుండి యుద్ధము వద్దని మొత్తుకొనుచున్నాడు. మీ భీమన్నా నువ్వు "రణము రణ"మని పలవరిస్తూ, పదిరెండేండ్లనుండి కత్తులు నూరుతునే ఉన్నారు. యికచాలు. నీకత్తిని ఒరలో భద్రముగా ఉంచు. మరచాను. గడ్డికోసుకోడానికి కావాలికదా? రథాన్ని మరలించాలా? కొరడాతో చెల్ చెల్ అంటారు. అర్జునుడు రథమునుండి క్రిందికిదిగి "బావా! నీవేమన్నా నేను యుద్ధముచేయలేను. నాకన్నుల నుండి జలజలమని నీరు క్రమ్ముతుంది. పౌరుషము పోయింది. నా హృదయం వికలమైంది. నేను నేడు నిరర్థకుడనె? నిస్తేజుడనె! నిర్వీర్యుడనె! మహాత్మా?" అని అర్జునుడు గాండీవాన్ని పారవేశాడు.

అప్పుడు కృష్ణుడు "పార్థా! యేమిది? నీవిపుడస్త్ర సన్యాసాన్నిగావించినా యీమహాసమరం విరమింపబడదు. యుధిష్ఠిరుడు దీక్షితుడైయున్నాడు. బద్ధకంకణుడై స్వరాజ్యమో! స్వారాజ్యాన్నో సాధింపగా ఉన్నాడు. సాత్యకీ ధృష్టద్యుమ్నాది యోధులు యథోచిత సహాయాన్నిగావించ డానికే కటిబద్ధులై యున్నారు. యిట్టిక్లిష్ట సమయమున నీవొక్కడవే యిలా తయారయ్యావు. నీవులోకములో పేరందావు. అంతేకాని నీవు లేకున్నా మాకులోటులేదు. నీ కుమారు డభిమన్యుడు తీరుస్తాడు; లే! అభిమన్యుని యీరథముపై నిలిపి నేనే సారథ్యముచేసి, కర్ణుని వధింపచేస్తాను. అంతేకాదు. ధృష్టద్యుమ్నుడు శిఖండీపుట్టారులే, వారిరువురూ భీష్మద్రోణాదులను వధిస్తారు. నీవూ నేనులేకున్న, దుర్యోధన, దుశ్శాసనుల చంపితీరుతారు. అప్పుడు భీముడు మహారాజై పాలిస్తాడు. నీవూ ధర్మరాజూ కలిసికానల్లో కసవు మేయడానికి వెళ్లండి." అన్నాడు కృష్ణుడు

అర్జునుడు "పోతాను. నేనే యీ పాతకాన్నొడి గట్టుకోలేను. అందులో ధర్మక్షేత్రమైన యీ కురుక్షేత్రములో చీ! చీ! కురువంశనాశకుడనై కురువంశీయుల రక్తము యేరులుగా ప్రవహింపచేయాలా? వద్దు. మూడులోకాల రాజ్యాధికారమైనా నాకువద్దు" అనగా; "అర్జునా! నీ నిస్పృహ చూస్తుంటే కోపముకాదు నవ్వు కూడా వస్తుంది. ప్రశాంతిగా ఉండు. నీ సంశయము పోయిన తరువాతే ముందడుగువేద్దాం. నీమనస్సు శాంతించి "సర్వమూ జరుగ వలసింది, జరుగుతుంది" అనుకొనడానికి ఉపనిషత్సారాన్ని సంక్షిప్తగా నీకు వివరిస్తాను. శ్రద్ధతోవిను. ఉభయసైన్యాలు తలపడ్డానికి సిద్ధముగా ఉన్నాయి. వ్యవధి యల్పము, విషయమా అనల్పము. ఆత్మనాశనములేనిది. నిత్యమైంది. దాన్ని ఆయుధాలు ఛేదించలేవు. అగ్నిదహింపలేదు. అందువలన లే అర్జునా? యీ యుద్ధ భూమి సుక్షత్రియ అదృష్టవంతునికి స్వర్గ ద్వారము. యితరులకు యిదిలభింపదు సుమ్మా!" అన్నాడు మరల

కర్మసన్యాసం పనిలేనివారికి- నిరర్థకులకు, సోమరులకు సన్యాసం ఒక ఊతపదమైంది. కర్మలేకుండా సన్యాసమెలాగ? కర్మలను విడిచిపెట్టడం యెవరికీ



సాధ్యంకాదు. ఒక్కక్షణముకూడా సన్యాసిక్కూడా కర్మలేకుండా జరగదు. ప్రాణికి గాలిపీల్చి, మరల విడుచుట వంటిది. కర్మ సహజము. దాన్ని విడిచి పెడతాననడం వెఱ్ఱితనం. వంచనకూడాఔతుంది. ఫలమాశించకుండా యీశ్వరునిపై సర్వభారముంచి స్వధర్మాన్ని నిర్వహించాలి. అటు వంటి వాడే నిజమైన యోగి. భక్తితో నున్న కర్మయోగం యెంతోఫలప్రదం. పార్థా! నీవుక్షత్రియుడవు. క్షాత్ర ధర్మప్రకారంగా నీవు నిమిత్తమాత్రమే! అంతానేనే నిర్వహిస్తాను" అనగా అర్జునుడు "నా అవజ్ఞతను మన్నింపు. పురుషోత్తమా? నీ... వు... శ్రీకృష్ణుడు విశ్వరూపాన్ని చూపించాడు. అర్జునుడు

**దండకము**

అహో! సహస్రాధికాదిత్య పూర్ణ ప్రభోద్గ్రాహమై- యక్షరంబై-పృధివ్యాంతరిక్షం బులన్ నిండెదేవా! భవద్విశ్వరూపంబహో! అందుదర్శింతు బ్రహ్మాదినీశున్ మహేంద్రాది బృందారకశ్రేణి దివ్యర్షి బృందంబులన్-జంగమ స్థావరానేక భూతప్రకాండం బులన్- దేవ! పశ్యామి- పశ్యామి- ఉద్యద్గదా చక్ర కోటీరకేయూర- హారప్రకర్షంబు కిమ్మీర నవ్యప్రభా భాసురం; ఆది మధ్యాంత శూన్యంబు- విశ్వాంతర వ్యాప్త సంవర్త వక్త్రాక్షి బాహూదరాభీల సందోహ సంయుక్త మత్యద్భుతంబైన యుష్మత్- స్వరూపమ్మహో! దేవ- గంధర్వ- యక్షోరగుల్- దైత్య- సిద్ధర్షి సంఘంబులున్ విస్మయావేశ భీతాత్ములై స్తోత్రముల్ చేయుచున్నారు. దేవా! కరాళోగ్రదంష్ట్రాకరం బైనయుష్మత్ప్రవృత్తాన నంబందు దుర్యోధనాధుల్ మహావీరసైన్యంబులున్ నిర్ఘరీవేగ సమ్మర్దులై జొచ్చుచున్నారు దేవా! నమస్తే నమస్తే నమః- బొత్సకవి. కృష్ణుడు మామూలుగా "అర్జునా! అదిగో భీష్ముని శంఖారవము ఆలింపు. దానిలో నీ పాంచజన్య శబ్దాన్ని శ్రుతిగలిపి, దేవదత్తాన్ని పూరించి బ్రహ్మాండకటాహము బీటలైనట్లు ఒక్క సారిగా ప్రళయని నాదము గావింపుమోయీ! అనగా అర్జునుడు పాంచజన్యాన్ని పూరించాడు. కృష్ణుడు "బీభత్సనామాన్ని సార్థకముగావించుకో!" అనగా అర్జునుడు భీష్మద్రోణుల పాదాలకు రెండేసి బాణాలు వేసి వందనలర్పించాడు.

ద్రౌపది ఉద్రిక్తతో వచ్చియుద్ధవార్తలు యేరోజుజరిగినవి ఆరోజువచ్చి చెప్పినవానిని జూచి " ఒక్కడూ లేడా? పాండవసైన్యమింత దుర్బలమైందా? పాండవ మధ్యముని జగదేకవీరుడంటారే? ఒక్క చీకు ముసలిని వయస్సేమో తెలీని బడుగును. కడ తేర్పలేక పోయాడా? అర్జునుని నిశితాతి నిశితాలైన ఆతని ఆయుధాలు పనికిరాలేదా? ఆతని ధనుర్విద్యా ప్రాభవమేల? ఇక ఆతని రణ కౌశలమెందుకు? ధిక్కారము! ధిక్కారము! తృణీకారము! భండనభీముడంటారే వృకోదరుని? ఆతని భుజబల దర్పమేమయింది? మాద్రీనందను లేమయ్యారు? అభిమన్యుఘటోత్కచు లేమయ్యారు? నాకుమారులు ప్రతివింద్యాదులు? ద్రౌపదీ గర్భానపుట్టి యింతనిర్వీర్యు లయ్యారేమి? అనగా; "పురుషపుంగవులకే అల వికానిది పాపమా కిశోరులకు సాధ్యమా?" అన్నాడు వార్తాహరుడు.

ద్రౌపది తీక్ష్ణతతో! "అన్నా! ధృష్టద్యుమ్నా! పాండవసేనాని వైనందులకు నీవూ నిస్తేజుడ వయ్యావా? యిదేనా నీరణ నిర్వహణ బాధ్యత? శిఖండిలేడో! ఉత్తమౌజ- యుధామన్యు- ధృష్టవర్మలేమయ్యారు?

**"వారమునుండియున్ రుధిరవాహిని పొంగులువారుచుండెనౌ**
**రా! రణభూమి; పాండవుల రాణువకూలిన దూచకోతగా;**
**పోరెదనేనె ఖడ్గమును బూనెద వీరులు లేరె లేరటో"**
**వీరులు లేరటో! ముసలి భీష్మని జంపగలారు? బాపురే!**

అని ద్రౌపది యుద్ధభూమికి పోబోవ ధర్మరాజు ఆమెకు అడ్డముగావచ్చి" నిలువు ద్రుపదరాజపుత్రీ! ఎక్కడికి?; ద్రౌపది "అక్కడికే" ఎచటకు యాజ్ఞసేనీ?" అనగా ధర్మరాజు; "ఎక్కడ పాండవ బలాలు కుప్పలుగా కూలుచున్నాయో అచ్చటికి" అన్నదిద్రౌపది; ధర్మరాజు "ఎందుకు?" "అందుకే?" ద్రౌపది; ధర్మరాజు "పాంచాలీ! రణభూమికి మహారాణి?" అనగా; "మహారాణినౌట చేతనే భీష్మని లలాట రేఖల్లో కృపాణాగ్రాన నేడు మృత్యుశాసనాన్ని లిఖింపనుంది" అనగా; ధర్మరాజు "రంగభూమికాదు; సంగరరంగము వెనుకకు మరలు" ధర్మరాజు అనగా; "నేనునర్తకుని యిల్లాలను అందువలన సంగరభూమి రంగభూమి గా కానుపించింది; అంతేకాదు ద్యూత-త-రం-గ-ము-గ..." అనగా; ధర్మరాజు కోపముతో "ధూర్తురాలా? యేమి నీప్రవర్తన? నీ విచట ఉండరాదు. గుడారానికి వెళదాము పదదేవీ!" ద్రౌపది "నాకు అడ్డులేవండి? నేను భీష్మని యెదిరింపబోవుచున్నాను. ఆతడు మరణిస్తేనేగాని మరలను" అనగా ధర్మరాజు "వీరులగు నీ మగల కెంతమచ్చ? యీ అప్రతిష్ఠ నీది కాదా మానినీ?" అన్నాడు ధర్మరాజు; ద్రౌపది "ఔనులే! తమకిదిక్రొత్త కాదుకదా! సరిగా పిడుగులు రాలు సమయమున శాంతచ్ఛత్రమున తయారగుటయే తమకు పరిపాటి. యింతలో ధృష్టద్యుమ్నుడు వచ్చి నీభర్తలు నీ చేష్టలకు ఊరుకున్నా నేనూరుకోను. నీ సోదరులు నిర్ధీకులైనప్పుడు గద నీవు స్వయముగా ఖడ్గధారివవాలి. అట్టిస్థితి యింకా కలుగలేదు. కలగదుకూడా! సేనాని అనుజ్ఞపొందకుండా సమరభూమికి వస్తావా? యెంతప్రమాదం? ధర్మరాజు దగ్గరతలవంచి, మహారాజా! తమకొరకే నేనువచ్చాను. విందాను విందులు సాత్యకిని దిగ్బంధనముగావించారు. తాముతొందరగా వారినెదిరింతురు గాక! నాకు తెలుపకుండా తాము విచ్చలవిడిగా తిరుగకుందురుగాక! తమ అంగ రక్షణకు నేననుక్షణం అప్రమత్తుడనై ఉంటాను. ధర్మరాజు యేగేడు.

ధృష్టద్యుమ్నుడు "సోదరీ! భీష్మపతనానికి మనశిఖండి ఉన్నాడుకదా! శిఖండివిషయం ధుర్యోధనునకు తెలియును. అందువల్లనే తానే స్వయముగా భీష్మనికంగరక్షగా దుస్ససేనుని నియమించాడు. ద్రోణుడు వేయికళ్లతో శిఖండి కొరకు చూస్తున్నారు. శిఖండి రణభూమికి వచ్చినంతనే అశ్వత్థామ యెదుర్కొను చున్నాడు. ద్రోణుని యెదుర్కొను నన్ను దుస్ససేనుడు అడ్డువస్తున్నాడు. దుశ్శాసనుని



భీముడడ్డుచున్నాడు;. భీముని సుయోధనుడే వారిస్తున్నాడు" యిలా చెప్పగా విని ద్రౌపది "అన్నయ్యా! యి అందరూ శిఖండికై పెనుగులాడుచుండ ఒక ప్రక్కనుండి మెరపులాగ వెళ్లి నేనే భీష్మని యెదుట నిలబడడం తేలికే కదా?"అనగా! "కాకేమి" అన్నది. ద్రౌపది "మెఱపుయుద్ధమున నా ప్రావీణ్యము తెలుసుగదా?" అన్నది. ధృష్టద్యుమ్నుడు "తెలుసు నీ పతులందుల కొప్పుకోరుగదా? అలోచిస్తే ఆవిషయం మా అందరికీ తీరనిమచ్చ" అన్నాడు

ద్రౌపది "అలాగైన ఆభీష్మహతకుడు చావడానికి ఉపాయమేలేదా?" "లేకేమి? నీవేచెప్పావుకదా? ద్రౌపది ఆనందమందింది. నేనే వైరులచీల్చుకుపోయి భీష్మనెదుర్చుట"... ... అనగా; ధృష్టద్యుమ్నుడు "అవును. కాని యీరూపుతోకాదు, ద్రౌపదివైకాదు" "మరి" ధృష్టద్యుమ్నుడు "శిఖండివై, శిఖండిరూపాన నువ్వు భీష్మని యెదుర్కొనాలి అనగా "నిజమా?" అనగా; ధృష్టద్యుమ్నుడు "సోదరీ! ఇది నా ఆదేశమేకాదు, శ్రీకృష్ణపరమాత్మ అభిమతము కూడ, ముమ్మూర్తులానీవు శిఖండినే పోలి ఉంటావు. అందువలన యీరహస్యము యెవరికీ తెలీదు. పాండవులకీవిషయం యెంతమాత్రమూ తెలియరాదు. శిఖండిరూపాన దుర్యోధనాధులనాకర్షించి దూరముగా గొంపోయి తుముల యుద్ధము చేయాలి. నేనును నీకు కవచముగా నిన్ననుసరించి ఉంటాను. అలాంటి సమయాన ఒక్కడే అర్జునుని యెదుర్కొనే భీష్మని శిఖండి భూపతనముచేయగలడు. ఒకవేళ శిఖండినే వైరులందరూ చుట్టుముడితే నీవే భీష్మని చంపుతావు. యేలాగైనా నీ కోరిక తీరుతుందికదా!" అనగా, ద్రౌపది "నీ ఊహ సరియైనదేకదా? వేషము సవరించు అన్నాడు. యిలా ధృష్టద్యుమ్న ద్రౌపదులు కూడబలుక్కొని భీష్మని పతనానికి కారకులయ్యారు.

సుయోధనుడు విచారంతో "ఇదివీరత్వమా? యిదేయుద్ధ ధర్మమా? కుతంత్రమా శౌర్యప్రదర్శనమా? ఛీ! అర్జునా! ధానుష్కశిరోమణి యొనర్చు ధర్మయుద్ధమా? యిదిమాధవుని నియంతృత్వము. పూజ్యాతి పూజనీయుడగు వృద్ధపురుషకంఠీరవుని యెడల యిలాంటి నికృష్టచేష్ట? ధర్మజా! యేమిధర్మ ప్రదర్శన? కార్యనిర్వహణమే నీయాశయమా? వీరోచిత రణనీతి విడిచి యిలా చేయుటా? స్వార్థలాభానికి నీవంశమూలాన్నే నీవే విచ్ఛేదమొనర్చుటా?" అనుకొనుచుండగా కర్ణుడు వచ్చాడు "మిత్రమా! "అభివందనము" అనగా; "అంగరాజా! "ప్రత్యభివందనము" అన్నాడు సుయోధనుడు; నీ దగ్గరకు "దుశ్శాసనుని యిప్పుడేపంపాను. నీయాగమనానికి యెదురు చూస్తున్నా" నిట; "రారాజా! మీకునాపై గలప్రేమానురాగాలట్టివి. మీరు ఆజ్ఞాపించండి. మీపాదాల దగ్గర యీ కర్ణుడు వ్రాల్తాడు. యీ భృత్యుడు..." అనేసరికి, "అంగరాజా! చాలింపు. ఒకమహావీరవతంసుడు భృత్యుడా? యెన్నటికీ కాడు. కాగూడదు" అన్నాడు.

యిరువురూ కౌగిలించుకొని పరమానందమందారు. "మిత్రమా! భారతాకాశాన్నుండి ఒక ఉజ్వల వీరతారకారాజ మంతర్హితమయింది.

కురువంశజ్యోతి యికలేదుకదా?" అనగా; " ఆ కలంక శౌర్యరశ్మియే మనకు మార్గదర్శకుడగుగాక!" అనగా; కానిమ్ముపితా మహుని కొరకు కంటతడిపెట్టడం ఆతని అమరజీవితానికే కళంకితం. అర్జునుడే రణనీతి అతిక్రమించాడు. సరే! పాండవులకు శ్రీకృష్ణుడులాగ కౌరవసేనా నివహానికి కర్ణధారిలేక శాసకుడులేక అలమటింప కౌరవులకు పరమాప్తుడవు నీవే కర్ణ ధారిని అవాలి" అన్నాడు సుయోధనుడు. "నీవుసైన్యాధ్యక్షుడవవాలి. సమగ్ర కౌరవసేనను శాసించాలి" అన్నాడు దుర్యోధనుడు.

అనగా, మిత్రమా! క్షమించండి, నాకూ నీకేకాక ఆసేతు శీతాచల మధ్యగల విశాల భూభాగాన ఆయుథధారణంచేయ జాలిన పురుషజాతికంతకూ యేకైకమాన నీయుడు ద్రోణాచార్యుడే మనసర్వసేనా నాయకుడు." అనగా దుర్యోధనుడు "మి-త్ర-మా? సంతోషము అలాగే గురుదేవునే అర్థిస్తాను. యిరువురూ వెళ్లను. తరువాత రథా రూఢులైన కృష్ణార్జునులు లో అర్జునుడు "యదుసింహా! యీరోజుతో త్రిగర్తులయుద్ధము తీరి పోయింది. అబ్బా! వారి శక్తి యుక్తులెంత భీతావహాలయ్యాయి?" అనగా; "అర్జునా! వారిరణచాతుర్యమేదీనీ దగ్గర పనిచేయలేదు. భీష్మాదులు నిహతులయ్యారు; సంశప్తకులు చచ్చారు. జయలక్ష్మికడకంటి చూపు నీపై ప్రసరించిందోయీ" అనగా; "బావా! భీ-ష్మ-డు మొన్నటి నుండి నాకళ్లముందే నర్తించుచున్నాడు. నా మనస్సు వ్రీలిపోతుంది. సిగ్గుతో నాశిరము క్రుంగి పోతుంది" అనగా కృష్ణుడు పకపకమనినవ్వాడు. "అర్జునా! యెంతటి వాడవయ్యా! అసలు శిఖండి యెందుకు జనించాడంటావు? భీష్మని వధించడానికే. దైవనిర్ణయాన్ని నీవు తప్పింపగలవా? తుముల యుద్ధములో న్యాయాన్యాయ విచారణచేయడం చాలా కష్టం. మనకు కావలసిందల్లా భీష్మపతనమేకదా!

నీవేకదా చూశావు. ఆపదిరోజులు రణవ్యాపార మెలాగస్తంభించి పోయిందో! యింకా భీష్మునిగురించి పరితపిస్తావెందుకు? యీ రాబోవు మార్గశిరశుద్ధ యేకాదశి వరకూ ఆతడు ప్రాణాలు విడువడు యోగసమాధిస్థుడై యుంటాడు. యుద్ధానంతరము వారిని దర్శిద్దాము యిక ద్రోణాచార్యులు కౌరవసేనాధ్యక్షుడై యున్నాడు. యుద్ధదేవత రణరంగాన వికృతాట్టహాసం చేస్తుంది. కొంచమునడిచి అదిగో! నీ అస్త్రగురుని ఆహవచమత్కారం? సంశప్తకులను మనమీదకు పంపి మనలను దూరముగా గొనిపోయి ఆ అదునుచూసి పద్మవ్యూహాన్ని పన్నాడు. తప్పక ధర్మనందనుని పట్టుకొనడానికే" అన్నాడు కృష్ణుడు. "బావా! అదిగో! ఆశబ్దాన్నివిందాము "తండ్రితలదన్నిన యుద్దండబాలుడు. మనందరిపాలిటా కాలుడయ్యాడు మీరెవ్వరూ భయపడకండి. పద్మవ్యూహములోనే ఆతడు కూలిపోయాడు" అనుదాన్నివిన్న అర్జునుడు "బావా! నాకుతప్ప పద్మవ్యూహాన్ని చొరగల వారెవరున్నారు?



నాహృదయమంతా యెవరో! కలచివేస్తున్నట్లున్నారు. ఇంతకూ ఆకూలిన బాలుడెవరు?" అని అర్జునుడనగా; "అర్జునా! ఊహింపలేవా? తండ్రితల దన్నగలబాలుడు, తమ్మి మొగ్గరాన్ని చీల్చగలవాడు సింహ కిశోరము నీకూ, నాకూ యెంతో ప్రేమ పాత్రుడు, నా సోదరికడుపు పంట, గద్గదస్వరంతో నీ వంశాంకురమోయి!" అనగా అర్జునుడు నేలకూలబడి "నా అభిమన్యుకుమారుడే చనిపోయాడా? అయ్యో. అనికంట తడిపెట్టిన అర్జునుని కృష్ణుడులేవనెత్తి "బావా! వీరుడు యుద్ధభూమిలో కంట తడి పెట్టరాదు. అందులో పితృఋణాన్ని తీర్చికొని ధన్యుడయ్యాడు. స్వర్గమలంకరించాడు. నీవు పరితపింపరాదు; యీ దేహానికి బాల్య-యౌవన- వార్ధకమెంత సహజమో, మరణమూ అలాగే స్వాభావికమే! స్థితప్రజ్ఞుడవవు అవు" అనుకృష్ణుని వాక్యానుసారం రెట్టింపు ఉత్సాహంతోలేచాడు అర్జునుడు. "కృష్ణ! యీరోజు సూర్యాస్తమయానికి అందునా పుత్రహంతను అంతంచేస్తా"నని అర్జునుడు ప్రతిజ్ఞచేశాడు.

అలా ఉండగా అశ్వత్థామ మహాకోపముతో వచ్చాడు. దుష్టా! ధృష్టద్యుమ్నా! శోకముతో అస్త్రశస్త్రాలన్నీ జారవిడిచి నిశ్చల యోగసమాధిలో ఊర్ధ్వగత ప్రాణుడైయుండే సంయమికుత్తుకనా కత్తిరిస్తావు? భరింపలేను! భరింపలేను! నాతండ్రిమరణానికి ప్రతీకారముచేయక, ప్రతిహింసచేయక ఊరకుంటానా? ఓరీ పాంచాలా? నా ప్రతిన విన్నావా? ఒక్కద్రోణునకు నీరాజనానికి మీపాంచాలజాతినంతా నంతంచేసి నెత్తురు నదులు పారిస్తాను" అని ద్రోణాచార్యులను తలచికొని, తండ్రీ దిగంతాలకు వ్యాపింపచేయు నీధనుర్విద్యాగురుత్వమే నీ అంతానికి కారణమయింది. నీ కుమారుడు అశ్వత్థామచిరంజీవి అని నీకు తెలియునుకదా? నీకుమారుడు చనిపోయాడని యెవడో అన్నంతమాత్రాన ప్రాయోపవేశముగావించావా? ఆ... ఆ అజాతశత్రువు పలుకునిజమనుకున్నావు. ఒకగొప్ప సత్యాన్ని, చిన్న అసత్యంతో గెలిచెనా పాండవాధముడు. దుర్మార్గుడా! యీ విధముగా గురు ఋణము తీర్చికున్నావురా! యిదిగో! కాచికొమ్మని. ఆకర్ణాంతంలాగి నారాయణాస్త్రాన్ని విడుచును. యిదంతా చూస్తున్న శ్రీకృష్ణుడు "ఓ పాండవ వీరులారా! మీరందరూ

ఆయుధాలు నేల పడేసి నారాయణాస్త్రానికి నమస్కారాలందించండి" అని అనగా అందరూ అలాగే చేశారు. ధృష్టద్యుమ్నుడు వచ్చాడు నా తండ్రిని, నాపిన తండ్రులను. నా పుత్రులను చంపిన పాంచాల శత్రువునుచంపేను. అర్జునా! నా పాంచాల విరోధిని హతమార్చాను. నాకు ద్రోణునితో వంశానుగత విరోధముంది. అదిమరచి గురుహత్యగావించానంటావా? యిది యుద్ధభూమి, అనవసరంగా నన్ను దూషించకు. నామేనల్లుర కొరకు మీతో భుజాలుకలిపాను. అందుకా నీవు యీ విధముగ సత్కారముగావించావు. ద్రోణుడు ప్రత్యేకము పాంచాలవిరోధి. యీధృష్టద్యుమ్నుడు పాంచాలరాజు. ఆతడు కౌరవసేనాని- యీతడు పాండవ

చమూపతి. ద్రోణుని వంశనాశనము గావించడానికే ఆతడీ యుద్ధములో పాల్గొన్నాడు. ఆతనికుత్తుక కోయడానికే యీతడు జన్మించాడు. ఈ అయిదుదినాలు ప్రత్యేకము పాంచాలుర నేరి వేటాడ్డము నువ్వెరంగుదువుకదా?

నావిరోధిని నేనంతంచేస్తే మధ్య నీకీ దురాగ్రహమెందుకు? అందులో సైన్యాధ్యక్షుడనైన నన్ను విమర్శించడానికి నీకు హక్కేలేదు. యిదిగో! నీవన్న మాటలకు సైన్యాధిపత్యాన్ని విడిచి వెళుతున్నాను. నీసేనల నీవే నడుపుకో! ఒక్కవిషయం మాత్రం జ్ఞాపకముంచుకో!" అనిధృష్టద్యుమ్నుడు వెళ్లబోవగా, భీముడడ్డువచ్చి "ఒకక్షణం ఆగు. నామాటవిను" అన్నాడు.

**ఇది మహాభారతములో భీష్మపర్వం ముగిసింది**





# సంపూర్ణ మహాభారతం
## ద్రోణ పర్వము



"సంజయా! మొత్తం పదునెనిమిదిరోజుల యుద్ధంలో చెప్పికోవలసింది ద్రోణాచార్యులు పన్నిన పద్మవ్యూహమంటారు. దానిని చెప్పు"మన్నాడు ధృతరాష్ట్రుడు. యిలా చెప్పాడు. ద్రోణాచార్యులు పద్మవ్యూహం పన్నాడన్న మాట విని ధర్మరాజుకు మతిపోయినంత పనయింది. అర్జునుడొక్కడే ఆతమ్మిమొగ్గరాన్ని ఛేదిస్తాడు. తక్కిన వారి కెవ్వరికీ తెలీదు. అర్జునుడు లేడు. అందుకే యీ వ్యూహాన్ని పన్నాడని అనుకొని యిప్పుడెలాగని" బాధపడసాగాడు. ధర్మరాజు తనసేనతో భీమునెదురుగా నుంచుకొని ద్రోణుడు భయంకరుడుగా కానవస్తున్నాడు. యెవ్వరూదరికే వెళ్లలేక పోతున్నారు. యింతలో సింహకిశోరాకృతితో రథాన్నిదిగి పెదనాన్నగారికి పాదాభివందన చేశాడు.

కుమారా! గురుడెంత మోసంచేశాడో! మీతండ్రీ, మీ మేనమామలు లేని సమయాన మాకెవ్వరికీ తెలీని పద్మవ్యూహాన్ని పన్నాడు. దానిసంగతి అర్జునునికేతెలుసు. మాకెవరికీతెలీదు. అనేసరికి అభిమన్యుడు "పెదనాన్నగారూ! దానిలోనికి వెళ్లడమేకాని తిరిగి రావడం మాత్రం నాకుతెలీదు;. అనగా; "కుమారా! నీవుముందు దానిలోనికి వెళ్లేవరకే తరువాత మేమందరం దాన్ని చీలుస్తాం" అను భీముని వాక్కులువిని "పెదతండ్రీ! తమశక్తియుక్తులు నాకుతెలీదా? నేను ముందుకు వెళుతుండగా. వెనుక వచ్చి మీరందరూ మీపని చెయ్యండి?" అన్నాడు సౌభద్రుడు;. అందరూ అభినందించి దీవించారు. అందరికీ అభివందనాలర్పించి అభిమన్యుకుమారుడు.

సువర్ణమయ రథాన్ని సువర్ణరూపుతో గల గుఱ్ఱాలు కట్టిన రథముపై ద్రోణునిపైకి అభిమన్యుని రథము ముందుకు దూసుకుపోయింది. వెనుక పాండవసేనవస్తుంది. ఆచార్యుని దూరాన్నుంచి చూసి ధనస్సుద్రోయించి అమ్ములు వింటతొడిగాడు అభిమన్యుడు. దూరాన్నుంచి ఆచార్యుడు చూసి తెంపరితనముతో తనపైకే దూసుకు వస్తున్న రథాన్నిచూసి అర్జునుడేమో అని ఆశ్చర్యమందాడు. కృష్ణుడుసారధిగాలేడు, ఆంజనేయస్వామి జెండాపైలేడు. కుదుటపడ్డాడు ఆచార్యుడు. ఆచార్యుడు బాణాన్ని సంధించకముందే. అభిమన్యుడు ద్రోణునిపై అస్త్రాలుసంధించాడు. యెడతెరపిలేకుండా బాణాలను విడుస్తున్న ఆతనినిచూసి అద్భుతాశ్చర్యాలనందాడు. అర్జునుడే పాండవులలో సర్వసమర్ధుడనీ, ఆతడు లేకుంటే పాండునందనులు నిర్వీర్యులనీ భావించే ఆచార్యునికి అభిమన్యుని సాహసవిక్రమసామర్థ్యాలు చూసి విస్తుపోయాడు. తానప్పటివరకూ యింతటివాడిని చూడలేదని అనుకొన్నాడు. ఆబాణప్రయోగం అబ్బురం. యెప్పుడుబాణం యెలాగుతీసి యేలావేస్తున్నాడో అంతు పట్టలేదు ఆచార్యునికి.

ఇక్కడ ఉండి వీరుల నెందరనో అంతమందించి రెప్పపాటుకాలములో అదిగో! అభిమన్యుడనేవారు. ఆమెరుపు యుద్ధంలో ఆతడెక్కడున్నాడో కానరాక ఆతనిచేత దెబ్బలు తినలేని యోధుడొక్కడు కౌరవసేనలో కానరాకుండా పోయాడు. పద్మవ్యూహాన్ని ఒక అదుటునచీల్చి చెండాడేడు. సంజయుడు ఆశ్చర్యముతో చెప్పగా, ధృతరాష్ట్రుడు కూడా అంతకంటే అబ్బురంగా అభిమన్యుని చరిత్రవింటున్నాడు. పద్మవ్యూహం మధ్యలోనికి వెళ్లి అరిభయంకరమైన అభేద్యమైన శంఖాన్ని పూరించాడభిమన్యుడు. తనకు యెదుట వాడి నెవడినీ విడిచిపెట్టకుండా అందరికన్నిరూపాలతో లాగ కౌరవులందరనుకలచి వేశాడు. మదగజాలు తుండాలు పడి పోయాయి. గుఱ్ఱాలు కాళ్లుతెగి, చని పోయి యిలా యుద్ధ భూమంతాతానే అయి విరోధులెవ్వరూ తేరి పారచూడ్డానికి వీలులేనట్లుగా విజృంభించి వీరవిహారంచేశాడు.

ద్రోణుని, గుఱ్ఱాలు, సారధి – రథము తుక్కు తుక్కుయింది. ద్రోణుడునిశ్చేష్టుడయ్యాడు. యిక యుద్ధవీరులు, కాళ్లు తెగినవారు, కళ్లుపోయినవారు. చేతులు నరకబడినవారు, తలలు పోగొట్టినవారు, యిలాకౌరవసేన అల్లకల్లోలమై పీనుగు పెంటలయింది. యిదంతాచూస్తున్న దుర్యోధనునికి మతిపోయింది. అయినా పారిపోతున్నవారినందరినీ ఉత్సాహపరుస్తూ, మహాకోపముతో ఉన్నాడు. దుర్యోధనుడు అలాసేనలను ముందుకు నడిపిస్తూ, అభిమన్యుని దిశగా వెళుతున్న అతన్నిచూచి ద్రోణుడుచాలా కంగారుతో కృపాచార్యుల్ని అశ్వత్థామను పెద్దగాపిలుస్తూ అభిమన్యునికి అడ్డుతగలమని చెప్పాడు. రారాజును కాపాడమన్నాడు.

అందరూ అడ్డంవచ్చారు. దాంతో వారి అందరివైపూ తీక్ష్ణముగా చూశాడు. దుర్యోధనునికి అడ్డం వచ్చిన వీరులందరి మీద లెక్కలేనన్ని బాణాలు వేయగా



వారందరూ పరుగులు తీశారు. శౌర్యము రేకెత్తి ఉన్న అభిమన్యుని మీదకు దుర్యోధనుడు యెంతో సేనను పంపాడు. అందరినీ అన్నివిధాలా బాధించాడు. అభిమన్యుడి మీదకు "అశ్మకుడు" అన్నవాడువచ్చి అభిమన్యుని యెదిరించాడు. అసలే దెబ్బతిన్న బెబ్బులిలాగున్న ఆతని దెబ్బలకు రథము, సారధి, గుఱ్ఱాలు జెండా, అంతా చీకయ్యాయి. వాడి తలకూడా తీసేశాడు. అది కౌరవసేన అంతాచూస్తున్నా ఆతనిని యేమీచేయలేకపోయారు.

కర్ణుడువెళ్లగా ఆతనికవచాన్ని ఊడగొట్టాడు. కర్ణుడుమూర్ఛపోయాడు కూడా. శల్యుడు మూర్ఛపోయాడు. అదిగని శల్యుని సోదరుడువచ్చి, వాడి బాణాలన్నీతెగవేసి వానితలకాయ తీశేశాడు అభిమన్యుడు. యిలా అనేసరికి ధృతరాష్ట్రుడు "సంజయా! ఎప్పుడూ అభిమన్యుడొక్కడినే చెప్పుచున్నావు. తక్కిన నలుగురూ పాండవులేమయ్యా" రనగా; "మహారాజా! వనవాసం పాండవులుచేసే కాలములో ద్రౌపదిని చూశాడు. ఆదారినే వెళుతున్న నీయల్లుడు సైంధవుడు. చెల్లిలిని అన్నా కళ్లుమూసుకున్న ఆతడు రథముపై బలాత్కారంగా యెక్కించుకు పోతుండగా ఆమెకేకలు పాండవులు విని రథాన్ని ఆపిసైంధవుని పట్టిచంపాలనుకొన్నా నీకుమార్తె దుస్సల పసుపు కుంకుమలు పాడుచేయడానికి యిష్టములేని పాండవులు ఒకప్రక్కతల, ఒకప్రక్కమీసాన్ని తీసేసి రెండుకొట్టి పొమ్మన్నారు.

అప్పుడువానికి పరాభవం తెలిసింది. ఒక మహాసామ్రాజ్ఞిని, సోదరివరుసగు వని తను కాముకత్వంతో కన్నులు మూసుకుపోయి, ఆమెను బలాత్కరించడం వానికి వారెంతగా పరాభవింపబడ్డారో ఆలోచించాడా? ఆసైంధవనీచుడు పాండవులందరినీ జయించాలని పరమశివుని గూర్చి మహాతపస్సుచేశాడు. ప్రత్యక్షమైన యీశ్వరుడు "పాండవులజయించే శక్తిని యిమ్మనగా"; సైంధవా! అర్జునునితో యుద్ధమన్ననాకే సందేహం. అందువలన మిగతానలుగురునీ నిరోధిస్తావు నాలుగుజాములు మాత్రమే. అది నీయవసరమైనప్పుడు నన్ను స్మరించు" అని శంకరుడు అదృశ్యుడయ్యాడు. అందువలన నీచుడైన సింధురాజు నీయల్లుడు ఈశ్వరుని వరప్రసాదమువలన అర్జునుడులేని సమయాన పాండవులును ఆ పగలంతా నిరోధించగలిగాడు. పద్మవ్యూహములో ఉన్న అభిమన్యుడు దుర్యోధనికుమారుని చంపాడు. కళింగులనూ. నిషాదులను యెందరినో హతము చేసిన అభిమన్యుని చూచి దుర్యోధనుడు పిచ్చికుక్కలాగై గంగవెఱ్ఱులెత్తి" అదిగో! అభిమన్యుడు. అంటూ అటూ యిటూ తిరుగుతూ కొట్టండి, చంపండి అనికేకలు వేయసాగేడు.

"యిక యీచిచ్చర పిడుగుతో మనమిందరం యేమీచేయలేకున్నాం. వీడిచేతిలో విల్లుంటే మనమెందరమైనా వీడిని జయించలేము. యేదోమోసముతోనే వీడి విల్లునువిరచాలి. అందరమూ ఒక్కసారిగా చుట్టుముట్టాలి. రాధేయా వెనుకగా వచ్చి వానిచేతిలో నున్నవిల్లును కొట్టాలి. అనగా; కర్ణుడు ఒప్పుకున్నాడు. అందరూ

అన్నివిధాలా మోసానికి తలపడ్డారు. వెనకగా వెళ్లి కర్ణుడు అభిమన్యుని చేతిబాణాన్ని తెగగొట్టాడు. రథాన్ని అశ్వాలను ద్రోణుడు చంపాడు. కృపాచార్యుడు యేమాత్రమూ కృపలేక సారధిని చంపేడు. "యెంతఘోరం యిదేనాయుద్ధ ధర్మం ఒకపసివానికి చాల్లేక యింతమంది మహాయోధులందరూ కలిసి యింతమోసం చేస్తారా?" అని మహేంద్రాది బృందారకులందరూ హా! హా! కారాలుచేశారు. అయినా ఆవీర సింహం కత్తిడాలుపట్టుకొని యేమాత్రమూ ధైర్యము విడువకుండా రథచక్రాన్ని వైరులపైకి విసిరాడు. ఆపాదమస్తకం రక్తం స్రవిస్తున్నా లెక్కచేయకుండా ఉండగా ద్రోణుడు ఆతని చేతిలోకత్తిని కొట్టి వేశారు. "యిలా యెనిమిదవసారి అభిమన్యుని కుట్రచేసిన నీకొడుకులు దుర్మార్గులు సుమ్మా ధృతరాష్ట్రమహారాజా!" అన్నాడు సంజయుడు.

ఒక్కడై యుద్ధంగావిస్తున్న అభిమన్యుని పై కౌరవయోధులందరూ చుట్టుముట్టి యెవరికి చేతనైనవిధముగా వారు హింసింపసాగారు. ఆతని చేతిలో నుండే రథచక్రాన్ని కొట్టేశారు. కత్తినందుకున్నాడాతడు. అశ్వత్థామ మీదికి వెళుతుండగా, ఆతడు పిక్కబలంచూపాడు. శరీరమునిండా కౌరవులు వేసిన బాణాలన్నీ అంటుకొనే ఉన్నాయి. యిలావున్నా యెంతో మందిని అభిమన్యుడు చంపుతునే ఉన్నాడు. కృపాచార్య, కర్ణ, కృతవర్మ, ద్రోణాచార్య, అశ్వత్థామ దుర్యోధనాదులందరూ, దుశ్శాసనుడు, మొదలైన వారందరూ అభిమన్యుని కొట్టారు. అలా ఉండే దుశ్శాసనుని కొడుకును చంపివేశాడు. మొత్తం అందరూ మొత్తారు అలా కౌరవయోధులు పసివాడనక అభిమన్యుని అంతంగావించారు మహారాజా!" అన్నాడు సంజయుడు.

అభిమన్యుడు వీరస్వర్గం అలంకరించాడని విన్నపాండవులందరూ అల్లలనాడిపోయారు. తలలూ, గుండెలు బాదుకొని పొర్లి పొర్లి యేడ్చారు. "మహారాజా! ధర్మరాజు గుండెలుబాదుకొని యేడుస్తుంటే ప్రకృతి అంతాస్తంభించి రోదింపసాగింది. "నాకొడుకును నేనే చే జేతులా వీరస్వర్గానికి పంపించాను. సుభద్రార్జునుల ముఖాలను నేనెలాచూస్తాను? యిన్ని అనర్థాలకు, యిందరు పడరాని పాట్లు పడడానికి కారణము నేనే! యింకనేనుండి చేసే దేమి? నేను చనిపోతే మీకందరికీ శాంతిలభిస్తుంది? అనితలబాదుకొనగా భీముడు వారించి "అగ్రజా! నీవుచనిపోవద్దు. ఆదుర్యోధన హతకుడుచావాలి. కేవలధర్మదేవతవునీవు. విధిబలీయము. యెప్పటి కేదిజరగాలో అది జరిగే తీరుతుంది. అన్నయ్యా! మీరింక బాధపడనవసరంలేదు.

కృష్ణార్జునులేమంటారో అనా మీరు అందోళనపడుతున్నారు. యింతకూ, మనిలువేల్పు. ముల్లోకాలనూ చక్రమున త్రిప్పగల మనబావ శ్రీకృష్ణపరమాత్మ ఉండగా మనకు ఆవంతయూ భయమక్కర్లేదు. యిక మన అభిమన్యువీరస్వర్గమా? యెందరో మహావీరులను సంహరించి, కౌరవ యోధానుయోధు లందరనూముప్పుతిప్పలు పెట్టి మూడుచెరువుల నీళ్లు తాగ్రించేడు క్షత్రియార్హమైన వీరస్వర్గమలంకరించాడు. అంతలో కృష్ణార్జునులు బయల్దేరారు. అక్కడ విజయంసాధించారు. అయినా



అర్జునునకు మనస్సు మనస్సుగాలేదు. దుశ్శకునాలు విపరీతముగోచరిస్తున్నాయి. రథముదిగిన అర్జునుని చూచి యేడుపుముఖాలు ఆతనికి చూపించలేదు. ఒక్కరికీ ముఖాల్లోనెత్తురు చుక్కలేదు. చివరకుబోరున విలపించుచూ, నన్నుచంపండి. యిదంతా నావల్లేజరిగింది.

యిదంతా నామూలాన జరిగింది. "బావా! నేనుబ్రతికుండి యెవర్ని ఉద్ధరించాను. ఉద్ధరించాలి. అర్జునుడు కుమిలికుమిలి యేడుస్తూ ధర్మ రాజును పట్టుకొని "అగ్రజా! నీవలన ఆవంతా పొరపాటులేదు. అంతానామూలాన నేనులేకుండా దూరాన ఉంచాడు ఆచార్యులు. లేకున్న యింతజరిగేదికాదు." అనగా! భీముడు అడ్డమువచ్చి "అర్జునా! ఆరోజు మనము కనికరించి విడిచిన ఆదుర్మార్గుడు సైంధవహతకుడే కారణము. మన అభిమన్యు వీరస్వర్గాన్ని అలంకరించడానికి వాడేమూలము." అనగా; అలాగే నకుల సహదేవులు, ధర్మ రాజునుచూసి "మీరందరేమయ్యారు?"

అనగా; కృష్ణుడందుకొని "అర్జునా! వారందరూ ఉన్నారు మనమూ ఉన్నాము. అది పరమేశ్వరుడిచ్చినవరం. అంతేకాని యెవరున్నాయేమిచేసేదిలేదు" అని సముదాయించారు. అందరూ సైంధవునే చెప్పుతున్నారు కనుక "బావా! పంచభూతాలు సాక్షిగా నిన్నుగాని, ధర్మరాజునుగాని, శరణువేడకుంటే రేపు సూర్యభగవానుడస్తమించక మున్నె ఆసైంధవుని అంతముచేస్తాను లేదా! నేనే గాండివముతో సహా అగ్నిలో దూకుతా" నని అర్జునుడన్నాడు ధర్మరాజు, భీమ, నకులులూ, మొదలైన పాండవవీరులందురూ, అభిమన్యుని గురించిగాక అర్జునుని ఘోరప్రతినకు తల్లడిల్లసాగారు. పాంచజన్యం వైరవీరులగుండెలదరినట్లు పూరించాడు అర్జునుడు. దేవ దత్తాన్ని శ్రీకృష్ణపరమాత్మ ఒత్తాడు.

యీ రెండుశంఖధ్వనులు విన్నకౌరవవీరులకు మనస్సులన్నీ ప్రీలిపోతాయి. ప్రళయంవచ్చినంతపనయింది. యేమీతోచక దుష్టచతుష్టయం దుర్యోధన దుశ్శాసన, కర్ణ, శకునులు ద్రోణాచార్యులపాదాలపైబడి "మహాత్మా! యీ ఘోర విపత్తునుండి రక్షించాలి" అన్నారు. ద్రోణుడు "సుయోధనా! నాశక్తికొలదీ సైంధవుని రక్షిస్తాను. తరువాత దైవయోగము. మీరెవ్వరూ భయపడకండి" అని అభయమిచ్చాడు. కానిసుయోధనునికి, సైంధవునికీ గుండెలదరిపోతున్నాయి. ద్రోణుడు అసాధ్యమైన ఒకవ్యూహాన్నిపన్నాడు. అదియిరువది నాలుగుక్రోసులపొడవూ, పదిక్రోసుల వెడల్పుగలది. శకట వ్యూహం దానివెనుక పద్మవ్యూహాన్ని ఆచార్యుడు అభేద్యమైనదానిని యేర్పాటుగావించాడు. వెనుక మహాయోధులనందర యెక్కడ యెవరిని యెలా ఉంచాలో స్వయముగా సమకూర్చి ఉంచాడు. వ్యూహముఖాన తానేస్వయముగా ఉన్నాడు. అనగా సైంధవుని అర్జునుడుచేరాలన్న ఈ వ్యూహాలన్నీఛేదించి. డెబ్బది రెండుమైళ్ల పరిధికిచేరాలి. యీలోపుగా ఆతనిజాడేతెలీదు. మొత్తం పదునెనిమిదిరోజుల యుద్ధవ్యూహాలన్నీ ఒకయెత్తు, అభిమన్యునకు పన్నిన

పద్మవ్యూహం, సైంధవరక్షణకుపన్నిన యీ రెండేగొప్పవి అద్భుతాశ్చర్యాలుగా చెప్పుకొనదగినవి. యీ దెబ్బది మైళ్ల దూరములో

అడుగడుక్కూ అతిరథులు, మహారథులు, మదగజాలు, గుఱ్ఱాలు, మహావీరులందరినీ జయించాలి. వారందరితో యుద్ధాన్నిగావించాలి. ఆరోజులో యింతభేదించడం సాధ్యంకాదు. దుర్ధర్షణుడు అర్జునునిప్రతికనీయనని కాచుకొని ఉన్నాడు. తెల్లవారిలేచి కాల కృత్యాలు తీర్చుకున్నాడు. అంతక ముందే శ్రీకృష్ణుడు రథాన్ని సిద్ధంగా ఉంచాడు. ముందుగా ధర్మరాజుకు పాదాభివందన చేశాడు అర్జునుడు. ధర్మరాజును బంధిస్తానన్న ద్రోణునికి అందకుండా ధర్మరాజు రక్షణ బాధ్యత సాత్యకికి అప్పగించాడు. అర్జునుని తలపైతన దక్షిణ హస్త ముంచి ధర్మరాజు "విజయీభవా!" అన్నాడు. కృష్ణార్జునులు బయల్దేరారు. తమ విజయ శంఖాలను పూరించారు. కౌరవులు ఆశంఖనాదాలకు కౌరవులందరూ భయ భ్రాంతులగుచుండగా, అందరికీ ధైర్యాన్ని చెప్పి తాను వ్యూహముఖాన కూర్చుని సింహములాగ ఉన్నాడు ద్రోణుడు.



ధర్మరాజు మొదలగు వారంతా యుద్ధభూమికి చేరుకున్నారు. కృష్ణార్జునులిద్దరూ వచ్చారు. అర్జునుడు "ఓమహావీరులారా! మీరందరూ ధర్మరాజును ఆచార్యుడు పట్టుకొనకుండా కట్టుదిట్టంగా రక్షించాలి. నేను నాప్రతిన నెరవేర్చుకొనే దిశలోనే ఉంటాను. బహుజాగ్రత్తా" అనిచెప్పాడు. కృష్ణార్జునులు రథమువెనుక మహాధీరతతో పాండవసేన నడవసాగింది. దుర్ధర్షణులు తనసేనతో అర్జునుని మీదికి వస్తూ "అర్జునుని చంపండి" అని పెద్దగా అరవడం ప్రారంభించాడు. అర్జునునిధ్వజంపై ఉన్న శ్రీమారుతి శక్తులన్నీ భయంకరముగా కానుపింప దుర్ధర్షుని, సేనాబలం సగంచల్లబడించి. అర్జునునిచేత వాడు దెబ్బలుతిని ఆచార్యుని శరణుజొచ్చాడు. అలాగేదుశ్శాసనుడూ పార్ధుని చేత దెబ్బలుతిని పారి పోయిద్రోణుని ప్రక్కకుచేరాడు. అర్జునుడు ద్రోణుని దగ్గరకు వచ్చి భక్తి విశ్వాసవినయంతో "గురుదేవా! ఆబాల్యంగా విద్యాబుద్ధులు చెప్పిమీ కన్నబిడ్డ కన్న మిన్నగానన్ను పెంచారు, పెద్దచేశారు. తమహస్తమున బాణముంటే త్రిలోచనుడుకూడా దరిచేరలేడు యీ విజయుని, విజయమువరించేలాగ దీవించండి" అని వందనలర్పించాడు.

"అర్జునా! అవన్నీ మరచినాతో యుద్ధంగావించు" అన్నాడు ద్రోణుడు. ఆతనితో యుద్ధంగావిస్తుండగా, కృష్ణుడు ప్రక్కగా రథాన్ని శరవేగంగానడిపాడు. "యిదేమి? యిదేమి అర్జునా?" అనగా అర్జునుడు. "గురుదేవా! తమరెప్పుడూ గురువులే" లోనికి వెళ్ళిపోయారు. " అర్జునా! అదిగో! ఆతడు జలాధినాధుడు వరుణదేవుని కుమారుడు. వీనితో జాగ్రత్త" అన్నాడు కృష్ణుడు. " ఈకృష్ణుని వల్లనే యీ అర్జునునికి పొగరూబలం యెక్కువయింది. అందువలన ముందువీనిని పనిపట్టాలని తనగదను కృష్ణుని మీదికి శ్రుతాయుధుడువేయగా, అదిగమనిస్తున్న అర్జునుడు వాడి రెండుహస్తాలు తెగ్గొట్టాడు. వానిభీకరగదాదండం కృష్ణునిస్పర్శించి తిరిగి వెళ్లి



శ్రుతాయుధుని మీదపడ దాంతో వాడు ప్రాణాలువిడిచాడు. అర్జునుడు "బావా! యిదేమి ఆశ్చర్యం" అనగా;" అర్జునా! వీడు వరుణుని సుతుడన్నానుకదా! వీనికి యీగద వరుణదేవుడిచ్చి, నీతో యుద్ధంచేసిన వారిపై నే దీనిని ప్రయోగింపవారు చనిపోతారు. లేదా యుద్ధంచేయని వారిపై దీన్ని వేస్తే వారి నే మీ అనకుండా స్పృశించి తిరిగి వచ్చి నిన్నే చంపుతుంది. జాగ్రత్త" అని చెప్పినా వీడు కోపాటోపముతో నాపై వేయగా వాడే చనిపోయాడ"ని చెప్పాడు.

యిదంతాచూస్తున్న కాంభోజరాజు కృతవర్మ అర్జునునికి అడ్డువచ్చాడు. వానితో వందలు రథాలురాగా వాటన్నిటినీ కొట్టివేశాడర్జునుడు. ఆయుతాయువు, శ్రుతాయువు సోదరులు అర్జునునికి యెదురై బాణాలు వేయ అర్జునుడు వారిబాణపు దెబ్బలుతిని వారిపై విజృంభించి వారి శిరములు రెండూ యుద్ధదేవతకు బలి యిచ్చాడు. యిదే సమయమని దుర్యోధనుడు తనసేనలను అర్జునునిపైకి ప్రోత్సహించి పంపాడు. వారందరూ బర్బర– మ్లేచ్ఛ కళింగాంగాదులందరూ అర్జునునిపై విరుచుకు పడ్డారు. యింత మందినీ విజృంభించి, చంపగా మిగిలినవారందరూ రణానికి వెన్నిచ్చారు. శ్రుతాయువు రెండు హస్తాలు తెగ్గొట్టి తలనరికి అర్జునుడు వాడినిచంపాడు. యీలా ఘోరాతి ఘోరయుద్ధం గావిస్తుండగా " అర్జునా! గుఱ్ఱాలు నీరు లేక అలమటిస్తున్నాయి" అని కృష్ణుడనగా; దాంతో "వరుణదేవా! నాపై కటాక్షముంచు. అంతానీదే భారమని

ఒకమహాబాణాన్నితీసి భూమికివేసే సరికి వరుణ– భూదేవతల కటాక్షంతో పాతాళ గంగవచ్చి అక్కడ ఒక చక్కని జలాశయముతయారయింది. అప్పుడు గుఱ్ఱాలూ, ఏనుగులూ, వీరులు ఆపవిత్ర గంగా జలాన్ని సేవించి బాగా సేదదేరారు. అర్జునుని మహాబలశక్తి సంపన్నంచూసి కౌరవులకు తమలో తామే నమ్మలేని స్థితివచ్చింది. దుర్యోధనుడు అడ్డువచ్చాడు. సేదదేరినగుఱ్ఱాలు ముందుకు దూసుకుపోతున్నాయి. దుర్యోధను సేనలంతా అడ్డుపడినా అడ్డుతప్పించుకొని ముందుకుసాగారు. ద్రోణుడు ధర్మరాజు రథాన్ని అశ్వాలను రథసారథిని కూడా చంపాడు. ద్రోణుడు ధర్మజుని తప్పక పట్టుకుంటాడని కౌరవసేన కేరింతలు కొడుతుంది. యింతలో సహదేవుడురాగా ఆతనిథముపై నుండి ధర్మరాజు ఆచార్యులవారికి దొరక్కుండా పోయాడు.

అలంబసుడనుగొప్ప రక్కసుడు భీముని మీదకువచ్చాడు. గెలవలేక రాక్షసమాయలు గావింపసాగాడు;. పాండవసేనను ఆమాయతో నాశనము గావించాడు. భీముడు వికటాట్టహాసముతో వాడిపై కురికాడు. వాడు భయపడి పారిపోతుండగా ద్రోణుడు కనుపించగా ఆతని ప్రక్కవచ్చి తనమాయతో పాండవబలాన్నంతా చంపి చీకాకు పరుస్తుండగా, అదిచూచి హఠాత్తుగా వచ్చి సాత్యకి మొదలైన పాండవవీరులకు ఉత్సాహాన్నిచ్చి "మీరందరూ ద్రోణుని పైకి వెళ్లండి. వీడిమాయలనూ, వీడిని నేను చూస్తానని ఘటోత్కచుని పలుకులకు

పాండవవీరులకు రెట్టింపు బలము వచ్చింది. సరిగా పదునాలుగు దినాలనుండి అలంబసుడు పక్కలో బల్లెములాగ బాధింపగా ఘటోత్కచుడు వాడి రెండుకాళ్లూ పట్టుకొనిపైకెత్తి భూమి పై కొట్టాడు వాడిశరీరాన్ని రెండుకాళ్లతోత్రొక్కాడు. దానితో వాడుయమునింటికి అతిథియయ్యాడు.

దాంతో పాండవ వీరులూ, సేనా పరమానందమందారు. యింతకూ సాత్యకీ ద్రోణుల యుద్ధములో సాత్యకిని ద్రోణుడు చంపేసే స్థితిలో ఉన్నాడనగా; ధర్మరాజు ధృష్టద్యుమ్నాది వీరులనచ్చటకు పంపాడు. అర్జునుని తరువాత చెప్పుకోదగ్గ అస్త్ర శస్త్ర ప్రవీణులు, మహావీరులు పాండవసేనలో యిద్దరే యిద్దరు. ఒకరు అభిమన్యుడు, రెండుసాత్యకి. ద్రోణుడు సాత్యకిని హతమార్చాలని అనుకున్నాడు. భీమ- ధృష్టద్యుమ్న ధర్మరాజు మొదలైన వారంతా ఒకరితరువాత ఒకరు సాత్యకికి భాసటగానిలబడ్డాడు. ఆకోపముతో ద్రోణుడు పాంచాలసేన యిరువదివేలమందిని, నూర్గుర కేకయ మహా వీరుల్ని, మంటలో కలిపాడు.

భీముడూ, కర్ణుడూ తలపడ్డారు. దివ్యబాణాలను విడిచాడు రాధేయుడు. నిరాయుధుడయ్యాడు వృకోదరుడు. మహాకోపంతో కర్ణుని రథంపైకి భీముడు యెగిరిగంతేశాడు. అదికనిన రాధేయుడు యిక లాభములేదని రథమున గల ఒక బల్లచక్కక్రిందదాగున్నాడు. యెలాగో రథముపై నుండి వెళ్ళేదని భీముడు రథాన్నుండిక్రిందికి గంతువేశాడు. కర్ణుడు బయటకు వచ్చి రథముపైనుండి ఘోరాస్త్రాలతో భీమునిపై వేయగా, భీముడు పిక్కబలంచూపించాడు. భీముని వెంట కర్ణుడు రథాన్ని తోలుతూ, ఆతని బాణాలతో బాధింపసాగాడు. దారిలేక భీముడు యేనుగుల కళేబరాల చాటున దాక్కొనక తప్పిందికాదు. ఉదయం నుంచీ అనేక మందితో యుద్ధంచేసి అలసి పోయి యున్న భీముని దగ్గరకు కర్ణుడు వెళ్ళి బాణము చివరతో ఆతని బొడ్డులో పొడుస్తూ "ఓరీతిండిపోతా! నీకు యుద్ధమెందుకు? ఎక్కడో ఒకరాజు దగ్గరవంటలువండి, పుష్టిగాతిని ఉంటే సరిపోతుందికదా? యికపో! కృష్ణార్జునులకు నీగతి చెప్పికో" అనికర్ణుడు అచ్చట నుండి వెళ్లిపోయాడు. యింతలో అర్జునుడు వచ్చి నెత్తురోడినట్లు కొట్టాడు. దాంతో భీమునికి కొంతసంతోషముకలిగింది. మధ్యలో అశ్వత్థామ రాగా! "ఓయీ! గురుపుత్రా! కాచికొమ్మని వాడి బాణాలు వేసే సరికి కర్ణ అశ్వత్థామలు యిద్దరూ పారిపోయారు. సాత్యకి యుద్ధమన్న ఉరకలు వేస్తాడు. భూరిశ్రవునితో ఘోరమైన యుద్ధంగావించాడు. యిద్దరు భూమిపై కత్తులతో యుద్ధము భీకరముగాచేస్తున్నారు. రోజంతా అలసి ఉన్నాడు సాత్యకి. భూరిశ్రవునిదే పై చెయ్యి అయింది. సరిగా ఖడ్గాన్ని తీసి భూరిశ్రవుడు సాత్యకి తలనరకాలని గురిపెట్టాడు "అర్జునా! అర్జునా? అటుచూడు నీ శిష్యుని పరిస్థితి" అనగా అర్జునుడు చూసి భూరిశ్రవుడెత్తిన చేతిని అర్జునుడు నరికేశాడు.

కౌరవులందరూ భయభ్రాంతులయ్యారు. భూరిశ్రవుడు అర్జునుడు రణధర్మాన్ని విస్మరించాడని నిరసనతో యోగములో కూర్చున్నాడు యిదే అదనని సాత్యకి



మహావీరులందరూ భీమకృష్ణార్జునులు యెంతవారించినా వినక ఆతని తలనరికేడు. యిక కృష్ణార్జునులకు సైంధవుని చేరాలి. అనుకొని వెళుతుండగా దుర్యోధనుడు తన వీరులను చూచి "అదిగో! అర్జునుని రథాన్ని రక్షించాలని రెండువైపులా సాత్యకీ, భీముడు, ప్రక్కలలో మహావీరులు ఉత్తమౌజుడు, యుధామన్యుడు చక్రరక్షకులు, కృష్ణుడు రథముపైన యెంతజాగ్రత్తతో ఉన్నారో చూడండి" అన్నాడు. యిక పగలు చాలా వరకు అయిపోయింది. సూర్యుడు అస్త్రాద్రికివెళ్లనున్నాడు. మనం సైంధవుని మరికొంత సేపురక్షిస్తే, అప్పుడు అర్జునుని అగ్ని ప్రవేశాన్నిచూసి అందరమూ హాయిగా ఆనందింపవచ్చు" నన్నాడు మహారాజా! మీపెద్దకొడుకు.

కర్ణుడు అర్జునుని అడ్డుకొని నిలవరించాడు. అర్జునుడు కర్ణుని మీద అనేక బాణాలు వేశాడు. కర్ణుడూ తెగించి యుద్ధముచేయుచున్నాడు. యిరువురూ ఘోరయుద్ధంగావింపగా అందు అర్జునునిదే పై చేయి అయింది. కాలముచెల్లినవాడికి కళ్లు మూసుకు పోతాయికదా? వృషసేన- కృపాచార్యులిద్దరూ యెంతో చాక చక్యముతో అర్జునుని ముందుకు పోకుండా నిలువరించారు. సైంధవుడు యింత భద్రతా వలయాన్ని తప్పించుకొని వారిద్దరి వెనకాల తగుదునమ్మా అని అర్జునునిపై బాణప్రయోగానికి సిద్ధపడ్డాడు. సైంధవునిచూసిన అర్జునుడు నేయివేసిన అగ్నివలె మండిపోయి కౌరవ వీరులపై విజృంభించాడు అర్జునునితో సైంధవుడు తలపడి యుద్ధముచేయగా, అర్జునుడు వాని రథాన్ని, సారథిని, జెండాను, గుఱ్ఱాలను చంపాడు. యింతలో సూర్యాస్తమయమయి చీకట్లు నాలుగు చెరగులాక్రమ్మాయి. కౌరవులలో ఆనందం- పాండవుల్లో విచారం తాండవిస్తుంది. సైంధవుని ఆనందానికి అంతులేదు. సుయోధనుడు కర్ణుడు మొదలగు వారంతా సైంధవునితో కేరింతలు కొడుతూ అర్జునుడు గాండీవముతో సహా అగ్నిప్రవేశమౌతాడు.

ఆదృశ్యాన్ని కనులారాచూడు అని ఒకరథముపై సైంధవుని కూర్చోబెట్టారు. భయపడసాగేడు. అయినా అందరూ వాడిని అక్కడుంచారు. యిక్కడ అర్జునుడు కృష్ణుని వైపు దీనంగా చూడగా, కృష్ణుడు "అర్జునా! యెవరికర్మకు యెవరు బాధ్యులు? నేను చేయగలిగిన దంతా చేస్తున్నాను. యింకేమిచేస్తా"నని కృష్ణుడన్నాడు. పాండవులందరూ ఆకనుచీకటిలో దుఃఖిస్తున్నారు. యీవిషయాన్నితెలిసిన సైంధవుడు ఆనందంతో "బావా! నన్నుచంపుతానన్న అర్జునుని చావుకనులారా! చూడాలనగా; శకుని "అల్లుడూ! యిందులో కృష్ణుని మాయాజాలం ఉందేమోచూడండి?" అనగా; కర్ణుడు "శకునీ! యెప్పుడు నీ బుద్ధి వక్రముగానే పరుగెత్తుతుంది. గాఢాంధకారంక్రమ్మితే దీనిలో మాయేముంది?" అనగా, అందరూ ఔననగా

సుయోధనాధులందరూ సైంధవుని దెచ్చి అలంకరించి పెండ్లి కొడుకులాగు తయారుచేసి ఒకయెత్తైన ప్రదేశములో రథముపైనిలబెట్టారు. కృష్ణుడురథాన్ని దానికి తిన్నగా ఉంచి " అర్జునా! గాండీవాన్ని యెక్కుపెట్టు అదిగో? నీకు తిన్నగా ఉన్న సైంధవుని తలకు గురిపెట్టు" అనగా; బావా! అన్నాడు; ఔనుగాండీవముతో...

అన్నాడు. యింతలో యేమయిందో! సూర్యదేవులు ఒక ఝాము యెండతో చీకట్లు పారి పోగా కానవచ్చాడు. సైంధవుడూ, కౌరవులూ పిచ్చికుక్కల్లాగ అరుస్తున్నారు. అర్జునా! సైంధవుని తలనరికి అదినేలపడకుండా వానితండ్రి వృద్ధ క్షత్రుడు "తనకుమారుని తలనరకబడిన దానిని చూసిన వారితలనేలపడాలనిశ్యమంతక పంచకములో గాఢతపోదీక్షలో ఉన్నాడు. కనుక వీనితలను వాని దోసిట్లో పడ్డట్లు వేయమనగా!

అర్జునుడు పరమానందంతో పారిపోబోతున్న సైంధవునితల తెగ్గొట్టి వాని తండ్రి దోసిట పడగా వృద్ధక్షత్రుడు యిదేమని కన్నులు తెరచిచూడగా, ఆతని తల కూడా దోసిటపడింది. యింక మనువృత్తి అడగకుండా యిరువురూ జమునింటికి అథితులయ్యారు మహారాజా!" అన్నాడు సైంధవుడు సంజయుడు. సైంధవునిచావుతో కౌరవశిబిరాన హా! హా! కారాలు చెలరేగాయి. భీముడుసింహనాదంచేశాడు. కృష్ణార్జును విద్దరూ దేవదత్త- పాంచజన్యాలు పూరింపగా కౌరవులెంతో భయభ్రాంతులయ్యారు. పాండవులందరూ శ్రీకృష్ణుని వేనోళ్లకీర్తించారు.

## రాత్రియుద్ధము



అసలే మర్కటం దానికి మతిచలించింది. దానిపైకల్లుత్రావింది. యెలా ఉంటుంది? అలా ఉందిసుయోధనుని పరిస్థితి. వీరాగ్రేసరులందరినీ పట్టుకొని చెడామడా తిట్టాడు. " యింతలేసి వీరులమని చెప్పుకుంటారు. యేదిమీవీర్వతం? తాతగారిని రక్షించుకొనలేకపోయాం. సైంధవుని సమరాన చంపుకున్నాం. యిందరమూ ఉండి మనం చేసే నిర్వాకంయిదేనా? యుద్ధంప్రారంభమయి పదునాలుగు దినాలయింది. యీ ఒక్కరోజులో మనకు జరిగిన నష్టంచెప్పలేనంత. ఒక్క అర్జునుడు యేడౌక్షౌహిణులసేనను నాశనంగావించాడు "గురువర్యా! మిమ్మునమ్ముకొనికదా నేనీ యుద్ధానికిదిగాను. మీ కేమిహాయిగా ఉన్నారు. యిన్నీ ఒక యెత్తు. మానూరు మందికి ఒక్క అడ పిల్ల దుస్సల. ఆమె ముఖాన్ని నేనెలాచూసేది?.

ఆ మాటలువిన్న ఆచార్యులు. "సుయోధనా! యెందుకలానిందిస్తావుమమ్ము. మేము శక్తివంచనలేకుండా యుద్ధాన్నిగావిస్తున్నాము. అంతేకాని నీకు నష్టము కలిగించాలని మాకేకోశాన్నీలేదు. ద్రోణుడు "నాయనా! పాండవులకు పాంచాలసేనాబలం యెక్కువ. వారందరినీ చంపనిదే యీ కవచాన్ని తీయను" అని ప్రతిజ్ఞగావించాడు. ఆరోజు రాత్రియుద్ధంలో ద్రోణుడు పాంచాలురందరనూ చంపేడు. సర్వసేనానాయకుడైన ధృష్టద్యుమ్నుని కుమారులను అంతం చేశాడు. ఆరాత్రి రణరంగాన భీముడు విజృంభించి మదగజం కట్లుత్రెంపి విచ్చలవిడిగా సంచరించినట్లుగా యుద్ధంగావించాడు. అశ్వత్థామ మహాప్రతాపంతో ఒక అక్షౌహిణిసేనను అంతంచేశాడు.



సాత్యకి సోమ దత్తుని చంపాడు. కాగడాలు వెలుగులో పరస్పరం మహా ఉద్రేకపూరితావేశాలతో కౌరవుల యుద్ధముజరిగింది. కర్ణసహదేవులు కలియబడ్డారు. కర్ణుడు బాలుడని కూడా చూడకుండా విపరీతంగా కొట్టి "ఓసహదేవా! నీకు యుద్ధమేంటి ఆపాంచాలి ఒడిలో పడుకో! పో!" అని విడిచి పెట్టాడు. వృద్ధుడైన బాహ్లికుని ముందుంచి కౌరవులురాగా, ధర్మ రాజాదులందరూ యెదురున్నా చివరకు, భీముడు కురువృద్ధునాతనిని స్వర్గానికి పంపాడు. ఒకవైపు కర్ణుడు, వేరొకవైపు ద్రోణుడు పాండవులసేనను చీల్చి చెండాడారు.

"అర్జునా! పగలంతా యెడతెరపిలేని యుద్ధంగావించావు. మళ్లీ విరామములేకుండా రాత్రియుద్ధాన్ని చేస్తున్నావు. కర్ణుడాచాలా విజృంభణావేశమత్త చిత్తుడైయున్నాడు. యిప్పుడు మనముకాక ఘటోత్కచుని పంపడం అవసరం. అదికాక రాక్షసులకు రాత్రిభాగాన రెండింతల బలము చేకూరుతుందని ఘటోత్కచుని కర్ణుని మీదకు వెళ్లమని కృష్ణార్జునులు పంపారు. కౌరవపక్షంగాచేరిన అలంబసుడు ఘటోత్కచునకు అడ్డురాగా వానిని భీమునికొడుకుచంపాడు. ఘటోత్కచ- కర్ణులయుద్ధం ఘోరాతి ఘోరంగా సాగుతుంది. కర్ణుడు అంతమయే సమయాన బకాసురుని సోదరుడు తనసేనతో దుర్యోధనపక్షంలో చేరి అడ్డుగా రాగా కర్ణుడుబ్రతికాడు తనమాయాయుద్ధంచేయ ఘటోత్కచుడు అంతకన్నమిన్నగా మాయాయుద్ధమువానితో చేసి ఆరాక్షసునివధించాడు. పాండవసేన దాంతో ఉత్సాహాన్ని పుంజుకున్నాయి.

ఘటోత్కచుడు తన శాంబరీమాయతో రథంతో కానరాకండా కౌరవసేనమీద పెద్ద రాతిబండలూ, రాళ్లు, రోకళ్లూ, ఇనుపగుళ్లు, ముద్గరాలూ కుంతాలు, మొదలైన ఆయుధాలు వర్షములాగ యెడతెరపి లేకుండా కురిపిస్తూ సేనలను నిలువనీకుండా భయభ్రాంతులను చేయసాగాడు. ఆతని అనుచరులు కూడా లెక్కలేనన్ని మాయాజాలంతో కౌరవసేనలనూ వీరులనూ బాధింపసాగారు. రథాలు విరిగి, ఏనుగులుచనిపోయి, గుఱ్ఱాలు అంతమయి, సేనలు అంతకపురికి చేరాయి. కర్ణుడు తనశక్తికొలదీ ఆరాక్షసులను యెదిరించిపోరినా మాయాయుద్ధం యెక్కువౌతుందేకాని యేమాత్రంతగ్గనే లేదు. అప్పుడు దుర్యోధనుడు "కర్ణా! మాయతోకూడుకొన్న ఘటోత్కచుని మనందరం యెదుర్కొనాలి అంటేచాలాకష్టము. అందువలన మహేంద్రుడు నీకిచ్చిన శక్తిని ఆరాక్షసునిపై వేసి వానిని అంతంగావిస్తే తప్పమనలను బ్రతకనీయడు" అన్నాడు.

కర్ణుని రథముపైకురికి సారధిని, గుఱ్ఱాలు, జెండారథాన్ని తుక్కుతుక్కుగా కొట్టాడు. దాంతో కర్ణుడు చావవలసిందే! అప్పుడు రాధేయుడు. మహేంద్రశక్తిని సకీలక మంత్రయుతంగా మంత్రించి ఘటోత్కచునిపైకి వేయగా, వేయిగంటలుమ్రోయ, ఆకసమూ, మెరపులతో, అగ్నికీలలతో భూమి వణికిపోగా వెళ్లి ఘటోత్కచుని మాయలన్నిటిని మటుమాయంచేసి ఆతనిగుండెల్లోచేరి వాటిని

చీల్చి వెళ్లగా, యెంతో యెత్తులో ఉన్న ఆతడు ఆశక్తి దెబ్బతో అక్కడనుండి నేలపై బడి రక్తాన్నిక్రక్కుకొని ప్రాణాలు విడిచాడు. దానికికౌరవసేనలు యెంతగానో సంతోషించాయి. పాండవులందరరూ విచారములో నుండ "ధర్మరాజా! యికవిజయము విజయునిదే. బ్రతికాము" అని సంతోషించాడు. ధర్మరాజు దానికి బావా! నీకెందుకింత సంతోషము? దానిలో పరమార్థంచెప్పమనగా;

"ధర్మజా! మహేంద్రుడు కర్ణుని కవచకుండలాలు అపహరించినప్పుడు, స్వయంగా దేవనాథుడే యీ మహాశక్తిని యిచ్చి "కర్ణా! యీ మహాశక్తి యుద్ధరంగాన త్రిమూర్తులను కూడా చంపి మరల నా దగ్గరకువస్తుంది" అనిచెప్పాడు. కర్ణునికి యుద్ధరంగములో యీశక్తిని గూర్చి యేకాదు గొప్పబాణాలన్నీ గుర్తులేవు. అందువలన ప్రతిరోజుయుద్ధం విరమణానంతరాన గుర్తుతెచ్చుకొని అయ్యో! యీరోజు అర్జునునిపై అమరేంద్రుని శక్తిని వేయలేక పోయానని విచారించేవాడు రాధేయుడు. ప్రతిరోజూ యిలాగే జరిగేది. దుర్యోధనాదులకు కూడా యేమీజ్ఞాపకముండేదికాదు. యీరోజు ఘటోత్కచునితో దెబ్బలు తినని వారు కౌరవసేనావాహినిలో ఒక్కరూ లేరు. అందరూ కలియబలికి కర్ణునికి ఐంద్రమహాశక్తినిజ్ఞాపకంతెచ్చారు. లేకున్నలేదు" అని శ్రీకృష్ణుడు చెప్పగా ధర్మరాజువిని యేదోకొంత ఊరటచెందాడు.



దుర్యోధనుడు ఘటోత్కచునిచావుతో కొంత ఊరట చెంది "గురుదేవా! తక్కినకార్యమంతా తమ భుజస్కంధాలపై నే ఉందని చేతులు జోడించాడు. ద్రోణుడు యుద్ధానికి సిద్ధమయ్యాడు. ఉత్తరానికి ప్రయాణమయ్యాడు. ద్రుపదుని కుమారులను అంతంగావించాడు. విరాటద్రుపదులిద్దరినీ సంహరించాడు. యీ వార్త పాండవ శిబిరాన్ని విషాదాన ముంచింది. ప్రత్యేకంగా ధృష్టద్యుమ్నుడు, భరింపరాని పితృవియోగబాధా తప్తుడయ్యాడు. "నాపితృదేవుని వధించిన వానిని యిప్పుడే చంపుతా"నన్నాడు ధృష్టద్యుమ్నుడు. యుద్ధరంగంలోనికి దూకాడు.

ద్రోణుడు పట్టు బట్టి మరీపాంచాలుర వధింపసాగాడు. రాత్రిగడచి సూర్యోదయమయింది. గురుశిష్యులు ద్రోణాచార్యులిద్దరు అర్జునుడు యుద్ధముచేయ సాగారు. ఇంద్రాస్త్రాన్ని గురువువేస్తే, దానికి ప్రతిగా శిష్యుడు కూడా అదే అస్త్రాన్ని ప్రయోగించాడు. యిలా యిద్దరూ అన్యోన్యం, అస్త్రాలను అస్త్రంప్రతిగా ఆహవముగావిస్తున్నారు. ఒకరికొకరు తీసి పోకుండా, యెవరు యేమిటో తెలియనంతగా యుద్ధరంగాన వీరవిహారం గావిస్తుంటే అమరేంద్రాదులు కూడా ఆశ్చర్యమందారు. ద్రోణాచార్యుడు అర్జునునిపై బ్రహ్మాస్త్రమువేయగా, దాన్ని ప్రతిఘటించాలని అర్జునుడుకూడా బ్రహ్మాస్త్రాన్నివేయగా ఆరెండూ భూనభోంతరాళాలను కాల్చివేస్తాయా అని ప్రజలూ, గగన చారులు భయపడగా ఆరెండస్త్రాలు గురు శిష్యుల్లాగే మెలగి కడకు యుద్ధభూమిలో కొంచమేనష్టం కలిగించి రెండూ కానుపించకుండా పోయాయి.



యికలాభములేదని ద్రోణుడు రథాన్ని అధిరోహించి వెళ్లగా, అర్జునుడు కూడా తనదారిని తాను చేరాడు. మరునాడు పిచ్చి పట్టిన వానివలె ఆచార్యుడు మహామారిలాగ పాండవసేన నంతా అంతక పురానికి పంపుతున్నాడు. పాండవుల శిబిరాన గగ్గోలుగా ఉంది. ప్రళయకాలరుద్రరూపుతో నున్నద్రోణుని యెవరూ చూడలేకపోతున్నారు. పాండవ వీరులంతా ఒకదగ్గరచేరారు. " ద్రోణుని చేతిలో బాణముండగా యెవరూ అతనిని గెలవలేరు. ఆతనికి ఆతనికుమారుడు అశ్వత్థామపై పిచ్చి నమ్మకం దుర్వ్యామోహము పెంచుకొని బ్రతుకుతున్నాడు. అందువలన అశ్వత్థామ హతుడయ్యాడు" అనుమాటవింటే ఆతడు అస్త్రాలను విడిచిపెడతాడు. అటువంటప్పుడే ఆతనిని మనము వధించాలి. యింతకన్నా మరొకమార్గము మనకు కానరాదని" శ్రీకృష్ణుడు చెప్పాడు.

యిలా ఉండగా ద్రోణాచార్యులవారి ఆత్మకు ఒకప్రబోధము వినిపించింది. "ఓయీ! పిచ్చి బ్రాహ్మణుడా! దేశములోగల రాజులందరికీ అస్త్రశస్త్రాదివిద్యలు నేర్పి అందరినీ సమతుల్యంగా చూడ తగిన నీవే ఒకప్రక్కకొమ్ముకాసి, వేరొకప్రక్కనున్న వారినందరనూ నాశనంచేయడం మంచిదికాదు. నీవింకయెన్నాళ్లుబ్రతికుంటావు? బ్రహ్మకల్పంబ్రతికినా యింతేకదా నీవు చేసేది. లేలే. రా!" అను అంతరాత్మ ప్రబోధానికి వశుడయ్యాడు ద్రోణుడు. యిక్కడ యింకొక పరమ రహస్యం ఉంది. పట్టుపట్టి పాంచాలుర నందరనూవధించి, తరువాత పాండవులవధింపవచ్చు, అప్పుడు అందరూపోగా యిటుకౌరవులూ, అటుపాండవులు పోగా, మిగిలేవారము, మా అశ్వత్థామపై పంచ ప్రాణాలూ పెట్టుకున్న ఆచార్యుడు అశ్వత్థామ చనిపోయాడని అనినా ద్రోణాచార్యులు, "ఓరీ భీమా! చిరంజీవి మా అశ్వత్థామ చనిపోతాడా? అంతా మోసం నీమాట నేను నమ్మను" అన్నాడు. అప్పుడు పాండవులందరూ, కృష్ణుని సలహా అడిగారు. ఒక్కధర్మరాజు తప్ప యింకెవరినీ నమ్మడు" అనగా, ధర్మరాజుని శ్రీకృష్ణుడు, పాండవులు, యెంతగా మొత్తుకున్నా ధర్మరాజు మాత్రం ససేమిదా ఒప్పుకోలేదు. యింకలాభంలేదని అందరూ, నిస్పృహ, నీరసం చెందారు.

ధర్మరాజు అక్కడుంటే మాట దక్కదని అక్కడ నుండి వెళ్లి పోయాడు. యింతలో శ్రీకృష్ణుడు భీముడూ రహస్యంగా మాట్లాడుకున్నారు. "అశ్వత్థామహతః హతః మెల్లగా "కుంజరః" అనుధర్మరాజుగొంతుకు వినే సరికి ఒక్కమారు ద్రోణుడు బాణాలు పారవేశాడు. అంతేకాదు చిరకాలవాంఛకూడా తనది వమ్మయింది. "ధర్మ రాజువంటి పవిత్ర మూర్తి ధర్మాత్ముడూ చెప్పాడు కాబట్టి నమ్మాలి. యింకనాకు ప్రాయోపవేశమే శరణ్యం" ఆనందంతో అంతంకావడానికే నిశ్చయించుకొన్నాడు. యోగంలో చేరాడు ద్రోణుడు. సరిగా అంతవరకూ కనిపెట్టి కూర్చున్న ధృష్టద్యుమ్నుడు ద్రోణుని దగ్గరకు ఒకతీవ్రమైన కత్తిని పట్టుకొని వెళుతుండడం చూచిన కృష్ణార్జునులు, కర్ణుడు మొదలైనవారంత యెంతగా వారిస్తున్నా వినకుండా ద్రోణుని జుట్టు పట్టుకొని మరోచేత్తో ఆతని కంఠాన్ని నరికేశాడు. అది చూసిన సాత్యకి అర్జునుడూ మొదలైనవారు ధృష్టద్యుమ్నుని యెంతగానో నిందించారు.

పాండవసేనలో రెండు వర్గాలయ్యాయి. సాత్యకి, అర్జునుడు "యింతఘోరమా? అనిధృష్టద్యుమ్నునిపై విరుచుకు పడ్డారు. అనేక విధాలుగా ఆతనిని నిందించారు. శ్రీకృష్ణుడు తటస్థుడుగా యెటూ మాట్లాడకుండా ఉండిపోయాడు. యిక్కడ కురుసేనలో అశ్వత్థామ చనిపోయినట్లు ధర్మరాజు చెప్పగా నిజముగా ద్రోణాచార్యులు ఆమాటవిని ప్రాయోపవేశంచేశాడనీ అదే అదునుగా ధృష్టద్యుమ్నుడు ఆతని తలను నరికేసినట్లు వార్తలు యుద్ధరంగమంతా చెలరేగాయి. ఒకమారుమూల దూరముగా యుద్ధముగా విస్తున్న అశ్వత్థామకు యీవిషయం తెలిసి తలపైపిడుగుపడి నట్లయి. దుర్యోధనాధులతో యెంతగానో దుఃఖించాడు. కృపాచార్యులంతా వారికి తెలిపారు.

అశ్వత్థామకోపావేశముతో ఊగిపోయాడు. పాండవులందరినీ నిర్మూలముగావిస్తాను. అని పాండవసేనపైదూకాడు. యిక అశ్వత్థామ పాండవులసేనలను మట్టుపెట్టి అంతంచేస్తాడని అర్జునుడు. సాత్యకి, ధృష్టద్యుమ్నుడు మొదలైన పాండవ యోధులు కలిసి ఆతనిని యెదిరించి తమసేనలను జాగ్రత్తగా రక్షణ కల్పించడానికి యేకమయ్యారు. అశ్వత్థామ సమస్తాన్ని సమయింప చేయగల నారాయణాస్త్రాన్ని పాండవసేన మీద ప్రయోగించాడు. దాంతో పాండవసేనంతా చనిపోసాగారు. కృష్ణుడు పాండవసేనలనూ, వీరులందరినీ ఉద్దేశించి "ఓవీరపుంగవుల్లారా! మీరందరూ, మీ మీ బాణాలన్నీ నేలపడేసి నారాయణాస్త్రానికి నమస్కరించండి" ఆమాట విని అందరూ నిరాయుధులై అహంకారాన్ని వీడి ఆ అస్త్రానికి అంజలిఘటించేసరికి ఆనారాయణాస్త్రం ప్రళయకాలాగ్ని వలె మంటలు క్రమ్ముకుని వచ్చి చల్లాగానయిపోయింది.

అశ్వత్థామ అలాతననారాయణాస్త్రం నిరుకారి పాండవసేనకుసంతోషముకూర్చే సరికి రుద్రావతారాన్నిదాల్చాడు. ధృష్టద్యుమ్నునీ, సాత్యకిని మూర్ఛపడగొట్టాడు. నారాయణాస్త్రం రెండవసారి పని చేయదని తెలిసిన అశ్వత్థామ దానిమాటే యెత్తలేదు. అప్పుడు ఆగ్నేయాస్త్రాన్ని వేయగా అదిభూమి ఆకాశాలను కాలుస్తూవస్తుంది. పాండవసేన దానిని చూసి భయభ్రాంతులగుట గమనించిన అర్జునుడు తన బ్రహ్మాస్త్రాన్ని దానిపై వేయగా ఆదివ్యాయుధాలు రెండూ పోరాడి కడకు- ఆగ్నేయాస్త్రం ఆరిపోవడంతో అశ్వత్థామనిరుత్సాహుడయ్యాడు. అంతేకాదు మహాశక్తులు గల రెండు దివ్యాస్త్రాలూ యెందుకూ కొరకాకుండా పోవడముతో యిక అర్జునునిపైకి నాబాణాలు యెంతటి వైనా యేమీ చేయలేవని తెలిసికొని దీనుడై అక్కడనుండి రథాన్ని బాణాలనూ అన్నిటినీ వీడిపోయాడు అశ్వత్థామ అరణ్యాలకు.

అక్కడ ఆతనికి "గురుపుత్రా! నరనారాయణ జన్మలే శ్రీకృష్ణార్జునులుగా భావింపు. వారు పరమ శివుని గూర్చి ఘోరతపస్సుచేసి సర్వదివ్యశక్తులూ పొందారు. వారిని యీ సృష్టియందు గల యేశక్తులూ యేమీచేయలేకుండా వరాలు పొందారు.



సురసిద్ధ సాధ్య విద్యాధరులు కూడా యేమీచేయలేరు. అటువంటప్పుడు నీవుగాని నీబాణాలుగాని యేమిచేస్తాయి?" ఆప్రబోధానికి అశ్వత్థామ కొంత ఊరట చెందాడు. రాక్షసులు రాజరూపాల్లో ఉండగా, వారిని వధించి, దుష్టశిక్షణ శిష్టరక్షణగావింపగా నరనారాయణులిద్దరు ద్వాపరయుగాన ఉద్భవించారు. దుర్యోధనుని వంటి దుష్ట చిత్తునకు వారర్ధమౌతారా?

తిరిగి వచ్చి అశ్వత్థామ రథాన్నధిష్ఠించి , యుద్ధానికి సిద్ధమయ్యే సరికే సూర్య భగవానుడస్త్రాద్రికిచేరుకున్నాడు. ఆరోజుకు యుద్ధాన్ని ముగింపు భేరీలు మ్రోయించారు. ద్రోణసూర్య దస్తమించాడు. పాండవశిబిరములో ఆనందకోలాహలం; కౌరవ శిబిరములో దుఃఖాశ్రువులు. అర్జునునికి మాత్రం చిన్న తనము నుండీ కన్నబిడ్డలాగ అస్త్ర విద్యారహస్యాలన్నీ బోధించిన గురుబ్రహ్మ ద్రోణాచార్యులను గురించి అర్జునుడు చింతాక్రాంతుడైయున్నాడు. సరిగా ఆసమయానికి వ్యాసులవారు ఆతని దగ్గరకు వచ్చారు. మహదానందంతో వారికి యెదురేగి తీసికొనివచ్చి కూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యాది విధులు సమర్పించాడు విజయుడు. వ్యాసమునీంద్రుడు అర్జునునకు శివతత్త్వాన్ని సంపూర్ణముగా బోధిస్తూ "నాయనా! నీకుయుద్ధరంగాన నీవైరివీరుల్ని, త్రిశూలముతో పొడిచి చంపుతాడు, కొన ఊపిరిగల వారిని నీ బాణాలతో వారిని నీవు నేల కూలుస్తావు.

ఆతడే సదాశివుడు, జ్ఞానులకు ధ్యానగోచరుడు. ఆతడు నిరంతరం నీరక్షకుడు గాగుర్తింపు. నీవాతనిపై పరిపూర్ణ భక్తివిశ్వాసాలనుంచు. నీకు విజయ మగుగాక! వెళ్లిపోయాడు.

**ఇది మహాభారతములో ద్రోణపర్వం ముగిసింది**



# సంపూర్ణ మహాభారతం



## కర్ణ పర్వము

ఇలా సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు దుఃఖాశ్రువులు నేలరాలుస్తూ, "సంజయా మనబలాలకు మూలస్థంభాల్లాంటి భీష్మద్రోణులస్త మింపగా యింక మిగిలి ఉన్నవాడొక్క కర్ణుడే. మన దుశ్శాసనుడూ కాన్పిస్తున్నారు. సరిగాయుద్ధం పదహారవరోజు'' అనగా; మహారాజా! మనవైపు యుద్ధ వీరులందరూ సన్నగిల్లుతున్నారు. దుశ్శాసనుడు సుయోధనునకు కుడిభుజమేనా? అయినా ఆతడు భీముని చేత ఘోరంగా చంప బడ్డాడు! కృష్ణార్జునులు హస్తములో కర్ణుడూ కాలునిదగ్గరకు చేరేడని" సంజయుడన ధృతరాష్ట్రుడు నేలకు తలకొట్టుకొని అంతఘోరమా? యెలాజరిగిందో వివరింపమన్నాడు. దుర్యోధనుడూ కర్ణుడూ యిరువురూ ఆప్తమిత్రులు ఆతని పరిస్థితి దాచకుండా చెప్పమన్నాడు.

ద్రోణవధానంతరం దుర్యోధనుడు సైన్యాధ్యక్షునిగా కర్ణుని చేయాలని నిశ్చయించుకొని, యెందుకైనా మంచిదని అశ్వత్థామనడగ్గా, ఆతడు ఆనందంతో కర్ణుడు పేరేచెప్పడం అందరి మనస్సులూ సంతోషించాయి. కర్ణసేనా నాయకత్వానికి అశ్వత్థామ ముందుకు రావడం, ధుర్యోధనునకు పరిపూర్ణానందం కలిగింది. కర్ణునిచూసి "మిత్రమా! ఆరోజు కుమారాస్త్రవిద్యా ప్రదర్శనములో మనము కలిసిన నాటినుండి మనయిద్దరి ఆత్మీయభావం ఆకాశాన్నంటు కుంది. యీ రోజునీవు యీ రణరంగాన వీరసమ్రాట్టువుగా అభిషేకంపొంది నన్ను గెలిపించు" అని ఆకర్ణుని సర్వసేనానిగా అభిషేకించాడు దుర్యోధనుడు. యింతవరకూ బాగానే ఉంది. యింత



సేనానాయకునకు అర్జును నకు కృష్ణసారధ్యంలాంటివారు కర్ణునకు సారధ్యం చేయడానికి కావాలికదా? అటువంటి వారెవరున్నారని దుష్టచతుష్టయం సమావేశమయ్యారు. ముందుగా శకుని "అల్లుడూ! యింత యెందుకు? ముందుగా ఆతిధ్యాన్నిచ్చి, ఆవైపు వెళ్లుతున్న శల్యరాజును కర్ణ సారధ్యానికి ఒప్పించలేవా?" "మామా! నీమాట గొప్పదే! కానీ మద్రరాజు ఒప్పుకోడేమో! అంతగొప్ప వానిని సారధ్యం చేయమంటే బాగుంటుందా? ఆయన యేమన్నా సామాన్యుడా? మీరందరే మన్నా కర్ణసారధ్యానికి పిలవడం బాగుండదేమో!" అన్నాడు దుర్యోధనుడు, కర్ణుడు, శకుని, దుశ్శాసనుడు, అశ్వత్థామ అందరూ కలిసి " రారాజా! నీవు తప్పకుండా వెళ్లి– అర్ధిస్తే శల్యుడు ఒప్పుకుంటాడని యేకగ్రీవ తీర్మానం. దుర్యోధనుడు దానికి యెంతగానో సంతోషించి. మద్రదేశాధిపతి దగ్గరకు వెళ్లాడు; శల్యుడు ఆదరణాప్యాయాలొలికిస్తూ " అల్లుడూ! ఓహోహో! యెప్పుడొచ్చావు? రా!రా!" అని ఒక ఉన్నతమైన పీఠంపై కూర్చుండ బెట్టాడు. "అల్లుడూ! రాజకుమారా! సుయోధనా? యేదోకార్యార్థివై వచ్చినట్లున్నావు. ఆకార్యమేమిటో తొందరగా చెప్పమనేసరికి" యెంతో సంతోషముతో నీవంటి యోధవీరునితో వచ్చాను. యికయుద్ధంగూర్చి నీకళ్లముందే జరుగుతుంది గనుక దానిని గూర్చి వేరుగా వివరింపనక్కరలేదు.

భీష్మాచార్యులూ, గురుదేవులూ యిద్దరు మహాపురుషులేకదా! యికమిగిలి ఉన్నవాడు ఒక్కడే. సేనాపట్టాభిషిక్తుని చేయమని అశ్వత్థామాది యోధవీరులందరూ నామీద ఒత్తిడితెస్తున్నారు. నీవూ పెద్ద వాడవు. నీయభిప్రాయంకూడా చెప్పా"లనగా! "సుయోధనా! ఆతనికి తప్ప కౌరవులకు మహావీరుడులేడ"న్నాడు శల్యుడు. "మామా! మీరన్నట్లు మహా వీరుడేకాని... "సుయోధనా! నసుగుచున్నావేమిటోచెప్పు? "అంతటి వానికి సారధ్యము చేయడానికి మనలో యెవరున్నారు" అన్నాడు దుర్యోధనుడు? "ఔనులేనట్లే?" శల్యుడు; యిప్పుడెలాగ? అర్జునునకు కృష్ణుడుసారధ్యములాగ, కర్ణునకూ్కడా తగిన సారధి కావాలికదా! యెవరున్నారో... ... అనగా; "నిజమే" అన్నాడు శల్యుడు.

"మామా! సుయోధనుడు నీళ్లునములుతూ... " అల్లుడూ! ఎందుకలా సందేహిస్తావు?" అనగా; మరి మరి... అన్నివిధాలా సమర్ధతగల... జంకుతూ; "సమర్ధతగల" చెప్పు? నీ... వయి... న" మాటరాకుండా? మహాకోపము నటిస్తూ "సుయోధనా! నీవేదోకాళ్లూ వేళ్లూ పట్టుకున్నావని మాస్వంత అల్లుళ్లను ఆహవానికి విడిచి రావడమే సిగ్గుచేటు. అటువంటినన్ను యెంత అవమానకరంగా చేసి సూతసుతునికి సూతకృత్యంచేయ మనడానికి నీ నోరెలావచ్చింది? నేనెవరినోతెలిసికొనే మాట్లాడుతున్నావా? నీకు చనువిచ్చానని చంకనెక్కి నెత్తికెక్కుచున్నావు. లేకున్న యింత అవమానంగా మాట్లాడతావా?" అనగా! దుర్యోధనుడు భయపడుతూ "మామా! నీసంగతిపూర్తిగా తెలిసియే నీ దగ్గర అలాంటి చనువున్నాది కాబట్టి కొంచము మాట్లాడగలిగాను. నీవెన్ని అన్నానిన్ను విడను"

అని శల్యుని రెండుహస్తాలూ పట్టుకొని బ్రతిమాలును. శల్యుడు కొంచము తగ్గి సారధ్యము వహించినంత మాత్రాన నన్ను సూతునిగా జమకట్టావనే బాధపడ్డాను. యిక నీముఖమ్మీదే చెప్తుతున్నాను. నేనెలా మాట్లాడినా కర్ణుడు ఒప్పుకొనాలి. లేదా! వెంటనే ఆతనిరథం దిగిపోతాను. యిది నావ్రతము" అనగా కడకు సుయోధనుడు యెంతగానో సంతోషించాడు. వెంటనే కర్ణదుశ్శాసన, శకునులకు యీ వార్త తెలిపి వారికి కూడా సంతోషము కలిగించాడు సుయోధనుడు.

కర్ణుని "మిత్రమా! యిప్పుడు నీవు కౌరవసైన్యాధి కారిగా అభిషేకించాము. నీవునాకు జయాన్ని చేకూర్చు"మని కౌగిలించుకున్నాడు; అప్పుడు మహావీరులందరూ కర్ణుని యెంతగానో అభినందించారు.

## పదహారవ దినము యుద్ధము

సూర్యభగవానుడు కౌరవపాండవుల యుద్ధాన్ని చూడ్డానికి యెంతో ఆత్రతచెందుతున్నాడో అన్నట్లుచీకట్లు అంతరించాయి. బాలభానుడు తూర్పుభామ ముఖాన తిలకంలాగ కానవస్తున్నాడు. ఆ సమయాన అంగరాజు లేచి కాలకృత్యాలన్నీ తీర్చుకొని యుద్ధములోనికి కావలసిన దుస్తులనుధరించాడు. నవరత్నఖచిత రథాన్ని ఆయత్తమొనర్చినాడు. మహత్తర కవచము కిరీటాన్ని ధరించాడు. తన శంఖాన్ని వైరివీరులగుండెలదరి పోయినట్లు పూరించాడు. వేసంగిలో మిట్ట మధ్యాహ్నము వెలుగు ప్రచండసూర్యునిలాగు కర్ణుడు రణరంగంలో దివ్య దీధితితో వెలుగొందుచున్నాడు ఆరోజు మకరవ్యూహాన్ని కౌరవసేనను పన్నాడు. ముఖభాగాన తానే స్వయముగా దివ్యునిగా అరిభయంకరునిలా నిల్చి ఉన్నాడు.

యెవరినెలానిలుపాలో ముందుచూపుతో వారివారిని ఆయాస్థానాల్లో విజయాన్ని ఆరాధిస్తూ నిలిపాడు; కాలానలజ్వాలా మాలికలతో నున్న రుద్రునిలాగ పాండవులకు కనుపిస్తున్నాడు. ధర్మరాజు అర్జునుని చూచి "విజయా! అటుచూశావా? కర్ణుని తేజస్సు? మనమిన్ని విధాలబాధలు పడడానికి యీతడేకారణం? అందువలన వీనిని అంతంచేయడానికి అద్భుతమైన వ్యూహాన్నిపన్ను" అనియుధిష్ఠిరుడన్నాడు; అగ్రజా! మీరేమీ మనస్సులో బాధ, అనుమానాలతో ఉండకండి" అని తనసేనను అర్ధచంద్రవ్యూహముగా అర్జునుడుతీర్చాడు. యిరువైపుల వీరుల సింహనాదాలూ, శంఖధ్వనులూ భూమ్యాకాశం మార్మ్రోగింపచేస్తున్నాయి. ఘీంకారాలతో మదగజాలు, గుఱ్ఱాల సకిలింపులు, రథనేమిఘోషలు, సేనల యేడుపులు, ఘోషలు నాలుగు దిక్కులూ ప్రతిధ్వనిస్తున్నాయి. వీరులభుజాస్ఫాలనలు, అది దొమ్మియుద్ధముగా మారింది.

కర్ణుడు పాండవ బలాన్ని నాశనంచేయనిదే కవచాన్ని విప్పనని; కౌరవులనంతంచేస్తానని కపిధ్వజుడర్జునుడు, యిరువురూ ప్రతినలుచేస్తూయుద్ధ భూమంతా వారేయై ప్రళయరుద్రులుగా యిరువురుసోదరులూ వెలుగుతున్నారు. సాత్యకిని కౌరవసేన ముట్టడించింది;. చోళ మాగధులు ద్రౌపదీకుమారులతో



మార్కొన్నారు. కులూతదేశనేత క్షేమధూతి భీముని పై దూకాడు. తనమహిత వీరశక్తినంతా పుంజుకొని ఏడుబాణాలతో భీముని వక్షముపై వేశాడు. భీముడు యేనుగునుకూడా కూలచేశారు. గదతో భీమునితో తలపడగా ప్రచండగదా యుద్ధమందు ప్రత్యేక శక్తిని సంపాదించిన ఆధూర్తుని తలనువ్రక్కలు గావించాడు. యిలాక్షేమధూర్తి చావునువిన్న కర్ణుడు వానిసైన్యానికి ధైర్యాన్ని చెప్పి అప్పుడు పాండవులపై విరుచుకుపడ్డాడు. ఆతనిధాటకకు పాండవులసేన మదగజాలన్నీ కకావికలయ్యాయి. అదంతాగమనించిన నకులుడు అగ్ని పై వేసిన ఆజ్యములా మండి కర్ణునితో తలపడ్డాడు. అలాకౌరవపాండవుల ద్వంద్వయుద్ధము ఘోరముగా సాగింది.

అశ్వత్థామ భీముని యుద్ధము హోరాహోరిగా సాగింది. యింకొక ప్రక్క విందానువిందులు చిత్రయుద్ధముగావించి సాత్యకిని గాయపరచారు. కృపాచార్యులతో ధృష్టద్యుమ్నుడు; దుశ్శాసనుడూ సహదేవుడూ తలపడ్డారు. అర్జునుడు సంశప్తకులతో ద్వంద్వయుద్ధము గావిస్తున్నాడు; ధర్మరాజు దుర్యోధనుడు కలిశాడు; యీ యుద్ధాన్ని మహేంద్రాది దేవతలందరూ చూసి ఆశ్చర్యపోతున్నారు. యింక కౌరవ వీరులూ పాండవ వీరులూ ద్వంద్వయుద్ధంచేయ రణభూమియందు నెత్తురుటేరులు ప్రవహిస్తున్నాయి. యింకొక ప్రక్క కౌరవసేనాధ్యక్షుడు కర్ణుడు నకులుడూ యుద్ధాన్ని చేస్తున్నారు. "కర్ణా! యెన్నాళ్లకు నీవు దొరికావు. సోదరులుగాఉన్న మామధ్య అగ్నిని రగుల్కొల్పి యిలాయుద్ధాన్నిచేసేవు. నీప్రతాపము అనన్యసామాన్యం. నిన్ను మెచ్చి మేకతోలు మెడలో వేయవలసిందే" అనగా నకులా! నాముందర కనబరచు. మాటలుకావు, పోటరివై నీశక్తి చూపించు" అని కర్ణుడు ఆతనిపై బాణవర్షాన్ని కురిపించాడు.

నకులుడు వేసిన ప్రతి బాణాన్ని మధ్యలోనే విరగ్గొట్టుతున్నాడు కర్ణుడు. నకులుని శరీరంలో ముప్పదిబాణాలువేయ నకులుడు వాటినితట్టుకొని డెబ్బదిబాణాలను రాధేయునిపైవేశాడు. అంతేకాదు వంద అమ్ములు వేసి కర్ణుని రథాన్ని కనుపించకుండా చేశాడు. యిక యిరువురూ వీరపుంగవులే! మంచి రసకందాయములో పడిందివారి యుద్ధం. నకులుడు అసామాన్య అద్భుత అస్త్రాలు సంధించడంలో నేర్పరితనము కలవాడగుట ఆతనినిచూచి కౌరవసేనలు భయపడి పరుగిడసాగాయి. యిదంతాచూస్తున్న కర్ణుడు నకులుని మీద విరుచుకు పడి ఆతడు పలాయనము చిత్తగించిన వరకూ వదల్లేదు. తరువాత పాంచాలసేనపై పడి వారిపని పట్టాడు కర్ణుడు. కృపాచార్యులు మహాకోపోద్రిక్తుడై ధృష్టద్యుమ్నునితో పోరుసాగించాడు.

యిలా కృపాచార్యులు వేస్తున్న బాణాలకు ధృష్ట ద్యుమ్నుని సారథిని రథాన్ని కూడా పోగొట్టుకున్నాడు. శిఖండి కృపాచార్యుల "ధాటికి ఆగలేక పారిపోయి భీముని శరణు చొచ్చాడు, అప్పుడు కృపాచార్యులు యెలుగెత్తి "ఓరీ! శిఖండీ! మొండీ!

మహాత్ముడైన భీష్మాబార్యులను నీవు పొట్టలో పెట్టుకొనగా; నీయన్న ధృష్టద్యుమ్నుడు మాబావగారిని యోగసమాధిలో సుండగా తలతీయడం యెంత ఘోరాతిఘోరమో ఊహించారా? యిలా మాయయుద్ధముచేతనే కౌరవుల గెలవాలనుకున్నారా? మూర్ఖులారా! రారండిరా ! నాతో యుద్ధముచేయండి?" అనితొడకొట్టాడు కృపాచార్యులు. ఆచార్యుల వారి శరాఘాతాలతో శిఖండి మూర్ఛపోయాడు.

త్రిగర్తాధీశుడు సుశర్మ యెప్పటినుంచో కక్షసాధించాలని అర్జునునిపై సర్వకాల సర్వావస్థల్లోనూ, అనగా రాత్రికలలోనూ చూస్తూండడంతో సరిగా ఆతనికి మంచి అవకాశమేలభించింది. ఆతడొక్కడేకాక తనవారందరిని వురికొల్పి, వారందరితోడ్కొని, ముఖ్యంగా సంశప్తకులు, సాళ్వాది పాండవవైరులందరినీ పోగేశుకొని అర్జునుని మీదకు యుద్ధానికి వచ్చాడు.

వీరందరూ కలిసి బాణవర్షాలను కురిపిస్తూ, అర్జునునకు యేవిధమైన అవకాశమూ యివ్వకుండా చుట్టుముట్టి యెడతెరపి లేకుండా బాణాలను వేయసాగారు. వారి బాణం శ్రీకృష్ణునికీ తగిలింది. రథాన్ని తోలు మునికోలను కూడా వారు పడగొట్టేరు. దాంతో అర్జునునికి యెక్కడలేని కోపమూ ముంచుకొచ్చి రుద్రడయ్యాడు. విరుచుకుపడి వారినందరినీ చెల్లాచెదరకొట్టి, కొందరిని యమలోకాన్నిచేర్చాడు. శత్రుంజయుడు మూర్ఛపడ్డారు, తరువాత ప్రాణాలను విడిచాడు. స్రొస్రుతి చని పోయాడు. సుశర్మ శరీరమంతా బాణాలు గుచ్చుకొని ముళ్ల మృగములాగున్నాడు. మిత్రసేనుడు ఒకరేమిటి వందలాది మంది అర్జునునిపైకి వచ్చిన వారెవ్వరూ ప్రాణాలతో బయటపడలేదు. అందరూ చనిపోయారు. అర్జునుడు మహేంద్రాస్త్రం వేసేసరికి సూర్యుడుదయిస్తే, చీకటిమూకలు కాన రానట్లు, ఒక్కడు కూడా కానరాకుండా పోయారు.

యిక్కడ యిలాజరుగుతుండగా, మరొకప్రాంతాన సుయోధనుడు ధర్మరాజుతో తలపడ్డాడు. దుర్యోధనుని రథాన్ని విరగ్గొట్టాడు ధర్మరాజు. యీదృశ్యాన్ని చూసిన కౌరవ వీరులందరూ కలిసి ధర్మరాజును చుట్టుముట్టగా; యీ సన్నివేశాన్ని చూస్తున్న పాండవీరులందరూ పరుగు పరుగున ధర్మరాజు దగ్గరకుచేరారు. వారికీ వీరికి ఘోరమైన సంగ్రామం జరిగింది. విరథుడు సుయోధనుడు తనపట్టువీడకుండా మొండిగా తొందరగా యింకొకరథాన్ని తెచ్చి దానిపై నుండి ధర్మజుని పైకి వెళ్లాడు. ధర్మరాజూ మహాపట్టుదలతో దుర్యోధనునితో కలిసి ద్వంద్వయుద్ధం చేయసాగాడు. ధర్మరాజు బాణాన్ని విరగ్గొట్టాడు సుయోధనుడు. యింకొక బాణముతో కౌరవాగ్రజునిచేతిలో గల బాణాన్ని పాండవాగ్రజుడు ముక్కలు ముక్కలుగాచేశాడు.

యిరువురూ సమానబలప్రపత్తి కలవారగుట చేత ఒకరికొకరు యేవిధముగా తీసిపోకుండా యుద్ధంగావిస్తూ, సుయోధనుడు ఒకశక్తిని ధర్మరాజు మీదకు వేయగా, ధర్మరాజాశక్తిని మధ్యలోనేద్రుంచివేశాడు. ములుకులతో గాఢంగా వేసి దుర్యోధనుని ధర్మరాజు యెన్నోవిధాల బాధించాడు. ఆదెబ్బలకు తేరుకోలేక పోయాడు.



దుర్యోధనుడు. దాంతో కృతవర్మ దూరాన్నుంచి వచ్చాడు. ధర్మరాజుతో యుద్ధం ఘోరంగా చేస్తూ ధర్మరాజును నొప్పించడము చూసి అర్జునుడు హఠాత్తుగా కృతవర్మపై పడ్డాడు. కృతవర్మనే కాకుండా అర్జునుడు అక్కడగల కౌరవ సేనలను ముక్కముక్కలుగా నరికివేశాడు.

మూర్ఛనుండి లేచిన సుయోధనుడు అర్జునునిపై దూకాడు. వాడి గల బాణాలను యెన్నో ఆతని మీదవేశాడు. యిక మహాకోపముతో విజృంభించి దుర్యోధనుని వాడి గలబాణాలతో కొట్టి, గుఱ్ఱాలు, రథము, జెండా విరగ్గొట్టాదర్జునుడు. మరొక బాణముతో ఆతని జెండాని ముక్కలు గావించాడు ఒక విషపూరిత అస్త్రాన్ని ఆతనిపై ప్రయోగించే సరికి కౌరవసేనలలో హా!హా! కారాలు చెలరేగాయి "దుర్యోధనుడు యీ దెబ్బతో చనిపోతాడు" అనిఘోషచెలరేగింది.

దీన్నిచూసిన అశ్వత్థామ వేగముగా రథాన్ని అర్జునునిపైకి నడిపించి ఆవిషబాణాన్ని మధ్యలోనే ముక్కలు ముక్కలు గావించాడు. అర్జునుడు మహాకోపముతో అశ్వత్థామను డీకొన్నాడు. బాణము, రథము, గుఱ్ఱాలను అశ్వత్థామాని చంపాడు. అడ్డము గావచ్చిన కృపాచార్యుల అస్త్రాలనూ విరగ్గొట్టాడు అర్జునుడు. కృతవర్మ అడ్డుకోగా ఆతని జెండా, గుఱ్ఱాలనూ చావకొట్టాడు– యింకయెదురులేక విజయుడు విజయమిచ్చిన దేవదత్తాన్ని పూరించాడు. ఆశబ్దంవిన్న దుశ్శాసనుడు కోపోద్రిక్తుడై పార్థునితో కలియబడ్డాడు. అర్జునుడు వెంటనే ఆతని విల్లును విరగ్గొట్టాడు.

## కర్ణుడు పాండవులపై విరుచుకపడుట

సాత్యకీ కర్ణులిద్దరూ యెంతగానో యుద్ధంచేస్తున్నారు. అది భయంకరముగా ఉంది. విజయుని విజయశంఖ పూరిత విజృంభణ, కౌరవసేనల దుస్థితి అంతా కర్ణుడు విని కలవరమందాడు. మహాకోపముతో అర్జునుని పైకి వీరంగంచేస్తూవచ్చాడు. "బావా! తక్కిన వారందరూ చేతులెత్తేశారు. కర్ణుడేమో కలకలలాడి కాలుకాలిన పిల్లిలాగ చాలాగంతులేస్తున్నాడు. మనరథాన్ని ఆతనిమీదకు పోనియ్యి" అన్నాడు అర్జునుడు. కర్ణుడు ఒకదివ్యాస్త్రాన్ని తీసి భయంకరంగా అర్జునునిపై వేశాడు. కృష్ణుని మీదా బాణాలు వేసి గాయాలు చేశాడు. కృష్ణార్జును లిద్దరూ ఆబాణఘాతాలకు శరీరమంతా రక్తసిక్తంకాగా యిరువురూ బాధపడ్డారు.

యిది చూసిన సాత్యకి, తనతో యుద్ధంగావిస్తూ, మధ్యలో కృష్ణార్జునులపైకి వెళ్లి నందుకు కోపముతో మధ్యలో వచ్చి దివ్యమైన బాణాలు వేశాడు కర్ణుని మీదకు. కర్ణుడు సర్దుకొన బోయేసరికి సాత్యకి వరుసగా వందబాణాలు మరల ఆతనిపై గుప్పించాడు. యిక దాంతో కౌరవ పాండవసంకుల సమరం అద్భుతంగా సాగింది. కర్ణుడే మాత్రం యింతఘోరంగా జరుగుతున్నా ఆత్రతపడడం, ఆవేదనపడడంలేదు. యికమహత్తర దివ్యాయుధాలను ప్రయోగించి పాండవ బలాన్ని చెల్లా చెదురుగావిస్తూ, యేనుగులనూ, గుఱ్ఱాలను, సేనలనూ మహమ్మారిలాగ పట్టిపీడించి చంపుతున్నాడు. దశదిశలూ ఆతని తేజస్సు, వీర విహారంవిస్తరించి పాండవుల పాలిటి కాల యముడులా తయారయ్యాడు.

ఎక్కడచూసినా మృతదేహాలు, హా! హా! కారాలు, అరుపులు, రొదలు, యేడుపులు, రక్తప్రవాహం యేరులై పారుతుంది. యీరోజుతో పాండవసేనంతా అంతమై పోతుందా? అన్నట్లుగా కర్ణుని యుద్ధం. ప్రచండభానుని వంటి ఆతని రూపం తిలకించడానికి వీలులేనట్లుగా ఉంది. పెనుగాలికి రాలిపోయిన తాళఫలాల్లాగ తలలు రాలినేలపడుతున్నాయి. పీనుగులు పెంటలు, భూమిదేవికి తర్పణం రక్తంతో యిచ్చినట్టుగా కానవస్తున్నాయి. మాంసపు ముక్కలు, కాళ్లుతెగి, చేతులు నరకబడి నడుము భాగాలు, తలలు తెగి చూడడానికి గొప్పభయంకరముగా చేశాడు సూర్యసూతి. యికకౌరవసేనల ఆనందం పట్ట పగ్గాలు లేకుండా ఉంది. పాండవుల్లో యెవరికి వారే మృత్యువాతలో పడ్డ యేడ్పు, ఘోషలు మిన్నుముట్టాయి. కర్ణుని యుద్ధవీరత్వం పదియారవరోజు వర్ణనాతీతం కురునాథా!" అన్నాడు సంజయుడు.

యిలా ఆనందసందోహం, కర్ణపర్వంగా కౌతూహలంగా ఉన్న కౌరవసేనలపై ప్రళయ రుద్రుడుగా పాండవ మధ్యము డొచ్చి విరుచుకు పడ్డాడు. నాలుగు దిక్కులూ మార్మ్రోత పిక్కటిల్లినట్లు దేవదత్తాన్ని పూరించి, గాండీవధ్వనిని అందులో కలిపి ధైర్య శౌర్య పరాక్రమోపేతుడుగా పెనుమంటల నార్పడానికి ప్రళయకాల వర్షముగా వచ్చి కర్ణుని విజృంభణను ఛిన్నాభిన్నంచేశాడు. మహత్తర అస్త్ర శస్త్ర ప్రయోగముతో కర్ణుని రణ తీవ్రతనంతా అణచిపెట్టాడు. రణ రంగమంతా భయంకరాగ్నిని సృష్టించాడు. సేనలను చంపినవారిని చంపి, కొందరు పారిపోగా అడవిలో ఎండుటాకులను కాల్చిన కార్చిచ్చులాగ చూపరులకు భయభ్రాంతి కలిగించాడు. చచ్చిన వారుచచ్చిపోగా, పారిపోయినవారు కాళ్లకు బుద్ధిచెప్పారు. యింతగా అర్జునుడు విరామములేకుండా యుద్ధంగావిస్తున్నా, అన్నిటా అంతకన్న మిన్నగా కర్ణుడు కూడా అద్భుతముగా యుద్ధంగావిస్తున్నాడు.



ఆ రక్తపు టేరులనూ, పీనుగులనూ, యేడ్పుఘోషనూవిని విని చూసిచూసి విసుగెత్తిన సూర్యభగవానుడు యింక చూడలేక అస్త్రాద్రివెనుక దాక్కున్నాడా అన్నట్లు అస్తమించాడు. నాలుగు దిక్కులకు పలుచగా చీకట్లల్లుకున్నాయి. అయినా యుద్ధం మాత్రం ఆగలేదు. పగలంతా విరామంలేకుండా యుద్ధము చేసి అలసిపోయినసేనలు, వీరులు, విశ్రాంతికై యెదురుచూస్తున్నారు. కౌరవ వీరులే యుద్ధవిరమణ ముందుగా ప్రకటించారు. కర్ణుడు సర్వసేనా నాయకత్వంవహించిన రోజు. ఆతడెంతగా ప్రాణాలకు తెగించి పోరాడిన సాయంసమయానికి మాత్రం పాండవులదేపై చేయిగా ప్రస్తుతింపబడింది మహారాజా! అన్నాడు సంజయుడు.

ఎవరి గుడారాల్లోకి వారు వెళ్లసాగారు. యిలాపదియారవదినం పూర్తి అయింది. బాగా రాత్రి అయింది. యిదిమంచి సమయమని కర్ణుడు మహానీయుడు ఆవేదనాలోచనలలో కొట్టుమిట్టాడుతున్న దుర్యోధనుని చూడ్డానికి వెళ్లేడు. "మిత్రమా! యెందుకిలా ఆవేదన చెందుతావు. నీవుయే ఆలోచనచేయకు. నేనుండగానీకు ఆలోచనేలా? రేపు సూర్యాస్తమయంకాకముందు నేనైనాభూమిపై, లేదా! కృష్ణార్జును



లైనా నిలవాలి" యిదే నాశపథమన్నాడు. "మిత్రమా! రేపు సారథ్యానికి మద్రాధిపతి కుదిరాడా?" అనగా; "అంగరాజా! ఆతనిని ఒప్పించడానికి నాతలప్రాణంతోకకు వచ్చినంత పనయింది; కర్ణుడు "ఇంతకూ శల్యుడు... ... "చివరకు యెలాగో ఒప్పుకున్నాడు" అన్నాడు సుయోధనుడు. "మిత్రమా? శల్యుడు సారథ్యంచేస్తాడు. కాని, ఆతడునిన్నెన్నో రీతుల పరీక్షచేసి మాట్లాడుతాడు. దానిని నీవేమాత్రం పట్టించుకోకు. మనమేదోవిధంగా మనకార్యక్రమాన్ని చక్కపెట్టుకొనునేర్పె చేసికోవాలి" అని దుర్యోధనుడనగా; "రారాజా! అదినాకు తెలీదా? ఆతడేమనినా యేమీ అనను. అందు ఆతడు మనకన్నాపెద్దవాడు. ఆతనిని నేనేమీ అనను. అసలు నేనేదీపట్టించుకోను. నేనతనిని పట్టినడుచుకుంటాను. మనకు ఆప్తుడైనందువల్ల అంతా ఆతనిష్టమునకే వదిలి పెడతాను. కష్టనిష్టూరాలాడినా క్షమించుకోవాలి.

శల్యుడు సూతకృత్యానికి సిద్ధమగుట కర్ణ సుయోధనాధులకెంతో పండగయింది. తక్కిన కౌరవవీరుల కెల్ల రకూ కర్ణపర్వమయింది. తన సారథిని పంపి ఉత్తమాశ్వాలను కట్టి మహత్తరమైన తనరథాన్ని తయారు చేయించాడు. సమస్త అస్త్ర శస్త్రాలను అందులో యెక్కడ యేవి ఉండాలో భద్రముగా నిలిపాడు. వాటన్నిటికీ పూజగావించాడు. తనకు జన్మనిచ్చిన తల్లిని, తండ్రి సూర్యభగవానునకూ వందనచందనలర్పించాడు. యికరథమునుండి నాకు విజయంచేకూర్చమని, రథాన్ని అధిష్ఠింపమని శల్యుని సాభిప్రాయముగా కోరాడు. కర్ణుడు రథాన్ని యెక్కి శల్యుడు కూర్చున్నాడు. "మద్రరాజా! రణరంగాన్నిచూడు" అన్నాడు కర్ణుడు. అంతేకాదు నీ సారథ్యం వలన మనమిద్దరంచుట్టరికం కలుపుకున్నాం. పదరథం సాగనియ్యి. కృష్ణార్జునులనగా నాకొకలెక్కేమి? నేను మహారథశ్రేష్ఠుడను. నీకు తగనని మాత్రం ఆలోచింపకు" అన్నాడు.

అదంతావిన్న శల్యుడు విషపునవ్వుతో కర్ణా! పాండవులగూర్చి మాట్లాడడానికి నీకు హక్కులేదు. అయిదుగురూ. అమరేంద్రుల్లాంటివారు. ఒకొక్కరూ ముల్లోకాలనూ గెల్వగల మహాదివ్య తేజస్సంపన్నులు. సత్యధర్మ న్యాయపదానువర్తులు. పరాత్పరుడైన శ్రీకృష్ణపరమాత్మ పరిరక్షితులు. అటువంటి వారికి యెదురుగా నిలవడానికే నీవు తగవు. సరేలే. తినగలిగిన దానికి రుచి చూడ్డందేనికి? యికకృష్ణార్జునులు నరనారాయణలు. అందువిజయుడు వేయు క్షణ క్షణము కొంగ్రొత్తాద్భుత అస్త్ర శస్త్రాలరుచి నీవు త్వరలో గాంచెదువుగాక! అనగా కర్ణుడూ చిరునవ్వుతో, "మద్రరాజా! నాబాణాలశక్తి లాఘవము త్వరలో నువ్వేచూస్తావు! మాటలేల?" అన్నాడుకర్ణుడు. శల్యసారథ్యంలో కర్ణుని రథం చూచిన కౌరవసేన, వీరులందరూ, పెద్ద యెలుగెత్తి కర్ణుని యెంతగానోశ్లాఘించారు. "కర్ణా! విజయీభవ! రాధేయా విజయోస్తు–అంగరాజా! స్వస్తి" అని యెంతగానో పొగడాయి.

దీంతో మరల కర్ణునికి గర్వం యెక్కువయింది. "యిదిగో! శల్యా! నీవుయీ అంగరాజు దానవీరశూరత్వం యేమితెలిసికో గలవు? ఒక్కసుయోధనునికి మాత్రమే

తెలుస్తుంది. అందుకే రారాజు నన్నంతగా అభిమానించడానికి కారణము. ఆతనికీ నాకూ అణుమాత్రమూ శరీరాలు తప్ప ఆత్మకు భేదములేదు" అన్న కర్ణునికి శల్యుడు. "కర్ణా! ఆయెదురుగా యెవరున్నారో నీవు బాగా తేరిచూసి, నీ బలమూ, యెదిరి బలమూ నిరూపించుకొని మరీ మాటలు కాక పోటులు చూపిస్తే అందరూహాయి! హాయి! భేష! భేషంటారు"అన్నాడు. "శల్యా! మరీ మితిమీరు చున్నావు. యిప్పుడు కృష్ణార్జునులను యేమిచేస్తానో! నీవే చూస్తావుగా!" "అవును ఉత్తరగోగ్రహణ సమయాన అందరూ నిన్ను చూశారుకదా?

అంతేకాదు దివ్యశక్తి సంపన్నుడు, లంకారి హనుమధ్వజము, పాశుపతాస్త్ర, గాండీవధ్వనులు, శ్రీకృష్ణపరమాత్మ రథసారథ్యముతో విజయుడు ముల్లోకాలనైనా గెల్వగలడు. ఆతని అక్షయతూణీరాలే చాలును మీవంటి వారినందరినీ ముంచడానికి కర్ణా! మాటలుకాదు పోటులు చూపిస్తే అందరమూ సంతోషిస్తాము. యికజాగ్రత్తగా వైరులనుయెదుర్కొను" అన్నమాటలకు కర్ణునకు కోపంవచ్చినా, దానిని కప్పి. నవ్వి "శల్యా! నీకు వైరులను ప్రస్తుతించడం ప్రతిరక్తకణములో జీర్ణించి పోయిఉంది. రథముపై కూర్చున్న దగ్గరనుంచీ నేను చూస్తున్నాను. అదే శాత్రవ ప్రశంసా పర్వం మొదలెట్టావు. నీకేమోకాని నాకు మాత్రము కృష్ణార్జునులిద్దరూ యేమీ కారు" అంచేత యిక మాటాడక నీపని నీవుచెయ్యి?" అన్నాడు కర్ణుడు. 'ఔనులే! ఉన్నమాటంటే ఊరుకు దూర మౌతారుకదా!" అన్నాడు శల్యుడు. నాకున్న భార్గవాస్త్రం విరోధులనందరినీ నాశనం గావిస్తుందని నీకు తెలియదేమో! జాగ్రత్త" అన్నాడు కర్ణుడు;. "ఓయీ కర్ణా! నీవు అర్ధరథుడవో! మహా" రథుడవో! నాకు తెలీదుగాని గాంగేయుడంతటి అమరుడందుకే నిన్నర్ధరథునిగాచేశాడు. ఆతడు నీశక్తిసామర్థ్యాలనెంతగా తెలిసికొన్నాడో! యికదుర్యోధనుడా! ఆతడు మూర్ఖుడు. తానుపట్టినకుందేలుకు మూడేకాళ్ళని వాదనకు దిగినవాడు. ముందువెనుకలు యేమీ ఆలోచించని అమాయకుడు. అందుచేతనే నిన్ను పూర్తిగా నమ్మి యీ యాహవాగ్నిలోకి దూకించాడు. కాన నీ వింక అనవసరంగా వాదించక ఊరకుండు. ఆతడునా కాళ్ళావ్రేళ్ళాపడి యెంతకాదన్నా! సరే అనబట్టి నీ విలా నన్నాడి పోసుకుంటున్నావు" అన్నాడు శల్యుడు.

అంతేకాదు కర్ణా! పూర్వము జరిగిన చరిత్రనాకు జ్ఞాపకమొస్తుంది.

**కాకము కథ**

ఒకప్పుడొకద్వీపాన కోట్లకు పడగలెత్తే ధనముగల వైశ్యుడున్నాడు. ఒక దినాన తల్లి దండ్రులులేని కాకి ఆతని పొలములో దొరికింది. యీతని పుత్రులు దానిని చూచి యెంతో కనికరమూ, జాలిగుండెలతో దానిని పెంచుచున్నారు. ఓయిరాధేయా! ఆవైశ్యులు తినగా మిగిలిన ఆహారాన్ని యీకాకము హాయిగాతిని బాగా శరీరాన్ని పెంచింది. దానికి ఆహారంకొరతలేదు. ఎక్కడకూ వెళ్ళక్కర్లేదు. పనీపాటూ అసలేలేదు. వైశ్యకుమారుల ఆనందానికి ఆకాకి చెట్లపైనుంచి క్రిందికిదూకి కొమ్మలపైకి



యెగిరిపడుతూ అనేకవిన్యాసాలు చేస్తుండేది. అలాజరగ్గా. ఒకప్పుడు రాజహంసలు అలాపోతుండగా కోమటి బిడ్డలు కాకమ్మా! ఆకాకులు యెంత తెల్లగా ఉన్నాయో చూశావా? అవి గగన మార్గాన యెంత యెత్తులో, యెంతహుందాగా, హుషారుతో, యెంతజోరుగా వెళుతున్నాయో. నీవూ వాటివలే ఎగరగలవా"?అన్నారు.

"యిప్పుడే చూడండి నాబలం?" అని ఆరాజమరాళాలతో పందె మొడ్డగా; అవిచూసి నవ్వి "ఓకాకీ! మమ్ము కొంగలనిభ్రాంతి పడుతున్నావేమో! మమ్మల్ని నీవు గెలవలేవు. నీవంటి పక్షులతో పందెముకడితే అదిబాగుంటుంది" అనగా ఆకాకి బాగా ఒళ్ళు బలిసి ఉందికదా! అది ఒప్పుకుంటుందా? యేది యేమైనానేను పోటీ పడవలసిందే. అని హంసలతో ఆకాశానికి వాటితో మొదట ముందుగానే యెగిరిందికాకి. అలా వెళ్ళగా తనజాతికాకులు దీనిని చూసి అరిచాయి. ఆహంసలు ద్వీపము దాటేవరకూ కాకి కన్నా సామాన్యముగా యెగిరి వెనక పడ్డాయి. కాకివాటిని చూసి నవ్వుతూ, అరుస్తూ ఉండగా రాజహంసలు, తమవేగాన్ని పుంజుకున్నాయి. కాకి వాటితో పాటే కొంత దూరం వెళ్ళి, జవసత్వాలుచల్ల బడగా బాగా నీరసించిపోయింది. వింటున్నావాకర్ణా! సాగరంపై హంసలు ప్రయాణం యీకాకి నీరసంతో నలువైపులూచూసి యెక్కడైనా యేదో చెట్టో తుప్పో ఉంటుందేమో అని ఆశించింది. అంతా సాగరమే! యింక గత్యంతరం లేక నీటిలో పడింది. అప్పుడు కనికరంగల ఒక హంస వెనక్కితిరిగి కాకినిచూసి "అయ్యో! కాకమా! నీవుబాగా మాకన్నాముందున్నావని అనుకున్నాము. నీ వీనీటిలో స్నానంగావిస్తున్నావా?" అనగా కాకి హీనస్వరంతో "ఓహంసరాజమా! నాజవసత్వాలుడిగియిలా ఉన్నాను" అనగా హంసతనకాళ్లతో కాకినిగొనిపోయి అచ్చటవిడిచి కాకాన్ని అలాబ్రతికింపచేసింది. కర్ణా! నిన్నుచూచి నీ ఆర్భాటం, నీప్రగల్భాలూ, విని కాకి కథ జ్ఞాపకం వచ్చిందయ్యా!" అన్నాడు శల్యుడు. కర్ణుడుకు శల్యుని కథ ఒళ్ళంతా మండిపోయింది. శల్యునిచంపాలని కూడా కర్ణుడు ప్రయత్నించాడు. అయినా శల్యుడు అనుభవము కలవాడు. శాంతివహించి, యింకా కర్ణుని సూటి పోటు మాటలతో బాధింపసాగాడు. మహావీరశూరామణి కర్ణుడు. మాటల వలన హృదయము వ్రీలిపోయింది. యేమిచేయడానికీ పాలుపోలేదు.

సారధ్యంచేసేవాడు రథికునకు అన్నివిధాలా ఉత్సాహాన్నిచ్చి తేజోవంతునిగా చేయాలి. మనస్సు చెడిపోయి, ఉత్సాహంచచ్చి పోయిన మహావీరుడైన కర్ణుడు యేమీతోచక యింతగా తనను నీరసంగా, నిరుత్సాహంగా, వ్యతిరేకంగా మాట్లాడిన శల్యునికి తనకథను కర్ణుడు వినిపించాడు మహారాజా! అన్నాడు సంజయుడు.

"శల్యరాజా! నీవు యింతవరకూ కృష్ణార్జునులను యెంతగానో పొగడావు. సంతోషమే కాని ఒక అతిరథ శ్రేష్ఠుని చిన్న బుచ్చి, యింకొకరిని హెచ్చు చేయడం భావ్యం కాదని నీకు తెలుసుకదా!

## పదిహేడవరోజు యుద్ధము- కర్ణుడు

యిలా కర్ణుడు తనశాపాలను చెప్పాడు. అయినా శల్యునికి కర్ణుని మీద కసింతైనా సానుభూతిలేక పోయింది. అంతేకాదు శల్యుడు తన మాటల్లో నీర సించాడని లోలోపల యెంతగానో సంతోషించాడు. ఉదయం మామూలుగా యుద్ధం ప్రారంభమయింది. "బావా! మనరథాన్ని కర్ణుని మీదకుతోలు" అన్నాడర్జునుడు. యిలా వారాలోచింపగా, అర్జునునిపై అపారంగా మహావిరోధాన్ని పెంచుకొన్న సంశప్తక వీరులు సరిగాకర్ణుని పైకి వెళుతున్న సమయాన అర్జునునిరథాన్ని అడ్డుకున్నారు. యిక కర్ణసుయోధనులు పాంచాలసేనలు, వీరులపై విజృంభించి యుద్ధంచేయసాగారు. యిక కర్ణయుద్ధం వర్ణనా తీతంగా ఉంది. సీనుగులుగుట్టలు గుట్టలుగాపడి ఉన్నాయి.

కౌరవసేనలు ఆనందమందగా, పాండవసేనలను పట్టిపల్లార్చగా, వారుచని పోయినవారు, పారిపోయినవారు, మహాభయభ్రాంతులతో నేలను దొర్లినవారు వేలాదిమంది ఉన్నారు. కర్ణుని యుద్ధమున చనిపోయిన వారినందరినీ ఊచకోతకోశాడు మహావీరుడు కర్ణుడు. అదిగమనించిన కర్ణుడు ధర్మజునివైపు తనరథాన్ని తోలించాడు. యింతలో పాంచాలవీరులు చనిపోగా మిగిలినవారిని ధర్మరాజుకు బాసటగా పంపించాడు ధృష్టద్యుమ్నుడు. ఆ అడ్డువచ్చిన వారితలలన్నీ కర్ణుడు నరికేశాడు. ఆయుద్ధములో కర్ణుని కుమారులు, కర్ణుని చక్ర రక్షకులుగా బాగా ఆతనికి సహాయము గావించారు. కర్ణునికి సహాయము యిలా లభించింది. కర్ణుడు ధర్మరాజును యెదిరించాడు. సాత్యకీ, శిఖండీ ధృష్టద్యుమ్నుడూ, నకుల సహదేవులూ, ద్రౌపదీ పుత్రులయిదుగురు వీరందరూ కలిసి భీముడు ముందుండగా కర్ణునికి అడ్డముగా నిలిచారు. దుశ్శాసన, దుర్యోధనాదులు భీముని వారించడానికి వచ్చినా భీముని ముందు నిలువలేక పోయారు. అప్పుడు కృపాచార్యులాది కౌరవ వీరులంతా భీమునికి బాసటగా ఉన్నవారినందరినీ చావమోదారు. యిదే సమయముగా భావించిన కర్ణుని ముగ్గురుకుమారులు. వీరులచంపి వీరవిహారంగావించారు. సాత్యకితో కర్ణునినందనుడు వృషసేనుడు కలియబడి విరథుండయ్యాడు. కర్ణునితో సాత్యకి అనేక విధాల బాధింపబడ్డాడు. భీమా– సాత్యకి, మొదలైన పాండవవీరులందరూ కలసి వచ్చినా కర్ణుడు మాత్రం వారలనులెక్కచేయక వారందరిపై బాణ వర్షాన్ని కురిపించాడు.

యిదికాదని కర్ణుడు ధర్మరాజు మీదకురథాన్ని నడిపించాడు. అయినా పాండవ సేన కర్ణుని అడ్డగింపగా, అడ్డువచ్చిన వందలమందితలలు నేలకురాల్చాడు రాధేయుడు. అది చూసి సాత్యకి, శిఖండి మొదలైన వీరులంతా కర్ణుడు ధర్మ రాజు దగ్గరకు చేరకుండా అడ్డమువచ్చిన వారిపై బాణవర్షాన్ని కురిపించి, ధర్మజుని దగ్గరకు వెళ్లాడు కర్ణుడు. అయినా చేదిసేన రాధేయుని నిలువరించారు. బ్రహ్మాండమైన సంకులసమరం మరల ప్రారంభమయింది. దానిపై అంగరాజు పాండవ వీరులసేనల



నన్నింటి మహామ్మారిలాగ అంతకపురానికి పంపుతున్నాడు. యిలా కర్ణుడు సమరాంగణమంతా తానే యై విజృంభింప సురసిద్ధ సాధ్యాదులు ఆతనిని యెంతగానో ప్రశంసించారు.

పాండవసేనలు చచ్చినవారు. చావగా మిగిలిన వారంతా సాలభంజికల్లా నిలబడి కర్ణుని వీరత్వాన్ని ఆశ్చర్యంతో చూడసాగారు. గురంతా ధర్మరాజుపైనే. కనుక పాండవ వీరులనందరనూ దూరముగా కొట్టి ధర్మరాజు మీది కురికాడు రాధేయుడు. యుధిష్ఠిరుడుకూడా తక్కువ తిన్నాడా? ప్రచండమైన బాణాలను కర్ణుని పైవేశాడు. అవితప్పించుకొని, మహత్తరదివ్యకవచాన్ని ధర్మరాజుది ఊడగొట్టాడు. చెప్పరాని ఊహించరాని, బాణాలములుకులు ధర్మరాజు శరీరమంతాగుచ్చినట్లు కర్ణుడు వేశాడు. మహాభయంకరశక్తిని కర్ణుని మీదకుప్రయోగింపగా, దానిని కర్ణుడు ముక్కలు ముక్కలుగావించాడు. వీరవిహారం చేయసాగాడు.

ధర్మరాజు మాత్రం సామాన్యుడా, రాధేయుని వక్షంపైని, చేతులపైని లలాటంమీద బాణాలను వేశాడు. దానికి కౌరవసేనలన్నీ యెంతో ఆశ్చర్యంతో చూశాయి. పాండవసైన్యం యెంతోపరమానందమందింది. దాంతో యింత మహావీరుడు యెంతోబాధకుగురయ్యాడు. తరువాతతేరుకొన్నాడు. ధర్మరాజుతో అసహాయశూరత్వం వీరత్వం ప్రజ్ఞాప్రాభవాలుబాగా సంపాదించాడు. ఆపాదమస్తకం క్రోధముతో కర్ణుడు క్రోధదేవతలా తయారయ్యాడు. ధర్మరాజుపై ఘోరాస్త్రాలను ప్రయోగించి ఆయుధాలులేని రిక్తహస్తుడుగా చేశాడు. యికకర్ణుని ధాకకు నిలువనేరని ధర్మరాజు యింకొక ప్రదేశానికి వెళ్లబోగా కర్ణుడాతని వెళ్లనీయలేదు.

"యేమిరా వీరుయుధిష్ఠిరులా? అయితే వీరికి యీవిరోధులేమి? యీరణరంగమున వీరవిహారమేమి? యీ క్షాత్రవధర్మం పాచికలాడ్డానికి పనికి వచ్చి నట్టుగా పగతురను యుద్ధమున కూల్చగలదా? పాపము నీకుయుద్ధమేల? యింటికి తరలి వెళ్లండి. నిన్నుప్రాణాలతోనే విడుస్తాను. యింక అవసరమైతే జూదమాడవచ్చుకదా!

అన్న కర్ణుని మాటలకు ధర్మరాజు చావలేకబ్రతకలేక మధ్యనయ్యాడు. యేమిచేయడానికీతోచలేదు. భీమునికి కర్ణుడుగావించిన పరాభవము జీర్ణించుకోలేక పోయాడు. దాంతో విజృంభించి కురుసేనలపై పడి భస్మంచేస్తున్నాడు. అప్పుడు శల్యుడు "కర్ణా! యేమి నీ యెత్తిపొడుపు? ధర్మదేవతా స్వరూపమే ధర్మరాజు. ఔనులే కేవల అధర్మాత్ముడవైననీకు ఆతనిసంగతి యెలాతెలుస్తుంది? యేది యేమైనా పాండవులు నలుగురూ ధర్మనందనుని దేవుని కన్న మిన్నగా పూజిస్తారు. అదినీకు తెలీదు. నీకెలా తెలుస్తుంది? తల్లెవరో! తండ్రి యెవరో తెలియని వాడివికదా!" అన్నాడు శల్యుడు.

భీముడు భీషణ విక్రముడై ధృష్టద్యుమ్నుని, సాత్యకికి అప్పచెప్పితాను మాత్రము కర్ణునితో యుద్ధానికి సిద్ధమయ్యాడు. కర్ణుడు కూడా భీమునిపై మహాభయంకర అస్త్రశస్త్రాలను వేశాడు. యిలా పెచ్చరిల్లు రాధేయుని ఒక్క అస్త్రాన్నివేసి మూర్ఛితుని గావించాడు భీముడు. యిందరిని పాండవ వీరులందరినీ భయభ్రాంతులను గావించే సూతసుతుడు భీముని అస్త్రముతో గిరగిరతిరిగి స్వహతప్పిరథముపై పడిపోయాడు. "ఓరీ మూర్ఖా! సూతసుతా! త్రిలోకార్చనీయ సత్యధర్మముల పరిరక్షణకై పుట్టిన ధర్మనందనుని ఆడరాని దుర్భాషలాడే నీ నాలుక యీకత్తితో కోసేస్తాను. అని పదునుగల కత్తితోవచ్చే భీముని శల్యుడు పట్టుకున్నాడు.

"అల్లుడూ! యీ సూత సుతునికి నోటి దురుసెక్కువ. ముందు వెనుక లాలోచించలేని వివేక శూన్యుడు. నీవిప్పుడు వీనినాలుక కోస్తే తప్పక మరణిస్తాడు. విజయుడు వీనిని చంపుతానని శపథముగావించాడు. అందు వలన వీనినేమీ అనకు" అని అడ్డుకున్నాడు. భీముడు "నిజమేమామా! నేనిప్పుడు వీడిని చంపితే అర్జునుడెంతో బాధపడతా"డని సమాధానపడ్డాడు. అప్పుడు భీముడు తనమాటను పాటించినందుకు శల్యుడెంతో ఆనందించాడు. సుయోధనునికి యీవిషయం తెలిసి యెంతగానో విచారించాడు. తనసోదరులు సమ– వికట శ్రుతవర్మలను భీమునిపైకి పంపాడు.

వారు వందలాది మదగజాలను. గుఱ్ఱాలను, సేనలనూ, రథాలనుగొని భీకరాట్ట హాసాలతో వచ్చి వాయుపుత్రునిపైకి విజృంభించగా ప్రళయకాలరుద్రునిలాగ భీముడు వేలాది సైనికుల, గజ, అశ్వాలను పరిమార్చాడు. యింతలో కర్ణుడు మూర్ఛనుండి విడివడ్డాడు భీమసేనుడు మాత్రం కౌరవసేనావాహినిని పట్టినల్లుల్లా నలిపి చంపివేస్తున్నాడు. కృతవర్మ రాగా సంకుల సమరం ప్రారంభమయింది. కర్ణుని అడ్డుకున్నాడు భీముడు. సంశప్తకులు మొదలగు వారినందరనూ గెల్చిన అర్జునుడు యిటు వైపువచ్చాడు. భీమకర్ణులు యుద్ధంచేస్తుండగా మధ్యగా సేనలను కర్ణుడు ముట్టడించాడు.

అశ్వత్థామ ధర్మరాజు కలిశారు. మహారాజా! ఆరోజు జరిగిన యుద్ధాన్ని తిలకించడానికి అమరేంద్రాలందరూ వచ్చి ఆశ్చర్యపోయారు. యింతలో దుర్యోధనుడూ, నకులసహదేవులూ యెదురై యుద్ధంగావింపబోగా, మధ్యలో ధృష్టద్యుమ్నుడు వచ్చాడు. సుయోధన రథ, తురగాలను ఆతడుత్రుంచాడు. అస్త్రాలను కూడా విరగొట్టాడు. సంశప్తకులను గెలిచిన అర్జునుని అశ్వత్థామ యెదిరించాడు. యిరువురూకొంతవరకు యుద్ధంచేయగా ఆచార్యకుమారుని మూర్ఛితునిచేశాడు అర్జునుడు. యింతలో పారిపోయిన సంశప్తకులు వచ్చి పాండవమధ్యమును ఢీకొన్నారు. ధర్మరాజును కర్ణుడు యెదిరెంచి ఆతనిరథాన్ని గుఱ్ఱాలను అంతంగావించాడు. అలా నకులసహదేవులతో ధర్మరాజు తమగుడారాలకు వెళ్లిపోయాడు.



ఆశ్చర్యకరంగా అందరినీ యెదిరించి కర్ణుడు యుద్ధంగావింపగా అర్జునునికే ఆశ్చర్యమయింది. "బావా! యీసమయాన కర్ణుడు భయంకరుడుగా నాకు కాన వస్తున్నాడు. రథాన్ని శిబిరానికి మళ్లించమన్నాడర్జునుడు. " అర్జునా! మీ అగ్రజుడు మనకు కానరాలేదు. ఆతడేమయ్యాడో! మనము ముందుచూడాలి. శిబిరానికి వెళ్ళాడా? ఆతనిని దారుణంగా కర్ణుడు అవమానించినట్లు తెలిసింది. ఆమనస్థాపముతో ఉన్నాడేమో! కొంచము అనునయించివద్దామనిరథాన్ని అటు నడిపాడు శ్రీకృష్ణుడు. ధర్మరాజు తనశరీరము నిండా కర్ణుని బాణములుకులను తీయించుకొని ఆగాయాలదగ్గర మందు పట్టించుకొని విశ్రాంతి తీసికొని ఉన్నాడు. నకులసహదేవులిద్దరనూ యుద్ధానికి పంపేశాడు.

ఆతనిమనస్సు మాత్రం మనసుగాలేదు. కర్ణుడు తనను ఆడరానిమాటలాడేదు. అవే ఆతనికి మాటి మాటికి తలపునకు వస్తున్నాయి. కృష్ణార్జునులు వచ్చారు. రావడంతో! "అర్జునా! కర్ణుడింక బ్రతికే ఉన్నాడా? నీవు వానిని చంపిమరీ శిబిరానికి వస్తావని యెంతో సంతోషించాను. నీవు కర్ణుని వధిస్తానన్నావనే ! నేను యుద్ధానికివచ్చాను. ఆకర్ణుడు నాకు బాగా సమ్మానముగావించాడులే! నీవింక ఆనందించు. యింతమహావీరుడవు. అమరేంద్రాదులిచ్చిన దివ్యాస్త్రాలన్నీ నీదగ్గరున్నాయి. యెందుకింత బేలతనం వహించావు? యింతజరిగిన తరువాత నిన్ననవలసిన పనేముంది? తప్పులన్నీనావే కదా? యింక యీ యుద్ధమెవరిగూర్చి? మూటాముల్లే సర్దుకొని మరల అరణ్యానికి వెళితేనే హాయిగా ఉంటుంది.

ఆసూతసూనుడు పలికిన ఒకొక్కపలుకూ నాగుండెలను పిండేశాయి. ఆయుద్ధంలో అలా అనరాని మాటలు అందరూవినగా ఆడుతుంటే బ్రతకుటతప్పేనాది. కాని ఆత్మహత్యమహాపాపమని ఊరుకున్నాను. అటువంటి ఆకర్ణుని వధించలేని అంతలేసి నీ అస్త్రశస్త్రాలెందుకు? యింతకూ నీగాండీవము కాల్చనా? యేది నీక్షాత్రం? యేదినీమగతనం?" అనిధర్మరాజు అధిక్షేపించేసరికి యింకేముంది? మహారాజా! తోకత్రొక్కిన త్రాచులాగ లేచాడర్జునుడు. యిప్పుడే యీతనిని వధిస్తానని ఖడ్గంతీశాడు. అప్పుడు అడ్డమువచ్చి "యేమోయ్ బావా! కర్ణుడను కొన్నావా? యీతడు మీ అగ్రజుడు యుధిష్ఠిరుడు. తిన్నగా కన్నులు విప్పిచూడు.

కర్ణుని ములుకుల లాంటి పలుకులకు పడరాని బాధపడి పలికిన మాటలు. సరేలే! పెద్దబావా! యీరోజు ఆసూతసుతుని అంతంచేసే వస్తాము. యిక నీమనస్తాపాన్ని శాంతింపచేసికో! అర్జునా! పదవెళదా" మని అర్జునుని తీసికొని కర్ణుని పైకి వెళ్లారు కృష్ణార్జునులు. యిక దారిలో కౌరవులు గావించిన దారుణకృత్యాలు, దాన్ని ప్రోత్సహించిన సూతసుతునిపోకడ, అభిమన్యువధలో కర్ణుని పాత్ర అంతా అర్జునునకు కళ్లకుకట్టినట్లు కృష్ణుడు నూరి పోసి బాగా ఆతనికి పౌరుషాన్ని యెక్కించాడు కృష్ణుడు. అప్పుడు అర్జునునకు ఆపాదమస్తకం

అగ్నిజ్వాలల్లోలాగ పౌరుషం ఉడికి కళకళమన్నది. కృష్ణార్జునుల రథం కర్ణుడు పైకి దూసుకొచ్చింది.

శల్యుడు కర్ణుని భుజము తట్టి "కర్ణా! అదిగో! నరనారాయణులరథం" అనిచూపించేలోగా, కౌరవపాండవసేనలు ద్వంద్వయుద్ధానికి తలపడ్డాయి. యింతలో భీముడు దుశ్శాసనునిపైకి దూకాడు. వాయుసుతుడు దుశ్శాసనుని విల్లూజెండాను విరగ్గొట్టాడు. ఆతని సారధినికూడా దునిమాడు. అయినాదుశ్శాసనుడేమీ బాధపడకుండా భీమునిమీద బాణ వర్షాన్ని కురిపించాడు. వాటన్నిటినీ ముక్కలుచేసి వాయు సూతి దుశ్శాసనుని శరీరమంతా చిల్లులుపడేటట్లు బాణాలు వేశాడు. భీముని గుఱ్ఱాలను చంపాడు దుశ్శాసనుడు. మహాకోపంతో ఆతని గుఱ్ఱాలను ముద్దగాచేశాడు భీముడు. దుశ్శాసనుడు పెనుగదతో భీమునిగుండెపై కొట్టే సరికి వాయుకుమారునకు పాతతపులన్నీ జ్ఞాపకానికొచ్చాయి.

యింకేముంది? భయంకరమైన భీముడు తనగదను ముమ్మారు త్రిప్పి దుశ్శాసనుని వేయగా నవరంధ్రములనుండి రక్తాన్ని క్రక్కుకొని నేలకూలాడు. వెంటనే భీముడు వచ్చి "ఓరీక్రూరుడా! దుశ్శాసనా! యేమిప్రేలావురా? దానికి ప్రతీకారాన్ని యిప్పుడనుభవింపుమని దుశ్శాసనుని గుండెలపై కాలువేసి తనకాలితో వాని కాలుని బిడిసిపట్టియింకొకకాలుతో తన్ని జీవముండగనే వాని గుండెలను రెండు చేతుల గోళ్లతో చీల్చి రెండు చేతులతో వాడివేడి రక్తాన్ని త్రావి" ఓకౌరవవీరులారా! వీడిని అడ్డుకోడానికిరండి! మీ బ్రతుకులు యిలాగేచేస్తాను. అని కేకలు పెట్టాడు భీముడు.

ఆభయంకర రూపముతో భీముడు ద్రౌపది దగ్గరకు బయల్దేరాడు. చూసిన వారందరూ "ఓహో! ఓహో! తొలగిపొండు భీమసేన మహారాజు దుశ్శాసనుని గుండెనెత్తురుత్రావి ఉన్మాదంతో మహోగ్రరూపంతో యిటేవస్తున్నాడు. దూరంగా పారిపొండు" అనే మాటలు ద్రౌపది చెవిలో పడ్డాయి. ఆమెపట్టరాని ఆనందంతో "యేమీ నాభర్త భీమసేనుడు దుర్మార్గుడైన దుశ్శాసన రక్కసుని చంపేడా? వాడి వేడి నెత్తురు త్రావేడా? యెంత చెవులకు హాయి గూరుస్తున్నాయీ మాటలు? భయంకరాకారముతో నాదగ్గరకే వస్తున్నాడా? అదేనాకూ, ఆనందం. ఆతనికి యెదురేగి జయమాల ఆతని గళములో అలంకరిస్తాను. భీముడు బీభత్సాకారముతో ఉన్మాదోద్రేకముతో వచ్చాడు మహారాజా! అంతవచ్చిన భీముడు హ్హా... హ్హా... హ్హా... యెంత సంతుష్టి! దుశ్శాసన రాక్షస హృదయ రక్తము యెంతమాధుర్యముగా ఉంది?

ద్రౌపదీ! పాంచాలీ! భీమపత్నీ! అనే సరికి ద్రౌపది "నాథా! ఇక్కడ రారమ్మ" అనగా; భీముడు "ఇదిగోవచ్చాను. యాజ్ఞసేనీ! గాంధారి నూర్గుర సుతుల రక్తపిపాసివి. భారతసామ్రాజ్ఞివయ్యావు." అనగా! "నాథాయింకా ఆలశ్యమేల?" అన్నది ద్రౌపది. "ఎన్నాళ్లనుండో నీహృదయకుహరంలో కణకణలాడు పరాభవాగ్ని చల్లార్చడానికి పచ్చినెత్తురుతెచ్చాను. దుర్మార్గ దుశ్శాసన హస్తాల వలన చిక్కుపడ్డ నీజుట్టును



సంస్కరించగా వచ్చాను. చేతులలో గల రక్తాన్ని చూపించి యెంత అపురూపమైంది యీతైలము? అని ద్రౌపది కురుల ఆరక్తపుచేతులతో చిక్కుతీస్తూ

యేమియీ సంస్కారభాగ్యం? నీవెంత ధన్యురాలవో కదా! ద్రుపదరాజ పుత్రివి, పాండు రాజు కోడలువు, తగినఫలమిదియే. నీప్రతినఫలవంతమైంది" అని భీమ ద్రౌపదులు మహదానందమందారు అని సంజయుడు దెల్పగా, ధృతరాష్ట్రుడు "సంజయా! యింతఘోరమైనవృత్తాంతాన్ని నేను వినలేను. అదిచాలించి తరువాత యేమయిందో విన్పించమన్నాడు. "మహారాజా! విను దుశ్శాసనుని వికృత వింత చావునకు కర్ణసుయోధనాధులందరూ యెంతగానో విచారించారు. కర్ణుడు "మిత్రమా! యీ రోజు కృష్ణార్జునుల అంతిమయాత్రచూద్దువు గానిలే!" అని మహాకోపంతో రణరంగంలో దూకాడు.

యిక్కడ అర్జునుడు "బావా! యీరోజు కర్ణునితో ప్రత్యక్షపోరాటం. విజయమో! విధ్వంసమో" అనగా "విజయు డెప్పుడూ విజయుడే" అన్నాడు కృష్ణుడు; "పరమాత్ముని కరుణ, మాధవుని సారధ్యమున పార్థునకు విజయమే!" అర్జునుడు. ధనుష్టంకారమువిని "అర్జునా! కర్ణుడు మనమీదికిటేవస్తున్నాడు.

**మ. "అమరేంద్ర ప్రమథేంద్రులంగెలిచి దివ్యాస్త్రంబులన్గొన్న వి**
**క్రమవైశిద్యము నేడు సార్ధకముగాగన్ కర్ణుతో పోరు ప్రా**
**ప్తమ య్యెన్; విజయాభి ధానమును బీభత్సప్రథా దర్పముల్**
**సమరక్షోణి నిరూపితంబులగు విశ్వఖ్యాతి నార్జింపుమా!"**

అర్జునుడు నారిమ్రోయించి కర్ణార్జునులకేకాదు, కాలపృష్ఠ- గాండీవాలు రెండింటికీ యిది మంచి పరీక్షాదినము. ప్రపంచంలో మహేశ్వానుడగు వీరమార్తాండు డొక్కడే వెలుగుతుంటాడు. కర్ణుడు వచ్చాడు నాహృదయము వజ్రమా? నాయాప్తమిత్రుడైన సుయోధనునికొరకు పార్ధునే బలి గొనాలా? సరే!

యిరువూరూ మహత్తర శంఖాలు పూరించారు. అర్జునుని పై ముందుకర్ణుడే అస్త్ర ప్రయోగంచేశాడు. అది మధ్యలోనే త్రుంచేశాడర్జునుడు. కర్ణుని శరీరాన పదునైన బాణాలు పదునెనిమిది నాటుకున్నాయి. అర్జునుని ఆగ్నేయాస్త్రానికి, కర్ణుని వారుణాస్త్రం. యిలా యిరువురూ మహాస్త్రసంపన్నులే! మహావీరులే! మహా బలులే ఒకరి కొకరు యెందులో నూ తీసిపోని వారే! అర్జునుడు బ్రహ్మాస్త్రంవేశాడు. కర్ణుడూ బ్రహ్మాస్త్రం వేశాడు, రెండూ ఘోరముగా యుద్ధంచేశాయి యెవరివి వారి వయ్యాయి. అర్జునుడు బాణాలకు కర్ణుని శరీరమంతా రక్త సిక్త మయింది. యిరువురకూ ఘోరమైన పోరు సాగుతుంది. దేవతలందరూ దివినుండి ఆశ్చర్యంతో తిలకిస్తున్నారు. అర్జునునిపై కర్ణుడు సర్పముఖాస్త్రంవేశాడు.

యెక్కడచూసిన కాలసర్పాలే! దానికి బదులు అర్జునుడు గారుడాస్త్రాన్ని సంధించాడు. యింకేముంది? సర్పాలన్నీ యెక్కడి వక్కడే సమసిపోయాయి. దివ్యాస్త్రం

తీసి " దీంతో అర్జునుడు సరి" అనివేయ శ్రీకృష్ణుడు రథాన్ని భూమిలోనికి దించ అర్జునుకిరీటాన్ని ఛేదించివెళ్లింది. మరల సర్పబాణంరాగా, అర్జునుడు తనదివ్య బాణాలతో దాన్ని ఛేదించేడు. ఆ అస్త్రం కొరకాకుండా పోవడంతో కర్ణుడు ఆపాదమస్తకంమంట లెగుస్తున్నాయి. మరొకదివ్య బాణాన్ని ప్రయోగింప బోయే సరికి సరిగా కర్ణుని రథ చక్రము పూర్వం భూసురుని శాపము మూలంగా భూమిలోనికి క్రుంగిపోయింది.

కర్ణుడు రథచక్రము నెత్తడానికి క్రిందికిదిగి. అర్జునా! కొంచము తాళుము. మద్రరాజా! భూమిలో కూరుకున్న రథచక్రము పై కెత్తుమ" నగా; "సూతసుతా! నేను నీకు సారథ్యమొనరించడానికే! యింకొకటి నేనేదీ చేయలేను. చేయను" అన్నాడు" ఆమాటవిన్న కర్ణుడు భుజముతో రథచక్రాన్ని ఎత్తగా భూమంతా కదులుతున్నా ఆచక్రము మాత్రం పైకిలేవలేదు. యింతలో ఒకబాణము రివ్వునవచ్చి కర్ణునిగుండెల్లో నాటింది. దాంతో కర్ణుడు "అర్జునా! యెంతనీచాని కొడి కట్టావు? నిరాయుధునిపై శరప్రయోగమా! గురిచూచి గుండి చీల్చుటా? సిగ్గు... నీకులేకున్నా పురషజాతికే... నిన్నింక క్షమింపను. రథమే అక్కర్లేదు.

భూమిపై నుండేయుద్ధంగావిస్తాను. నాగాస్త్రాన్ని తీసి నాహృదయమంతా కంపిస్తుంది. పృథాగర్భంవేదనా మయమౌతుంది. బాధ దుస్సహముగాఉంది. నిన్ను మహావీరుడవని భ్రమించాను. సహోదరుడవనుకున్నాను... యెంతమాత్రమూకావు. నేను రాధేయుడను. అని బాణాన్ని బయటకు తీసి చూచి యిది అర్జుననిదికాదు. పార్థుడు నా... సో... ద... రు... డే! యిలాందొంగ దెబ్బకొడతాడా? ఆతడు జగదేకవీరుడు. పృథా పుత్రుడు. కర్ణభ్రాత... కర్ణభ్రాత... యిటు వంటి నికృష్టపని చేయడు. యెప్పుడూ చేయడు. రారాజా!

యింకనేనేమి చేయాలి? యేమిచేయగలను? శక్తివంచనలేకుండా యుద్ధంగావించాను. నీభాగ్య చక్రము వంకరగా తిరిగింది. గాంధారేయ! రాధేయులకు శాశ్వతమైన వియోగమే సంప్రాప్తించింది. కృష్ణుని మాయాజాలమే ఫలించింది. విజయా! సోదరరక్తంతో యీ భరత సామ్రాజ్యాభిషిక్తుడవు కాబోతున్నావు. విజయుడవయ్యావు. అన్నలు కాని అన్నలకై అన్ననేహతమార్చుకున్నావు. పృథకు యేకపుత్రుడ వయ్యావు. తమ్ముడూ! ఒక్కమారు నిన్ను ముద్దు పెట్టు కుంటాను. యిదే మొదటిది, కడసారిదికూడా! రా! రా! పార్థా! పార్థా" అని కర్ణుడు ప్రాణాలు విడిచాడు. కర్ణునిలో నుంచి వచ్చిన ఒకవెలుగు అస్త్రాద్రికి వెళుతున్న సూర్యునిలో కలిసింది. మహారాజా! అన్నాడు సంజయుడు. భీముడు ఆనందంతో సింహనాదంగావించాడు.

ఇది మహాభారతములో కర్ణపర్వం ముగిసింది





# సంపూర్ణ మహాభారతం

## శల్య పర్వము



"మహారాజా! యింకేముంది? అంతా అయిపోయింది. నీపెద్దకొడుకు యేమహా వీరపుంగవునినమ్మి పాండవులకు చేయరానిపనులు చేయించాడో! అటువంటి కర్ణుడు అస్తమించాడు. కర్ణుని చావుకౌరవులలో ఆ బాలగోపాలనికి దుఃఖాన్ని మిగిలించింది. కర్ణుడు అస్తమించిన తరువాత ఆరాత్రి తనకు మిగిలున్న వీరులందరితో కలిశాడు. దుర్యోధనునికి కర్ణుని చావు పంచ ప్రాణాల్లో నాలుగుపోయాయి. యిక యెవరితో సంప్రదించాలి. ద్రోణాచార్యుల తరువాత అంతటివారు. కృపాచార్యులేకదా! ఆతడు అనేకవిధాల దుర్యోధనుని ఓదార్చేడు. "సుయోధనా! జరిగిన దానికి విచారించడం పురుషలక్షణంకాదు.

నీ బుద్ధి యింతవరకూ పెడత్రోవత్రొక్కింది. యిప్పుడు యీ బ్రతికి ఉన్నవారినైనా బ్రతికించుకొని బ్రతకడం మంచిది. నీకు యెవరు ఎన్ని విధాలా విజయాన్ని చేకూరుస్తారని హృదయ పూర్వకముగా నమ్మావో అటు వంటి అమరుడు గంగానందనుడు, ఆచార్యసార్థకనామధేయుడు, విల్లుపట్టిన వారికెల్లా గురుడు ద్రోణాచార్యులు, ఆబాల్యంగామైత్రితో మెలగి నీప్రాణలకన్న మిన్నగా చూసుకున్నావో! అటువంటి అంగరాజు, యీముగ్గురూ త్రిమూర్తులులాంటి వారు అస్తమించారు. వారితో నీ బలమంతా నీరు కారి పోయింది" అనగా; దుర్యోధనుడు ఆచార్యా! యెందరు యేమైనా పాండవులతో మాత్రంయీజన్మలో సంధికుదరదు.

అంతేకాదు ఆబాల్యము నుండీ, రారాజుగానే బ్రతికాను. అందరూనన్ను రారాజనే పిలుస్తారు. సమస్త భోగ భాగ్యాలన్నీ రారాజుగానే అనుభవించాను. భూసురులకు అగ్రహారాలన్నీ నాచేతి మీదుగానే యిచ్చాను. కవుల, పండితులవేదవిదు లందరికీ అపూర్వ సమ్మానాలు చేశాను. నాపరిపాలనలో ప్రజలకు యేలోటూలేకుండా చూశాను యాగాలు, యజ్ఞాలుచేసి దేవతలందరి ఆశీస్సులందాను. అటువంటి నేను యీరోజు నాదాయాదుల క్రింద చేయి సాచి అడగమంటారా? అదిన్యాయమే అంటారా ఆచార్యా? అందువలన నేను కొన ఊపిరున్న వరకూయుద్ధము చేసి విజయం సాధిస్తాను.

నా కిప్పుడున్నసేనతో పాండుపుత్రులను భండన భూమిలో ఓడిస్తాను. ఆ ఆత్మవిశ్వాసముమాత్రము నాకుంది" అని రేపుయుద్ధము సంగతి చెప్పమనగా "సుయోధనా! పాండవవీరులు, సేన మహదానందంతో ఉన్నారు. మన మీద కసితో వారీ రాత్రి మన మీదపడినా పడవచ్చు. అందువలన మీరు రాత్రి యీగుడారాలను విడిచి దూరంగా పోవుట మంచి" దనగా; అందరూ యుద్ధభూమికి నాలుగామడల దూరముగా ఉన్న నది ఒడ్డుకు చేరుకున్నారు. ఆతరువాత అతితొందరగా అక్కడ గుడారాలు యేర్పాటుగావించారు. ఆసన శయనాలు భోజనాలకు తగిన వసతులు చేశారు. మరునాడు సుయోధనుడు ఆప్తుడైన అశ్వత్థామను సలహా అడగ్గా! "రారాజా! మనకు మద్రాధిపతిశల్యుడు

సర్వసైన్యాధిపతి అవుతాడు. ఆతడే సర్వసమర్థుడన్నాడు. సుయోధనుని ప్రార్థన ఆనందంతో సైన్యాధికారిగా ఉండడానికి ఒప్పుకున్నాడు. ఆరాత్రిపాండవులు కూడా మరునాడేమిచేయాలో ఆలోచించడానికి సమావేశమయ్యారు; ధర్మరాజు శ్రీకృష్ణునిజూచి "బావా! నందనందనా! రేపేమిచేయాలో నీవే చెప్పా"లన్నాడు. అనగా; "ధర్మనందనా! సుయోధనాదులు మీ శల్యుని సర్వసైన్యాధ్యక్షుడుగా నియమించారు. యిక శల్యుని వధింపగలారు మనలో నీవొక్కడవే ఉన్నావు. వేరెవ్వరూలేరు" అన్నాడు. తరువాత తమగుడారాలుచేరుకున్నారు. మరునాడు పదునెనిమిదవరోజు యుద్ధము ప్రారంభమయింది. కురురాజా! మనబలం పదకొండు అక్షౌహిణులు. పాండవులవి యేడక్షౌహిణులు. అయితే పదిహేడు రోజుల యుద్ధములో రెండు వైపుల వారూ బాగానష్టపోయారు.

పాండవులకు మొదటినుండీ సైన్యాధ్యక్షుడు ధృష్టద్యుమ్నుడొక్కడే! మనకో! భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, యిప్పుడు శల్యుని అభిషేకించారు. ఎలాగైనా కర్ణుని చావుతో మన కౌరవసేనంతా బాగా నీరసించింది. అంతేకాదు మహావీరులైన భీమార్జునులు మనసేనను విపరీతంగా అంతంగావిస్తున్నారు. యిక యిద్దరు కర్ణునికుమారులనూ, సుశర్మతో కూరగాయలు తరిగినట్లు నకులుడు తలలునరికాడు. సహదేవుడు శల్యుని కుమారుని అంతంచేశాడు. యిక భీమశల్యులిద్దరూ గదాయుద్ధములో ఆరితేరినవారగుట ఒకరిగదతో, యింకొకరు కొట్టుకొని యిరువురూ



మూర్ఛితులయ్యారు. అడ్డముగా ధర్మరాజు వచ్చి శల్యునితో యుద్ధముచేయసాగేడు. శల్యునిరథాన్ని రక్షించేవాడిని ధర్మరాజు అంతంగావించాడు. అందుకు ప్రతిగా శల్యుడు చేదిరాజ కుమారులను యిరువదియైదుగురనూ చంపాడు ధర్మజుడు.

అశ్వత్థామ పాంచాలరాజును అంతంచేశాడు. యిక ధర్మజశల్యులయుద్ధం భీకరంగా ఉంది. ధర్మరాజు శల్యుని దెబ్బకు మూర్ఛపోయాడు. లేచిన ధర్మజ శల్యులయుద్ధం మహాభీలంగా సాగుతుంది. పాండవ వీరులందరినీ ముందూ వెనుక ప్రక్కలనుంచి ధర్మరాజు శల్యునితో సమరం సాగించాడు. అయినా పై చేయి శల్యునిదే అయింది. ధర్మరాజు మంచి ఆత్మవిశ్వాస బలముతో శంకరుని ఉపాసించాడు. పరమేశ్వరుడు ధర్మరాజు భక్తికి యెంతగానో మెచ్చుకొని ఒకమహాశక్తిని ప్రసాదించాడు. అప్పుడు ఆమహాశక్తిని సకీలక మంత్రయుతంగా ఉపాసించి ధర్మరాజు దానిని శల్యుని మీదవేయగా, మహాభీకరమై యుద్ధవీరులందరూ భయభ్రాంతులై పర్వులెత్తగా అది ముందుగా శల్యుని కవచాన్ని చీల్చి ఆతనిగుండెల్లోనుండి వెన్నులోనికి వెళ్లి భూమిలో దూరింది. దాంతో శల్యుడు నవరంధ్రముల నుండీ రక్తం క్రక్కుకొని భయంకరంగా అరుస్తూ భూమ్మీదపడ్డాడు. ప్రాణాలను వీడాడు. ఆతని సోదరుడు మహాకోపంతో ధర్మనందనుని యెదిరించి, ఆతని చేతిలోనేతడకు అంతమయ్యాడు. శల్యుని బంధుమిత్రులు వందలాది మందివచ్చి పాండవులచేతుల్లో సమసిపోయారు మహారాజా! యీరోజు పదునెనిమిదవరోజు యుద్ధంచాలా బీభత్సంగా సాగుతుం"దని సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పాడు.

కౌరవసేనంతా కొన్నివందల రథాలతో ధర్మరాజును ముట్టడించారు. అప్పుడు శిఖండి, ధృష్టద్యుమ్నాది వీరులందరూ కలిసి ఆరథాలను తుక్కుగా కొట్టారు. కృపాచార్యులు, కృతవర్మలు విజృంభించి పాండవసేనపై విరుచుకు పడ్డారు. గుఱ్ఱాల సమూహాన్ని సర్వనాశనంగావించిన జూచి, అర్జునుడు క్రోధావేశుడై, మనగుఱ్ఱపు దళాలన్నింటినీ రూపుమాపాడు. సహదేవుడు శకునితో యుద్ధంచేస్తుండ ఉలూకుడనే వాడు మధ్యలో రాగా, సహదేవుడు వానిని హత మార్చాడు. శకుని తనకుమారుని చంపిన సహదేవునిపై ప్రళయకాలాగ్నిలాగ రాబోయాడు. "మామా! శకునీ! నీమాయలు పాచికలలో చూపించావు. యిది యుద్ధరంగము. యిక్కడనీయాటలేవి పనికిరావు

యీరోజుతో అంతంవచ్చింది. దుర్మార్గుడా! బాగాదొరికావు. నీవింక యెవరితోనూ పాచికలాడక్కర్లే" దని ఆతని తల నేలరాల్చాడు. యిక శకుని చావుతో ఆతని సేనంతా పారిపోవుచుండగా, వారందరినీ హతమార్చాడు సహదేవుడు. దుర్యోధనుని రథాన్ని ముక్కలు ముక్కలుగావించ, పారిపోయి అలా అరణ్యములో ఒకహ్రదము దగ్గర ఉండిపోయాడు. యింతలో మహారాజా! ఆద్వైపాయన హ్రదము దగ్గర దుర్యోధనుని నేను కలిశాను. "సంజయా! మనవారు యుద్ధములో చనిపోగా మిగిలున్నవారెవరైనా ఉన్నారా?" అనగా కృతవర్మా, కృపాచార్యులు అశ్వత్థామలు

మాత్రమే బ్రతికున్నారు. తక్కినవారెవ్వరూ లేరని నేను చెప్పాను ధృతరాష్ట్రమహారాజా!" అన్నాడు సంజయుడు.

నాకు"జలస్తంభన" విద్యవలన యీమడుగులో ఉంటాను. యింకెవరికీ యీవిషయం చెప్పొద్దు. కొంచంకోలుకొని అనంతరం బయటకు వచ్చి పాండవుల నందరినీ వధించి, భారతసింహాసనాన్ని అధిష్ఠిస్తానని చెప్పాడు. అలాగే అని నేను వస్తుండగా దారిలో కౌరవ వీరత్రయం నాకు తారసించారు. ఆముగ్గురూ దుర్యోధనుడు యేమయ్యాడో తెలియక విలపిస్తున్నారు. జరిగినదంతా వారికి విన్నవించాను. యికపాండవవీరుల్లోని వారెవ్వరైనా వస్తారేమో అని నేను తొందరగా రథమెక్కివచ్చాను. మనవీరులంతా యుద్ధములో చనిపోయారన్న వార్తవిన్న వారిస్త్రీల యేడుపులు మిన్నుముట్టాయి.

పాండవవీరులు బ్రతికున్న మనవారినెవ్వరినీ యేమీ అనలేదు. యెందరినో క్షతగాత్రులను వారు పరామర్శించారు. అక్కడవైద్యగుడారాల్లో చేర్చివారికి తగినట్లు చికిత్స కూడా చేయించడము కూడా నేను కనులారా చూశాను మహారాజా! ధర్మ రాజావారి అనుమతితో యుయుత్సుడు వందలాదిమంది ఆ భర్తవిహీనులందరినీ రథాలపై హస్తినకు పంపాడు. విదురుడు మాత్రం యుద్ధములో యేమిజరిగిందో అంతఃపురాంగనలకు తెలుపవద్దని బాగా కట్టు దిట్టంచేశాడు. మహారాజా! సుయోధనా! బయటకువస్తే మనము నలుగురమూ పాండవులనుచంపి భరత సింహాసనాన్ని కట్టు కుందువుగాని" అన్నాడు. అప్పుడు దుర్యోధనుడందులో నుంచే "ఓమహావీరులారా! మీస్వామి భక్తికి కృతజ్ఞుడను. నేను విశ్రాంతి తీసుకుంటాను. మీరూ విశ్రాంతి తీసుకోండి. తరువాత సేనాబలాన్ని చూసికొని వారి మీదకు యుద్ధానికి పూనుకుందామన్నాడు.

అలాదుర్యోధనుడు ద్వైపాయన హ్రదములోనుండగా అశ్వత్థామ-కృపాచార్య, కృతవర్మలు వెళ్లడం, మడుగులో నుండి దుర్యోధనుడు మాటాడ్డం యివన్నీ విని వారికేమీ అర్థంగాక పోగావారు భీముని దగ్గరకు వచ్చి, జరిగిన విషయమంతా చెప్పేరు. భీముడు యెంతో సంతోషించారు. కారణం? కర్ణుడు చనిపోయినతరువాత, దుర్యోధనునికి మతి భ్రమణ కలిగింది. యేమీతోచక పాండవులింక తనపై బడి చంపుతారనే అభిప్రాయంతో ద్వైపాయనహ్రదములో దాక్కున్నాడు కురుక్షేత్ర యుద్ధభూమంతా వేయికళ్లతో పాండవులు, దుర్యోధనుని గూర్చి గాలించి తిరిగినా యెక్కడా జాడదొరకలేదు. అందువలన ఆనందంతో కృష్ణార్జునులు భీముడూ నకులుడూ సహదేవుడూ, ధర్మరాజు ద్వైపాయనహ్రదము గట్టుపైకి చేరారు.

కృష్ణుడు "ధర్మరాజా! యిప్పుడు దుర్యోధనుడు యిందులోనే ఉన్నాడు. ఆతడు మాటపడని మానధనుడు. ప్రాణమైనా పోగొట్టుకుంటాడు గాని. ఒకరితో మాటపడడు. అంచేత నీవాతని కఠినముగా మాట్లాడితేనే అందులో నుంచి కదిలివస్తాడు" అన్నాడు. పరుషంగా మాట్లాడితేనే బయటపడతాడు. యిదిచాలా



లోతైనదన్నాడు. ధర్మరాజు శ్రీకృష్ణుని వాక్యాలను శిరసావహించి యిలా అన్నాడు. "సుయోధనా! నీబ్రతుకు చివరకు ఇంత నీచంగా ఉంటుందని యెవ్వరూ యెప్పుడూ ఊహింపలేదు; నీవారందరూ రారాజని పిల్చారు. యిదేనా నీరారాజత్వం? నీకు సిగ్గుగూడాలేదా? అందరినీ చంపించుకొని చివరకు యీమడుగులో దాగున్నావు. పరువు, మర్యాదా ఉన్న వాడెవడూ యిలాచేయడు.

కర్ణుడుతో యీనీకౌరవ వంశ ఘనతంతా గంగలో కలిసిపోయిందా? బాగుబాగు! ఆతడు సూతుడు, నీవాతనికంటే తక్కువవాడివై ఆతనితో మైత్రిగావించి, జీవితమంతా మోసాలతో నింపి, తుదకు యిల్లాంటి నికృష్టజీవితాన్ననుభవిస్తున్నావు. దొంగలాగ యిందులో దాక్కోవడం నీరారాజత్వానికి పరాకాష్ట అవుతుందనుకొన్నావా? యీవలకురా! ప్రజలంతా నీవు పరమనీచుడవని కోడైకూస్తుంది. చిన్ననాటి నుండీ నీవు చేసిన పాపాలూ, అధర్మవర్తనా, చివరకు యీగతికి కారణమయ్యాయి. యికను శకునిమామలేడు. ఆతనికి చెల్లు చీటి నీవే యిచ్చావో! ఆతడే తీసి కున్నాడో పాపము మాయద్యూతములో వాని మహిమచూపించాడు. యిక నీనీచపు తమ్ముడు దుష్టదుశ్శాసనుడు నిండుసభలో పరమశీలవతి ద్రౌపదీదేవికి చేసిన పరాభవమే నిన్నీవిధంగా కట్టికుడుపుతుంది.

అందరినీ యుద్ధములో చంపించుకున్నావు. నీవు యుద్ధానికి జడిసి దొంలాగపారిపోయి వచ్చి యిందులో దాక్కున్నావు. నీవిలా దాగున్నా పాండవులు నిన్ను గాలించిపట్టి చంపకపోరు. పౌరుషమున్న సుక్షత్రియునకుపుడితే తిన్నగారా? రాజు బ్రతికితే రాజ్యాన్ని పాలిస్తాడు. యుద్ధంలో మరణిస్తే వీరస్వర్గమలంకరిస్తాడు. నీవు రెండిటికీ చెడిన రేవడి వయ్యావు. యిలా బ్రతకకు. నీబ్రతుకిలా పాడయిందని నేనెంతగానో విచారిస్తున్నాను. పరమపాపాత్ముడా! మూర్ఖుడా! వేగముగాలేచిరా? లేదా మాభీముడే నీజుట్టుపట్టుకొని యీవలికి యీడ్చి తెచ్చి ఆతని ప్రతిజ్ఞ ప్రకారం గదాయుద్ధంలో నీ రెండు తొడలూ విరగొట్టి అతి నీచముగా చచ్చి నట్టు చేయకముందే లేచిరా! లేకున్న మర్యాద దక్కదు. పౌరుషముందా? లేదా?

నీబ్రతుకు మంటబెట్ట ఛీ!... నీచుడా? యేముఖంపెట్టుకొని బ్రతుకుతున్నావురా! రాకున్నజుట్టు పట్టుకొని యీడ్చుకువస్తాము. తిన్నగారా! నువ్వుయెలాగూచస్తావు. పదిమందీ మెచ్చిన చావుచావరా?" అన్నాడు. అసలే చచ్చి ఉన్నాడు. ధర్మరాజు మాటలతో మరింతగా చచ్చాడు దుర్యోధనుడు. కోపాన్నీ, పౌరుషాన్నీ బిగియబట్టాడు. యేమీ చేయడానికీ పాలుపోదు. యీ నీటిలోనే ఉండిపోతే యేలాగైనా యీడ్చుకు పోయైనా చంపకమానరు. "ధర్మరాజా! నేను నీవెంతగా తిట్టినా క్షత్రియవంశాన జన్మించానుకాదా! నేను బయటకు వస్తే యుద్ధంమీతో చేయాలి. రథాలూ- గుఱ్ఱాలు- కాల్బలమూ- ఆయుధాలూ యేవీలేవుకదా? ఉన్నా, నాక్కావలసిన వారందరూ చనిపోయారు. వారి కళేబరాలపై నేను యుద్ధంచేయాలి? యింక నాకు యీ భూమిని పరిపాలించాలనే కోరికలేదు.

యిన్నినాళ్లూ భోగ భాగ్యాలతో యీడు లేని విధముగా రాజ్యాన్ని పాలించాను. యిక అరణ్యానికి పోయి తపోవృత్తిలో శేషజీవితాన్ని గడుపుతాను. నీవే యీ భారత సామ్రాజ్యాన్నంతా పరిపాలించుకో" అన్నాడు.

"దుర్యోధనా! యిప్పుడది గుర్తుకొచ్చిందా? దీనికోసం యెందరు మహాపురుషులు నీకాళ్ల దగ్గరకు రాయబారానికి వచ్చారు. చివరకు మనవంశానికే మూలపురుషుడు, మనందరి క్షేమాన్నే ఆకాంక్షించే వ్యాసభగవానుడు యుద్ధభూమిలోనికి వచ్చికూడా నీతోచెప్పాడు. అప్పుడైనా విన్నావా? మొగుడుచచ్చిన తరువాత ముండకు బుద్ధివచ్చిందట" అలా అంతా అంతమైనతరువాత యీవిషయాలన్నీ నీకు గుర్తొచ్చాయా? నీవుయిచ్చేవాడివి, నేను పుచ్చుకొన్నవాడినా? నీవు దయ దలచి నాకివ్వనక్కరలేదు. నేను నీ దగ్గరకు యాచనకురాలేదు. యుద్ధములో నిన్నుచంపిన తరువాతనే యీభూమంతా పరిపాలించుకుంటాము.

మహాసాధ్వి గాంధారీదేవి కడుపున చెడపుట్టావుకదరా? ముందుగారా! రా! బయటికి అప్పుడు మాట్లాడుకుందాం" యిలా అనరానివి చెప్పరానివి యెన్ని అన్నాడో ధర్మరాజు చెప్పలేము. యిన్ని అనుభవించి యిన్ని కఠోరవాక్కులు పడి చనిపోతేనే దుర్యోధనునకు యెంతో మేలు. చివరకు ధర్మరాజు మాటలు కత్తికోతల్లాంటివి భరింపలేక మడుగులో నుండి నీ కొడుకు బయటకువచ్చాడు గదను దాల్చి చూసిన వారందరికీ యెంతో అద్భుతాశ్చర్యాలను చేకూర్చింది. "ధర్మరాజా! యెందుకు నీకింత మొండిపట్టు. యిదంతా పరిపాలించడానికి నీకుసిగ్గుగాలేదూ? నేను గదా మాత్రంతో ఉన్నాను. నన్ను వదలకుండారప్పించారు; యిక ఆయుధాలతో పనేముంది?" అనగా! "సుయోధనా!

మేమైదుగురం, మాలో నీవు యెవరితో నైనాయుద్ధము చేయవచ్చు. జయిస్తే రాజ్యాన్ని పూర్తిగా నీవే పరిపాలించుకో! మాలోవాడే గెలిస్తే మాదేరాజ్యమనగా" సరేనన్నాడు సుయోధనుడు. "నేనేమైనా భీమునితోనే గదాయుద్ధం చేస్తాననా"గా, కవచాలూ మొదలైన వన్నీ ధర్మరాజు తెప్పించాడు. "నీకేదికావాలన్నా యిస్తాం. తుష్టిగా భోజనం కూడా నీకు సమకూరుస్తాం. నీకేమికోరికలున్నా తీరుస్తాం. జరిగినంత జరిగింది. గతజలసేతు బంధనమేల? యిరువురూ తలపడండి?" అని ధర్మరాజు అన్నాడు. భారతయుద్ధం ప్రారంభం రోజే.

బలరాముడు తీర్ధయాత్రలకు వెళ్లి తిరిగి అక్కడికి వచ్చాడు. యిక భీమసుయోధను లిర్వురూ బలరాముని దగ్గరే గదాయుద్ధాన్ని అభ్యసించారు.ఆతని సమక్షంలోనే వారిరువురి అంతిమ పోరాటం అంతా దైవయోగం గాకింకేముంది? యిరువురూ నడుములు బిగించారు.

**భీమదుర్యోధనుల గదాయుద్ధం**

పరమపుణ్యక్షేత్రం కురుక్షేత్రం. అచ్చటే భీమదుర్యోధనుల గదాయుద్ధం చేయడానికి మంచిదని నిర్ణయించుకున్నారు. యిరువురూ గదలూ కలిపేరు.



శబ్దాలుమిన్నుముట్టుతున్నాయి. ఒకరికొకరు తీసి పోనిమహావీరులే యిద్దరూ. ఒకరినొకరు కొట్టుకొనుచుండగా చూసే వారంతా భయభ్రాంతులయ్యారు. ఉద్దండగదా దండ ప్రచండయుద్ధంభీకరంగా సాగుతుంది. ఆప్రాంతమంతా ఉడికి పోయింది. కాళ్లతో, చేతులతో తన్నుకోవడం, పొడుచుకోవడం, భీకరమైన భరింపరాని ధ్వనులతో, బొబ్బలతో రెండు మదించిన ఆంబోతుల్లాగ, రెండుమద మాతంగాల్లాగ, రెండు యెనుబోతుల్లాగ, రెండు సింహాల్లాగ కేకలతో ఒకరినొకరు పొడుచుకొని కొట్టుకొనుచున్నారు.

ఆదెబ్బలధ్వనికి పరిసరప్రాంతమంతా భయభ్రాంతమయింది. చిత్రవిచిత్రగతులతో ఒకరినొకరినొకరు నిర్లక్ష్యం గావించుకోడంతో మొదలైన భీమదుర్యోధనుల గదాయుద్ధం సుమారు పదిహేడురోజుల సాగిన కౌరవపాండవయుద్ధం కన్నా ఘోరంగా సాగింది. ఒకరినొకరు పొడుచుకొనినందు వల్ల వారుదాల్చిన సువర్ణ భూషలన్నీ తెగికొన్ని- సగం తెగికొన్ని, పూర్తిగాక్రింద పడిపోయినవి కొన్ని, సువర్ణ స్థగిత నవరత్నాలూ క్రిందపడి మిరి మిట్లు గొల్పుతున్నాయి. బాగాదెబ్బలు తగిలి వాటి నుండి స్రవించే రక్తం గైరికధాతువులను ప్రవహింపచేస్తు వారి శరీరాలు మహాపర్వతాల్లాగున్నాయి. మీదికిపోయి, క్రిందపడి, వెంటనేలేస్తూ, తిరుగుతూ, అవకాశముదొరికితే ఒకరినొకరు చంపుకొనాలనే మహాపట్టుదలా కోపతాప ఆవేశాలతో చూచే వారందరికీ భయాన్ని కలిగిస్తున్నాయి. దుర్యోధనుని అనల్పగదాయుద్ధ ప్రావీణ్యతకు భీముడు మాత్రం సరిపోలేదు. ఆదెబ్బలకు ఆతడు మూర్ఛమునిగాడు. వెంటనేలేచాడు. శరీరాన్ని దులుపుకున్నాడు. దుర్యోధనుని భీముడు శక్తి కొలదీ ప్రావీణ్యతతో కొట్టుచున్నా ఆదెబ్బలను లెక్కచేయక దుర్యోధనుడు కొట్టినదెబ్బలకు మాత్రం భీముడు భరింపలేక పోతున్నాడు. యీవిషయం కృష్ణుడు కనిపెట్టాడు. "అర్జునా! మన భీమునికన్నా, దుర్యోధనుడు ప్రత్యేకమైన శ్రద్ధతో విలక్షణమైగదాయుద్ధ మర్మాలను, ఆశక్తి, దానిలో గల మెలకువులూ నేర్చుకున్నాడు.

మన భీమన్నది బండమొండితనం. యెవరినైనా మోటుగాకొట్టడం చేతనౌవును. తక్కిన విషయాలేవీ మనవాడికి తెలియవు. అన్నిటా ఆరితేరినవాడు దుర్యోధనుడు. ప్రత్యేకముగా గదా యుద్ధంపై బుద్ధి నుంచి నేర్చుకున్నాడాతడు. యీయిద్దరికీ తేడాయిది. అంతేకాదు. శాస్త్రం ప్రకారంగాయుద్ధం యిప్పుడు పనికిరాదు. మాయగాళ్లను, మాయాలతోనే వంచించాలి. వాళ్లదగ్గర ధర్మమార్గం యెంతమాత్రం పనికిరాదు. మోసాన్ని మోసంతోనే కొట్టడమంచిది. దుర్యోధనుని తొడలు విరగ్గొడతానని ప్రతినపూనేడు కాబట్టియిప్పుడు ధర్మాన్నివిడిచి వాడి తొడలు విరగ్గొట్టకపోతే. మనకు విజయం దక్కదు" అన్నాడు కృష్ణుడు.

భీమదుర్యోధనులగదాయుద్ధం మహా భయంకరంగా సాగుతుంది. చూపరులందరు విస్మయాందోళన చెందుతున్నారు. సరిగా దుర్యోధనుడు కొట్టిన

దెబ్బలకు భరింపలేక భీముడు సొమ్మసిల్లిపోయి నాలుగు దిక్కులకూ చూస్తూ, అర్జునుని వైపుచూడగా, అర్జునుడు తొడపై కొట్టమని సంజ్ఞచేశాడు. భీముడు అర్థము చేసికొని దుర్యోధనునితో ప్రాణాలకు తెగించి పోరాడుతున్నాడు. యిలా మహాభయంకరంగా సాగుచున్న గదాయుద్ధం అందరినేత్రాలకూ అద్భుతమనిపించింది. అవకాశానికి యెదురుచూస్తున్న భీముడు తన భీకరగదాదండాన్ని గిరగిరముమ్మారుత్రిప్పి దుర్యోధనుని తొడలపై వేయగా ఆదెబ్బతో దుర్యోధనుని తొడలు రెండూ విరిగిపోయి, భూమిపై పండి, రక్తపంకిలమై క్రిందదొర్లుతున్నాడు. "ఓరీ! నీచుడా! నిండుసభలో పాంచాలికి బట్టలు ఊడదీయించిన పాతకీ! క్రూరుడా! ఆనాడు నీవు చేసిన పాపము పండి యిలా పరిణమించిన ఫలము యిప్పుడనుభవింపు'' అంటూ అఖండభూమండల భారతపరిపాలిత సువర్ణస్థగిత నవరత్న కాంతులునాలుగు దిక్కులకూ విరజిమ్ము సుయోధనుని శిరమును భీముడుతన యెడమకాలితో పెడేలున తన్నాడు.

యిది అంతా చూస్తున్న బలరాముడు మహాకోపోద్రిక్తుడై "ఓరీ భీమా! నాకళ్లముందే అధర్మయుద్ధం చేస్తావా? అధోభాగాన్ని గదాయుద్ధములో కొట్టకూడదని తెలిసీ కొట్టావు. తరువాత అఖండమండలాధీశుడీ రారాజు కిరీటాన్ని యెడమకాలితో తన్నుతావా? యెంత పొగరురానీకు? చూడు నిన్నిప్పుడేమిచేస్తానో!'' అని బలారాముడు మహాకోపముతో భీమునిపై పడబోయేసమయాన కృష్ణుడు అడ్డువచ్చి, "సోదరా! నీకు తెలియని దేముంది? మాయగాడిని, మాయతోనే చంపాలి. ఆనాడు నిండుసభలో ఒకసాధ్వీమణి బట్టలు ఊడదీసిన పాపము ఊరక పోతుందా? యిలా అనుభవించాలి. అంతేకాదు ద్రౌపదీదేవిని యీదుష్టదుర్యోధనుడు తనతొడపై కూర్చొమ్మని, ఆమెభర్తలముందే అన్నాడు. అప్పుడే" ఓరీసుయోధనా! రాబోవుయుద్ధాన నీతొడలు విరగ్గొడతానని ప్రతిజ్ఞచేశాడు. ఆప్రతిన యీరూపముగా తీర్చుకున్నాడు.

అందువలన భీముడు నిష్కారణముగా దుర్యోధనుని తొడలు విరగ్గొట్టలేదు. యిది తగినట్టు జరిగింది. దెబ్బకు దెబ్బే అయింది. న్యాయమే. అన్యాయంకాదు. నీకు కూర్చిన యీ నీశిష్యుడు దుర్యోధనుడు పాండవులకు గావించిన ఘోరకృత్యాలు. యెవరెరుగరు? అందరికీ తెలుసు. కొంచం కనుమరుగయ్యాయి. అంతమాత్రాన మాసిపోతాయా? శకునిచే మాయద్యూతముగా పదమూడు సంవత్సరాలు అరణ్యవాసం గావించింది యీ నీప్రియశిష్యుడుకాదా? ఘోషయాత్రలో వారిని పరాభవింపబోయి ఘోరపరాజయంపొందినది యీనీ శిష్యుడేకదా? గోగ్రహణసమయాన అజ్ఞాత వాసాన్ని పాడుచేయాలనీ, మరల అరణ్య అజ్ఞాతవాసాలను చేయించాలనే నీచుడు యీనీ ప్రియ శిష్యుడేకదా? యుద్ధంవద్దు. యుద్ధము వలన శాంతిరాదు అని యీధర్మరాజు యెంతో మొత్తుకొని నన్ను రాయబారానికి పంపితే నిండు సభలో నన్ను బంధించాలని చూచినది యీనీప్రియశిష్యుడే కదా! భీష్మాదిద్రోణాచార్యాది పెద్దలందరు చెవినిల్లుకట్టు కొని



అర్ధం రాజ్యంకాదు, పోనీ కనీసము అయిదూళ్లు వారికి యియ్యి యుద్ధమున సర్వనాశన మవుతుందని చెప్పి చెప్పి విసిగిపోయినట్లు చేసిన వినని వాడు యీ నీప్రియ శిష్యుడేకదా! యిన్నీ తెలిసిననీవు యీనీ ప్రియశిష్యుని ఒక్కమారైనా మందలించావా? భీముడు గావించింది. అన్యాయమని అన్నావు. అర్జునుడు దూరంగా యుద్ధాన్నిచేయు యేర్పాటు చేసి పసిబాలుడు మహావీరుడైన మన అభిమన్యుకుమారుని ఘోరంగా చంపించిన వాడు యీనీ ప్రియశిష్యుడేకదా! అది అన్యయంకాదేమి? అప్పుడు నీవు అన్యాయమని ఒక్కమాటాడలేదు. యిక యింతకూ, ఒకరిది న్యాయం. మరొకరిది అన్యాయం అనడానికికూడా మనకు అణుమాత్రం అవకాశంలేదు.

అంతాకాలపురుషునిది, రాబోవు కలికాలప్రభావం. మనం దేనికీ కర్తలముకాదు. యింతనీచంగా తొడలు విరిగి పడిపోవాలని నీ శిష్యునికి యోగముంది కాబట్టే అలాజరిగింది. అంతేకాని. యిందులో న్యాయాన్యాయాలు మనం విడదీయలేము. అందుకే " సత్యమేవజయతే– ధర్మమేవజయతే" అన్నారు. యిక్కడ సత్యధర్మాలు రెండూ జయించాయి" అనుకృష్ణుని వాక్కులకు బలరాముడు మారు మాటాడలేకపోయాడు. అచ్చట లేకుండా వెళ్ళిపోయాడు. "ఓమహావీరులారా! ఆనాడు వీనితొడలు విరగకొడతాననీ, దుశ్శాసనుని రొమ్ముచీల్చి రక్తం త్రాగుతాననీ ప్రతినచేసి దానిని నిలపెట్టుకున్నాను. వీని పాపకృత్యాలే యిలా చేశాయి. యిక స్వర్గనరకాలు యెలా ఉన్నా అనుకున్నపని చేశానని ఆత్మతృప్తి నాకుంది. యేది యెప్పుడు యెలాజరగాలో కాలమే నిర్ణయిస్తుంది. వీడు పాండవులకు చేసిన చేయించిన అన్యాయాలు యిన్నీ అన్నీకావు. అని భీముడు మళ్లీ తన వామ పాదముతో దుర్యోధనుని తలను తన్నాడు.

అంతలో ధర్మరాజు "భీమసేనా! వీడు మనపెద తండ్రికుమారుడు వీరుడు. దుర్యోధనుని సమీపించి" సోదరా! నీకిటువంటి దిక్కులేని గతివచ్చిందా? యుద్ధంవలన యీగతిపడుతుందని నాకు ముందే తెలుసు. కాని నీవువిన్నావా? వింటే నీకీస్థితి వచ్చేదా?" అని దుఃఖించాడు. అందరూ సుయోధనుని అచ్చట విడిచి పాండవులు సేనలతో యెవరిగుడారాలకు వారు వెళ్లుచుండగా సూర్యాస్తమయమయింది. అర్జునుడు, కృష్ణుడు మొదలగు వారందరూ వెళ్లారు. రథాలనూ, గుఱ్ఱాలను యెక్కడవక్కడ కట్టారు. కృష్ణుడు తనరథాన్ని మెల్లగా దిగాడు. యింతలో పెద్దవెలుగు నాలుగు దిక్కులనూ మండించి నట్లుగా జిగేల్మంది. అర్జునుని జెండాపైనున్న శ్రీహనుమన్మూర్తి అనేక భూతగణాలతో అదృశ్యమయ్యాడు. దానికి అందరూ ఆశ్చర్యమందారు. మంటలు అర్జునుని రథాన్ని కాల్చివేశాయి. అర్జునుడు యెంతో అద్భుతాశ్చర్యాలతో చూడసాగాడు. "అర్జునా! యేమలాచూస్తున్నావు? భీష్మాదిమహావీరులందరు, ఘోరమైన దివ్యమైన ఆయుధాల అగ్ని అది. యీనీరథం ఆయగ్నివలన యెప్పుడో కాలిపోవాలి. కాని యిప్పటి వరకూ నేనేఆపాను. యుద్ధమంతా ముగిసింది. ఆరథము పనీ అయిపోయింది. దీనికి ఆశ్చర్యమేల?" అన్నాడు కృష్ణుడు.

ధర్మరాజా! నీవుఅర్జునుని నాకు చూపించి "మాధవా! " యీతని రక్షణ భారమంతానీది" అన్నావు. అలాగే యుద్ధంలో విజయాన్ని చేకూర్చాను. యిక నీతమ్ముని నీకు అప్ప చెప్పాను" అన్నాడు కృష్ణుడు. కౌరవ. శిబిరాలన్నీ నాశనమై ఉన్నాయి. పాండవులకు అక్కడ ఉండడం క్షేమముకాదని కృష్ణుడు చెప్పి మొత్తంపై అందరూ బయల్దేరి ఓఘవతీనదీతీరానికి చేరారు.

అశ్వత్థాను ఆరణభూమికి వచ్చాడు మహారాజా! కటికి చీకటి పిశాచాలూ, ఘూకాలు, నక్కలూ, అరుస్తూ, అన్నీగొంతుకలు కలిపి యేడుస్తూ, అక్కడగుట్టలు, గుట్టలుగా పడిఉన్న శవాలను పీక్కుతింటూ ఆనందిస్తూ ఉన్నాయి. ఆభయంకర యుద్ధభూమిలో ఒంటరిగా కరదీపిక కూడా లేకుండా, యెవరూలేకుండా, నాలుగు సముద్రాలమధ్యగల భూమినంతా పరిపాలించే సార్వభౌముడు, భరతవంశసుధాముడు సుయోధనుడు నా రారాజు "అయ్యో! అంతిమసమయాన మిణుగురు పురుగుల కాంతిలో గడుపుచున్నాడు. గట్టిగా! "మానధనా! సుయోధనా! మిత్రమా! యెక్కడ?" అనగా సుయోధనుని కొన ఊపిరి మూలుగు అశ్వత్థామకు వినిపించింది. ఆమూలుగు శబ్దాన్ని బట్టి వెళ్లాడు.



దుర్యోధనుని కౌగిలించుకొని అయ్యో! నిలవలేని నిర్భాగ్యులకు నీడనిచ్చి నిలవబెట్టిన నీకు యీరోజు నీడలేకుండా అయ్యావా? ఔరా! కాలమహిమా! దుర్యోధనుడు "గురుపుత్రా! తొంబది తొమ్మండుగురు సోదరులు, నా ఆరవప్రాణము కర్ణుడు, అమరుడైన పితామహుడు, ఆప్తులు, మిత్రులు, అందరు రణయజ్ఞములో ఆహుతిగావించి నేనింకా నిలవాలా? నాకుమరణమే శరణ్యము. నేను బ్రతకాలనే ఉన్న పాండవులలో నకుల సహదేవులలో యే ఒక్కరినో తులా యుద్ధములో కోరుకొని జయించనా? భీమునేయెందుకు కోరుకుంటాను? ఒక అర్ధదినము భీమునితో గదాయుద్ధముగావించాను. భీముడు అలిస్తే విశ్రాంతి తీసికొనమన్నాను. అద్వితీయగదాయుద్ధ కళానిష్ణాతుడ నయ్యూవక్రమార్గము మాత్రము త్రొక్కలేదు" అనగా; అశ్వత్థామ "కానినిన్ను మాత్రము, అధర్మముగా, గదాయుద్ధవిరుద్ధముగా తొడలు విరుగగొట్టాడు భీముడు.

అనగా; "గురునందనా? అర్జునుడు తొడతరచి సైగచేయగా, కృష్ణుడు నిష్ఠురాలాడి, నాశక్తినీ, ఉత్సాహాన్నీక్రుంగదీశాడు. నాకిప్పుడు మరణమేకావాలి" అనగా అశ్వత్థామ రారాజా "ఘోరము! ఘోరాతి ఘోరము, కృష్ణుడు, ధర్మరాజని పించుకొను యుధిష్ఠిరుడు నీయందు అధర్మమూర్తులయ్యారు. యింతదుష్కర్మ చేయగా భీముడు వారందరూ ఊరుకున్నారా? ఆహా! కన్నులచింతామణి హస్తమున స్పర్శవేది, పాదాల్లో పద్మరేఖలుతో నవరత్న ఖచిత సువర్ణ కిరీటముతో, బంగారు రథముపై నవఖండ భూమండలాన్నంతా యేకాత పత్రముగా పాలించి "రారాజను సార్థక నామాన్ని పొందిన భరతవంశాధిపుని పవిత్రశీర్షాన్ని వీరుడై భూమిపై నొరిగిన సమయాన నీచాతినీచముగా పాదముతో తన్నుటా! ఆవేశము పట్టలేను. యీపంచ



భూతాలు యెలా ఊరుకున్నాయి? యీభూమంతా కంపించలేదేల? ఆకాశము బ్రద్దలగుటలేదేమి? ప్రళయ జంఝూనిలము ప్రకృతినంతటినీ బీభత్సముచేయదేల?" అని అశ్వత్థామ యెంతగానో ఉడుకెత్తిపోయాడు. మహారాజా! అప్పుడు నీపెద్దకొడుకు "ద్రోణనందనా! జరిగిన దానికి విచారించకు. నాజీవిత నాటకములో కాలయవనిక వ్రాలింది. నాసర్వస్వమూ నశించింది. కాని... కాని...కా... నిరాశాంధకారాన... ఇంకా..." అనగా; అశ్వత్థామ "ప్రభూ! యేమిమిగిలుందో ఆనతివ్వండి?" అనగా దుర్యోధనుడు "ప్ర... తీ... కా... ర... ము..." అనగా మరల అశ్వత్థామ "ప్రతిఘాత" అన్నాడు. సుయోధనుడు "ఔను గురు పుత్రా! ప్రతిహింస! యుద్ధమింకా ముగియలేదు. మిత్రమా! నాసేనానివి. నీవేనా సర్వసేనానివి. సేనవూనీవే, భీష్మ- ద్రోణాదులవలె యెంతో సైన్యము లేకపోయినా ఒకే ఒక్కసైనికుడవు, నిన్నే అభిషేకిస్తున్నాను. చస్తూ బ్రతుకు సంధ్యాసమయాన కౌరవసేనానిగా నిన్నభిషేకిస్తున్నాను. కర్తవ్యమార్గమున ముందుకుప్రయాణించు. కృప-కృత వర్మలే నీకిప్పుడు అంగరక్షకులు. నాకిరీటము యేలాగూ ధూళిలో... కాదు సోదర మిత్ర రక్తపంకంలో లయమై పోయింది. నారాజదండము శత్రువంచనము చేత శకలాలయింది. సేనానికీయడానికి ఒక్కరాజ లాంఛనమూ లేదు

రక్తముతో అశ్వత్థామకు తిలకము పెట్టును" అనగా, అనగా! ధన్యుడను! మహాప్రసాదం. రారాజా! నీయాజ్ఞశిరోధార్యము. భీష్మ- ద్రోణ- కర్ణులు పొందిన కౌరవసేనా నాయకత్వము ప్రసాదించావుకాని... రథాలూ, గుఱ్ఱాలూ, యేనుగులూ, మహాస్త్రశస్త్రాలు, అపారసేనా వాహిని కృష్ణ- ధృష్టద్యుమ్నులు రక్షసేయు పాండవ వీరుల జయింప, యేమీలేని నేను నీచే సేనానాయకునిగా అభిషేకింపబడ్డాను. ఐనా! బాధలేదు రారాజా! ప్రత్యేకంగా, రహస్యముగా అర్జునునికి చెప్పక నాకు మాత్రమే నాతండ్రి ఉపదేశించే దివ్యాస్త్రాలు, అమూల్యనిక్షేపాలు, ప్రాణప్రదముగా దాచుకొన్న రహస్యాయుధాలు అన్నీ త్యజించాను. అయినా ప్రతిచర్య- ప్రతిఘాత! సుయోధనుడాలించి "మిత్రమా! నిజమే! రాజకార్యనిర్వహణము, ప్రతిజ్ఞా పాలన, ద్రోణ- కర్ణులు తప్పినమహత్కార్యమునే నీవాచరించాలి. ఈనీ ఆశయములో, ఈనీ ధర్మమందు, ఈనీ విధ్యుక్త కార్యాచరణమందు, నీతికి గాని, న్యాయానికిగాని, మానవత్వానికైనా స్థానంలేదు.

కౌరవవాహినీపతీ! శత్రుదమనము కాదు. శత్రువినాశనమే నేనా దేశించు చున్నాను. పాండవ నాశనము చూచికాని నాప్రాణాలుపోవు. పవిత్ర భరతసింహాసన మున అధిష్ఠించాలనికాదు. ముట్టుకొనడానికీ ధర్మరాజుకు ఆవంత అధికారములేదు. మృత్యుముఖమునుండి నేను కోరునదదే. నాసేనానికాజ్ఞాపించుచున్నాను" అను రారాజుమాటలాలించిన అశ్వత్థామ "నీయాజ్ఞశిరోధార్యంగా స్వీకరిస్తాను. బాల్యములోనే బ్రాహ్మణత్వాన్నివీడి, నేడుమానవత్వాన్నే మంటకలుపుతాను. రారాజా నీయాజ్ఞ ఆచరిస్తాను. రణ ధర్మములను విడిచిపెడతాను. అధర్మమార్గమును,

అధర్మమార్గముతో అణచివేస్తాను" అలా అనగా; నీపెద్దకొడు కెంతో సంతోషించాడు. "అలాగే చేయి మిత్రమా! భీష్మ- ద్రోణ- కర్ణ- జయద్రధ. సోమదత్తు యెటువంటి అధర్మమార్గానకూలేరో! అలాంటి కృత్రిమ నీచ మార్గాన నేడు పాండవులును..." అనగా; అశ్వత్థామచత్తురుకాక! శత్రువిధ్వంసము, పాండవనాశనము, పాంచాలుర మరణము, రారాజా! నా భీషణ ప్రతినవినినీవు సంతసింతువుగాక!...

పాండవ- పాంచాలుర శిరములు పేర్చి స్వర్గానికి సోపానాలు నిర్మిస్తాను.

ఉ. **శాణిత- మత్కృపాణ ఝుణ ఝుంఝుణిత భ్రమణ ప్రహార ఝుం**
**ఝూనిధన ప్రతీకులయి, శార్వర దుర్వహ వక్త్ర చర్విత**
**ప్రాణులునై నశింతురిక పాండవులేవురు రాజరాజ! ని**
**ర్వాణ సుఖంబునందుమిక పాండవులేవురు లేరు లేరికన్."**

**ఇది మహాభారతములో శల్యపర్వం ముగిసింది**





# సంపూర్ణ మహాభారతం

## సౌప్తిక పర్వము



ధృతరాష్ట్రమహారాజా! అలా మీ అగ్రసుతుచే అభిషేకింప బడ్డాడు అశ్వత్థామ. అనంతరం పాండవుల శిబిరాల్లో నూతన విజయ దుందుభులు మ్రోయించి యాపదు నెనిమిది రోజులూ ఒకే ఒక్కసేనాని ధృష్టద్యుమ్నుడు. సైనికులనుజూచి, మీ శౌర్యప్రతాపాలన్నీ ధన్యమయ్యాయి

సీ. **మృత్యువునే నిగ్రహించి మించిన భీష్ము**
**డవలీల శరశయ్య నాశ్రయించె;**
**శస్త్రాస్త్ర శాస్త్ర నిష్ణాతుడైన గురుండు**
**ఖడ్గఘాతమున స్వర్గస్థుడయ్యె;**
**చండప్రచండ కోదండ సముద్దండ**
**భండనుండైన కర్ణుండు గూలె;**
**చతురబ్ధిజలధౌత చరణరాజీవుండు**
**రారాజు స్వారాజ్య రమణుడయ్యె;**
**దండివీరులు, సామంత ధరణిపతులు**
**శలభములవోలె నాహవ సవనవహ్ని**
**నాహుతులుగాగ సుక్షత్రియాన్వయంబు**
**లుప్తమైనది; లేరు శత్రువులు నేడు"**

అనుకొనుచున్న సమయానికి కృష్ణుడు వచ్చాడు. ధృష్టద్యుమ్నుడు "పురుషోత్తమా! తమ ఆశయము సర్వవిధాలా విజయమైంది. రాజుకన్న ప్రజాధినేతయే బలముగలవాడవని నిరూపించావు" అనగా కృష్ణుడు నిజమే ప్రజానాయకుడు పురుషోత్తముడేకాదు. మహాత్ముడు, పరమాత్ముడు, మహారాజులందరినీ శాసించేశక్తి సామర్థ్యం ఒక్కప్రజానాయకునికే ఉంది. ఆతని కత్తికి రాజులు కూడా తారుమారౌతారు." అని అనగా; ధృష్టద్యుమ్నుడు శ్రీకృష్ణుని వంటి ప్రజానాయకునకు సాధ్యము కాని దేది?" అనగా; కృష్ణుడు "ధృష్టద్యుమ్నునివంటి, సైన్యాధికారి ఉన్నప్పుడన్నీ సాధ్యాలే. కాని సంపూర్ణముగా మనవిజయమింకనిర్ధారణ కాలేదు. సుయోధనుని పతనమింకా స్థిరముకాలేదు. ఈతుదిఘడియలలో మృత్యుసింహాసనమిదుండే శాసనాలు చేస్తున్నాడు.

అలా అనగా ధృష్టద్యుమ్నుడు "అంతావ్యర్ధప్రయత్నం. పరమాత్మా! ఒక్క బ్రాహ్మణ వీరునికై తమరిలా భయపడతారా!" అనగా? కృష్ణుడు "సేనానీచూద్దాం. నేనూ పాండవులూ, కలిసి యీరాత్రి ఓఘవతీ నదీతీరానికి వెళ్లాలి. నీవు శిబిరాలను కడు జాగరూకతతో కాపాడుము" అనగా ధృష్టద్యుమ్నుడు వెళ్లాడు. కృష్ణుడు తనలో యీ ధృష్టద్యుమ్నుడు తన సామర్థ్యంచేతనే పాండవులకు విజయము వచ్చిందని మహాగర్వంతో ఉన్నాడు. నేటితో పాండవులపై భారతవర్షముపైనా పాంచాలుర పలుకుబడి స్థాపించాలను కొనుచున్నాడు. సోదరులచంపుకొనుటకు యెవరుకారణం? పెదతండ్రి కొడుకు కామంతో కళ్లుమూసుకొని పైబడిన సైంధవునే క్షమించిన పాంచాలిచే కీల్గంటునంటిన మరదిరక్తాన్ని వాంఛింపచేశారెవరు? కలలో కూడా అబద్ధమాడని యజాతశత్రునిచే అసత్యమే ఆయుధముగా గురుని కంఠాన్ని యెవరు కోయించారు?

నేటి ఈ విశ్వక్షోభానికి యీ దారుణరక్త పాతానికి, యీ నీచహత్యాకాండకు కర్త యెవరు? నేనేకదా! నాగీతోపదేశమే మూలమంత్రముకాదా? యీహింసాకాండకు అంతములేదా? నారాజకీయతంత్రమంతా సౌభాగ్యశాంతికిగాక శ్మశాన శాంతికే మార్గదర్శకమయింది. ముక్కముక్కలుగా ఉన్న రాజ్యాన్ని ఐకమత్యముచేయాలిగాని, యిలా దేశవిధ్వంసక చర్య చేశానే! మత సామరస్య పరిష్కారానికి మహాత్ములనందరనూ చంపించుటా? స్వారాజ్యానికి యీ ఘోరకర్మచెయ్యడమా? సౌజన్య సౌదర్య సౌమనస్యానికి యింతమంది సోదరుల చంపుకోవడం? ధర్మ సంరక్షణమిదేనా? శాంతికి కొరకు రక్తపుటేరులను ప్రవహింపచెయ్యాలా? వీడితజనరక్షణా? విశ్వవిప్లవమ? విశ్వకల్యాణానికి, ప్రజాక్షేమానికి యింతకన్నామార్గము లేదా?

రక్త పాతమే విధానమా? మారణమే కర్తవ్యమా?" అని శ్రీకృష్ణుడు యెలుగెత్తి చాటినాడు మహారాజా! తానే యింతాగావించానని అతడే ఒప్పుకున్నాడు. యిక్కడ యిలా ఉండగా కృపాచార్యులు, కృతవర్మ, అశ్వత్థామ ముగ్గురు కౌరవయోధులు



ఆరాత్రి పండుకొన్నారు. కొంతసేపటికి కృపాచార్య, కృతవర్మలు మెల్లగా నిద్రపోయారు. అశ్వత్థామకు మాత్రము నిద్ర పోలేదు. పాండవుల అంతముగావించడం యెలాగ? అప్పుడు గాని రారాజుకు తృప్తికాదు. అప్పుడే ఆతడు తన ప్రాణాలను విడుస్తాడు. వీరు ముగ్గురూ పండుకొన్న చెట్టుపైని ఒకగుడ్లగూబ వ్రాలింది, అవృక్షం పై నున్నకాకుల గూళ్లన్నిటినీ పాడుచేసి వాటిని తినేసి చల్లగా తన దారిని తాను పోయింది.

అశ్వత్థామకప్పుడు ఆగుడ్లగూబే మార్గదర్శకమయింది. అప్పుడు నిద్రిస్తున్న కృపాచార్య, కృతవర్మలనులేపి అశ్వత్థామ పాండవశిబిరాల దగ్గరకు తీసుకొని వెళ్లాడు. పదునెనిమిది రోజుల నుండి సరియైన ఆహారమూనిద్రాలేని పాండవసేన, వీరులు, ఉత్సాహంతో విజయాన్ని పొందామని చాలా రాత్రివరకూ సందడితో గాఢనిద్రలో ఉన్నారు. కృపాచార్య, కృతవర్మలను అక్కడుంచి, అశ్వత్థామతానొక్కడే గుడారాల్లోనికి వెళ్ల బోవగా, అక్కడ పరమశివుడు భూతగణాలతో అడ్డముగానిలిచాడు.

ఆతనితోయుద్ధానికి సిద్ధమయ్యాడు అశ్వత్థామ. యెన్నిబాణాలు వేసినా యెందుకూ కాకుండా పోయేసరికి అశ్వత్థామకు నీరసం. నిస్పృహ ఆవరించింది. అప్పుడు యీతడు సామాన్యుడుకాడని తన ఆత్మను ఆదివ్యమూర్తి కర్పించి, క్రిందకుదిగి సాష్టాంగ నమస్కారం చేసి "హే! పరమశివా! పార్వతీనాథా! జగదీశా! త్రిమూర్త్యాత్మకా! పాహిమాం, పాహి" ప్రభూ నేను గావింపదలపెట్టిన యీకార్యక్రమానికి అడ్డువచ్చిన ఆభూతాలను పారద్రోలుతండ్రీ!" అని యెన్నో ప్రాణులను నీకుబలిగా సమర్పిస్తాను. అలా అనగా! అక్కడే అగ్ని గుండంతయారయింది.

అశ్వత్థామ "పరమశివా! భవా!" అని ఆ అగ్నిలోకి దూకాడు. అప్పుడాతనికి పరమశివుడు ప్రత్యక్షమయ్యాడు. సర్వజీవులనూ చంపగల ఒకదివ్య ఖడ్గాన్ని ఆతనికిచ్చి శివుడు అంతర్హితుడయ్యాడు. పరమానందంతో అఖడ్గాన్నిధరించి తనతండ్రిని వధించిన ధృష్టద్యుమ్నుని చంపాడు. అలాగే అక్కడున్న ఆతనితమ్ములనందరనూ వధించాడు. అలాగే కృతవర్మా, కృపాచార్యులూ, గుడారాల్లో నిద్రిస్తున్నవారందరినీ యిష్టము వచ్చినట్లు చంపుతున్నారు.

అలాగే ఆదివ్య ఖడ్గాన్ని ఝళిపిస్తూ, ద్రౌపదియందు పాండవులైదుగురకూ జన్మించిన ఉపపాండవులైదుగురనూ అశ్వత్థామ ఆఖడ్గముతో చంపాడు. శిఖండిని రెండుముక్కలుగా నరికి యింకా కోపం చల్లారక ఆముక్కలను మరల ముక్కలుగాచేశాడు. ఆభయంకరపిశాచము అశ్వత్థామనుండి ధృష్టద్యుమ్నుని సారధి ఒక్కడే బయట పడ్డాడు. అలా అశ్వత్థామ పాండవగుడారాలన్నీ శవాలుగాచేశాడు. అనంతరం కృపాచార్య, కృతవర్మ, అశ్వత్థామలు ముగ్గురూ చావుబ్రతుకుల్లో ఉన్న దుర్యోధనుని దగ్గరకేగి చేసిననిర్వాహమంతా విన్న వించుకున్నాడు అశ్వత్థామ. దానికి పరమానందమందాడు సుయోధనుడు. ఆతని ఆనందానికి అవధుల్లేవు

ధృతరాష్ట్రమహారాజా! అలాగ నీ అగ్రసుతుని అపూర్వ అవతారము అంతమయింది. యిక వ్యాసభగవానుని అనుగ్రహ భాగ్యముచేత వచ్చిన మహాశక్తి నాలోనుంచి పోయింది. యింక యేమీ చెప్పలేను. అని వెళ్లి పోయాడు సంజయుడని వైశంపాయనుడు ముగించాడు.

"మహర్షివర్యా! మాతాత ఉపపాండవులను అశ్వత్థామ చంపినట్లు చెప్పారు. తరువాత యేమిజరిగిందో శలవివ్వండి?" అనిజనమేజయ మహారాజడిగేడు. "జనమేజయ జనపతీ! కౌరవ పాండవులయుద్ధము పదునెనిమిదిరోజుల్లో పదునెనిమిదక్షౌహిణులసేనా సర్వనాశనమయింది. పందొమ్మిదవరోజు విజయమందిన సంతోషముతో పాండవులు యెంతో హాయిగాఉండగా సరిగా ధృష్టద్యుమ్నసారధి ఓఘవతీ నదీతీరానికి వచ్చి గతరాత్రి జరిగిన అశ్వత్థామ మారణకాండంతా వివరించే సరికి ధర్మరాజు దఃఖముతో మూర్చపోయాడు. కొంతసేపటికి తేరుకొనిలేచి సాత్యకి, కృష్ణుడు సోదరులందరితో రథముపై వెళ్లాడు. మొదటిగా విరాటద్రుపదాదుల అంతఃపురకాంతలను ఓదార్చి సుభద్రా- ఉత్తరా ద్రౌపదితో ఉపప్లావ్యానికి వెళ్లి వారిని రప్పించారు. ఆగుడారలలో గల శవాలను చూసి ఆవీరులందరికీ మతులు పోయాయి. ఆశ్చర్యమందారు. భీతావహంగా ఉంది. ధృష్టద్యుమ్నుని శవాన్ని చూసి కృష్ణాదులందరూ కంటతడి పెట్టారు. మూర్ఛలో మునిగిపోయారు. అందరూ యేడ్చారు.

## ద్రౌపది గర్భశోకం

ద్రౌపదీ దేవికి పాండవులు విజయశ్రీని తెచ్చారన్న ఆనందంగాని సంతోషముగానిలేక నోటమాట రాలేదు. గర్భశోకముతో క్రుంగిపోయింది. ఒకప్రక్క పుత్రశోకం మరొకప్రక్క, పుట్టినిల్లుమునిగి పోవడం యీ రెండు భరింపలేక నేలపైపడి దొర్లి దొర్లి యేడువసాగింది. యిక యిందరు చచ్చిన తరువాత యింక రాజ్యం యెందుకు? విజయశ్రీయెందుకు? కడుపు బాదుకొని కృష్ణుని చేతులు పట్టుకొని "అన్నయ్యా! యెంతఘోరం జరిగిందో చూశావా? అటు పుట్టి నిల్లు బూడిద- యిటు గర్భంకోత యెలాభరించేది? నేను యెలా భరించేది? నిద్దురమత్తులో చంపబడ్డారు. ఆ ఆచార్యకుమారునకు యింత దారుణకృత్యం చేయడానికి యెలాబుద్ధిపుట్టింది? అశ్వత్థామను వధించినగాని నాశోకం ఉపశమింపదు" అన్నది.

ధర్మరాజు అందుకొని "ద్రుపదనందనా? నీవు దుఃఖింపకు. కౌరవులను మనవారు వధించారా? అలాగే మనవారినీ వారుచంపారు. దీనిలో కొంచము హెచ్చుతక్కువలుండుగాక! అని యెంతగానో ఓదార్చినా చల్లబడకుండా, యింకాద్రౌపది నిప్పులు క్రక్కి ధర్మనందనా? మీరు అశ్వత్థామను చంపకపోతే, నేనేవెళ్లి ఆనీచుని వధిస్తాను" అనగా; ధర్మరాజు యాజ్ఞసేనీ! "అశ్వత్థామ సామాన్యుడు కాదు, అస్త్ర శస్త్రపాండిత్యంలో తండ్రిని మించాడు. అటువంటి వానిమీదకు మన భీముడు వెళ్లడం శ్రేయస్కరంకాదు. అంతేకాదు. ఆతడు మన అర్జునునితో సమానమైన



అస్త్ర శస్త్ర శాస్త్ర మర్మాలు తెలిసినవాడు" అని రథాన్ని నడుపుతూ కృష్ణార్జునులు బయల్దేరి. భీముని రథములో కలిశారు.

వ్యాసాశ్రమము దగ్గరభీమాదులు వ్యాసభగవానుని మనసులో నమస్కరించారు. అనంతరం కృష్ణార్జునులూ వచ్చారు. యిలా ఉండగా, ధర్మ రాజు దీర్ఘదర్శి, మృత్యుతాండవము ఆగదు, ఆహా ధరణీస్థలమ్మీద. శత్రువుల రక్త పాత నదులైపారాలి. మిత్రులు, ఆప్తులు, కుమారులు, మహారాజ సంఘాలు, చనిపోయినా, భార్యల మంగళ గళసూత్రాలన్నీ తెగిపోయినా మృత్యువుమాత్రం ఆగదు." అని తనమనస్సులో బాధపడుచుండగా వ్యాస భగవానుడొచ్చి "నాయనా! ధర్మనందనా ఊరడిల్లు. విజయ శ్రీతో వీరులనష్టాలూ, కష్టాలూ కలిసే ఉంటాయి. యికనీకు స్వరాజ్యము సిద్ధించింది. కాని మీ వంశవృక్షం మాత్రం కూకటివ్రేళ్లతో కూడా పెల్లుబికి కూలిపోయింది" అనగా;

ధర్మరాజు "మహాత్మా! యింకేమికావాలి. సస్యశ్యామల, ధనధాన్యసంపన్న, రత్నగర్భ, ధర్మపరాయణ, శాంతి ప్రియ" అని అనేకవిధాల కీర్తింపబడిన భరతవర్షం, యిప్పుడు తేజస్సు, ఓ జస్సులేక మోడువారి పోయింది. పీనుగులపెంటలతో, దుర్గంధంతో, ప్రసిద్ధరాజవంశాలన్నీ నామరూపాలైనా లేకుండపోగా, యీ భూమండలము మాచేతుల్లోకి వచ్చింది. నిర్వంశము, నిర్ధనం, నిరాశ, నిస్పృహలతో నీరసించి ఉన్న మాకీ భారమెందుకు? ఋషీంద్రా! యిదిజయమే అంటారా?" అని ధర్మరాజు వ్యాసమహర్షి, మాట్లాడు చుండగా కృష్ణార్జునులు రెండు చేతులూ పట్టుకొని అశ్వత్థామను తీసికొని వచ్చారు. జనమేజయమహారాజా! అనివైశంపాయనమహర్షి చెప్పాడు. అదివిన్న జనమేజయుడు మునీంద్రా! తరువాత యేమిజరిగిందో నాకు వినిపించండి?" అని అడిగాడు. రాజేంద్రా! కృష్ణార్జునుల మధ్యనున్న అశ్వత్థామ నిర్భీతితో "ధర్మరాజా! జయముగాదా! ఆహా యేమిజయము సాధించారు. ఓహో! యెంతగొప్ప జయముమీది?

**ఉ. సంతతిలేక, సౌఖ్యమును, సంపదలేక ప్రజానువృత్తియున్**
**శాంతియులేక, బంధువులు జ్ఞాతులులేక శ్మశానవాటి,నా**
**ద్యంతము నేకచక్రముగ ధర్మజ! రాజ్యముసేయుమీవె; ధ**
**ర్మాంతర శౌర్యలబ్ధమగు నైహిక భోగము నీకె చెల్లెడున్"**

యిలా యెకసక్కెముగా మాట్లాడు అశ్వత్థామ గొంతుకునొక్కి భీముడు "ఓరీ వాచాల! నీనాలుకనుచీలుస్తాను" అనేసరికి ధర్మరాజు "భీమసేనా! బంధనలో ఉన్నవానిపై దౌర్జన్యం చూపింపరాదు. కొంచం శాంతించు" అన్నాడు "అగ్రజా! యీహంతకుడు, నరహంతకుడు, దుష్టుడు, క్రూరుడు, దయాహీనుడు, వీనిపై ధర్మము చూపడం మంచిది కాదు" అను

భీమునిమాటలకు అశ్వత్థామ నవ్వి "ధర్మరాజు, అజాత శత్రువు, నేతి బీరకాయ. బంగారుపిచ్చుక" అనిహేళన చేయగా; భీముడు "చూచారా! యీ

పాషండుని. పరీహాసం? మనధర్మరాజు ధర్మాన్నే వెక్కిరిస్తున్నాడు. ఓరీ! బ్రాహ్మణచండాలా! కటికి కసాయీ! నీ ప్రతాప ప్రేలుడులు కట్టి పెట్టు. యిదిగో! యీముష్టిఘాతంతో నీతలను ముక్కలుగా చేస్తాను'' అనగా; అర్జునుడు "అలాకాదుయీబాణంతో వీని శరీరమంతా జల్లెడలాగ తూంట్లుచేయాలి" అనగా; అశ్వత్థామ "కావిస్తావు అర్జునా! గురునికంతాన్నే కోయించిన వానికి, గురుపుత్రుని శరీరముకొయ్యడం పెద్ద వింత మాత్రం కాదు? విజయుడవుకదా? గురువు రక్తంతో రాజ్యాభిషేకం చేసికొన్న కిరీటివి. ధర్మరాజా! సత్యవ్రతంతో నువ్వు, శౌర్యవ్రతంతో నీతమ్ములూ సంపాదించిన భరతసింహాసనము నింక గురుపుత్రుని కంకాళాలమీద కాళ్లుంచి అధిష్ఠింపుమయ్యా. ఓహోహో! యేమి సామ్రాజ్యమునీది. మునుపెవరూ నీరాజ్యంలాంటి రాజ్యాన్ని పరిపాలింపలేదు. ఆకాశానప్రేతాలు, భూమిపై విధవలు, యేలడానికి ప్రజలు, పరిపాలింపు. దాయాదులు, వారసులూ లేరు, యీరాజ్యాన్నంతా నెత్తికట్టుకు పోదువులే'' అనగా; భీముడు ''యేమిరా! నరహంతకునితో యింకామాటలా? వీడికి తగినట్లు సమ్మానంగావించాలిగాని మాట లేల? గాఢాంధకార రాత్రివేళ నిద్దురలో నున్న నిరపరాధ శిశువులను కర్కశంగా ఖడ్గానికి యెరచేసేవీడిని సహించాలా? యెంత దుర్మార్గం?" అనగా; అశ్వత్థామ "ఔనౌను దర్భరం– దుస్సహమే! మీరెంత సత్యవంతులో, నిరాయుధుల, యోగనిష్ఠుల తలలు తీయలేదుకదా? పాపం మీరందరూ నిరపరాధులే! నిజమే! మీరందరూ సత్యపరాయణులే" అన్నాడు అశ్వత్థామ.

"ఓరీ! కిరాతక! యేవుర బిడ్డల తల్లియైన పాంచాలి అమ్మాయనిపిలవడానికి ఒక్కబిడ్డలేక యెంతగాకుతకుత లాడుతుందో ఆలోచించావా? యిదేనా నీవీరత్వం? యిదేనా నీశౌర్యం? యింకాప్రేలుతున్నావా? పరమచండాలా?" అనుభీమునితో "నిజమే! నూరుగురుబిడ్డలతల్లి వృద్ధహృదయ మెంతగా కణకణలాడుతుందో ఊహించావా?" అనగా "భీమసేనా! నీవీ అశ్వత్థామకు దూరంగా ఉండు. ఆతడన్నదీ నిజమే! ఆత్మీయులందరి చితులపై యిప్పుడు దాయాదుల రక్తమాంసాలతో యీ పాండవుల నూత్న రాజ్యాభిషేకం జరుగుతుంది. పచ్చని పంటలతో ప్రకాశించే భారతభూమిని చూచావా! రక్తంతో ఎఱ్ఱబడి యెంత భయంకరముగా ఉందో!" అను ధర్మరాజు వాక్కులాలించి అశ్వత్థామ "భీమన్నా! శరీరబలమేగాని బుద్ధిబలములేని మూర్ఖునిలాగు శ్రీకృష్ణుని చేతిలో కీలు బొమ్మలై నీకుమారుడు ఘటోత్కచుని, మనుమడు అంజనపర్వుని చంపుకున్నావు; ద్రౌపదీ పుత్రులను గోల్పోయావు. జాగ్రత్తగావిను. సుభద్రసంతానానికే భావిభారత సామ్రాజ్యాన్ని సంక్రమింపచేయు కృష్ణుడా? మీకు పూజనీయుడు?" అనగా;

"ఓరీ! నీచగురుపుత్రా! యింకప్రేలకు యిప్పుడేనిన్నంతం చేస్తాను" అను అర్జునుని మాటలకు మరల అశ్వత్థామ "ఆతని ఆటనుకట్టించడానికే ఉత్తరగర్భములో నున్న శిశువును సైతము" యేదో అనబోగా; శ్రీకృష్ణుడు "అలా యెప్పుడూ జరగదు.



పాండవ వంశము బహుభద్రము, ఉత్తరాగర్భములో నున్న శిశువు పరిరక్షింపబడి పరీక్షిత్తు అయ్యాడు" అనగా; ధర్మరాజు "బావా! యీతని మాటలు నాకర్థంకాలేదు. ఉత్తరగర్భపు శిశువనగా యేమి" అనగా; అశ్వత్థామనుచూపి, యీక్రూరుడు ఉత్తర గర్భంను రెండుగా బ్రహ్మశిరోనామకాస్త్రమువలన గావించాడు" అనికృష్ణుడు చెప్పగా ధర్మరాజు ఆశ్చర్యంతో "అయ్యో! యెంత ఘోరము కుమారులను, ఆప్తులనూ, దాయాదులందరినీ రాజ్యపిశాచానికి బలిచేశాము. అదిచాలక పాండురాజవంశబీజం ఉత్తరాగర్భస్థపిండంకూడా కావలసి వచ్చిందా?" అనగా; అర్జునుడు మహా కోపంతో "ఓరీ కర్కశాత్మా! నువ్వు నరరూపుతో నున్న ఘోరరాకాశివి. యిదిగో! నిన్నెవరు రక్షిస్తారో చూస్తాను.

సహస్రాక్షఫాలాక్షులైన అడ్డువచ్చిన నీతల తీస్తాను. దానితో ద్రోణుని వంశమంతా నాశనమౌతుంది." అని భీమార్జునులు అశ్వత్థామ మీదపడబోగా, కృష్ణుడు రెండు చేతులతో వారిద్దరనూ ఆపి ఆగండి, అనగా; భీముడు "అగ్రజా! యీనీచునకెలాంటి దండన విధిస్తారో విధించండి'' అనగా; ధర్మరాజు ధర్మస్వరూపుడైన యీమాధవుడే చెప్పుతాడ"నగా; అశ్వత్థామ. యెకసక్కెముగా "యేమిరా! ఒకడు ధర్మ స్వరూపుడా? యింకొకడు ధర్మరాజా! చాలామంచి ధర్మాలను చూచుచున్నాను" అనగా; కృష్ణుడు "ధర్మరాజా! మనమెవ్వరమూ వీనికి ప్రతిక్రియచేయనవసరము లేదు. మనద్రౌపదియే తగినదండన విధిస్తుంది" అని అనగా; ధర్మరాజు ॥ నిజమే! ఆమె పుట్టినిల్లూ, మెట్టినిల్లూ పునాదులతో కూల్చాడు. అందువలన యీతనికి దండనము కూడా సరియైనది యీయగా ఆమే సమర్థురాలు. అందుచేత అర్జునా! నీవేగి సానునయముతో ద్రౌపదినిచ్చటకు తీసుకొనిరా! "అర్జునుడు వెళ్ళాడు; అశ్వత్థామ" ధర్మరాజా! నీకుసిగ్గుందా? భీమార్జున ధృష్టద్యుమ్న సాత్యకీ ప్రముఖమహావీరులుగల అపారసేనా సాగరాన్ని కలిగి, అన్యాయముగా, అక్రమముగా, యుద్ధధర్మాన్ని విడిచి నువ్వు, భీష్మ – ద్రోణ – జయద్రథ కర్ణ యోధవీరుల నందరనూ, నిరాయుధులైయున్న సమయాన నేలగూల్చలేదా? యిదిగో యీవ్యాసభగవానుని దగ్గర గుండె పై చేయివేసిచెప్పు. యికనేనా! ఆయుధములేక, అస్త్రాల్లేక, నిస్సహాయముగా రాజాజ్ఞతో పదిమంది వైరుల అధర్మముగా చంపానని నీసోదరులందరూ కలిసి అనరానిమాటలతో బాధిస్తున్నారు. అనండి. మీరు విజయులు, నేను పరాజయుడను" అని అన్నాడు.

అర్జునుడు ద్రౌపదితో వచ్చాడు; ధర్మరాజు ''దేవీ! యిలారా! మనవిజయమెంతగా నున్నదో చూడు" అని ధర్మరాజు అనగా; ద్రౌపది "విజయమా? యెవరిది? యింకా సర్వనాశనముకాని విజయమెవరిది? విజయము దుర్యోధనునిదే! ఆతని రాజశ్రీ ఆతనితో గూడి సహగమనం చేసింది! మనకు యిప్పుడు మిగిలింది శ్మశానమే! యెప్పుడూ రాజుచుండి చల్లారని భస్మరాశే మిగిలింది. చచ్చినవరకూ చితాగ్నులను యిలా కన్నీటితో చల్లార్చుకొని ఉండడమే మనకు ప్రతీదినచర్య."

అనగా; కృష్ణుడు "సోదరీ! దుఃఖించకు. నీహృదయములో ఒకటి కాదు అయిదు చితాగ్నుల నొక్కసారి ముట్టించే ముష్కరుడు నీయెదురుగానే ఉన్నాడు. వానికి తగిన దండన నీవే విధించు" అన్నాడు.

భీముడు "రాజదండనమేకాదు, యిదిగో ప్రళయకాలయమ దండాన్ని మించిన మహోద్దండ గదాదండము గదనుచూపించి, దీనితో నీవే వేయుము" అనగా; అర్జునుడు "వీడు నీపుత్రహంతయేకాదు, భ్రాతృహంత కూడా! పితృహంత!" అన్నాడు. ధర్మరాజు "ఒక్కమారు రెండువంశాల నాశనముచేసిన క్రూరుడు" అన్నాడు. అప్పుడు అశ్వత్థామ అదంతావిని "మీరందరూ యీద్రౌపది దుఃఖాగ్నిలో క్రోధమను నెయ్యిని పోస్తున్నారు. పాంచాలీ! నామాటలనూ నీవు కొంచము శాంతితోవినాలి. నీపుత్రులనైదుగురును చంపినందుకు నీలాగే నేనూ యెంతగానో దుఃఖిస్తున్నాను. నేను దుఃఖించుటెందుకంటావా? ఆగాధాంధకారాన, కానరాక పాండవులనుకొని ఉపపాండవుల చంపినందుకు; పాండవులైదుగురూ బ్రతికి యున్నందుకు! దుఃఖించుచున్నాను. యింకొకటివిను.

యోగస్థితిలో నున్న ద్రోణాచార్యుల తలతీసినందులకు పాంచాలురనందరనూ బలిచేయడమైంది. యిదినా హింసకు ప్రతిహింస. యికనేను గావించినదానికి నీవునన్ను చిత్రవధగావించినా సిద్ధముగానే ఉన్నాను. నీవేమి చేసినా సంతోషమే!" అన్నాడు అశ్వత్థామ; భీముడు తనగదను ద్రౌపది చేతిలో నుంచి "వీరనారీ! యీ గదతో వీనిశిరము వ్రక్కలు చెయ్యి?" అన్నాడు. అప్పుడు ద్రౌపది గద సవరించి "కానివ్వండి! యీమహాభారతయుద్ధము నామూలముగా పుట్టింది. నాతోనే అంతంకావాలి. ఆనాడు స్త్రీబుద్ధితో మయసభలో సుయోధనుని జూచినవ్వాను. యీవిరోధాగ్నిని రగిలించాను. దానికి ప్రతీకారమే కౌరవనిండు సభలో యీద్రౌపది జుట్టుపట్టుట ప్రారంభమైంది. మరల యీరోజు ద్రౌపదీ గర్భాన్ని దహించడంతో అంతమైన ప్రతీకారచర్యకు ప్రతీకార ప్రవాహానికి, ఔను! యీద్రౌపదే అడ్డుగట్టుకట్టాలి. కడతాను. గురుపుత్రా! పుత్రులచంపిన వారికి – సోదరులను చంపినవారికి నేను చూపు ప్రతిహత్య యేలాటిదో చూస్తారా? జాగ్రత్తగా చూడు. ఊహలకు అందనిది. పాండవపత్నికి నీవు చేసిన పుత్రధారణానికి; ప్రత్యాదరణముగా ద్రోణ పత్నికి పు...త్ర...దా...న...ము. గదను క్రిందపడవేసింది. భీముడు కోపముతో. దా...రు...ణ...ము. మహాదారుణము. ద్రౌపదీ! యిదేమి? నీకు మతిభ్రమణముకాలేదుకద?" అనినాద్రౌపది వినిపించుకొనలేదు.

చం. ఎరిగితి గర్భశోకమది యెంతనితాంత దురంతవేదనా
భరితమొ; వెండియున్ విగతభర్తృకయై తనయింట నొంటివం
దురుగురు పత్ని శీర్షమున ద్రోతునె దుర్భరగర్భ దుఃఖమున్
గురుసుత?; పొమ్ము తల్లికిక గూర్పుముచేర్పుము మోదబాష్పముల్"



యిలా ద్రౌపది అనగా; అశ్వత్థామ "పాంచాలీ! యిదిగో! యీగద దీనితో కొట్టినాతలను వ్రక్కలుగావించు. నీవలాగే చేస్తావనుకున్నాను. నీవు నిజముగా ద్రుపదరాజ పుత్రికవగు ద్రౌపదివేనా? యేమియీవాత్సల్యము? యేమి నీ క్షమాగుణము? పుత్రహంతకు ప్రతిక్రియ యిదా? నన్ను నీవు విడిచి పెట్టకు. నేను నీక్షమాగుణాన్ని భరింపలేను. అని అనగా; భీముడు" దేవీ! యీతనికి యిదా ప్రతిక్రియ? నీవు భీమపత్నివేనా? ధృష్టద్యుమ్ను సోదరివేనా? యేందుకీ పిరికితనము నీకెలావచ్చింది? రెండు వంశాలనూ నశింపచేసిన యీ దుర్మార్గుని యిలాగా విడిచి పెట్టడం? వీడికి ప్రాణదానమా?" అన్నాడు. అప్పుడు ద్రౌపది "ప్రాణేశ్వరా! అహింసతో హింసను యెదుర్కొనుచున్నాను. సహనముచేత దమనాన్ని అరికట్టుచున్నాను. కృపాదానముతో క్రూరత్వాన్ని కృపాణాన్ని యెదిరించాను" అనే సరికి భీముడులేచాడు. "యీమెంది పిచ్చి వాగుడు. యిదంతా ఉన్మాదమే!" అనగా; ద్రౌపది "యెంతమాత్రంకాదు. ఉత్తమ మానవధర్మమిది. గొప్పమహోన్నతనీతి యిదియే.

శ్లో॥ అహింసా – సత్య – మక్రోధం, త్యాగశ్శాన్తి రపైశునమ్
దయాభూతే – ష్వలోలత్వం, మార్దవం హ్రీ రచాపలమ్" అని ద్రౌపది

అనగా అర్జునుడు "ఆహా! యేమిగీతామృతం! దివ్యబోధ! శ్రీకృష్ణపరమాత్ముని గీతాసూక్తి. యీమెకెలావచ్చింది? ఆశ్చర్యంగా ఉందే?" అనగా; ధర్మరాజు ఆ...శ్చ...ర్య...ము" అనగా వేదవ్యాసభగవానుడు.

గీ. గీతవచియించినట్టి శ్రీకృష్ణకంటె;
గీతనాలించినట్టి మీ కృష్ణకంటె;
గీతప్రకటించినట్టి ఈకృష్ణకంటె;
గీతనాచరించిన కృష్ణ కీర్తనీయ;"

అని సంతోషముతో అన్నాడు. అప్పుడు భీముడు "యివి యెంతమాత్రము ద్రౌపదివచనాలుకావు. పాంచాలి ప్రవర్తనమంతకంటేకాదు. దుఃఖములో నున్న యీమె మాటలేకావు. యీమెకు దుఃఖముతో పిచ్చిపట్టింది. నేనే యీ నరహంతకునితల ముక్కలుగా చేస్తాను. అశ్వత్థామపైకి వెళ్ళనుంకించగా అశ్వత్థామ "భీమన్నా! నీవే అందుకు తగినవాడవు. గర్భశోకభారంతో కుమిలిక్రుంగిన యీద్రౌపదీదేవి ప్రదర్శించు దయాప్రదానముకన్నా నీగదాప్రహారమే యెంతో ఆనందాన్ని నాకిస్తుంది" అనగా ధర్మరాజు ఆశ్చర్యంతో "మాధవా! యేమి యీలీల? నాకర్థముగాకుండా ఉంది. నీవుమౌనము వహించావేల?" అనగా; "ఔను యుధిష్ఠిరమహారాజా! ఆమాటలు ద్రౌపదివిమాత్రంకాదు. నేనే ఆమెయందావేసించి గీతారహస్యము ఆచరణకు తెస్తున్నాను. నిరంతరాయంగా సాగుతూ వచ్చిన యీదారుణ హింసాకర్మలకు, ఘోరమారణచర్యలకు యీదినముతో చెల్లుచీటీ యివ్వాలని దానికి దివ్య సాధనమొక్కటే! గీతామృతమే. యింతకన్నా గత్యంతరంమరొకటిలేదు. ఈ మహాభారత యుద్ధానికి ఈభయంకర రక్తపుటేరులు

ప్రవహించడానికి కారణం నాగీతయే! నేడు విశ్వకల్యాణానికి ప్రపంచశాంతికి మార్గముగూడా గీతామృతమని తెలిసికొన్నాను" అనగా; "అలా అని యీవంశనాశకుడైన శత్రువును క్షమించమంటావా? యిదెక్కడినీతి? కృష్ణా శత్రునిగ్రహానికి క్షాత్రధర్మమే అవసరమని ఆనాడు పార్థునకు ఉపదేశించిన గీతావాక్యాలే ఆలోచింపక యీనాడు సంశయములేకుండా..." అనుభీముని పలుకులకు అడ్డముగా కృష్ణుడు" క్షాంతినే బలపరుస్తున్నాను.

క్షాత్రముకన్నా క్షాంతిమిన్న. అదే శత్రువులను జయిస్తుందని తెలిసికొన్నాను" అక్కడవున్న వ్యాసభగవానుడు శ్రీకృష్ణా! ఆహా! యేమి యీసందేశము? నీవు యుద్ధము చేయనని పట్టుపట్టి కూర్చున్న అర్జుననికొరకు యుద్ధాన్ని ప్రోత్సహించడానికి కర్మప్రబోధముగావించావు. యింతవరకూ అదికృష్ణగీతే అయింది. కాని అది యిప్పుడు భగవద్గీత అయింది. అందువలన దానిని కృష్ణగీతగా కాకభగవద్గీతగా నామహాభారతామ్నాయములో వ్రాసినదానిని మార్చుకుంటాను. యీనీ దివ్యవాణితో జగము పునీతమగుగాక! స్వరాజ్యంకొరకు, స్వతంత్రరక్షణకొరకు, శాంతి స్థాపనకు భారతవర్షమును రక్తముతో తడపకుండ అన్నదమ్ముల అంతఃకలహాలతో అతలాకుతలమైన యీభారత మాతనుద్ధరించడానికి కృష్ణా! అపజయమేలేని అహింసా ఆయుధాన్ని సృష్టించావు. నీవు రాజనీతి విశారదుడవేకావు, మహాత్ముడవు కూడా!" అనగా

ధర్మరాజు "యదూత్తముడు యీనాడు పురుషోత్తముడయ్యాడు. హింసను ప్రోత్సహించే యీ పాంచాలి నోటనే అహింసాసూక్తులను పలికించిన మహాత్ముడితడు" అన్నాడు. భీముడు "శాంతియెవరికి? అశక్తులకు, వాచాలురకు, సోమరులకు మాత్రమే పనికొస్తుందని అన్నాడు. అదివిని శ్రీకృష్ణుడు "భీమన్నా! నీకింకా కేవలము పశుబలము మీద ఆశతీరలేదు. హింసను ఆపేది హింసయెంతమాత్రంకాదు. అహింస మాత్రమే. శత్రుత్వాన్ని శత్రుత్వంతో జయింపలేము మిత్రత్వముతోనే జయింపగలము. క్రాంతిని కాపాడేదిశాంతి సహనమే అన్నిటికీ విజయాన్నిస్తుంది. సహనము అహింస, సత్యము. సామరస్య – సానునయాలే విజయాన్నిస్తాయి. అంతేకాని శస్త్రాస్త్రాలు, – యుద్ధం – క్రోధం – ఈర్ష్య – దర్పం – దంభం విజయంపొందలేవు." అమాటలాలించిన భీముడు పెద్దగానవ్వి "యిదంతా నేలవిడిచిన సాములాంటివి. యివన్నీ ఆచరణసాధ్యాలేనా? శాంతి సోమరులు చెప్పు ఊకదంపుడుమాటలు. దుర్యోధన – దుశ్శాసన మొదలైనదుష్ట శక్తులను యెదుర్కొనడానికి మారణాయుధాలు కాక బావా! నీశాంతి సత్యాలు యేమి చేశావయ్యా? నీసహనమూ సర్వనాశనమే. యిటువంటి మాటలతో భారతమాతకు సంకెళ్లు తగిలించకు?" అన్నాడు భీముడు; కృష్ణుడు "యుద్ధానికి పరమార్థం ఉభయపక్షవినాశనమే భీమన్నా! మానవమాంసరక్తాలతో తయారైన మహాసామ్రాజ్యములేనాటికైనా పునాదులతో కూలి కాలగర్భానకలిసి పోక మానవు.



క్రాంతిని విడిచి, శాంతిచేత సాయుధులుగాక, సాధులచేత, విరోధముగాక – ప్రేమతో తయారైనసామ్రాజ్యము సుస్థిరమౌతుంది" అనగా

అదివిన్న అశ్వత్థామ కృష్ణా! నీ ఉపదేశం శాశ్వతశాంతిగా మనగలుగుతుంది. నీ అహింసాప్రబోధము యీలోకాన్నేపునీతము చేస్తుంది. నీ ఆదేశము మానవప్రగతికే మంచిబాట. ద్రౌపదిని చూచి తల్లీ! గర్భశోకాన్ని కలిగించాను. దానికి ప్రతిగా, నాపై ప్రేమనే వర్షించావు. శిరోరత్నాన్నితీసి యిదిగో శిరోరత్నం, నీమాతృపూజకు ఒక పుష్పములాగ సమర్పిస్తున్నాను. అంతేకాదు ద్రోణాచార్యులదగ్గర యీవిజయుడైన అర్జునుడూనేనూ అహోరాత్రాలు అస్త్రశస్త్రాదివిద్యలు అభ్యసించాము. ఆతనికీనాకూ భేదములేదు. యీ అర్జుననికూడ. జరిగిపోయినదానిని ఒకపీడకలగా మరచిపొమ్మని అర్థిస్తున్నాను" అనగా అర్జునుడు రెండుచేతులూచాచి అశ్వత్థామనుకౌగిలించుకొని "సోదరా! గురుపుత్రా! యెంతకాలానికి యిద్దరమూ యిలా ఆనందముతో యిద్దరమూ కలియుట జరిగింది." అనగా

వ్యాసభగవానుడు " భగవద్గీతామృతము మిమ్ము పునీతులను గావించుగాక! వైరమునశించుగాక!" అనగా శ్రీకృష్ణభగవానుడు కొన్ని శతాబ్దాలు జరిగిన తరువాత భరతఖండము పైవారి యేలుబడిలో దరిద్రముతో, అశాంతితో. అంతఃకలహాలతో కుమిలిక్రుంగిపోతుంది. యిప్పటివలె – అప్పుడూ నేనునియంతనై స్వతంత్రోద్యమాన్ని నడిపి సాయుధులనిరాయుధులుగా యెదిరించి అహింసాబలముతో నవ్యభారత నిర్మాణాన్నిగావిస్తాను. వైరులా! రవి అస్తమించని విశాల రాజ్యముగల దుశ్శాసనుడు; దురంత యంత్రతంత్ర మాంత్రికుడు మాయగాడు అయినా వానికి యెదురునిల్చి అహింస ఆయుధముతో, సత్యాగ్రహమే యుద్ధముగాగా సర్వమానవ సామరస్య బలముతో, సహనమే శౌర్యముతో, శాంతియే సాహసముగా ప్రపంచాన్నే గెలవడానికి బయల్దేరుతాను. ఆనాడు మారణాయుధాలతో యెదిరింపగా యీ విజయునే ఆనాడుకూడా శాంతిసమరానికి నాయకునిగా చేసి కిరీటి గుర్తును అర్జునుడానాడు భారతాంబకు జహ్వారుడై ప్రకాశిస్తాడు. యీనాటిప్రతిజ్ఞ అనాడు పూర్తిచేస్తాను" అనగా; భీముడు "యిదంతా స్వప్నయోగం" అన్నాడు; కృష్ణుడు "భీమన్నా, ఆనాడూ నీవు యీనాడులాగే పశుబలాన్ని నమ్మి హింసావాదివై శస్త్రసుభాసుడవై నాశాంతి విప్లవానికి – యెదురుగా సాయుధవిప్లవాన్ని పురికొల్పి శత్రుత్వాన్ని వీడి – శత్రువునేయెదిరింప చూస్తావు. మోహనదేవుడను కాను – మోహనదాసుడను.

**సీ. హాటక బర్హిబర్హావతంసముకాదు;**
**కలదు లేదను చిన్నపిలకగాని;**
**చతుర మనోజ్ఞహాసజ్యోత్స్నయేకాదు;**
**మిసిమినవ్వులతేనె పొంగుగాని;**
**కమనీయ తపనీయ కౌశేయమేకాదు;**
**మాయనిముతక కొల్లాయిగాని;**

**హరినీలవిగ్రహ స్ఫురితదేహము కాదు;**
**బడుగుబక్క బికారి యొడలుగాని;**
**కరమునసుదర్శనముకాదు. కదురుతోడి**
**రాట్నచక్రంబెకాని; నిగ్రహముకాదు;**
**కలని ప్రకటించునది యనుగ్రహమెకాని;**
**కృష్ణుడనెకాదు, కష్టసహిష్ణు నపుడు"**

అనగా; వ్యాసభగవానుడు "నీవుకృష్ణుడవుకాదు, కష్టాన్ని సహించేవాడివి. అందరినీ జయించిన వాడివి. ప్రపంచమంతా అహింసా సాధనముచేత ఉద్ధరించేవాడివౌచు. కృష్ణగీతయే భగవద్గీతగా శాంతి నుద్ధరించేవాడివౌచు. కృష్ణగీతయే భగవద్గీతగా శాంతి నుద్ధరించడానికి దివ్య జ్యోతియై లోకకల్యాణాన్నిగావించి భరతమాతకు సర్వసంపదలూ చేకూర్చుదువుగాక!" అన్నాడు.

యిక త్వరలో కలియుగం రాబోతుంది. ఆయుగం దారుణమయి యజ్ఞయాగాదులకొరతతో, బ్రాహ్మణులు బ్రాహ్మణత్వంవీడి తక్కువజాతి వారికడబానిసలుగా ప్రవేశిస్తారు. నాలుగు వర్ణాలు వారు పంచమవర్ణాలవారికి బానిసలౌతారు. యెన్నోదారుణాలు కలియుగంలో జరుగుతాయని" శ్రీకృష్ణుడు చెప్పాడు. ఆనంతరం తానుగావించే ఘోరమారణ కృత్యానికి దీర్ఘరోగంతో అడవులపట్టి పోయాడు. ద్రౌపదికి పాండవులు అయిదుగురుకు పుట్టిన ఉపపాండవులు – శిఖండీ – ధృష్టద్యుమ్నుడూ – తక్కినవీరాధివీరులందరూ రాక్షసుడైన అశ్వత్థామ చేతిలో చనిపోయారని యెంతగానోదుఃఖిస్తూ యుధిష్ఠిరుడు శ్రీకృష్ణుని చూచి "బావా! ఉపపాండవులు అసమానవీర విక్రమకళాకోవిదులైదుగురూ ఒక్క అశ్వత్థామ హస్తంలో హతమయ్యారంటే నాకు నమ్మశక్యముగా కుంది. మరి అలా ఆతడు విహరించే శక్తి యేలావచ్చింది? పోనీ, శిఖండి సామాన్యుడా! ఆతడూమహా బలప్రాభవశక్తులతో నున్నవాడేకదా? అంత క్రూరంగా, ఆతనిచేతిలో మరణించుటా వింతగానే ఉంది. మహేంద్రుని కుమారుడు విజయుడంతటి వీరుడూ, శూరుడు ధృష్టద్యుమ్నుడు. ఆతన్నీ చంపేడు. యిలా యెంతో మంది మహావీరులను చంపడంకాకుండా, యెన్నో గుఱ్ఱాలనూ, కాల్బలాలను పొట్టను పెట్టుకున్నాడుగాదా! యింత అపూర్వశక్తి ఆతనికి యేలావచ్చింది? యిదంతా నాకుమాత్రం చాలాచిత్రాతి చిత్రంగాఉంది. ఆశ్వత్థామవీరత్వాన్నీ శౌర్యాన్నీ యెరుగుదుముకదా! అంతటి వీరశూరత్వం యెలా సంక్రమించిందో నాకువివరించాలి. నీవేదానికి మహాసమర్ధుడవు" అన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు యిలా చెప్పాడు.

## పరమశివ ప్రభావం

"ధర్మరాజా! ఆతనిది ఆశక్తి యెంత మాత్రంకాదు. అంతాపరమశివ ప్రభావముచేత అశ్వత్థామకు వచ్చింది. భక్తులందరికీ అతిసన్నిహితుడు పరమేశ్వరుడు. ఆతని ఆరాధన వలననే యింత మందిని హతమార్ప గలిగాడు. పరమశివుని



కృపకలిగిన వారెంత వారైనా అవుతారు. సామాన్యుడు సురేంద్రుని గెల్వగలుగుతాడు. అందువలననే అశ్వత్థామ అందరిని అంతం చేయగలిగాడు. శివతత్త్వమునాకు తెలుసు. ఆతడేత్రిమూర్తి రూపాలతో సృష్టిస్థితిలయకారకుడౌతాడు. ఆతనిచేతుల్లోనే పదునాల్గు భువనాలూ ఉన్నాయి. ఆతని అపారకృప ఉంటే అతిదుర్బలుడు కూడాయెంతో అధికుడౌతాడు. భక్తికే పరమశివుడు వశమౌతాడు. యింకదేనికీ ఆతడు వశముకాడు. ఆతనిలీలలు వర్ణనాతీతాయి.

బ్రహ్మకు సృష్టిచేయాలను సంకల్పము కలిగింది. పరమశివుని దగ్గరకు వెళ్లి సలహాచెప్పమన్నాడు. అప్పుడాతడు "బ్రహ్మదేవా! యేపనిజరగాలన్నా తపస్సుమూలమౌతుంది. దానివల్లే సమస్తమూసమకూరుతుంది" అని పరమశివుడు చెప్పగావిని బ్రహ్మదేవుడు ఒకపెద్దచెరువులో మునిగి తపస్సు నారంభించాడు. "ఓంనమశ్శివాయ" అనేమహామంత్రాన్ని జపిస్తూ పదివేల దివ్య సంవత్సరాలు బ్రహ్మదేవుడు ఘోరమైన తపస్సుగావించాడు. పరమశివుడు మాత్రం ప్రత్యక్షముకాలేదు. దానికి నిరసనగా బ్రహ్మ దక్షుని పుట్టించి "నీవు ప్రజలను సృష్టించు అని ఆజ్ఞచేశాడు. ఆదక్షుడు దేవదానవ మానవులను సృష్టించాడు. పశుపక్ష్యాది కీటకాలన్నింటినీ సృజించాడు. యిలా ప్రాణులను సృష్టింపగా అవన్నీకలిసి ఆకలితో అలమటిస్తూ యేమీ దొరకనందున ఆ దక్షునే తినడానికి వచ్చాయి.

అప్పుడాతడు బ్రహ్మదగ్గర దాక్కొన్నాడు. బ్రహ్మదేవుడు ఆతని భయపడవద్దని, పాదులు – చెట్లు – కాయలు – పండ్లు యిచ్చే తీగలను, సమస్తసస్యాలను – తినమని ఆభూతాలకు చెప్పాడు. పెద్దవాటికి – చిన్న వాటిని తినేలాగు యేర్పాటు చేశాడు. అప్పుడాభూతాలన్నీ యెంతగానో సంతోషించి అవిబాగా అభివృద్ధిచెందాయి. కొంతకాలానికి తనతపస్సుపూర్తిచేసి శివుడు వచ్చాడు. యెంతగానో అభివృద్ధిచెందిన యీసమస్తభూతసంఘాన్ని తిలకించిన శివుడు మహాకోపంతెచ్చుకున్నాడు. అందువలన తనలింగాన్ని భూమిపై పడవేశాడు. "యిదేమని?" బ్రహ్మ అనగా; దేనిమూలంగా యావత్ ప్రజా సృష్టిగావించాలనుకున్నాను. యిప్పుడు సృష్టంతా మీరే చేశారు. నేను చేయడానికి అసలు పనేలేదు. అందువలననే యీలింగాన్ని యిలా వదిలేశాను. అని శివుడు మాల్యవంతమనే మహాపర్వతానికి వెళ్లిఅచ్చట తపస్సుచేయప్రారంభించాడు. అప్పుడు సమస్తదేవతలూ బ్రహ్మకలిసి ఆశివలింగాన్ని పూజించారు. అలాప్రారంభమయిన శివలింగపూజ అప్పటినుండి సమస్తలో కాల్లోజనులందరూ ఒక్కపూజలేకాకుండా విశేషపూజలూ చేయడం బాగా సంప్రదాయమయింది. యిక ఆలింగానికి అభిషేకాలు చేస్తూ "ఓమ్‌నమశ్శివాయ" అనుపంచాక్షరీ మహామంత్రాన్ని ప్రజలందరూ జపంగావిస్తూ తమ తమకోరిన కోర్కెలనన్నింటినీ సిద్ధింప చేసుకొని అపారమైన పరమశివుని కృపకు పాత్రులౌతున్నారు. యిలాయెన్నో దివ్య సంవత్సరాలు జరిగిన తరువాత, సమస్త దేవతలందరూ ఒకయాగాన్ని చేయ సంకల్పించి దానికి కావలసిన వన్ని సిద్ధంచేసి

కున్నారు. అయితే వారందరికీ ఒకసంశయము వచ్చింది. హవిర్భాగం యెవరికి యివ్వాలి అని నిర్ణయానికి వచ్చి ప్రారంభించారు. కాని వారికి పరమశివుని మహిమయేమాత్రమూ తెలీక ఆతనికి యజ్ఞభాగం యీయలేదు. యీవిషయాన్ని విన్న పరమశివుడు మహత్తరమూ, దివ్యతపస్సుచేస్తున్నదీ, మహామహిమ గలదీ ఆశ్చర్యాన్నికలిగించు పొడవుగలది ఒకమహా బాణాన్ని సృజించి దానిని దాల్చివీరందరూ గావించు యాగ శాలకు వచ్చాడు. ఆతని కోపం మహాగ్ని జ్వాలలుగా వెలువడ్డాయి. ఆయజ్ఞాన్ని ధ్వంసంగావించాలని తలచే సరికి లోకాలన్నీ తిరిగి పోతున్నాయి. యెనిమిది దిక్కులూ వడికి పోతున్నాయి. సూర్యచంద్రులు కాంతి విహీనులయ్యారు. సమస్త దేవతలూ భయముతో వణికి పోసాగేరు; అలా ఆమహాధనస్సుతో పరమశివుడు ఆయాగాన్ని కొట్టాడు. అప్పుడాయజ్ఞపురుషుడు లేడి రూపుతో అక్కడ నుండి పారిపోయాడు అగ్నులన్నీ ఆతనితో వెళ్లాయి. దేవతలందరూ పరుగులు తీశారు.

శివుడు వారందరినీ పారిపోకుండా అడ్డుకొని సూర్యుహస్తాలు, పూషుని దంతాలు – భగుని కళ్లు, బాణంకొనతో నాశనంచేశాడు. దేవతలందరూ అది చూసి భయభ్రాంతితో యాగసామగ్రితో పరుగులు పెట్టుచుండగా, వారందరినీ తన బాణపునారితో అందరినీ ఒకకట్టగాకట్టాడు. వారందరూ పరమశివుని పూజించి తమకట్లను విప్పమని యెన్నోవిధాల ప్రార్థించగా, అప్పుడు వారందరి ప్రార్థనలనూ మన్నించి, తనదివ్యకోపాగ్నిని ఆ సరోవరాన పారవేశాడు. దేవతలందరూ శివారాధనగావించారు.



### దేవతలు శివారాధన చేయడం

అందరూ బ్రహ్మముహూర్తం అనగా తెల్లవారు ఝామున 4 గంటలకు లేచి పరమశివుని మనస్సులో నిలుపుకొని స్నానాదిక్రియలన్నీ చేసికున్నారు. ముందుగా పద్మాకారంతో ముగ్గువేశారు. ముందుగా మహాగణపతిని పూజించారు. ముందు పీఠపూజచేసి అమరులందరు భక్తిభావముతో లింగమూర్తి నచటప్రతిష్ఠించారు. ఆచమనంచేసికొని చేతులు కడుక్కొని, ప్రాణాయామాన్ని గావించి, యీశ్వరుడు అచ్చటున్నట్లు భావించి, పాపాన్ని దహించుకున్నారు. మనస్సులో యేకాగ్రతచేసికొని మూలమంత్రాన్ని పఠిస్తూ అంగన్యాసకరన్యాసాలు చేసి పాద్యము. అర్ఘ్యము. ఆచమనీయాంబు పాత్రలో తీర్థంతో చేసికొని తరువాత పవిత్రాలైన దర్భలను ఉంచారు. ఓంకారనాదము చేస్తూ, పాత్రలో నున్న జలాన్ని చందనము అలది కర్పూరచూర్ణమును మఱ్ఱిచివురులు ఆచమన పాత్రలోవేసి అన్నింటిపై చందనము జల్లి, పరమశివుని సన్నిధిలో నందీశ్వరునినిలిపి, మంచి భక్తిగల మనస్సులతో కూడ ధ్యానావాహనాదులు, స్నానం సుగంధం సమర్పణ చేసి పూజగావించాలి. అక్కడ పరమశివుని తూర్పుదిక్కుగా అణిమ; దక్షిణదిశలో లఘిమ; పడమరదిశ మహిమ; ఉత్తరదిశ గరిమ; ఆకాశమువైపు ప్రాప్తిని; ఆగ్నేయ దిశయందు ప్రాకామ్యము;



నైఋతిదిశ ఈశత్వము; వాయవ్యదిశ వశిత్వము; ఈశాన్యదిశ సర్వజ్ఞత్వము; కర్ణిక యందుచంద్రుని; చంద్రునిక్రింద సూర్యుని; సూర్యుని క్రింద అగ్నిని; ఆతనిక్రింద యమధర్మాదులను; చంద్రుని వెనుక భాగాన త్రిగుణాలను; నాలుగు దిక్కులందు అవ్యక్తాదులను క్రమముగా యేర్పాటు చేశారు. అప్పుడు పరమశివుని సద్యోజాతమహామంత్రముతో ఆవాహనముగావించారు. వామదేవమహామంత్రముతో నవరత్నఖచిత సింహాసనము సమర్పించారు. తత్పురుషమంత్రముతో ఆతని సన్నిధానంచేసుకున్నారు. అఘోరమహామంత్రంతో నిరోధించారు. ఈశానమంత్రముతో పాద్యము ఆచమనీయం సమర్పించారు. ఆరీతిగా భక్తిభావముతో పూజగావించారు. మరల ఓంకారమంత్రాన్ని పూరిస్తూ అర్చించారు. సుగంధచందన తీర్థముతో, పంచామృతంతో నానావిధపరిమళపుష్పాలతో, పళ్లరసాలతో ఓంకారముతో అభిమంత్రించారు అమరులు.

పరమశివునకు అభిషేకముచేసి – తెల్లనివస్త్రముతో తడి ఒత్తి విభూతి ధారణచేసి చందనము సమర్పించారు. తరువాత సుందరంగా ఉండే తెల్లనిబియ్యం. జాజి – సంపెగ – తెల్లగన్నేరు – మల్లెపూలు – తుమ్మపూలు – జమ్మి – కలువపూలు – మొదలైన క్రొత్తక్రొత్త రకాల పూలు, అనేక సుగంధాలు – బిల్వపత్రాలతో పరమశివ పూజగావించారు. శివమంత్రం పఠిస్తూ, శుద్ధజలధారతో అభిషేకించాలి. అప్పుడు అలా పరమశివుని ప్రసన్నుని చేసి జపించిన మహామంత్రాలను గూడాచెప్పుతాను ధర్మరాజా! జాగ్రత్తగా వినమని యిలా చెప్పాడు శ్రీకృష్ణపరమాత్మ. రుద్రము, నీలరుద్రము, చమకము, శ్రీసూక్తము – రాత్రి సూక్తము, హోతారము, అథర్వశిరస్సు – అథర్వశిఖ, శాంతి, అరుణము, సామము, పుష్పసూక్తము, పురుషసూక్తము, మృత్యుం జయమహామంత్రము, పంచాక్షరి మొదలైనవాటితో అపారభక్తిభావముతో వీనిని జపిస్తూ వేయిజలధారలతో, లేక నూట యెనిమిది జలధారలతో అభిషేకము గావించారు.

తరువాత చందన విభూతి అక్షతలు కుసుమాలు బిల్వపత్రాలతో శివలింగార్చన గావించారు. అనంతరం ఓంకారనాదముతో ధూపదీపనైవేద్యాలు దక్షిణ తాంబూల నీరాజనాలు సమర్పించారు. అనేక విధాలైన ధ్యానమంత్రాలు జపిస్తూ మంత్రపుష్పము సమర్పించారు. తరువాత ప్రదక్షిణ నమస్కారాదులనిడి అందమైన పూవులు పరమశివుని పాదముల మీదజల్లి దోసిలి పట్టి "ఓ పరమశివా! మేమందరం తెలియక యీవిధముగా మీపూజ మీరిచ్చిన జ్ఞానముతో మిమ్ము పూజించాము. దీనిలో యేమైన పొరపాట్లున్న సరిదిద్దమని ప్రార్థిస్తున్నాము ప్రభూ! కరుణాకరా! శుభకరా! మమ్మందరరక్షించుమా!" అని ఆతనిని ప్రార్థించి పూలు సమర్పించి స్వస్తిమంత్రాలనూ పఠించి మార్జనము చేసి పరమశివుని పూజించి, "శివ! నీపైభక్తి భావము మాకు కలుగునట్లు చేయండి. నీప్రపత్తికి మాహా నమోవాకాలందుకో మహాత్మా!" యిలా పరమేశ్వరుని యెంతో భక్తిభావంతో ఓంకారనాదాలతో, శివుని

పరివారమునకందరకూ నామస్సులర్పించి, అలా పూజపరిసమాప్తి చేశారు దేవతలు. అమరులందరూ ఆవిధముగా శివపూజగావించారు. అందువలన "ధర్మనందనా! దేవతలు పరమశివారాధన యెలాగావించారో ఆవిధముగా యెవరు చేసినా దేవతలందరూ వారికి సమస్త సంపదలూ యిస్తారు. పాపము – రోగము – దారిద్ర్యము; ఋణము, యివన్నీశివపూజవలన పోతాయి. శాంతికలుగుతుంది.

బ్రహ్మకు – విష్ణువు శివలింగార్చన గూర్చి చెప్పడం "యధిష్ఠిరా ! ఒకప్పుడు బ్రహ్మదేవుని దగ్గరకు సురేంద్రాదులందరూ వచ్చారు. వారినందరినీ తీసికొని ఆతడు శ్రీమహావిష్ణువు దగ్గరకు వెళ్లారు.

**ఉ. సారపువేదమూలమును, సత్యము స్కంధము, నైగమోరుమ**
**జ్జారము యోగశాఖయును; చారుకలాసనపత్రమున్, మనో**
**హారిసుభక్తిపుష్పమునునై, ఘనమోక్షఫలంబునై శుభ**
**శ్రీరమణీయమౌచు విలసిల్లు ధరారుహ పాళిగాచుచున్"**

బ్రహ్మాదులెల్లరూ "ఓంనమోనారాయణాయ" అనే అష్టాక్షరీ మహామంత్రాన్నీ స్పష్టమైన ఉచ్చారణతో పలుకు చిలుకలు, ఓంకారనాదాన్ని నిర్మలమనస్సుతో పఠిస్తున్న శారికలు, మహాభావముతో ద్వైతభావము పఠించు భరద్వాజపక్షులు, ద్వాదశాక్షరీ మంత్రాన్ని నిరంతరమూగావించు చిట్టంగులు తారకము జపముచేయు సారసపక్షుల, నుజూచిన బ్రహ్మాదులకు ఆశ్చర్యము కలిగింది. ఆవైకుంఠ మహానగరం. బ్రహ్మాదులు యింకాకొన్ని కక్ష్యలు దాటారు. అక్కడయెక్కడజూచినా "ఓంనమో నారాయణాయ" అనేమంత్రాలే వినిపిస్తున్నాయి. యింకాకొంచం దూరం వెళ్లేసరికి "ఓంనమోభగవతే వాసుదేవ" అనే మహాదివ్యమంత్రాలే వీనులవిందుగా వినిపిస్తున్నాయి.

యింకాముందుకు అడుగులు వేశారు. "శ్రీనారాయణ శరణం ప్రపద్యే" అనుదివ్యమంత్రాలే; మరికొంచంముందుకు వెళ్ళారు అచ్చట "శ్రీమతే నారాయణాయ" అనే మహా మంత్రాలు వారిచెవులకు పండువుగా విన్పించగా బ్రహ్మమహేంద్రాది బృందారకులందరూ రెండు చేతులు పైకెత్తి శ్రీమన్నారాయణునికి వందనలర్పించి ముందుకు సాగారు. ఆవైకుంఠనగరాన్ని గూర్చి యేమని చెప్పాలి. దేవతలందరూ అచ్చటగల పుణ్యపురుషులనుకని, అచ్చట గల చిత్రవిచిత్రాలను జూచి సురలుతామెందుకు వచ్చారో పూర్తిగా మరచిపోయారు. అలా ద్వారాలను దాటి బ్రహ్మమహేంద్ర మొదలైన దేవతలందరూ అనేకవిధాల స్తోత్రంగావించారు. అప్పుడు శ్రీహరి అనుమతితో బ్రహ్మాదులను లోనికి తీసుకొని వెళ్ళారు. అందరినేత్రాలూ అపరంధాముని దర్శించే సరికి మిరిమిట్లుగొల్పాయి, ఆతడు కామునితండ్రియైనా, కామములేనివాడు. కోపములేనివాడయినా, సాధుబాధితులకు బాధలు కలిగించువాడు; మోహములేని వాడేగాని శ్రీయందు మోహము గలవాడు; మదములేని వాడేగాని, భక్తరక్షణ మదాధికుడు; మాత్సర్యములేని వాడేగాని, దుష్టజనులపై మాత్సర్యము కలవాడు; దుష్టులందర వధించువాడు; శిష్టరక్షకుడు;



అటువంటి నారాయణుని చూశారు. ఆతనికి అల్లంత దూరాన నిలబడి "నమోశ్రీమతే నారాయణాయ! నమోభగవతే వాసుదేవాయ! నమోవిష్ణవే! నమోజిష్ణవే! నమోనమస్తే! మమనాథాయ! జగన్నాథాయనమో! మమదేవతాయ! దైవత దైవతాయనమో! మమకుల నాథాయ! దుష్టనిధనాయ! అని బ్రహ్మమహేంద్రాది దేవతలందరూ సాష్టాంగ దండప్రణామాలు చేశారు. భయసంభ్రమానందముతో ఉండే వారిని జూచి వైకుంఠుడు "కుమారా! నీసృష్టి సక్రమముగా సాగుతుందా? మహేంద్రా! సర్వదేవతలతో హాయిగా ఉన్నావా?" అని అందరక్షేమాలూ తెలిసికొన్నాడు;. మహేంద్రాదిబృందారకులారా! నిరంతరమూ, మీకు సర్వశుభాలుకావాలన్న ముందుగా పరమశివారాధన తప్పక చేయాలి. శివభక్తితోనుండేవారూ, నిరంతరమూ శివుని పూజించేవారు. మనస్సుల్లోశివునే ఆరాధించే వారికి యే చీకూచింతా ఉండదు; అమరులారా! నేనీస్థితిలో ఉన్నానంటే ఆ పరశివనామప్రభావమే కారణం. శివారాధన సల్పినవారు, శివలింగాన్ని నిత్యమూపూజించేవారు శివునే తలచినవారు. జన్మ, పాపదుఃఖాలన్నీ పోయి ఆనంతరం శివ సామ్రాజ్యాధికారులౌతారు" అలానారాయణుడు చెప్పగావిని

అందరూ సంతోషముతో "రమానాథా! మాకు అపరమశివలింగములు పూజించుటకు తమరే ఆలింగాలను దయతో నిప్పించండి" అనగా నారాయణుడు వెంటనే విశ్వకర్మను పిలిపించి "ఓయీ విశ్వకర్మా! నీవుతొందరగా యీబ్రహ్మాది దేవతలందరికీ ఒకొక్కరికీ ఒక్కొక పరమశివలింగాలను తయారుచేసి యీయమని ఆజ్ఞాపించాడు. వారివారి అర్హతలననుసరించి వారందరికీ కావలసిన లింగాలు తయారుచేసి యిచ్చాడు. వారు పరమభక్తి ప్రపూర్ణముతో వాటిని శిరోధార్యముగా స్వీకరించారు. శిరస్సులందు ధరించారు;. బ్రహ్మ దేవుడు ఇంద్రనీల మణులతో తయారుగావించిన లింగాన్ని పూజించాడు. స్ఫటికలింగాన్ని శ్రీమహాలక్ష్మి హృదయపూర్వకముగా పూజించి తనగళ సీమలో ధరించింది. వాణీదేవి రత్నభాస్వరలింగాన్ని ధరించింది.

యముడు మహత్తర కాంతులతో నున్న స్వర్ణలింగాన్ని భయభక్తి వినయనయ సంభ్రమానందంతో పూజచేయసాగాడు. వరుణ దేవుడు శ్యామలాకృతి గల లింగాన్ని అర్చించాడు. సూర్యభగవానుడు వజ్రలింగాన్ని గొని పూజించాడు. చంద్రుడు ముక్తామయలింగాన్ని భక్తి పూర్వకముగా గొలిచి ఆరాధించాడు. వసువులు, విశ్వేదేవులు, బంగారు లింగాలను పూజించారు. పగడపులింగాలను నాగరాజులు అర్చించారు. యిలా సమస్తసురలూ, సకలలోకవాసులను వైకుంఠవాసుడు కైలాసవాసుని పూజనుగూర్చి యెంతో షంతోషముతో తెలిపాడు ధర్మరాజా!" అని శ్రీకృష్ణ భగవానుడు తెల్పాడు.

అంతేకాదు శివుని జ్ఞానయజ్ఞముతో పూజించేవారే మహాత్ములౌతారు. అలా జ్ఞానయజ్ఞం చేసిన వారికి శివుడు అతిసన్నిహితుడౌతాడు. అటువంటి వారికి సుఖదుః

ఖాలూ, ధర్మ అధర్మాలూ కానుపించవు. యికలింగం గూర్చివిను. బాహ్యలింగమని, అభ్యంతరలింగమని రెండురకాలుగా ఉంటుంది యీ బాహ్యలింగం స్థూలంగా, అభ్యంతరలింగం సూక్ష్మముగా ఉంటాయి. ప్రతివారికి శివపూజ అత్యంత అవసరం. దేహధారితప్పక శివపూజాను రక్తుడై ఉండాలి. అలా ఉన్న వారికి సర్వశుభాలూ కలిగి పాపాలన్నీ పటాపంచలౌతాయి. అంతేకాదు "యుధిష్ఠిరా! నూనెశరీరానికి పూసుకొని కనీసము వారానికి ఒక్కమారైనా అభ్యంగస్నానముగావించాలి. ప్రతిరోజూ అభ్యంగన స్నానంచేసే వారికి పరమశివుడు ప్రక్కనే ఉంటాడు. మజ్జనానంతరాన ఋషి పితృతర్పణం భక్తితో చేసి తెల్లనివస్త్రాలు దాల్చి, పవిత్ర ప్రదేశంలో, దర్భాసనముపైని, విభూతి త్రిపుండ్రాలూ దాల్చి, రుద్రాక్షలు, గళసీమలో అలంకరించి నిత్యకర్మలు చేసికొని జప, తపో దానాలు సల్పి, సమస్తపూజాద్రవ్యాలన్నీ దగ్గరుంచుకొని ముందుగా గురువందనంబుచేసి, సంకల్పాన్ని చెప్పి పరమశివుని, పరివారాన్ని ప్రార్థించి, తరువాత శంకరుని పూజించాలి.

అందరికన్న ముందుగా మహాగణపతిని పూజించి, ప్రార్థించి, హృదయపూర్వకముగా నుతించాలి. కుమారస్వామిని, ద్వారపాలకులనూ నుతించాలి. పూలు, చందనమూసుగంధ ద్రవ్యాలు, ధూప, దీప మహానైవేద్యము సమర్పించాలి, తరువాత ఆచమనంచేసి అఖండజ్యోతిని వెలిగించి పూజించాలి. ఏకాగ్రమానసముతో, బంగారం, లేక, వెండితో చేసిన పార్థివలింగాన్నిగాని మూలమంత్రంతో జపించి, పంచముద్రలతో, ఆవాహనం, స్థాపనం సన్నిధాపనం చేయాలి. మహదానందంతో పరమశివ లింగార్చనచేయాలి ఆసనం పాద్యం ఆచమనంచేసి సుగంధచందన పుష్పాలు, షడంగాలుతో, శతరుద్రీయుము, చమకము, అనువాకాలతో పదిరెండు వారాలు అభిషేకించాలి. దాన్ని తెల్లవస్త్రంతో తడిఒత్తాలి. తరువాత ఆచమనము చేయాలి. వస్త్రము వేయాలి.

దానిపైని నువ్వులు, యవలు, గోధుమలు, పెసలు, మినుములు, శివునికి మంత్రంతో సమర్పించాలి. తరువాత, పద్మాల, శంఖాలు, దుత్తూరాలు, తుమ్మపూలు, మందారపూవులు, బిల్వపత్రాలు, తులసీ పత్రాలు, భక్తితో సమర్పించాలి. అన్నిటికన్నా బిల్వదళాలు ఉత్తమము. వీటి సమర్పణ చేత సర్వసిద్ధులూ కలుగుతాయి. ఆతరువాత సుగంధం, అత్తరు, పన్నీరు సమర్పించాలి. గుగ్గిలంధూపంవేయాలి. తరువాత మరల అర్ఘ్యంయీయాలి. "ఓపరమశివా! మాకు రూపము, మంచి భోగభాగ్యాలు, మంచి సత్కీర్తిని, ముక్తితో తమరు మాకు యివ్వండి" అని ప్రార్థించాలి.

తరువాత అనేక విధాలైన మధురభక్ష్యాలతో దివ్యమైన మహానైవేద్యము ఆచమనంచేసి సుగంధ దక్షిణతాంబూలాలతో అర్చన చేసి అయిదు జ్యోతులతో నాలుగు మార్లు పాదాలకు, మొత్తం పదియారు మారులు పరమశివునిలింగానికి దీపహారతినియ్యాలి. తరువాత కర్పూరనీరాజనం యిచ్చి, గురువుపదేశించిన మూలమంత్రజపము చేయాలి. అప్పుడుహృదయ పూర్వక నమస్సులర్పించి



"ఓపరమశివా! భూమిపై కాలుజారితే, మరల భూమే ఆధారమైనట్లు తమదగ్గర మేమేది తప్పుచేస్తే మరల మాకు నీవేదిక్కు. వేరెవరూదిక్కులేరు. ప్రభూమీపరివారముతో మీరున్న స్థానానికి వెళ్లండి, మళ్లీ మేము అర్చించు సమయానికి రావాలి" అని ప్రార్థించాలి. అలా అని పుష్పాంజలి తిరిగి సమర్పించి, హృదయము నుండి శివలింగాన్నివిడిచి, ఆతీర్థాన్ని శిరసుపై చల్లుకొనాలి. యీవిధంగా, భోగానికి, మోక్షానికి కారణమైన పరమశివార్చనమీకందరకూ ఉపదేశించా" ననినారాయణుడు బ్రహ్మాది దేవతలందరికీ చెప్పాడని, కృష్ణుడు ధర్మరాజుకు శివప్రభావమూ, పూజాదిక్రియలు ఉపదేశించినట్లు జనమేజయమహారాజుకు, వైశంపాయనమహర్షి చెప్పాడు. ఓధర్మరాజా! అందువలన నీవాపరమలింగార్చనా పరుడవై సర్వకాలాల్లో "ఓంనమశ్శివాయ" అనే పంచాక్షరీ మహామంత్రాన్ని జపిస్తే నీకు పరమ శాంతి లభిస్తుంది. జరిగిన దానికై యెంత మాత్రమూ విచారించవద్దు. అంతా ఆశివపరమాత్మయే చూసుకుంటాడని" ధర్మరాజును శ్రీకృష్ణపరమాత్మ ఓదార్చాడని జనమేజయునకు వైశంపాయనుడు తెలిపి మరల యిలా అన్నాడు.

తరువాత కృష్ణ పరమాత్మ వ్యాసులవారి ఆశీరుపాయనలు పాండవులతో పొంది. యెవరి శిబిరాలకు వారు వెళ్ళారు. అశ్వత్థామశిరోమణిని తీసికొని భీముడు ద్రౌపదికిచ్చాడు. అదిచూసిన పాంచాలి యెంతో ఆనందించింది. ఆమె ధర్మరాజుకిచ్చింది. అప్పుడాయుధిష్టిరుడు ఆమహావిలువకట్టలేని మణినితన శిరముపై దాల్చి భరతసామ్రాజ్యాధిష్ఠుని పోలిక కాంతితో ప్రకాశించాడు.

**ఇది మహాభారతములో సౌప్తికపర్వం ముగిసింది**



# సంపూర్ణ మహాభారతం



## స్త్రీ పర్వము

జనమే జయమహారాజు, వైశంపాయన మహర్షిని చూసి "మహాత్మా! తరువాత మాతాతల దివ్య చరిత్ర తమరు విన్పించండి" అని అడగ్గా! ఆమౌని యిలా చెప్పాడు. "మహారాజా! యేమని చెప్పాలి? మూర్ఖుడూ. ముందు చూపు అణుమాత్రమూ లేనివాడూ, దుస్స్వార్థపరుడూ, కేవలం పరమదుష్టుడైనదుర్యోధనునకు వశమై, అతడే తనసర్వస్వమని నమ్మి, తన తమ్ముని కుమారులు పాండుపుత్రులకు చేయరాని దుష్కార్యాలు చేస్తున్నా, తనకేమీపట్టనట్లున్న ధృతరాష్ట్రుడు నూరుగురు కుమారులు, బంధువులు, ఆప్తులు, మనుమలు, మహారాజులు, కోట్లుసేన, ఏనుగులు, గుర్రాలు బంగారం – నవరత్నరాసులు, అన్నీతనకనుల యెదుటనే నాశనమయ్యాయని ఘోరముగా యేడ్చాడు.

"మహారాజా! చిన్ననాటి నుండీ నీపెద్దకుమారుని అదుపులో పెట్టలేదు. సరే! వాడాడినది ఆట! పాడినది పాటగా వాడియిష్టానుసారమేనీవునడిచావు. అందువలన వాడుచేయు అకృత్యాలు లెక్కలేనన్ని చేశాడు. పాండవులను భూమిపై ఉండనీయలేదు. వారుకాబట్టి నీకొడుకు చేయు నీచపుపనులకూ, దారుణాలకూ, శాంతితో తలొగ్గియెలాబయట పడగలిగారు. యెప్పుడైనా నీవు ఆలోచించావా? యిప్పుడింతగా నేలదొర్లియేడిస్తే యేమిలాభం! అంతా అయిపోయింది. యిప్పుడు యెవరూ యేమీ చేయలేరు. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకోవడమని దీనినే అంటారు" అని సంజయుడు ధృతరాష్ట్రునిమాటలు ఆతనిముఖముమీదే అన్నాడు. యెవరు



యేమన్న యిక లాభంలేదుకదా! జనమేజయమహారాజా? బాగా ఆలోచిస్తే, ధృతరాష్ట్రుని మూలంగానే యింతజరిగింది.

### విదురుడు - ధృతరాష్ట్రుడు

"మహారాజా! నీవు సర్వమూ తెలిసిన వాడివికూడా. పామరుడిలాగుదుఃఖిస్తే యేమిలాభం? పోయిన వారిని మరల మనం తేగలమా? తేలేముకదా? మరియేడుపు దేనికి? పుట్టి – పెరిగి. తరువాతనాశనం యీగుణాలు ప్రతీదానికీ ఉన్నవే?" యదృశ్యం తన్నశ్యం – తన్నశ్యం యదృశ్యం "అనివేదముచెప్పుతుంది." పుట్టుట గిట్టుటకే అన్నారు పెద్దలు వీటన్నిటికి కాలముకర్త. అందువలన వీటిని గూర్చి అతిగా యేద్వడంజ్ఞానమున్న వారికి తగదు. మనకు. సర్వమూకాలమే సమకూరుస్తుంది. ఆకాలము తానుచేశాననిపించుకోక యేదో ఒకనెపముగా జీవులందరినీ పొట్టను పెట్టుకుంటుంది. మనవారి నందరినీ పాండవులే చంపారు ఆనడం కన్న పొరపాటు మరొకటిలేదు.

యింతకూనీవు విచారించవలసినపని ఆవంతలేదు. కారణం? యుద్ధములో మరణించిన వారందరూ ఉత్తమము లోకాలకు వెళ్లారు. అంతేకాని యేవోరోగాలతో, యెన్నాళ్లో మంచంపట్టి మరణించలేదు. అటువంటి మరణం అందరకూలభిస్తుందా? వారిని గూర్చి నీవు యిలామరీదిగజారిపోయి మనోవ్యాధిని కొనితెచ్చుకొని మరణించడం మంచి పనికాదు. పోనీయేకధాటిగా యేడుసంవత్సరాలు మనము యేడుద్దాం. పోయినవారు తిరిగి రారుకదా? మనబాల్యం యవ్వనం యిప్పుడు యెన్నిచేసినా తిరిగి తెచ్చుకోగలమా? మనకు కొన్ని వందలు జన్మలున్నాయి. యేయేజన్మల్లో యెవరెవరు తండ్రులో! యెవరెవరుకు మారులో యేమైనాతెలిసి కొనగలమా? నువ్వెందరకు పుట్టి యెందరను యేడిపించావో యేమైనా తెలుసునా? యెవరుకొడుకులు? యెవరుతండ్రులు?

అందువలన మనముదుఃఖింపరాదు. అతిగా దుఃఖిస్తే అజ్ఞానులమేఔతాము. అజ్ఞానమూలముగా సర్వమూ మరచి పోయి చేయరాని పనులుచేసి, నరకంలోనికి పోతాము. యీ భోగభాగ్యాలూ – యీసర్వసంపదలూ నిజమైనవికావు. మనకు నిజమైనది మన ఆత్మ ఒక్కటే. దానిని మించింది యిక యేమీలేదు. అందువలన వీటిని గూర్చి మనము విచారించడం, యేడవడం తలకొట్టుకొని చావడం తప్ప యింకమనకు చచ్చినవారుతిరిగిరారు, యిది దేహముయొక్కధర్మం. పంచభూతాలతో నిర్మాణమయిన యీదేహం యిక్కడ ఆటలాడి మరల పంచభూతాల్లోనే కలిసి పోతుంది. అందుచేత మహారాజా నిరంతరానందమయముగా బుద్ధిని ఉంచుకొని సర్వకాలసర్వావస్థల్లో సర్వేశ్వరుని ప్రార్థిస్తూ, ఆతనిని శాంతినిమ్మనికోరి ఆ శాంతితో జీవించడం మంచిదిగాని, వేరువిధముగా మనము మనకూడదు.

యీ శరీరాన్ని విడిచి ఆత్మ మరొకశరీరములో ప్రవేసిస్తుంది. అంతేకాని దానికి చావులేదు. చినిగిపోయిన వస్త్రాన్ని విడిచి మరలక్రొత్తవస్త్రాన్ని యెలాధరిస్తామో,

ఆత్మయీ శరీరమునుండి వెళ్ళివేరొక శరీరములో ప్రవేశిస్తుందంతే! యీజీవులకు వందలాది జన్మలుండుట చేత అనేక జన్మల్లో వారుగావించే కర్మలు మళ్ళీజన్మల్లో అనుభవించాలి. తప్పదు. అందుచేత అనేక సుఖాలు, కష్టాలూ, నష్టాలూ పొందవచ్చు, నూరేళ్ళనిండుజీవితం నిర్మితమైనా, వారివారి పూర్వజన్మల ననుసరించి, కొందరు పుట్టగానే చనిపోవచ్చు. మరికొందరు పదిసంవత్సరాల్లో మరికొందరు ముప్పది యిలా వారి వారి జన్మలలో వారుచేసికొన్న కర్మల మూలాన యీజన్మలో అవి అనుభవించాలి తప్పదు. యీ శరీరతత్వమే అంత. కొందరుచాలా శాంతి స్వరూపులుగా ఉంటారు. కొందరు పరమదౌర్భాగ్యులౌతారు. ముందుమనము చెప్పుకొన్నాము వారి వారి జన్మకర్మలేవారినలా నడిపిస్తాయి. ఒక్కతల్లి గర్భంలో నుంచి వచ్చినవారే అనేకరకాల బుద్ధులు కలిగి ఉంటారు. కారణం? వారు యీ జన్మలో ఒక్కతల్లికి జన్మించారు. వారు వేరు జన్మల్లో యెలాంటి కర్మలు చేశారో ఒక్కతల్లి గర్భంలో నుండి వచ్చినా వారిపూర్వకర్మలఫలం అనుభవించి తీరవలసిందే. అందుకే అన్నదమ్ములైనా, అందరి మనస్తత్వాలు ఒక్కలాగుండవు.

యీవిషయాన్ని తెలిసికొన్న విజ్ఞానులు విభిన్నమనస్సుగల వివిధ జనులను జూచి ఆనందిస్తారేగాని అసూయ అందరు. మహారాజా! మీరు మీబిడ్డలగూర్చి, మరొకదాని గూర్చి దుఃఖించక యీశేషజీవితాన్ని యీశ్వరార్పణం చేసి, సర్వమూ పరమేశ్వరుడను సమానబుద్ధితో ఉండండి. యిప్పటికే జీవితము చరమదశలో చేరుకుంది.



**జీవుని ఉత్పత్తి**

మహారాజా! జీవుని ఉత్పత్తి చాలా చిత్రముగా ఉంటుంది. జీవుడు తాను తినిన అన్నం నుండి దివ్యమైన జీవశక్తి పుడుతుంది. అది యేవిధమైనది అయితే ఆటువంటి బుద్ధిపుడుతుంది. స్త్రీ – పురుషుల్లో శోణితంగా – శుక్లంగా ఉంటుంది. యిక ప్రకృతి కల్పించిన కాముకత్వం వలన స్త్రీపురుషుల కలయిక జరుగుతుంది. పురుషుని శుక్లం – స్త్రీ యోనిలోనుండే శోణితములో పడుతుంది. అలాపడినతరువాత ఆరెండూకలిసి ముద్దగాతయారవుతాయి. అలా రక్తంతో కలసి పిండమౌతుంది. అదిక్రమక్రమంగా పెరిగి అవయవాలు తయారవుతాయి. యిలా ఆపిండం జీవుడుగా తయారయి పూర్తిగా తొమ్మిది నెలలూ నిండి పదియవమాసంలో తల్లిగర్భంనుండి బయట పడతాడు జీవుడు. యిక పుట్టిన బిడ్డ మగగాని – ఆడగాని వారియెన్నో జన్మలలో చేసిన కర్మలన్నింటినీ అనుభవించాలి. యీబిడ్డకు బాల్యంలో అనేకరోగాలు రావచ్చును.

అతిబాల్యం నుంచీ మహామేధావులవుతారు, కొందరు సామాన్యులుగానే ఉంటారు. దీనికంతటికీ కారణం వారి జన్మకర్మలేగాని మరొకటిలేదు. బాల్యందాటి యవ్వనదశకువస్తారు. యీ యవ్వనదశచాలా ప్రమాదాలనుకొనితెచ్చి పెట్టుకుంటుంది. అహంకారంతో నాకన్నా గొప్పవారులేరనే భావంతో



అన్నివిధాలవ్యసనాలతో, చేయరాని పనులతో మృత్యువును తెచ్చుకుంటారు. కొందరు; వారి కర్మలమూలంగా సత్సహవాసంతో మంచి మార్గంలో ప్రయాణించి, సత్పురుషులై, గొప్పకీర్తితో చరిత్రలో కెక్కుతారు. మరికొందరు చెడ్డసహవాసముతో యెందరు చెప్పినా వినక అహంకార మమకారాలతో చెడి దుర్మరణము పాలౌతారు. యమలోకములో అనేక బాధలు అనుభవిస్తారు. దుష్టబుద్ధి గలవాడు యెందరు చెప్పినా వినక తనకు తానే అహంకారంతో అన్నీ అనుభవిస్తూ అంతమందుతాడు. యింకొందరు యెదుటి మంచివారిని నానాకష్టాలూ పెట్టి, కొంతకాలానికి వారికి వారే శత్రువులైనశిస్తారు. సర్వమూ నాదే అను దురూహాతో అహర్నిశలు, పరులకీర్తి – ఉన్నతికి ఓర్వలేక కొందరు చెడతారు. అధర్మప్రవర్తనతో, తనకు మించినవారులేరని కామక్రోధలోభ మదమాత్సర్యాలతో, యీర్ష్యతో ఉన్నతులను ఆగౌరవపరచిపతితులైన వారు కొందరు. మేమూ, మాబిడ్డలేకాక యింకా యితరులు మనుజులేకారని భావించి, పయివారికి నానాకష్టాలూ, నష్టాలూ, కలిగించి తుదకు వారేనాశనమైన వారుకొందరు; అందరిసొత్తూనాదేనని భావించి, సోదరులనైనా అనేకవిధాలబాధలు పెట్టి, వారితో యుద్ధాలుగావించి, వారికి నష్టంకలిగించి వారేతుదకు అంతమైన వారుకొందరు; యిలా రకరకాల మనుజులున్నారు – యిలా చెప్పాలంటే చాలా చరిత్ర యీ జీవునకుంది. అంతేకాదు యీజీవితమంతా అగమ్యఅంధకార అధోగోళం. యీగోళములో పడినమానవుడు దారికానక అందులోనే చిక్కుకొని చుట్టూ తిరుగుతాడు. ఆగోళములో క్రూరమృగాలెన్నో లెక్కలేనన్ని ఉన్నాయి.

వాటన్నిటినీ అధిగమించాలన్న మనిషికి యేమాత్రం సాధ్యముకాదు. అవి ఆతనని తినివేయడానికి, తప్పించుకోవాలన్న ఆతని ప్రయత్నాలు కొన్ని సఫలమౌతాయి, కొన్ని విఫలమౌతాయి. అదికూడా పూర్వజన్మకర్మననుసరించే ఉంటుంది. యింక దొంగభయం ముఖ్యముగా మనిషిని పట్టిపీడిస్తుంది. యెక్కడకువెళ్ళినా ఆతనిని వెన్నాడుతూనే ఉంటారు. వారిని తప్పించుకోవాలన్న చాలా పాట్లుపడాలి. వాటికోరలలో చిక్కుకోకతప్పదు. యిక ఆమానవునికి గమ్యమేది? ఉండదు. గమ్యం చేరడం చాలా కష్టసాధ్యం. ఆగోళంలో చిక్కుకొని దూరాలోచన చేయక దురాలోచనతో మ్రగ్గిపోతాడు. మానవుని భగవంతుడు పరీక్షిస్తుంటాడు. కొందరికి సర్వమూ యిచ్చి వీడు యీఐశ్వర్యాన్ని సద్వినియోగం చేస్తాడా? లేదా? అని ఒక పరీక్షపెడతారు.

ఆపరీక్షలో వానికి గర్వంకలిగి యిదంతా నాసంపాదనే అని అహంకారంతో నున్న వాడిని భగవానుడు మరల మొదటి స్థాయిలో అధోగతిలోనికి తోసేస్తాడు. యింకొకనికి బాగా లేమితో తినడానికి తిండి లేకుండా, చేసి పరీక్షపెడతాడు. వాడు భగవానుని పరీక్షలో నెగ్గాడా? వానికి అన్నీయిచ్చి ఆదుకుంటాడు. యిదంతా నాదికాదు. నిన్నటి వరకూ పడరాని పాట్లు పడ్డాను యిప్పుడీ ఐశ్వర్యం నీవిచ్చావు. యిదంతానీదే! యెంతమాత్రం నాదికాదు. అని సర్వము భగవత్

స్వరూపముగాభావించి, అణకువతో అందరినీ గౌరవించి, అందరిచేతా గౌరవింపబడి సమాజములో మంచికీర్తి నార్జిస్తాడు. ఆతడే నిజమైన మానవుడు.

అందువలన మహారాజా! యెన్ని భోగాలు, రాగాలు అనుభవించినా చివరకు మిగిలేవి మనము చేసికొన్న దానధర్మదయా సత్యాలేమనకు తోడువస్తాయి. యీకుమారులు గాని, యీమనుమలుగాని యెవ్వరూ మనకు తోడురారు. మనభోగాలు యెక్కువైతే రోగాలు వస్తాయి. కలిగి ఉన్నవాడుత్యాగి కావాలి. త్యాగము లేనివాడికి రోగమే మిగులు తుంది. త్యాగము లేని వాని శవాన్ని కుక్కలూ నక్కలూ ముట్టవంటారు. కొందరు పరోపకారానికే పుడతారు. కొందరు స్వార్థానికే పుడతారు. రాజాంతఃపురంలో ఒక భటుడు తన ఉద్యోగధర్మం ప్రకారం కఱ్ఱను విడువకుండా ఉండేవాడు. తరువాత ఉద్యోగావసరం లేదు. ముసలివాడయ్యాడు. అప్పుడు నిజముగా కఱ్ఱచేతికి అవసరమైంది. అలా కఱ్ఱను పట్టుకొని నడిచేవాడు. దానదయాధర్మసత్యాలు. మనిషికి యవ్వనములో అవసరం లేకపోయినా వాటిని విడువకూడదు.



అంత్యకాలాన మనిషివెనువెంట వచ్చేవి అవే! కాని యీమేడలు, మిద్దెలు, యీభోగాలూ, భార్యాపిల్లలూ యెవ్వరూరారు. వీటికి మనం చెల్లు చీటీ యిచ్చేయ్యాలి. అదే భ్రాంతిమీద వారలగూర్చి మనము చింతించడంగాని, యేడవడంగాని చేయరాదు. వారికి యిహలోక సంబంధము తెగిపోయింది. వెళ్లిపోయాడు అంతే. జ్ఞానులు చచ్చిన వాని గూర్చి, చావని వాని గూర్చి ఒక్కలాగే చూస్తారు" అని చెప్పిన మహాత్తత్వవేత్త విదురుడు తన జన్మజన్మాంతరాలలో గల విషయాలతో ధృతరాష్ట్రుని ఓదార్చాడు. సరిగా వ్యాసభగవానుడు కూడా అచ్చటికి వచ్చాడు. ఆమహాత్ముడూ అనేకవిధాల దుఃఖించు ఆంబికేయునికి ఉపశమనం కలిగించాడు.

యెందరెందరు యెన్నివిధాల చెప్పినా కేవలమూర్ఖుడగుధృత రాష్ట్రుడు మాత్రం దుఃఖిస్తూ, నాసంతానం, సమస్త సంపదలూ సమసిపోయాయి. శ్రీవ్యాసభవానుడు ఆతనిని పరామర్శించి వెళ్లిపోయాడు. ధృతరాష్ట్రుడువిదుర సంజయులతో కురుక్షేత్రభూమికి అంతఃపురకాంతలందరితో వెళ్లడానికి తగిన యేర్పాట్లు చేయమన్నాడు. మొత్తముపై అందరూ ఆరణరంగ భూమిలో చచ్చిపడి యున్నవారిని దర్శించాలని బయల్దేరారు. రథాలు, బళ్లూ – మొదలగువాటిపై ప్రయాణంకట్టారు. అందరూ వెళ్లారు. హస్తినాపురం దాటారు. కొంతమేరకు వెళ్లేసరికి వారికి కృపాచార్య – కృతవర్మా – అశ్వత్థామలు కానవచ్చారు. వారు గాంధారీ – ధృతరాష్ట్రులకు వందనలర్పించారు.

భీముడు దుర్యోధనుని గదాయుద్ధములో మాయచేసి తొడలు విరగ గొట్టాడని, దానికి ప్రతిగా రాత్రి నిద్దుర పోతున్న వారి నందరనూ మాయతోనే చంపానని అశ్వత్థామ చెప్పాడు. పాండవులకు వేముకనుపించకుండా వచ్చామనీ, కృష్ణార్జునులిద్దరూ మాకుకానరాలేదని ముగ్గురూ వచ్చారు. కృతవర్మ తననగరానికి



వెళ్లాడు. కృపుడు హస్తినాపురానికి, అశ్వత్థామ ముగ్గూరూ మూడు దిశలకు చేరుకున్నారు. యిక అశ్వత్థామ తానాచరించిన ఘోరకృత్యాలన్నిటినీ నెమరు వేసుకొని యెంతో పశ్చాత్తప్తుడై యెంతోబాధపడి, ఆబాల్యంగా పవిత్రమైన బ్రాహ్మణకర్మను విసర్జించిక్షాత్ర ధర్మాన్నే ఆరాధించాను. అని యెంతో బాధతో ధనుర్బాణాలను విసర్జించాడు అశ్వత్థామ. యిక తపస్సే అన్నిటికీ మూలమని ఆవృత్తిని పొదాడు.

## ధృతరాష్ట్రుని పాండవులు కలియడం

ఇలా అశ్వత్థామ శిరోమణిని తీసికొన్నారు పాండవులు. యింతలో గాంధారీ ధృతరాష్ట్రాదులు వచ్చారని తెలిసింది. సాత్యకీ – కృష్ణులతో పాండవులు యుద్ధభూమికి ప్రయాణమయ్యారు. ద్రౌపదీదేవి – తనసపత్నులూ – పాంచాలదేశ అంతః పురకాంతలతో కలిసి గాంధారీ ఆంబికేయుల దగ్గరకు వెళ్లారు. రణరంగక్షేత్రాన ఒకవైపునుండి ధర్మరాజాదులు – వేరొకప్రక్క ధృతరాష్ట్రాదులు పాదాలు మోపారు. కౌరవకాంతలు ముందుగా ఉన్నారు. ధర్మరాజును చూసిన కౌరవకాంతలందరూ మోములు చిట్లించుకొని కటిక కసాయిఅని. బంధువుల – సోదరులందరనూ చంపిన దుష్టుడనీ, తమపతులందరినీ హతమార్చినవాడని దుఃఖివివసులై అనేక విధాలు నిందించారు.

అందరూ చుట్టుముట్టి "నిజముగా నువ్వుధర్మరాజువేనా? నీకు యీ పేరెవరు పెట్టారు? నేతి బీరకాయకాదా? నీవు కులహంతకుండవు. మెత్తనిపులివి. బాల్యంనుండీ తండ్రిలేని పిల్లలను మిమ్మందరనూ పెంచి పెద్దచేసి సకలవిద్యాపారంగతులుగా చేసిన అమరమూర్తిని అంపశయ్యనెక్కించావు. తనవిద్యమర్మమింతైనా మిగల్చక సకల శస్త్రాలమర్మాలన్నీ చెప్పిపంచిన గురువును బ్రతికుండగానే కుత్తుకను కోయించిన పరమపాపిష్టివి. మేము నూర్గురము నీమరదండ్రము మాపసుపుకుంకాలూ గంగలో కలిపెయ్యడంతో నీవూ నీభార్యలూ అందరూ బాగా ఆనందించండి. యిప్పుడు తిన్నగా మాముఖాలు చూసి చెప్పు? యిదినీకు ధర్మమేనా? మేమిందరం బ్రతికినంత కాలం యిలా వైధవ్యంతో బాధపడి క్రుంగి కృశించి పోవడమే నీకిష్టమా!

యిక మీ కుమారులు ఉపపాండవులు లేరు. మహావీరాధి వీరుడైన అభిమన్యుడూ – ఘటోత్కచులూ – ధృష్టద్యుమ్నాది పాంచాలవీరులందరనూ పరిమార్చుకున్నావు. యిందరు చచ్చిన యీ శ్మశాన సామ్రాజ్యాన్ని జాగ్రత్తగా పరిపాలించుకో! రాజ్యభోగాలన్నీ శాశ్వతముగా అనుభవించుకో! దయాదాక్షిణ్యం ప్రేమా నీహృదయంలో ఉందా? ఉంటే యింతదారుణాన్ని సృష్టిస్తావా? పదునెనిమిదక్షౌహిణుల బలమునంతా నాశనముగావించావు. కళకళలాడిన కౌరవసామ్రాజ్యానికి మహమ్మారివయ్యావు." యిలా కౌరవకాంతలు ధర్మరాజును పట్టుకొని దులిపి దుళ్లగొట్టారు.

దీనికి ధర్మరాజుగాని, మరెవ్వరూ జవాబు చెప్పకుండా తలలు వంచుకొని ధృతరాష్ట్రుని దగ్గరవరకూ అలాగే నడిచారు. "పెద్ద తండ్రీ! నేను ధర్మరాజును.

నీతమ్ముడు పాండురాజాగ్రజుడను" అని ధృతరాష్ట్రునకు పాదాభివందనగావించాడు ధర్మరాజు. ధృతరాష్ట్రుడు లోపలినుండి పొంగి పొర్లివస్తున్న దుఃఖాసాగరాన్ని ఆపి బయట పడనీకుండా తప్పనిసరి బలవంతపు బ్రాహ్మణత్వములాగ ఆశీస్సులందించాడు. అందరు పాండవులు వారివారి పేర్లు చెప్పి ఆతనికి నమస్సులర్పించారు.

## ధృతరాష్ట్రుడు భీముని చంపనెంచడం

తక్కిన వారందరినీ అంధరాజు అదోలాగ ఆశీర్వదించాడు. పళ్లుపట పటకొరుకుచూ ఆంబికేయుడు మనస్సంతా భీమునిపైనే పెట్టుకొన్నాడు. తన అగ్రసుతుని - దుశ్శాసనుని అన్యాయంగా భీముడు చంపాడని ఆతని ఆరాటం. ఆరాటమేకాదు ఆతన్ని అంతంగావించాలని కూడా యెంచుకున్నాడు. ధృతరాష్ట్రుని బలముసామాన్యమైనది మాత్రంకాదు. అది ఒక్కశ్రీకృష్ణ పరమాత్మకే తెలుసు. అంతేకాదు చిన్నతనంలో బాల్యంలో ఆటలాడినప్పుడు కూడా పాండవులందరి కన్నుమిన్నగా కౌరవులందరూ యేకమైనా వారందరినీ చితక కొట్టినవాడు భీమన్న. అందువలన కౌరవులకు ప్రబలశత్రువు. ఆతన్నికౌరవుల సామాన్యంగాచేశారా? గాఢనిద్రలో ఉండగా భీముని త్రాళ్లతోకట్టి అగాధజలాశయములో పడేశారు. విషాన్నాన్ని ఆతనికి పెట్టారు. ఒకటేమిటి? పాండవులలో భీముడే కౌరవులచేత బాధాపడ్డాడు. అలాగే కౌరవులూ భీమన్ననే చంపాలని యెన్నో విధాల ప్రయత్నించారు. యీ విషయాలన్నీ దుర్యోధనునకు తెలుసును. ఆతడు ధృతరాష్ట్రునకు యెప్పటి విషయాలన్నీ పూసగ్రుచ్చినట్లుచెప్పేవాడు. అందుచేత ధృతరాష్ట్రునకు భీమన్నపైనే యెక్కువ క్రోధాన్ని పెంచుకున్నాడు. శ్రీకృష్ణుడు అందరితరువాత భీముని ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్లమని యీలోపున ఉక్కుతో భీముడు లాంటి విగ్రహాన్ని చేయించారు. పాండవులందరూ ఆశీస్సులందారు. యిప్పుడు భీముడు వెళ్లాలి. ధృతరాష్ట్రుని దగ్గరకు ముందు భీముని పంపి వెంటనే ఉక్కు బొమ్మను పెట్టి కృష్ణుడు వెళ్లాడు వెనకాల. భీముడు నమస్సులందించాడు. పేరు. చెప్పమనగ భీముడనగా భీమునినామమువిని ఒక్కమారు హృదయంలో మంటలెగసాయి. ధృతరాష్ట్రునికి నమస్కరించి భీముడు దూరంగా పోయాడు. వేయి ఏనుగుల బలముగల ధృతరాష్ట్రుడు "నాయినా కుమారా! నిన్నుగాఢంగా కౌగిలించుకొనాలని యెంతో ప్రేమ ఆత్రత ఆర్ద్రత ఆరాటంపడుతుంది నామనసు ఒక్కమారు నాయాలింగనాన్ని అందుకొంటే ముక్తి పొందుతావురా!" అన్నాడు.

అప్పుడు శ్రీకృష్ణునికి యీవిషయమంతా తెలియునుకదా! అందువలన భీమునికి బదులు ఉక్కుభీముని విగ్రహాన్ని నిగ్రహంకోల్పోయిన ధృతరాష్ట్రునికి అందించారు. ఆతడు భీముడని మహాజవసత్వాలు, ధృఢమైన బాహుబంధాల్లోకి తీసికొని గట్టిగా నొక్కాడు. యింకేముంది? ఆవిగ్రహంముక్కముక్కలయింది. అదితెలిసిన గ్రుడ్డిరాజు బయటికి ఆశ్చర్యాన్ని ప్రకటించి, "అయ్యో! నాయనా! కొంచం



యెక్కువప్రేమతోనిన్ను కౌగిలించుకున్నానంతే! యింతమాత్రానికే యిలాడీలాపడిపో తావా? నొప్పిగా ఉంటే చెప్పవాకుమారా! యెంతపని జరిగింది" అనినొచ్చుకున్నాడు. అది చూసి అక్కడివారందరూ! గ్రుడ్డిరాజు దుర్మార్గానికి భయభ్రాంతులై యెంతగానో హా! హా! కారాలు గావించారు.

## శ్రీకృష్ణుని హితవు

"మామా! ధృతరాష్ట్రమహారాజా! నీవణు మాత్రమైనా యీ జరిగిన దానికి విచారించకు. యెందుకనగా! భీముడు మాత్రం సురక్షితంగా ఉన్నాడు. నీబాహువుల్లోకి వచ్చింది. లోహపుప్రతిమ. నీకు భీమునిపై యెంత ప్రేముందో యిక్కడి వారందరికి తెలిసింది. తమ్ము బిడ్డలన్న మొదటి నుండీ నీకున్న ప్రేమకొందరికే తెలుసు. యిప్పుడు చేసిన యీనీగొప్పపనితో అందరకూ తెలిసింది!" అన్నాడు కృష్ణుడు. దానికి యెంతో సిగ్గుపడ్డాడు ధృతరాష్ట్రుడు. ఆహా! నాపన్నాగాన్నిముందే పసికట్టి నాకు తగిన శాస్తిచేశాడు. యిటువంటివాడు పాండవుల పక్షములో ఉంటే నాకొడుకులు యుద్ధరంగాన పాండవులను యెలాగెలుస్తారు?" అని మనస్సుల్లో అనుకున్నాడు. ధృతరాష్ట్రుడు.

సరేయింకనేను నాలోనున్న దుష్టత్వాన్ని దీనితో కూడా విడిచిపెడుతున్నానని సమాధాన పడ్డాడు. "మామా! నేనుండగా పాండవులకు యెట్టి ఆపదజరగదు. అంతేకాదు భీష్మద్రోణకర్ణ అశ్వత్థామాది మహావీరులందరూ నావైపున్నారని మానవప్రయత్నము మీదే ఆధారపడ్డాడు నీకొడుకు. అంతేగాని పరమాత్మ స్వరూపులైన దాన ధర్మదయాసత్యములు విసర్జించాడు. అందుకే తగినట్లు అనుభవించాడు. అనినేననడంకాదు ప్రజలందరూ ఘోషిస్తున్నారు. అందువలన నీవింక పూర్వపు బుద్ధిని వీడి పాండవులు నీకొడుకులుగా జూచుకొమ్ము" అన్నాడు కృష్ణుడు.యింక గాంధారీ అత్తతో, కుంతీ అత్తతో మీరందరూ నిరభ్యంతరంగా కలిసి జరిగిన దంతా పీడకలగా మరచి పోయి పొరపొచ్చాల్లేక ఉండండి. పూర్వపు విషయాలన్నీ మరచి పోండి. మనస్సులు పవిత్రముచేసి సర్వసమభావంతో మసలుతూ పాండవులను కుమారులుగా చూచుకొన్న, వారుకూడా నిన్ను పితృమూర్తిగా ఆరాధిస్తూ, మీకు కావలసిన వన్నీ సమకూరుస్తారు. నిరంతరం శివధ్యానంతో నున్న ఆపరమశివుడే మీకన్నీ సమకూరుస్తాడు. అదేమీకు శాంతినిస్తుంది. యింకాకామక్రోధాదులకు వశముకావద్దు. మామా! నేనెందుకు రాయబారానికి వచ్చాను. నీవప్పుడు నీపెద్ద కొడుక్కిగట్టిగా చెప్పి ఉంటే, వారికాగతి, నీకీగతి పట్టి ఉండేదికాదు.

ఇక "బుద్ధిఃకర్మాను సారిణి" అంటారుపెద్దలు. ముందు యీకర్మ అనుభవింపవలసి ఉన్నమీకు నామాటలు ఆనాడు చెవికెక్కలేదు. సరే! జరిగిన దానికి విచారింపనక్కరలేదు. జరుగవలసినదానికై చూడండి. యిప్పుడైనా నామాట లాలించి, యీ నీబిడ్డలను జాగ్రత్తగా చూసుకుంటే వారూనిన్ను అంతకన్నమిన్నగా

అన్ని విధాలాచూస్తారు. నీకు వందమందికుమారులేపుట్టారు. యిప్పుడు పాండవులు వేయిమంది పుత్రులుగా నీపూజగావించి నీవు యెలా చెప్పితే అలా నడవడానికి సిద్ధంగా ఉన్నారు. యిక్కడనుండి వారికీనీకూ కూడ కొత్త జీవితం సంప్రాప్తమౌతుంది. వీరందరితో వైశ్యవీరాగ్రేసరుడు "యుయుత్సు" కుమారుడు ఉన్నాడు. అని ఆతనిని ధృతరాష్ట్రుని దగ్గరకు తీసుకువచ్చారు.

పరమాత్ముడైన శ్రీకృష్ణుని దివ్యవచనాలు చక్కగా పాటించాడు ధృతరాష్ట్రుడు. మరల వ్యాసభగవాను డచ్చటికి వచ్చాడు. అందరూ దివ్యమహార్షికి అర్ఘ్యపాద్యాదులిచ్చి పూజించి ఉన్నతాసనం వేశారు. అందరూ చుట్టూ ఉన్నారు. అప్పుడుకన్నీటితో ధృతరాష్ట్రుడు వ్యాసులవారికి నమస్కారంచేసి "మహర్షివర్యా! యిప్పటినాదీన పరిస్థితిని కళ్లారా చూశారా?" అనగా "అంబికేయా! నీవింకదుఃఖించకూడదు. నీకర్మయిలావుంది. అంతేకాదు, యుద్ధం ప్రారంభించడానికి ముందుగా సుయోధనుని దగ్గరకు కురుక్షేత్రరణరంగ స్థలానికి వెళ్లియెంత చెప్పాలో అంతాచెప్పాను. ససేమిరా! నామాట వినలేదు. నేనేమిచేసేది. ఒకవేళ వినునేమో కర్ణశకుని దుశ్శాసనులు విననివ్వలేదు. యీస్థితివస్తుందని నాకు ముందుగానే తెలుసును.

జరిగినదానికి మూలము సుయోధనుడేకాదు. కర్ణశకుని దుశ్శాసనులు. యీము వ్వురి వాక్కులే వేదవాక్కులుగా ఆలించడంవలన యింత జరిగింది. యింక జరిగిందేదో జరిగింది. యికజరుగవలసిన దానిని చూడు. నీకుమారులైన యీపాండవులు నీకు పంచపాండవులు. పాండవులజూచి "ధర్మనందనా! నీపితృదేవుడు మీపిన్ననాడే పోయాడని యింతకాలం అనుకున్నారు. యిప్పటినుండి యీధృతరాష్ట్రమహారాజే మీ పితృపాదునిగా ఆరాధించండి" అనివ్యాసులవారు వెళ్లారు.

## గాంధారీ చరిత్రము

అచ్చటనుండి శ్రీకృష్ణుడు, సాత్యకీ – పాండవులు మహాసాధ్వియైన గాంధారీదేవి దర్శనానికి వెళ్లారు. గాంధారదేశపురాకుమారి. గాంధారి యీమె పుష్పవతియైన జ్యోతిష్యులు యీమెను యెవరు వివాహము గావించుకుంటారో ఆరాజు కుమారుడు వెంటనే మరణిస్తాడనగా; రాజదంపతులూ, ఆరాజుకు కలిగినవందమంది కుమారులూ, ఆప్తులూ, బంధువులూ యెంతగానో చింతింపసాగారు. అప్పుడొకజ్యోతిషపండితుడు "మహారాజా! భూమిపైన మానవులకు ప్రతి పనికీ ప్రతిక్రియ ఉంటుంది. అలాగే నీకుమార్తెకు కూడావివాహముగూర్చి మార్గంలేక పోలేదు. వినండి మానవునికీ మేకకూ చాలా దగ్గరసంబంధముంది. అందుకే మనిషికి అవయవాల్లోయే భాగంక్షీణిస్తేమేక యొక్కఆభాగాన్ని తినినపుష్టికలుగుతుందని మన ప్రాచీన ఆయుర్వేదములో వ్రాయబడింది.

అందువలన మంచి వివాహ ముహూర్తాన్ని నీపుత్రికమెడలో ఒకమేకపోతుతో మంగళ సూత్రం కట్టిస్తే ఆకీడంతాదానికి తగిలి అదిమరణిస్తుంద"ని చెప్పగా, అలాగే గాంధారరాజుమంచి ముహూర్తసమయాన గాంధారీ గళమందు ఒకమేక పోతుచేత మంగళసూత్రము కట్టించడం అదివెంటనే చనిపోవడంజరిగింది. అప్పుడు గాంధారరాజు, కుమారులూ, మొదలగు వారంతా యెంతగానో ఆనందించారు. తరువాత ఆమెను అంధుడైన ధృతరాష్ట్రునకు వివాహం గావించారు. యిదియిలా ఉండగా, సుయోధనుడు పెద్దవాడైన తరువాత యీవిషయం యెలాగో తెలిసికొని తల్లిని దండించి, ఆమెవలన జరిగినది తెలిసికొని ఆగ్రహోదగ్రుడయ్యాడు.



తాతగారికి, మేనమామలకు యేలాగైనా ప్రతిక్రియగావించాలని ఆలోచించి ఆగాధమైన ఒకగొప్పనుయ్యి తీయించి, దానిపైనికాలు పెట్టేసరికి వానిని క్రిందకు లాగేసి చంపేసిన ఒకయంత్రాన్ని తయారు గావించాడు దుర్యోధనుడు. ఒకరోజు తానేస్వయంగా వెళ్లి మహాభక్తి ప్రేమలు ఒలికించి, వినయాన్ని నటించి తాతగారిని మేనమామలు నూరుమందినీ తీసుకువచ్చాడు. తాననుకున్న ప్రకారం ముందు తాతగారిని ఆ ఆగాధ కూపములో పడవేశాడు. ఆతడేమైనాడో తెలియలేదు. వరుసగా, మేనమామలనూ అలాచేస్తుండగా, చివరివాడైన శకుని చాలా తెలివిగలవాడు మాయగాడు. తొంబదితొమ్మండుగురూ అలాదానిలో పడిచనిపోయారు. శకునిమాత్రం తప్పించుకొని ప్రాణాలను దక్కించుకున్నాడు.

అలాబ్రతికిన శకుని ఆరోజే ప్రతిజ్ఞచేశాడు. "యీదుర్మార్గుడైన దుర్యోధనుడు నాతండ్రినీ, నాసోదరులనూ, మాయచేసి యెలా చంపించాడో అలాగే నేను వీడి. నూర్గురుతమ్ములనూ, వీడినీ అంతముగావిస్తా" నన్నాడు. అప్పుడు ద్వారకా నగరానికి వెళ్లి రహస్యముగా కృష్ణుని కలిసి కౌరవనాశనానికి యిద్దరూ కారకులయ్యారు. శకుని సోదరినికలిసి యిచ్చటే ఉంటానని దుర్యోధనుని ఒప్పించి అప్పటినుండి దుర్యోధనునకు ఆంతరంగికుడుగానటిస్తూ, పరోక్షముగా పాండవపక్షపాతిగా శకుని కౌరవనాశనానికి ముఖ్యకారకుడయ్యాడు. యీవిషయంగాంధారీ దేవికి యేమీ తెలీదు. ధృతరాష్ట్రునికి మాత్రం శకుని సంగతి తెలిసినా పూర్తిగా నమ్మిన దుర్యోధనుని ముఖంగామరల మారి పోయేవాడు.

అలాంటి శకునియే మహాభారతయుద్ధానికి నాందీగా నర్తించాడు. తరువాత శ్రీకృష్ణుడు. ఒకసందేహం మహాభారతం చదివినవారికి ఉంది. లక్షశ్లోకాలుగల యింత మహోద్గ్రంథంలో గాంధారీ దేవి పాత్రకు వేదవ్యాసభగవానుడు సరియైన న్యాయంచేయలేదనే వాదనకూడా ఉంది. దీనికి జవాబు ఒక్కటే రామాయణంలో ముఖ్యులు సీతారాములే. యికపోతే తరువాత చెప్పికోవలసిన వాడులక్ష్మణుడు. ఆతనిమాతృమూర్తి సుమిత్రాదేవి పాత్రకూడా రామాయణంలో యిలాగే వాల్మీకి మహర్షి వ్రాశారు. వారుమనలాంటివారా? అతీంద్రియద్రష్టలు. వ్యాసమర్షికి వాల్మీకి మహర్షి పరోక్షంగా ఉన్నగురువు. రామాయణములాగే మహాభారతం ఉండాలని భావించాడు. మనకు రామాయణ – భారత – భాగవతాలు కథామాత్ర ప్రయోజనాన్ని మాత్రమే యివ్వగలిగేవైతే అంతటి వారు వ్రాయనక్కరలేదు.

యీ మహాగ్రంథాలు మూడు బాహ్యార్థం అంతరార్థముకలవి. అందువలన మనము ఆవిధముగానే వాటిని అర్థంచేసికోవాలి. గాంధారిని గురించి వ్యాసభగవానుడు అంతమాత్రమే వ్రాసిన ఆమహాసాధ్వి ధృతరాష్ట్రమహారాజుకు ధర్మపత్ని, రారాజైన దుర్యోధనునికి మాతృమూర్తి. అటువంటి ఆమెచరిత్ర చిన్న దెలాఔతుంది? మహాభారత కథకే ఆమెమూలమౌతుంది. యిదంతా మనము తెలిసికొనగలగాలనే మహర్షి అలావ్రాశారు. మనము హాయిగా పండుకొని నవలలాగచదువుకు పోతుంటే అర్థమవాలంటారు కొందరు. అలాగే ఉంటే యిన్నియుగయుగాలుగా యెన్నోరకాలుగా యీమహాగ్రంథాలను ఆరాధిస్తామా? పారాయణవలన ఫలితాలనందగలమా?

యిక కథలోనికి వద్దాం – అలావారందరూ కలిసిగాంధారీదేవి దగ్గరకు వెళ్లారు. గాంధారీ దేవికి పాండవులు దర్శనానికి వచ్చారనే సరికి నూరుగుర చితుల మంటలు ఒక్కమారుగా మండించి నట్లయింది. అందరూ వచ్చి పాదాభివందన గావించారు. అయినా ఆమె హృదయంలో నుండే అగ్నిపర్వతం చల్లారలేదు. సరికదా! ఒక్కమారుబ్రద్దలయింది. యెవరు తనకొడులందరు అంతం అవడానికి కారణమో ముందుగా ఆమెకు తెలియదు. వ్యాసభగవానుడు "మహాసాధ్వీ! గాంధారీ! ముందుగా నీపెద్దకుమారుడు యుద్ధానికి వెళ్లుచున్నాడు నాకు ఆశీస్సులీయమని అనగా, నీవప్పుడే మన్నావో గుర్తుందా?" ధర్మమేవ జయతే – సత్యమేవజయతే" అన్నావుకదా!

అందువలన పాండవులు ధర్మాత్ములు, సత్యవర్ధనులు. నీవన్నమాట వృధాయెందు కౌతుంది? వారిని హృదయపూర్వకముగా ఆశీర్వదించు" అన్నాడు. భగవానుడైన వ్యాసులవారి దివ్యవాక్కులకు గాంధారీదేవి యేమీ అనలేకపెద్దగా నిట్టూర్చింది. బాగా ఊపిరితీసి "మహర్షివర్యా! పాండవులపై నాకెలాంటి కోపమూలేదు. ఒక్కవాయుకుమారుడు దుశ్శాసనునిపట్ల చేసినపని ఒకమనిషి చేసినపనేనా? లేక రాక్షసుడు గావింప వలసినదా? తమరేచెప్పండి. యికగదాయుద్ధధర్మానికి విరుద్ధంగా, దుర్యోధనునితొడలు విరగ్గొట్టడం యేధర్మం? వారుగావించినవి యివన్నీ ధర్మవర్తనులకార్యాలేనా?" అని కుండబ్రద్దలు కొట్టినట్లు అడిగింది. యేమీతోచని పాండవులు నీళ్లనములుతూ శ్రీకృష్ణుని మోము చూడసాగారు. "ఓధర్మరాజా! నిన్ను నేనడుగుచుండగా, ఆతని ముఖంచూస్తావేమి? ఆతడు చెప్పనక్కరయేలేదు. యేమంటావు భీమా? నీవు సుక్షత్రియవంశములో నేపుట్టావా? కృష్ణుడు కన్నుగీటగా, భీముడు రెండు చేతులూ జోడించి భయభక్తివినయంతో" మాతృదేవీ! నీవేమనుకున్నా నామాతృమూర్తివి. నేనా రోజు ప్రతినగావించాను. నేను చేసినవి చెయ్యరానివే! కాని ఒకమహాసభలో భీష్మద్రోణ బాహ్లికమహాపురుషులున్న నిండుపేరోలగంబున ఏకవస్త్రను నీకోడలు ద్రౌపదిని జుట్టుపట్టుకొని వచ్చి వస్త్రాలు ఊడదీయడం, అందులో మహావీరులమైన మేమైదుగురం ఉండగా మాకళ్లముందే అదిజరగడం, ఆమె దీనాతిదీనంగా



విలపిస్తుడడం, ఆమెను దుర్యోధనుడు తనతొడజూపి యీతొడమీదకూర్చోమనడం. అక్కడ ధర్మబద్ధంతో ఉండి ఆవేశముతో చేసినప్రతిజ్ఞలు.

అమ్మా! ప్రాణాలు పోయినా ప్రతిజ్ఞయే ప్రథమకర్తవ్యముగానెంచిన సుక్షత్రియుడను. అటువంటి నాలోపాలు క్షమించు. అని నమస్సులర్పించాడు. దాంతో తనకుమారులు గావించే అకృత్యాలన్నీ ఆమెకన్నులముందే నర్తించగా భీమునియేమీ అనలేకపోయింది. "ధర్మరాజెక్కడ?" అన్నది. "తల్లీ! నేనిక్కడే ఉన్నాను. నీవందమందికుమారులనూ పొట్టనుపెట్టుకున్న కసాయివాడిని. యేమీ అనలేదు. మరేమీ ఆసాధ్వి అనలేక "మీరందురూ తొందరగా వెళ్లి కుంతీదేవిని దర్శించమని ఆజ్ఞచేసింది. అలాకుంతీదేవిని దర్శించి ఆమెకు అందరూ పాదాభివందనగావించారు. ద్రోపది పాండవులతో కూడా గాంధారీదేవిని దర్శించి గొల్లున యేడ్చింది.

దానికి గాంధారి యెంతగానో దుఃఖించి, అమ్మా యాజ్ఞసేనీ యీవంశానికి పెద్దకోడలవు. నీకూనాకూ భరింపరాని గర్భశోకాన్ని కూర్చాడు భగవంతుడు. మనయిద్దరి పసుపు కుంకుమలు నిలిచాయిగాని తక్కినవారికి పసుపుకుంకుమలు మనము నిలుపలేని నిర్భాగ్యులమయ్యాం వారిద్దరూ ఒకరినొకరు పట్టుకొని యేడ్చారు. అందరూ కలిసి ధర్మక్షేత్ర రణ రంగభూమికి చేరారు. పీనుగులుపెంటలు, యెక్కడచూసినా రక్తపుటేరులు ప్రవహిస్తున్నాయి. రాబందులు పొడుచుకొని పీక్కుతింటున్నాయి. ఒకటారెండా పదునెనిమిది అక్షౌహిణులు. యెక్కడా అడుగుతీసి అడుగువేయడానికి వీలులేకుండా ఉంది. శరీరాలు గుర్తించలేనట్లున్నాయి. అందరుగొల్లునయేడుస్తూ వెతుకుతున్నారు.

సమస్తదేశరాకుమారులందరినీ అస్త్రశస్త్రవిద్యావిశారదులుగాచేసి తీర్చిదిద్దిన ఆచార్యద్రోణులవారిదీ శరీరము. అదిగో అక్కడున్నది ఆయనతల. కొంచందూరంలో చూసి గుండెలుబాదుకొని అదిగో! భారతవీరుడు ద్రోణాది వీరులందరినీ పద్మవ్యూహములో చీల్చి చెండాడి మూడుచెరువుల నీరు త్రాగించే అభిమన్యుని కళేబరం – రూపాన్ని గుర్తుపట్టలేనట్లుగా మహావీరులందరూ మూకుమ్మడిగా ఒక్కమారుగాపడి ఆతని శరీరాన్ని ముక్కముక్కలుగావించారు. పైటలతో కళ్లనీళ్ళు తుడుచుకొని వెక్కివెక్కి యేడ్చారు. కౌరవకాంతలందరూ, తమతమ పతులను పోలికయే దొరక్కగొల్లున యేడుస్తూ ఉండగా గాంధారికి ఒళ్ళు తెలియని మహాకోపోద్రేకంతో యెవరిని యేమనాలో తోచలేదు. వందమందికుమారులూ, యే ఒక్కరినీ పోల్చలేకపోయారు. మాంసఖండల్లాగున్నారు. యీకోడళ్లగోడు యెవరు తీర్చగలరు? యెవరు ఓదార్చగలరు? తనకొడులను వారిభార్యలు, వారివారి భర్తలు వారికిగావించే పనులు, వారందరూ బ్రతికున్నప్పుడు, వారివారి ఆనందామంద హాసాలూ, తలపులోనికి తెచ్చుకొని అందరూ అక్కడ యేడుస్తుంటే చూసిన వారికి శరీరాలు జలదరిస్తుంది. అదంతా విన్న గాంధారిదేవి తన తనయులనూ, కోడండ్రనూ, మనసులోనిల్పి నిలువలేక పోయింది. దీనికంతటికీ ముఖ్య కారణం

కృష్ణుడని గట్టిగా “కృష్ణా! అనిపిలిచింది. వెంటనే శ్రీకృష్ణుడు రెండు చేతులూ జోడిస్తూ “పిలిచావా అత్తా?” అంటూ వచ్చాడు. హృదయమంతాదిమ్మెక్కి పోయిన ఆమెనోటినుండి మాటరాలేదు.” అల్లుడూ! నీకు నేనేమిపాపంచేశానని నాపైపగపట్టి నాగర్భంలో వందచితులు పేర్చావు. యిదంతా నీవాడించేనాటకం. పాండవులునువ్వెలాగాడిస్తే అలా ఆడే నీచేతిలో కీలు బొమ్మలంతే!

నాకన్నులున్నాయి. నేను చూడలేను. గంతలు కట్టుకున్నాను. చెవులతో యీరోదనలు వినినాహృదయమంతా చలించిపోతుంది. కన్నులతో యీఘోరదృశ్యాన్ని చూస్తే యేమౌదునో తెలీదు. మేమందరం హృదయవిదారకంగా ఉండే యీదృశ్యాలను చూసి చలించిపోతున్నాం కాని, నీవుమాత్రం అణుమాత్రం బాధపడవు. యీ పదునెనిమిది అక్షౌహిణులసేనా అంతమందడానికి నీవేకారణంకాదా?” అనగా; “అత్తా! నీవుకేవలంభ్రాంతిలోనున్నావు. పుత్రులమరణంతో చలించి పోయావు. రాగద్వేషాలకు మనస్సేమూలం అంతకన్నామరేమీలేదు.” అనగా “కృష్ణా! యింతటి దారుణకృత్యాలను వింటూనేనూ, చూస్తూయెలా జీవించాలి. నామనస్సును యెంతమార్పు చేయాలనుకున్నా మారడంలేదు. విపరీతమైన బాధతో బ్రతుకుతున్నాను.



నాసంగతినీకు తెలీందికాదు. మహారాజు పుట్టువుతో అంధుడు. అర్ధశరీరం ఆతనిది నాదికదా! అందువలన వారికి లేని ప్రపంచము నాకెందుక్కావాలి? నేను కన్నులకు గంతలు కట్టుకొని ప్రకృతికి వ్యతిరేకంగా జీవిస్తున్నాను. యిది కొందరికి విడ్డూరముగా ఉన్నా నాకుసబబే! నాహృదయమంతా తరుక్కుపోతుంది. నన్ను పరీక్షపెట్టావా? యెలామనస్సును రాయిచేసికొని బ్రతికేది? నేనెవరికొరకు బ్రతకాలి? యీదారుణకృత్యాలను వినియెలాగుండ గలను? యెటువైపు చూసినా యేముంది? యీదుర్మార్గదురూహదుష్క కార్యాలను యెలాసహించేది? యీమారణకాండను తలచుకొని యెలాబ్రతకాలి? పదునెనిమిది అక్షౌహిణులు మరణానికి నువ్వేకారణం? నీవుకలగచేసుకోకపోతే యింత జరిగుండేదా? యిదంతా నీ వలనే జరిగింది. యిందరిచావుకూ కారణం నువ్వే! భర్తలు గతింప బిడ్డలతో యేడుస్తూ, గతిలేక ఉన్నయిలక్షలాది మంది స్త్రీలరోదనధ్వని నీకు వినిపించలేదా? భూనభోంతరాళాలు నిండిన యీప్రళయఘోష నీచెవులకు తాకలేదా? నీచెవులు పడిపోయాయా? నీ మూలానయింతమందికి యెంతగతిపట్టిందో అసలు నీవు చూస్తున్నావా? కన్నులుండి కూడా గ్రుడ్డివయ్యావా? యెందుకింతఘోరాతిఘోరం. నీపేరుచెప్పికొని బ్రతికినంతకాలం యేడుస్తూ యింతమంది స్త్రీలు తలలు బాదుకుంటే నీమనస్సు నిలువ గలదేమో! నాహృదయం మాత్రం నిలువలేదు. నాపెద్దకొడుకు సుయోధనుడు, దుశ్శాసనాదు లెంత ఘోరదుర్మరణము పాలయ్యారు? భారతవీరుడు అభిమన్యుకుమారుడు, కర్ణుడు. మహామహులు భీష్మద్రోణాదులు. నా ఒకేఒక్కపుత్రిక దుస్సలభర్త సైంధవుని, యీ పీనుగుల పెంటల్లో ఒక్కమారు పరికించి నీకన్నులు



రెండూ విప్పిచూడు. చూసిన నీ హృదయం ప్రేలిపోదా? యెందుకు చూస్తావు? యిదంతా చేసిన వాడవు నీవైతే నీవెందుకు చూస్తావు? యిలా చెయ్యాలనే చేశావు. యీ కౌరవపాండవుల రణరంగం నీవుకల్పించిందే! యేదో మూర్ఖపుమాట పట్టింపుగల నాపెద్దకుమారుడంటే యింతశ్మశానాన్ని తయారు చెయ్యాలా? చెయ్యాలి. చేస్తేగాని నీకడుపునిండదు. యిదంతానీనెత్తిపై పాపపుభాండముగా ఉండదా? యింతపాపఫలాన్ని నీవు తప్పక అనుభవింపకతీరదు. మాకౌరవపాండవులెలా అంతః కలహాలతో అంతమయ్యారో, అలాగే మీయాదవకులమంతా నాశనమౌతుంది. యీపాప మంతా నిన్నూ నీజ్ఞాతులను తప్పకుండా కట్టికుడుపుతుంది.

యిదంతా నీకళ్లయెదుటే జరుగుతుంది. నీవు కూడా దిక్కుమాలిన చావు చస్తావు. యింతగావించిన నీకుమాత్రం అంతంలో మంచిచావుయెలావస్తుంది? యిలా నోటికి వచ్చినట్టు శాపాలతో తిడుతున్న గాంధారీదేవిమాటలన్నీ ఆలిస్తూ చిరునవ్వు చిందించిన కృష్ణుడు “గాంధారరాజనందినీ! నీవిచ్చిన శాపఫలాన్ని శిరోధార్యంగా స్వీకరిస్తున్నాను. కాని నీవన్నట్లు భర్తలు పోగా మ్రోదులుగా ఉన్న యింత మంది స్త్రీలలో నీవలే యే ఒక్కరూ నన్నుపల్లెత్తుమాట అనలేదు. అనరు. నీవేనన్ను నోటికొచ్చినట్లుతిట్టి, శపించావు. యిక నాయందున్న అభిమానానికి జోహారులందిస్తాను. నీశాపం నాకు అవశ్యంకావాలి. యీరూపంగా నీవునా తలపైనున్న బరువు బాగా తగ్గించావు. నీవు నాయెడగావించినమేలు యెన్నడూ మరువలేను.

నీకున్నప్రేమ అలాంటిది. యింతప్రేమ నాపై ఒలికిస్తావని నేనెప్పుడూ అనుకోలేదు. నీపాతివ్రత్య మహాధర్మాన్ని యీరూపంగా నాపై జూపించునీకు అత్తయ్యా! శతసహస్రవందనాలందిస్తున్నాను. అపారమైన నీ ప్రేమౌదార్యాలకు జోహారు. యింతటి పనిగావిస్తావని నాకెప్పుడో తెలుసు. నీవుయీ అల్లునికి మంచి ఆశీస్సులందించావు. చాలాసంతోషం. పరమానందంగాఉంది. ఆహా! అత్తయ్యా! యేమినీఔదార్యం? అపూర్వం! అద్భుతం! అపారం! ఆనందం! అమృతవర్షం కురిపించావు” లని గాంధారికి తగినట్లు శ్రీకృష్ణుడు చెప్పాడు.

### యుద్ధమృతుల దహనసంస్కారం

మహాభారతములో యీస్త్రీపర్వానికి ఒకప్రత్యేకత కల్పించారు. వ్యాసభగవానుడు. ఆతడుకూడా యిందులో పాత్రధారియే. సర్వమూజ్ఞాన చక్షువులతో, చర్మచక్షువులతో విలోకించియే యీమహాభారతంవ్రాశాడు. యిక శ్రీకృష్ణుడూ – గాంధారీ సంవాదానికి కొంచము దూరంగా ఉన్న ధృతరాష్ట్రుడు ధర్మరాజాదులు రణరంగాన అసువులు బాసిన వీరులందరికీ యధావిధిగా దహనసంస్కారాదిక్రియలు చేయమని మహారాజు ఆజ్ఞాపించాడు. యుధిష్ఠిరుడు తమకులగురువైన ధౌమ్యమహర్షిని రప్పించాడు. యికకౌరవులూ, బంధువులూ, ఆప్తులూ అందరికీ ఉత్తరక్రియలు జరుపనెంచారు. వీరందరూ యిలా ఉండగా, యుద్ధములో,

లెక్కలేనంతమంది వీరరాజులు ప్రాణాలు వీడారు. వారివారి బంధువులూ, పుత్రులెవరో తెలియరాలేదు. వారికి ఉత్తరక్రియలూ, దహనసంస్కారం యెవరు చేయాలి? చేస్తే వారికి యేగతులు కలుగుతాయి. వారికి యేలాచేయాలి? యిలాంటి విషయం ధౌమ్యమహర్షి, కృష్ణుడూ, ధర్మరాజూమొదలైనవారు ఆలోచించారు. యిటువంటప్పుడు మహావిజ్ఞానవేత్తవిదురుడు – యుయుత్సుడు, సంజయుడు, ధౌమ్యుడూ యీనలుగురికీ యీవిషయాన్ని యెలా పరిష్కరించాలో సశాస్త్రీయంగాచేయమని ధర్మరాజాదులు వారికి యీకార్యక్రమాన్ని అప్పజెప్పారు. హస్తినగుగల సిద్ధాంతులూ, పండితపురోహితులను కలసి ధౌమ్యుడు అందరూ, కలసి, ఆలోచించి దేశకాలపాత్రానుకూలంగా వారువారందరికీ ఉత్తరక్రియలు నిర్వర్తించారు. దుర్యోధన దుశ్శాసన కర్ణ, అభిమన్యుడు మొదలైనవారి జెండాలు, రథాలను బట్టి పోల్చి, వారందరికీ, ఒకొక్కచితిని యేర్పాటుగావించి, దహనసంస్కారాదిక్రియలు గావించారు.

యికరాజులందరి కళేబరాలన్నీ కలిపి మూకుమ్మడిగా యేశవమూ మిగలకుండా దహనంచేశారు. మహారాజా! జనమేజయా! అచటవారి అంత్యక్రియలలో జరిపే వేదఘోషస్త్రీలు యేడుపు యీరెండూ కలిసి భూమీ, ఆకాశాలు మార్రోగసాగాయి. యీరాజులదహనక్రియల వలన వచ్చేధూమం పరిసరాలు, అక్కడ ఉన్నవారినేత్రాలలో చొరబడి కన్నులు కానరాక దారుణమై విషాదచ్ఛాయలు అంతటా అలముకున్నాయి.

### కర్ణుడు - కుంతి

తిలోదకాలిచ్చు సమయాన ధర్మజుడు పెద్దతండ్రిని ముందుంచుకొని, సోదర, బంధువులందరతో, తనకైనవారందరికీ, ఆప్తబృందానికీ యుద్ధంలో రెండువైపులవచ్చి, యేచిన్న సహాయం చేసినవారికై వారందరికీ తిలాంజలులిచ్చారు. ప్రతివారు పిలిస్తే, వారందరూ వచ్చివీరిచ్చిన తిలాంజలులు పుచ్చుకొని వెళ్లేవారు. యిలాజరుగుతుండగా, కుంతీదేవి దుఃఖాశ్రువులు కళ్లనుండి కారుస్తూ, భోరునవిలపిస్తూ, ధర్మరాజు దగ్గరకు వచ్చి, "నాయనా! ధర్మరాజా! కర్ణునికి కూడా యిన్నితిలోదకాలు సమర్పింపచరా" అన్నది. అనీ సరికి ఒక్కమారు ధర్మరాజు తల్లిముఖంచూసి "అమ్మా! యేమి యీవిపరీతపు కోరిక?

మాసోదరులందరికీ సుయోధన, దుశ్శాసనాది కౌరవవీరులందరికన్నా యెక్కువ విరోధి కర్ణుడు. కర్ణుడు రణరంగాన మాకు ప్రబలశత్రువు. ఆతనిని చూస్తే మారక్తం కుతకుత ఉడికి పోయేది. ఆతడు కూడా మమ్ము చూస్తే మండిపడేవారు. అటువంటి కర్ణునికి నేను తిలోదకాలివ్వాలా? ఆతన్ని చూసే సరికి మాకు ఉన్న శాంతి మాయమయి. ఉక్రోషమే హృదయాన పెల్లుబికేది" అని అనగా! కుంతీదేవి "కుమారా? నేనెలాయేమని కర్ణుని గూర్చి చెప్పనురా! యింతకాలము నాహృదయములో దహిస్తున్న యీకర్ణ జన్మరహస్యము యిప్పుడు నీకు తప్పక



చెప్పవలసివచ్చిందిరా! కర్ణుడు సూతసుతుడు కాడు. సుక్షత్రియుడు. అంతేకాదు సూర్యదేవునకూ నాకు పుట్టాడు. నీవుయమధర్మరాజు వలనను వాయుదేవుని వలన భీమసేనుడూ; మహేంద్రుని వలన అర్జునుడు; అశ్వినీదేవతల వలన నకులసహదేవులు పుట్టినట్టుగా సూర్యునికి కర్ణుడుద్భవించాడు.

కర్ణుడు మీ అందరికన్నా పెద్దవాడు. రాధేయుడు మాత్రంకాడు. నాజ్యేష్ఠపుత్రుడు" అనుమాటవిన్న ధర్మరాజు ఆపాదమస్తకం వణికిపోయాడు కళ్లనిండా దుఃఖాశ్రువులు నింపుకొని లోనే అణచిపెట్టు కున్నాడు తనకు పెద్ద సోదరునిగా సంకల్పంచెప్పుకొని హృదయంవ్రీలిపోయినా చిక్కపట్టుకొని కర్ణునికి తిలాంజలులు సమర్పించాడు. యీవిషయం తెలిసి అంధరాజు ఆశ్చర్యహృదయుడయ్యాడు. వైశంపాయనమహర్షి యిలా చెప్పగా జనమేజయ మహారాజు యెంతగానో చింతించి" మహాత్మా! ధృతరాష్ట్ర ధర్మరాజాదులు యేమనుకున్నారు తమరు విన్నవించండి " అన్నాడు.

**ఇది మహాభారతములో స్త్రీపర్వం ముగిసింది**



# సంపూర్ణ మహాభారతం

## శాంతి పర్వము

"జనమేజయ మహారాజా! యింకేమి చెప్పాలి? అలా ధర్మనందనుడు, అంబికేయుడు. రణరంగవీర మృతవీరులకు, మొత్తం మీద దుఃఖాశ్రువులతోనే తిలోదకాలు సమర్పించారు; ఆయమునానాదీ తీరాన ఉండి సమస్త ఉత్తరక్రియలూ, కొన్ని రోజులు జరిపారు. యిలా ధర్మనందనుడు కర్ణుని గూర్చి రాత్రీపగలూ దుఃఖిస్తూ యేడుస్తూ కూర్చున్నాడు. ఒక రోజు నారదమహార్షి వచ్చాడు. ఆదివ్యమహార్షికి యెదురేగితోడ్కొనివచ్చి ఉన్నతాసనముపై కూర్చుండబెట్టి, తన అతిదీనగాథంతావినిపిస్తూ "మునీంద్రా! నావంటి అతిదీనుడెండైనా ఉన్నాడా? నాహృదయానికి అణుమాత్రమైనా శాంతిలేదు. యేమిరాజ్యం. యేమిగెలుపు? నా అన్నవారందరినీ, ఆప్తులనూ, బంధువులనూ, మిత్రులనూ చంపికొని వారిశ్మశానం మీదకూర్చొనాలి.

అది అలా ఉంచండి. మహావీరుడైన కర్ణుడు నాజ్యేష్ఠసోదరుడని తెలిసికొని నేను పడుహృదయసంక్షోభం తమకు యేమని యెలాగని వివరించమంటారు? ఆతని చూసేసరికి ఆముఖమూ, కాళ్లూ మొదలైన శరీర పోలికలన్నీ అచ్చంగా మామాతృమూర్తి కుంతీ దేవిలాగే అచ్చంగా కానవచ్చేవాడు. నామనసు ఆతనిని దర్శిస్తే యేదో చెప్పలేని అనురాగ అనుబంధం పెనవేసుకుని ఉండేది. మాకతనిపై ఉన్న మమకారంతా తెగిపోయి మరలవిరోధభావం అంకురించేది. మరియింత సంబంధముగల దానవీర శూరకర్ణుడు. మా అగ్రజుని చేతులారా చంపుకున్న



దౌర్భాగ్యులీ పాండవులు. యింతదౌర్భాగ్యదశ యేముంది మునీంద్రా? నేనెంతపాపము చేసిన దుర్మార్గుడనో చూడండి. ఆరోజుయుద్ధములో కర్ణుని బాణాలు నాశరీరమంతా చిందరవందర చేయగా, గూడారానికి వచ్చిసేదదేరి నీరసంగా నిస్పృహగా, పండుకొని ఉన్న సమాయాన కృష్ణార్జునులు కూడా కర్ణుని వలన దెబ్బలు తినివచ్చారు. రావడంతో అర్జునా! కర్ణుడు చచ్చాడా? అని అడగ్గా ఆతడు యెంతో దీనంగా తనశరీరాన్ని చూపించి, నన్ను కూడా చితకకొట్టాడనగా, మహాకోపముతోనేను అర్జునా! మహావీరుడనని బీరాలాడుతావు. ఆకర్ణుని చంపలేని నీగాండీవాదులెందుకు? గాండీవాన్ని అగ్నిలో పడవేయి" అన్నాను. అప్పుడు అర్జునుడునాపై లేచి పోయి నీవన్నవుకావు" నేను నీతమ్ముడనే కాను నాగాండీవాన్ని అగ్నిలో వేయమంటావా? నేను నిన్ను చంపుతానని లేచే సరికి శ్రీకృష్ణుడాపేడు. "అర్జునా? యిది రణరంగంకాదు. యీతడు కర్ణుడూ కాడు. ధర్మరాజు. పదకర్ణుని చంపుదువుగాని" అని అర్జునునికి పౌరుషం కలిగించి కర్ణునివధింపచేశాడు. మహర్షీ! యిదంతా నామూలాన కదా! సంప్రాప్తించింది? ఆవిధంగా కర్ణుని నాపెద్దసోదరుని మా అర్జునునితో చంపించిన యీపాపి ధర్మరాజుకు యెన్ని జన్మాల్లోనా నిష్కృతి ఉందా దేవమునీంద్రా? అని ధర్మరాజు గొల్లునయేడ్చాడు. నేను భ్రాతృద్రోహిని. యిదంతా నన్ను కట్టికుడుపకుండా ఉంటాయా? పరమనీచుడను. యీ రాజ్యమంతా నా అగ్రజుని పాదపద్మాలపై నుంచి మాసోదరులమందరము మా అగ్రజుడు, మహాశూరుడు కర్ణుని సేవచేసి బ్రతికే యోగము లేకుండా చేసికొని చివరకు ఆతనిని అంతంచేసికొన్నాం. ఆతనిరీవి, ఆతనినేత్రాలు, ఆతనిబాహువులు, వక్షస్థలం యిప్పుడు నాకన్నులయెదుట నర్తిస్తున్నాయి.

మాఅగ్రజుని పవిత్ర దివ్యచరిత్ర తమకు తెలిసినది మాకు చెప్పి మమ్ములను ధన్యులను చేయండి. ఆతని చరిత్ర అపూర్వం! అద్భుతము! ఆరాధ్యం!"

### నారదుడు కర్ణచరిత్ర చెప్పడం

అన్నధర్మరాజుకు నారదమహర్షి యిలా చెప్పసాగాడు. "ధర్మనందనా! ఆపుణ్య పురుషుని చరిత్ర పునశ్చరణగా, నీతో చెప్పడం యెంతో పవిత్రతవస్తుంది. దుర్వాస మహర్షి ఉపదేశించే మహామంత్రాన్ని కుంతీదేవివిూ మాతృశ్రీబాగా మననంగావించింది. సూర్యభగవానుని వరప్రసాదము వలన కర్ణునకు జన్మనిచ్చింది. ఆతనికి తల్లి గర్భంలో నుండే కవచము కుండలాలు సంప్రాప్తించాయి. యిక ఆమె తాను పెంచుకొనడానికి తగిన అవకాశములేక కన్న ఆబిడ్డను గంగానదిలో కలిపివేసింది. అలా ఆబిడ్డ అతిరథుడను నామముగల సూతునకు దొరికాడు. ఆతనికి సంతానంలేదు. ఆతని భార్యరాథమ్మ అపురూపంగా ఆబిడ్డను పెంచుతుంది. వసువనగా బంగారం. బంగారముతో దొరికిన ఆతనికి "వసుషేనుడు" అనిపేరు పెట్టారు రాధా అతిరథులు.

ఆతడు యెంత దూరమందున్నా ముందుగా ఆతని కర్ణముల గలకుండలాలు చూపరుల చూపులను ఆకర్షించేవి. అందువలనన ఆతని "కర్ణా! కర్ణా!" అనిపిలిచేవారు. యిలా ఆతడు పెద్దవాడయ్యాడు. అందరు రాజకుమారులతో అస్త్రశస్త్రవిద్య లభ్యసించాడు. మొదటినుండీ అర్జునునితో నీవానేనా అన్నట్టుగా అస్త్రవిద్యలో ఆరితేరాడు. యిలా ఉండగా కుమారాస్త్రశస్త్రవిద్యా పరీక్షసమయాన సుయోధనునికి అప్తమిత్రుడయ్యాడు కర్ణుడు. అర్జునునికి ఆగర్భశత్రువయ్యాడు. తనకు బ్రహ్మాస్త్రమీయమని ద్రోణాచార్యులను అర్థించగా ఆతడు నిరాకరించాడు. పరశురామునివద్ద సమస్త అస్త్రపాండిత్యం తనకు సమానులు లేరన్నట్లుగా అభ్యసించాడు. నేను సూతకుమారుడనని చెప్పిన పరశురాముడు విద్యనేర్పడని ద్విజుడనని చెప్పికొన్నాడు. పరశురాముని ఆశ్రమములో ఆస్త్రాలు సంధించే సమయాన ఒక బ్రాహ్మణుని పవిత్రమైన ఆవునకు తగలగా అదిచని పోయింది. ఆ బ్రాహ్మణుడు కోపముతో నీవుమంచి రణరంగంలో నుండగా నీరథచక్రం భూమిలో క్రుంగుగాక! అని శపించాడు. నీపెద్దసోదరునకు అది ఒక పెద్దశాపం. యింకొకటి విను ధర్మరాజా! ఒకరోజు కర్ణుని తొడపై భార్గవరాముడు తొడపెట్టి పండుకున్నాడు. యింతలో ఒకవిష పురగు కర్ణుని తొడక్రిందనుంచి దొలిచేస్తుంది. పరశురామునికి నిద్రాభంగమవుతుందని కర్ణుడుతొడకదల నివ్వలేదు. యింతలో ఆరక్తానికి ఆతని శరీరంతడిసి పరశురాముడు లేచి చూసి ఆశ్చర్యంపొందాడు "ఓరీ! నీవెవ్వడవు? బ్రాహ్మణునికి యింత ఓర్పుఉండదు" అనగా కర్ణుడు. తాను సూతుడనని చెప్పాడు. దాంతోమండిపడి "ఓరీనీచుడా? మోసంతో నాదగ్గరనేర్చికున్న నీవిద్యంతా, నీకు అవసరానికి పనికి రాకుండుగాక!" అని శపించాడు.

యిలా మీ అగ్రజుడు దారుణమైన శాపాలను పొందాడు యుధిష్ఠిరా! దుర్యోధనునికి మాత్రం యిన్ని శాపాలు తాను పొందినట్లుగాయెప్పుడూ చెప్పలేదు. యింతకూ దుర్యోధనుడు యెందరు చెప్పినా వినక తుదకు తననాశనానికైనా మీ అన్నగారి బలము చూచే యుద్ధానికి సిద్ధపడ్డాడు. తరువాత విని కళింగదేశపు రాజకుమార్తెకు స్వయం ప్రకటింపగా మీ సోదరుడు దుర్యోధనుడు వెళ్లాడు ఆరాజనందిని దుర్యోధనుని నిరసించిముందుకు సాగిపోతుండగా కర్ణుడు "మిత్రమా! సుయోధనా! ఆరాచకన్యను నీవు యెత్తుకు పో యెవరువచ్చినా నేను చూసుకుంటానన్నాడు కర్ణుడు. అదిచూసి రాజలోకమంతా రాగా కర్ణుడొక్కడేవారందరినీ జయించాడు. అంతమహావీరుడు నీఅగ్రసోదరుడు. అంతెందుకు మహాబల పరాక్రమాలుగల జరాసంధునికి భయపడి శ్రీకృష్ణుడు లాంటివాడు సముద్రములో ద్వారకానగరం నిర్మించుకున్నాడు. అటువంటి జరాసంధుని అవలీలగా గెలిచాడు కర్ణుడు. తరువాత కళింగ రాజు కుమార్తె భానుమతితో సుయోధనునకు ఘనముగా వివాహం జరిపించినవాడు మీ అగ్రజుడే!



మహేంద్రుడు మాయవేషంతో వచ్చి కర్ణుని కవచకుండలాలు తీసికున్నాడు. అరణ్యావాసముమీరు చేస్తున్న సమయాన సుయోధనుడు దిగ్విజయయాత్రను చేసిన తరువాత దుర్యోధనుని వలన వైష్ణవయాగం చేయించిన వాడు మీసోదరుడేకదా? రాయబారానికి వచ్చిన కృష్ణుడు మీమాతృదేవిని పంపి యెలాగేనా వచ్చి నీతమ్ములను చేరుకొమ్మని కర్ణునికి చెప్పించగా, అణు మాత్రమైనా జంకకుండానేను రానని స్పష్టంగా చెప్పగలిగిన మహాసత్యవంతుడు నీపెద్దన్న. తరువాత స్వయముగా కృష్ణుడే వచ్చి కర్ణుని యేకాంతముగాపిలిచి అనేక విధాలప్రలోభపెట్టినా వినక తనధనమానప్రాణాలు యెప్పుడో సుయోధనునకు అర్పించానని చెప్పగలిగిన మిత్రశబ్దానికి భాష్యముచెప్పిన మహామనీషి మీ జ్యేష్ఠసోదరుడు. మీమాతృశ్రీపుత్రభిక్షపెట్టమని అడిగితే "అమ్మా! సమరమున చేతిలో పడినా చంపను నేను, ఫల్గునుని తప్ప తక్కిన పాండవులను" అనగలిగిన ధీరత ఆత్మ శక్తివిశ్వాసం, వివేకం విజ్ఞత యెవరికుంటుంది ధర్మరాజా? అన్నాడు నారదమహర్షి. అపారమైన శక్తి గలవాడు కర్ణుడు. పరమపావనుడు, సత్యవ్రతుడు, దానధౌరేయుడుకర్ణుడు. తల్లికిచ్చిన మాట ప్రకారం అర్జునుడు తప్ప తక్కినవారందరూ అతని చేతిలో పడినా మిమ్ములవదిలేశాడు.



ఇంతకూ తనసోదరుని బాణాలకే బలైపోయిన మహావీరాగ్రేసరుడు. అంతేకాదు శల్యుని దుర్వాక్యాలు, కర్ణకఠోరంగా ఉన్నా అడుగడుగునా క్రుంగదీస్తున్నా అణుమాత్రంచలించని మేరుసమాన ధీరుడుమీ అగ్రజుడు. అర్జునుడాతని చంపేడనడం అబద్ధం. బ్రాహ్మణశాపం – మహేంద్రుడు కవచకుండలా లపహరించడం, పరశురామునిశాపం, శల్యుని దురాగతం, భూదేవిశాపం యిలా ఆరువిధాల శాపాలను భవించి ఆఖరుకు అర్జునుని బాణానికి మీ అగ్రజుడు బలైపోయాడు. యిన్నికలిస్తేగాని ఆతనిని సాధించలేక పోయాయి. ఆతని దానానికి నిదర్శనా ఒక్కటి చెప్పి ముగిస్తాను ధర్మరాజా!

మీ పెద్దసోదరుని కుడిచేతికి దానకంకణం, యెడమచేతికి వీరకంకణం ఉన్నాయి. యివిచూసిన దుర్యోధనునికి కళ్లుకుట్టాయి నాకేమిలోటని దుర్యోధనుడు అరడజను కంకణాలు వేసుకున్నాడు. అది చూసిన దేవేంద్రునికి అసహ్యంకలిగి ఒకరోజు బ్రాహ్మణ వేషముతో సుయోధనుని దగ్గరకు వెళ్లి "గాంధారేయా! నేను యజ్ఞం చేయనెంచాను. నీవు వందబళ్ళు యెండుకట్టెలు యిస్తావని వచ్చాననగా! బ్రాహ్మణుడువద్దు. నేను మరలవస్తానని వెళ్లి హస్తినాపురం పొలిమేరలో కుంభవృష్టి కురిపించాడు. ఆసమయాన దుర్యోధనుని యాచింపగా ఓవిప్రోత్తమా! మాకు పొయ్యిలోకి యెండుకట్టెలు దొరక్కపస్తులుంటూన్నాం" తరువాత రమ్మన్నాడు.

ఆతడు కర్ణుని దగ్గరకు వెళ్లి యాచింపగా కర్ణుడు వెంటనే వరుస మేడలను పడగొట్టించి కలపను వంద బళ్లపై వేసి పంపాడు. యీ విషయంవిన్న సుయోధనుడు సిగ్గుపడి తనకంకణాలను తీసివేశాడు ధర్మరాజా! అలాంటి దానధౌరేయుడు మీ అగ్రజుడు" అన్నాడు నారదుడు. కర్ణునివంటి దానధౌరేయుని మనం

యెక్కడాచూడలేదు. యింకొక రహస్యాన్ని చెప్తుతానువిను. ద్రోణాచార్యులు పన్నిన పద్మవ్యూహాన్ని ఛేదించినప్పుడు అభిమన్యుడు యెవరినీ లక్ష్యంచేయలేదు. అందరినీ చితకకొట్టి బ్రతకనీకుండాచేస్తున్న అభిమన్యుని చూడ్డానికి క్కూడామా హావీరులందరూ భయపడి మూకుమ్మడిగా వచ్చి అభిమన్యుని రథాన్ని, గుఱ్ఱాలను, చేతిలో బాణాన్ని కొట్టారు. అలా ఆతన్నిచంపుట అధర్మమని కూడా తెలిసిచేశాడు కర్ణుడు.

కర్ణుడు బాధయింతా అంతకాదు. అలాచేయక పోతే ఆరోజు కౌరవసేనంతా పూర్తిగా యమలోకానికి చేరవలసిందే! అందుచేతే అలాచేయవచ్చిందని యెంతో విచారించాడు. ఆరాత్రి ఆతనికి నిద్దురపట్టక మనసంతా పరిపరివిధాల పరుగులెత్తసాగింది. ఆగాఢాంధకారంలో రణభూమిలో కాగడా సహాయంతో అవయవాలన్నీ చిందరవందరగా పడి ఉన్న అభిమన్యుని ముఖంమాత్రం కాగడాకాంతితో పోల్చిచూసి బోరున యేడుస్తూ "కుమారా! నాతరువాత నీవే మనవంశాన్ని నిలబెట్టి పేరు తేగలనిన్ను నిష్కారణంగా చంపాను. యీనీపెదతండ్రిని ఒక్కమారు కన్నులెత్తి చూడు. చంద్రుని వంటి నీవోమును తిలకించి ముద్దుపెట్టుకుంటాను అని అభిమన్యుని మోము యేడుస్తూ, ముద్దుపెట్టుకొన బోవుసమయానికి, అప్పుడే సుభద్రాదేవి యేడుస్తూ, కాగడాలతో కొంతమంది స్త్రీలతో అభిమన్యుని కళేబరాన్ని చూడాలని వచ్చింది. కర్ణుడు వారిని చూడకయే యేడుస్తూ "నాయానా! సుభద్రార్జునులముద్దుబిడ్డవు. యింతలోనే నీకు నూరేళ్లూనిండాయా తండ్రీ!" అని విలపించుచున్న కర్ణుని చూచి, "ఎవరునీవు?" అని అడగ్గా; "అమ్మా! నేను అభిమన్యుని పుత్రఘాతకుడను నేనే; నన్ను చంపు యిదిగో ఖడ్గ" మని అందివ్వబోయాడు; సుభద్ర ఆకన్నీటితో "ఓహో! నీవు దానవీరశూరకర్ణుడివా? మీరందరూ కలిసేకదా నాకుమారుని చంపారు" అనుసుభద్రాదేవికి కర్ణుడు మీసమాధానము చెప్పలేక యేడుస్తూ ఉండిపోయాడు ధర్మరాజా!" అన్నాడు నారదుడు. అలా మహర్షికర్ణుని దివ్యచరిత్ర చెప్పేసరికి ధర్మజుడు చలించి పోయేడు నోట మాట రాలేదు.

"మునీంద్రా! మా అగ్రజుని వంటి వాడెందైనా ఉన్నాడా? లేడు అటువంటి మహావీరుని నిష్కారణముగా చంపుకున్నాము. మావంటిపాపాత్ములు యింక యీచరిత్రలో యెవరూ ఉండరు. యెంతఘోరం? యిదంతా మా అమ్మకుంతీ దేవి మూలంగా జరిగింది. మాతో యెప్పుడైనా ఒక్కమాట కర్ణుడు నాపెద్దకొడుకని చెప్పిందా? లేదు. యింతగోప్యంగా యెలా దాచుకుందో! హృదయంనిండిన దుఃఖభారాన్ని యిన్నిసంవత్సరాలెలా గుండెల్లో దాచుకుందో ఆశ్చర్యంగా ఉంది? యేదో ఒక్కమారు ఒక్కమాట మాకెవ్వరికి చెప్పినా యీపదునెనిమిదక్షౌహిణులు సేన, లక్షలాది మంది వీరులు, కౌరవులంతాబ్రతుకుదురుగదా! యెంతమోసంచేసింది? అగ్ని పర్వతాన్నే గుండెల్లో దాచుకుంది. అటువంటి అగ్రజుని నిష్కారణంగా పోగొట్టుకున్న యెంతపాపాత్ములమో మేము చెప్పడానికి నోటంటమాటకూడా



రాకుండా ఉంది" అన్నాడు ధర్మరాజు. "అమ్మయింతచేసింది. "యికస్త్రీలు యేవిధమైన రహస్యందాచకుండా ఉందురుగాక!" అని శపించాడు. నారదమహర్షి వెళ్లాడు.

కుంతీదేవి దుఃఖిస్తూ కుమారా! నామూలంగా స్త్రీజాతికంతకూ శాపమిచ్చావు. నీవెప్పుడూ కోపమెరుగని వాడవు. యింతపనిచేస్తావని అనుకొనలేదని" అన్నది. యిలా కర్ణునిపైనే మనసుంచి, ఆతనిని తలచుకొని దుఃఖితుడైన ధర్మరాజును జూచి కృష్ణుడిలా అన్నాడు. "బావా! ధర్మరాజా! యెందుకింతగా దుఃఖిస్తావు? నీవు తలకొట్టుకున్నా ఆకర్ణుడు తిరిగివస్తాడా? నీకు నేను చెప్పాలా? సమస్తమూ తెలిసినవాడివి. జీవికి చనిపోవడం సహజం. యిక సర్వమూ మన మానసిక భ్రాంతిలో ఉంది ఆమనస్సును సర్వదాభగవత్ ధ్యానంపైని ఉంచి జీవించాలి. ముందు రాగాన్ని త్రెంచుకోవాలి. మనిషిలో నుండే కామక్రోధలోభమదమత్సర్యాలనే దొంగలు జ్ఞానరత్నాన్ని అపహరించడానికి కనురెప్పపాటైనా విడువకుండా పొంచియే ఉంటారు. అందువలన ఆదొంగలబారిని పడకుండా మనిషి జాగ్రత్తగా ఉండాలి. అప్పుడే మనీషి ఔతాడు. పెద్దబావా! మీ అగ్రసోదరుడు చాలా గొప్పవాడన్నావు. అంతకుమించిన గొప్పవాళ్లు మరిముందు పుట్టలేదా? యెందరో మహాపురుషులు ఉద్భవించారు. వారిలో ఒక్కరినిప్పుడు చూపగలవా? లేరే? వారిగొప్ప తనము చరిత్రలో ఉంటుంది. పదహార్గురు రాజులు యీ భూమిని పరిపాలించలేదా? వారిపేరేదీ?

## పదహారురాజులచరిత్ర

మరుత్తు మహారాజులగూర్చి యెప్పుడైనా విన్నావా ధర్మనందనా? నీకు నేనిప్పుడు వారిచరిత్ర సంక్షిప్తంగా చెప్తుతానువిను "మరుత్తుడు" అనుమహారాజు ప్రజలందరనూతన కన్న వారికన్నమిన్నగా పరిపాలించేవాడు. సామాన్యంగా ఒకరాజు తనజీవితకాలంలో ఒక్కయజ్ఞంచేయడం చాలాకష్టం. అయితే యీమరుత్తమహారాజు యెన్నోయజ్ఞాలు దేవతాప్రీతిగావించాడు. ఆతడు గావించే యజ్ఞాలకు మహేంద్రాది దేవత లందరూ యెంతగానో సంతోషించారు. ఆతనిఘనతకిన్నెరులు తమవీణెలపైకీర్తించేవారు. ఆతని ధానధర్మాలు యింకెవరూ కావింపలేదు. ఆతనిఘనతకు నిదర్శనం భూమి దున్నకుండా మూడుకాలాల్లోను మంచిపంటలు పండేవి; యాతడు మాత్రం యిప్పుడున్నాడా?

దేవేంద్రాది బృందారకు లాతనికి గజతురగ వాహనాలనెన్నిటినో సమర్పించారు. ఆతని ధర్మపాలనలో జారచోరులేలేరు. నెలకు మూడువర్షాలు పడేవి. అకాలమృత్యువులేదు. దీనానాథజనులు హాయిగా పోషింపబడేవారు. స్త్రీలకు వైధవ్యప్రాప్తిలేదు. అందరూ అన్నివిధాలా ఆనందముగా ఉండేవారు. యీమరుత్తమహారాజు అపూర్వసౌందర్యరాసి. లెక్కలేనన్ని యజ్ఞాలుగావించిన యీతనిని మహేంద్రుడు పిలిచి యింతటి మహారాజు లేడని ఆదేవసభలో పొగడి, ఘనసమ్మానాలు గావించారు. తుంబురనారదులు యీతని సచ్చరిత్రను

ముల్లోకాల్లోనూ కీర్తి స్తుండేవారు. వర్షంకాక మేఘుడు కనక వర్షంకురిపించేవాడు. అత్యద్భుతమైన అంతచరిత్ర దిగ్గజాలదం తాలమీద లిఖించారు. యింతటి మహానీయుని చరిత్ర యేమయింది? ఆమహారాజు యేడీ? యుధిష్ఠిరా! చూపింపగలవా?

యిక రెండవరాజు యీతని పేరు "సుహోత్రుడు" యీతని పరిపాలన అపూర్వం? యీ మహారాజును చూడ్డానికి మహేంద్రాదులే యీతనిదగ్గరకు వచ్చేవారు. నూరు యజ్ఞాలు చేసేవారు యింద్రులౌతారు. మహేంద్రపట్టభద్రత కది గురుతు. యీ మహారాజు మాత్రము వందకు యెక్కువగా యజ్ఞాలుగావించినా, యింద్రపదవిపై అణుమాత్రమైనా మోజుచూపని మహాత్ముడు. అందుకే యీతనిపేరు షోడశమహారాజుల వరుసలో నాట్యము చేస్తుంది. యింతటి మహారాజు లేడనుప్రసిద్ధిగాంచిన యీసుహోత్రమహారాజు మాత్రం యీభూమ్మీదశాశ్వతముగా నిలువగలిగాడా? యెంతటి వారైనా నశించవలసిందే! కానివారు ఆచరించిన మంచి కార్యాలుమాత్రము శాశ్వతముగానిలుస్తాయి. తక్కినవేవీ నిలువవు.

ఇంకొక మహారాజు చరిత్ర చెప్తానువిను. వంగదేశాన్ని పరిపాలించే "బృహద్రథుడు" మహామహుడు. యీరాజుగావించిన యాగాలు చరిత్రలో యేమహారాజూ చేయలేదు. యీయన చేసిన యాగాలలో వేసిన నెయ్యిత్రాగిన అగ్నిహోత్రుడు గర్భం మందగించి అశ్వినీదేవతల దగ్గరకెళ్లిచెప్పగా వారాగర్భము మందగించడానికి మందునిచ్చిన పూర్వములాగ అగ్నిదేవుడు మామూలుగా జ్వలింపసాగాడు. దీని వలన ఆమహారాజు యెన్నియాగాలు చేశాడో ఊహించుకోవలసిందే. ధర్మరాజా! యింతటివాని వాసనైనా ఉందా? అందువలన యీశరీరం శాశ్వతముకాదు.

ఇకశిబిచక్రవర్తి యొక్క త్యాగశీలం అందరూ యెరిగిందే. అటువంటి త్యాగంగల మహాత్ముడున్నాడా? లేడుకదా? అపారమైన ఆతని దానధౌరేయత వర్ణించడానికి యెవరికీ సాధ్యం కాదుకదా? శిబియొక్క త్యాగం ముల్లోకాల్లో గజ్జెలు గట్టి నర్తిస్తుంది. యెవరి నోటవిన్నా మహాత్ముడైన శిబి యొక్కదాన ధౌరేయతయే. యిలా అయన రాజ్యపాలనము గావిస్తుండగా; ప్రజలందరూ కేవలం మా అందరి భాగ్యదేవతయే యీ రూపానపుట్టింది. లేకుంటే యింతటి మహానుభావుని పరిపాలనలో ఉండే యోగం మాకు సంప్రాప్తిస్తుందా? అని ప్రజలందరూ ఆబాలగోపాలాలు ఆమహాత్ముని నామాన్నే ఉచ్ఛరించేవారు. యిలా ఉండగా అగ్నిదేవుడూ, మహేంద్రుడూ ఆతని త్యాగశీలతను పరీక్షింపనెంచారు. అగ్ని హోత్రుడు పావురంరూపుతో; ఇంద్రుడుడేగ రూపాలుదాల్చారు.

అగ్నిహోత్రుడు పావురరూపాన నుండి డేగనుజూచి సహజశత్రువగుట భయముతో గడగడ వణికి పోతూ, ఎగిరివచ్చి శిబిచక్రవర్తి ఒడిలో వ్రాలింది. దాన్ని వెంట బెట్టుకొని మహావేగంగా డేగవచ్చింది. "మహారాజా! యీపావురాన్ని



నాకివ్వండి? నాయాకలిని తీర్చుకుంటాను" అనగా, శిబి "ఓపక్షిరాజా! యీపావురం నన్ను శరణుకోరింది. శరణన్న వారిని రక్షించడం నావ్రతం. అందువల్ల దీన్ని నీకెలా యిచ్చేది? అయినా! నీవు చంపుతావు. మరినా అహింసావ్రతాన్ని నేనెలావిడిచేది? నీవింక ఆహారాన్ని వేరొకటి తీసికొనుము" అనగా! "రాజా! నీవు ధర్మాత్ముడవు. దయాశాలివి. సత్యవ్రతుడవు. నానోటికందిన ఆహారాన్ని పడగొట్టిన పాపానికి నీవంటి మహాత్ముడు బలికాకూడదుకదా?"

అన్నడేగను చూచి శిబి ఓద్విజోత్తమా? నన్నెందుకు భ్రమలో ముంచుతావు. నీవెన్నిచెప్పినా యీ పావురాన్ని విడువను. నీకు ఆహారం మాంసంకదా! దీనియెత్తు మాంసము నీకు ఆహారంగా యిస్తాను సరిపోతుందా?" అనగాడేగ సరేఅన్నది. ఆమాట ప్రకారం శిబిచక్రవర్తి తక్కెడ తెప్పించి పావురాన్ని ఒకప్రక్కగా ఉంచి, వేరొకప్రక్క తనశరీరాన్ని ఖండఖండాలుగా కత్తితోకోసి తక్కెడలో వేసి తూయగా నరిపోలేదు. అలాశరీరమంతా ముక్కలుగావేసి తూచిన పావురానికి సరికాకుండాఉండగా, యింక లాభములేదని స్వయముగా శిబిచక్రవర్తియే తక్కెడలో కూర్చున్నాడు. యింక అగ్ని మహేంద్రులు యిద్దరూ అదిచూచి భరింపలేకపోయి స్వస్వరూపాలతో శిబిచక్రవర్తి దగ్గరనిలిచారు. అదిగని శిబి తనహస్తాలు మోడ్చి "దివ్యులారా! తమ దర్శనం వలన ధన్యుడనయ్యాను. మీదర్శనము అలభ్యమయింది. యెన్నిజన్మలపుణ్యమోయిది" అనగా; మహేంద్రుడు తన పవిత్రహస్తస్పర్శతో శిబిచక్రవర్తిని మహాతేజస్సంపన్నుని గావించి "శిబీంద్రా! నీకేమికావా"లని అగ్ని మహేంద్రులడగ్గా! "మహాత్ములారా! తమ దర్శనము కన్నా నాకింకా కావలసినదేముంది?" అనవారు "ఓత్యాగశీలీ? నీవంటి త్యాగపురుషుని ముల్లోకాల్లో చూడలేదు. కనక నీపవిత్రదివ్య చరిత్ర సువర్ణాక్షరాలతో విరచింపబడి అందరినాలుకలపై నిత్యం తాండవమాడుగాక;" అని వరమిచ్చి వెళ్లి పోయారు. అటువంటి వాడేడీ?

"యిక భరతుని చరిత్ర జాగ్రత్తగావిను ధర్మజా! అని యిలా చెప్పసాగేడు శ్రీకృష్ణుడు. యీతనికి "సర్వదమను"డని పేరు వచ్చింది యీతనిపేరేగదా! మనభారత భూమి. యీతడు దుష్యంతుని కుమారుడు. దుష్యంతమహారాజు గూర్చినీకు బాగా తెలియునుగదా? యీతడు జనపదవాసుల. వనౌకసుల రక్షణకోసం మహారణ్యానికి ఒకనాడు సైనికులతో, వేటగాళ్లతో బయల్దేరివెళ్లి మధ్యాహ్నంవరకూ క్రూరసత్వమృగాల వేటాడాడు. అలసి ఒకప్రదేశమున నీరముతీసికొని విశ్రాంతి పొందాడు. సేనలన్నీ దూరంగా ఉన్నాయి. మహారాజు మాత్రం ఆప్రక్కనేయున్న కణ్వమహర్షి ఆశ్రమాన్ని దర్శించి మహర్షి ఆశీస్సులందాలని అటువైపు కొంచందూరం నడిచాడు. అక్కడ కిలకిలారావాలతో చెలులతో శకుంతల వనవిహారంగావించడం నర్మసఖునితో గూడా అక్కడపొదలు చాటుగా ఆమెను చూసేసరికి మహారాజుకు ఆమెపై మనసు పడింది.

ఆమె అతిలోక సౌందర్యానికి మోహితుడయ్యాడు దుష్యంతమహారాజు. నర్మసచివుని ఆచెలులదగ్గరకు పంపగా ఆతడు అన్నీతెలిసికొని చక్కావచ్చుడు. అదంతా మహారాజుకు విన్నవించాడు. యింకేముంది? మహారాజు రొట్టెవిరిగినేతిలో పడింది. యిద్దరూ కలిసి ఆశ్రమములోనికి అడుగుపెట్టారు. ఆచ్చుటశకుంతల హాయిగా చెలులతో యెంతసంతోషముతోడనో విహారంగావిస్తుంది దుష్యంత మహారాజును గాంచినంతనే యెదురేగి అతిథిని మర్యాదగావించింది. విదూషకుడు మహారాజుగారి గురించి చెప్పడముతో శకుంతలకు సిగ్గుముంచుకు వచ్చింది. ఆమె అతిలోక అందాన్ని తిలకించినదుష్యంతుడు కూడా ఆమెను మోహించాడు. "యీమెతండ్రియైన కణ్వమహార్షి ఆశ్రమములోలేరు. మహారాజా! తమకు తగినమర్యాద జరుగలేదు. క్షమించండి" అన్నారు చెలులు.

దానికి దుష్యంతుడు "ఓయువతులారా! నామర్యాదలకేమిగాని, మీరాకుమారిని గాంధర్వవివాహం చేసికొంటాను. మహర్షులకు యీచరిత్రంతా చెప్పండి" అని దుష్యంతుడు చెలులకు చెప్పాడు. దుష్యంతమహారాజ చంద్రుని అందాన్నితిలకించిన శకుంతలకూడా అతనిని కూడాలని యెంతో తహతహలాడుతుంది. చెలులప్రోత్సాహముతో దుష్యంత మహారాజు శకుంతలను తీసికొని వెళ్ళి పొదరింట కూడడముతో ఆమెకు సద్యోగర్భముయేర్పడింది. దుష్యంతుడు చెలులతో "నేను త్వరలో యీమెను నారాజధానికి తీసుకువెళతా" నని చెప్పివెళ్లాడు. తరువాత సాయం సమయానికి కణ్వమహార్షివచ్చాడు. ఆతడేమంటాడో యేమో అని శకుంతలా చెలులు భయభ్రాంతులయ్యారు. మహర్షిదగ్గరకు రావడానికి శకుంతల భయపడుతుండగా మహర్షి "అమ్మా! శకుంతలా!" అనిపిలువగా సిగ్గూభయముతో రాగా దగ్గరగా తీసికొని కూర్చుండ బెట్టికొని తనదివ్యతపో నేత్రంతో చూసి అంతాగ్రహించే మహర్షి "బిడ్డా! నీగర్భంలోగల మగశిశువు యీభూమండలమంతా పరిపాలించు చక్రవర్తి అవుతాడు. నీవేమీ భయపడనక్కరలేదు. దుష్యంతమహారాజు ధర్మప్రభువు నిన్ను పరిగ్రహించాడు" అని చెప్పాడు. అలానిండు గర్భిణియైన శకుంతల ఒకసుముహూర్తాన సూర్యుని వంటి తేజస్సుగల మగ బిడ్డను ప్రసవించింది. ఆబిడ్డకు జాతకర్మాది క్రియలు నిర్వర్తించి కణ్వమహార్షి "సర్వదమను"దని పేరుపెట్టాడు. ఆతడు బాల్యమునుండి అరణ్యానగల సింహముపిల్లలపై నెక్కి స్వారిచేసి ఆశ్రమానికి తీసికొనివచ్చేవాడు. మహర్షులందరూ ఆశ్చర్యపోవ కణ్వ మహార్షి యెంతో సంతోషింపగా, ఆతనికి విద్యాబుద్ధులతో క్షాత్రధర్మానికి తగిన అస్త్ర శస్త్రాది. విద్యలు కూడా మహర్షి ఆబిడ్డకు నేర్పింప వాటిలో ఆతడు ఆరితేరాడు. యిలా ఉండగా, ఒకరోజు మహర్షి శకుంతలను తన దగ్గరకూర్చుండ బెట్టుకొని" అమ్మా! స్త్రీకి భర్తదగ్గర ఉండే గౌరవము వివాహము జరిగిన తరువాత పుట్టింటివారెంత పెట్టినా ఉండదు. అందులో నీవు సామాన్యవుకావు. దుష్యంతమహారాజుకు అర్థాంగివి. రేపేమంచి సుముహూర్తం



మునికుమారులతో చక్కగా నీ భర్తదగ్గరకు నీకొడుకుతో సహావెళ్ళు" మనగా; శకుంతల యెంతో సంతోషించింది.

అంతమరునాడు శకుంతలను అత్తవారింటికి పంపడానికి సన్నాహాలుచేసి మునికుమారులను తోడుగాయిచ్చి శకుంతలనూ కుమారుని దుష్యంతమహారాజు దగ్గరకు పంపనుద్యుక్తుడై యిన్ని నాళ్లూపెంచిన ప్రేమానురాగాలు విడక కణ్వమహార్షి కూడా కన్నుల నుండి నీరు పెట్టుకొని తనమదిలో "ఆహా! పెంచినందుకే నేనింతగా బిడ్డను విడువలేక పోతున్నాను. కనుకున్న ఆదంపతి యెంతబాధపడతారో!" అని శకుంతలను విడువలేక విడువలేక విడిచిపెట్టాడు. శకుంతలను చెలులు కూడా విడువలేక యెంతగానో యేడ్చారు. అలా దుష్యంత మహారాజు దగ్గరకు వెళ్లిన శకుంతలను చూసి మహారాజు యెప్పుడూ యెరుగని దానినివలె నిరాకరించారు.

శకుంతలకు తనతలతీసేసినంతగా అయి ఆరాజదర్బారులో ఆమె యేడుస్తూ, తన చరిత్రనంతా చెప్పినా దుష్యంత మహారాజు వినలేదు. అప్పుడు అశరీరవాణి "ఓ దుష్యంతమహారాజా! నీమహారాణిని సందేహించక నీ కుమారునితో సహా ఆమెను పరిగ్రహించు" అనగాదుష్యంతుడు సంతసముతో కుమారునెత్తి ముద్దిడుకొని శకుంతలను చేరదీశాడు. ఆసర్వదమనుని వంశమే మీది. ఆతనికి తరువాత "భరతు"డను పేరువచ్చింది. ఆతని పేరేమనభారతభూమి ధర్మరాజా!" అని కృష్ణుడు చెప్పాడు. మరి అంతటివాడీనాడేడీ? తరువాత సూర్యవంశాలంకారుడైన శ్రీరామచంద్రమూర్తి అటువంటి ధర్మసత్యవంతుడు ఆతడు కూడాలేడుకదా? మానవులందరికీ ఆదర్శ పూర్ణపురుషుడు. మాంధాత – యయాతి – అంబరీషుడు – శిబిందుడు – గయుడు. రంతిదేవుడు. సగరుడు – పృథువు. వీరందరూ దివ్యపురుషులేకదా? వీరందరూ దానదయా ధర్మవర్తనులే! యిందులో ఒకరికి ఒకరుతీసిపోవువారున్నారా? వీరిలో యెవరు నీ అగ్రజుడు కర్ణునికి తక్కువ వారో చెప్పగలవా? అందువలన యింక దుఃఖించకు. దాని వలన చాలా అనర్థాలున్నాయి. నరకలోకములోకే మనిషివెళ్లగలడు. యిదీస్థితి. మనిషికి తీరని దుఃఖంవస్తే ఆఖరుకు అలా దుఃఖించి చనిపోతాడు" అని యింకధర్మరాజు మరల దుఃఖించకుండా శ్రీకృష్ణుడు చెప్పాడు. అప్పుడు ధర్మరాజు తన హృదయాన్ని గల దుఃఖాన్ని ఆపేడు.

### ధర్మరాజుకు వ్యాసమహార్షి ధర్మప్రబోధం

అలా శ్రీకృష్ణ పరమాత్మ షోడశరాజ చరిత్రవిని పింపగా వినిన ధర్మరాజు కొంత ఉపశమనంగాంచాడు. అలా ఉండగా! ఒకనాడు తనమనుమలను చూడాలని వ్యాసమహార్షి ధర్మరాజు దగ్గరకు వచ్చాడు. యెంతటితపోనిధి యైనా తమ కన్న సంతానంపై ఉన్నమమకారం పోదుకదా? వచ్చిన వేదవ్యాసభగవానునకు ధర్మరాజు యెదురేగి, అర్ఘ్యపాద్యాదులన్నీయిచ్చి, పూజించి, ఉన్నత పీఠముపై ఉంచి" మహాత్మా! తమదర్శనమువలన ధన్యులమయ్యాం. తమరు బ్రహ్మణ్యులు. మావంటిదీనులపై మీ కరుణా కటాక్షాలు చిందించ మాదగ్గరకు దయచేశారంటే మేమెన్నో జన్మల్లో

చేసిన పుణ్యఫలముగాభావిస్తాను. నాయందు కనికరించి మీరు ధర్మాలను వినిపింప ధన్యుడనౌతా" నన్నాడు. ఆమాట లాలించిన కృష్ణద్వైపాయనుడు "ధర్మనందనా! ధర్మాలయందుగల నీకోరిక యెంతైనా మెచ్చుకొనతగింది.

మనకు కొన్ని శాస్త్రాలు మహాత్ముడైన ఋషులు రచించి యిచ్చారు. అవిమనకు త్రికాలాలలో అచరించాలని వారి ఆశయం. వాటిని ఆచరిస్తే మానవునకు సర్వమూ వశమౌతుంది. అలాచేయని వారు పాపము చేసిన వారౌతారు. యీ ధర్మం సామాన్యమైనది. యింకవిశేషధర్మాన్ని చెప్తూతారు. యిటు ఆరోగ్యానికి, అటు దైవారాధనకు పనికి వచ్చేవి విను. సూర్యోదయసమయాన, సూర్యాస్తమయ సమయాన నిద్రపోరాదు. పెద్దవారు యెవరైనా మనయింటికి వస్తే వారికి తగినట్టు మర్యాదను గావించక పోవడం. పరస్త్రీలతో కూడ్డం, త్రిమూర్తులు కన్నామిన్ననైన "గురుర్ బ్రహ్మ" అన్నట్లు గురుభగవానునికి తిరిగి చెప్పివారితో వాదానికి దిగడం. అభివృద్ధిపనులు గావించి పదిమందికి పనికి వచ్చేవారుగావించే కార్యాలకు అడ్డమురావడం. ధనము కొరకు వేదాన్ని చెప్పడం, పెసలూ, మినుములూ మొదలైనవి విక్రయించడం, తనదగ్గర పనిచేయుచున్నవారిని నిరాదరణగాచూడ్డం, అసత్యమార్గంలో ప్రయాణించడం, అరణ్యాలను అనగా పచ్చని వృక్షసంపద, మానవులకు ప్రాణవాయువునందించే వాటిని కొట్టేయడంగాని, కాల్చేయడంగాని చేయడం; తనకులవృత్తిని విడిచి పెట్టడం; పరులవృత్తులు చేయ ప్రాకులాడ్డం;

పశుసంపదను కొట్టడం, చంపడం, బ్రహ్మణ్యులైన వారి ధనాన్ని దొంగిలించడం, శరణుచొచ్చిన వారెవరైనా వారికి రక్షణ కల్పించకపోవడం, బ్రహ్మహత్య యివన్నీ మహాపాపాలని చెప్పబడతాయి. యిక యింకొకటి చెప్తూతాను. సామాన్యంగా బయటికి పాపాలు లాగే కానవస్తాయి. అవి యెంతమాత్రం పాపాలు కానేకావు. యెంతగొప్పవాడుగాని, భక్తుడుకాని, సమస్త శాస్త్రరహస్యవేదికాని విరోధంతో మనమీదకు చంపడానికి వచ్చేవాడినెంతటి వాడైనా వానిని చంపడం పాపం మాత్రంకాదు. ప్రాణము మీదకు వచ్చినప్పుడూ, అన్నంకాదు, కనీసం నీరైనా దొరకని కటికి కరువు వస్తే, కల్లుత్రాగినా పాపముకాదు. తన అన్నచెడుగుణాలతో చెడ్డవాడైతే, లేక సన్యాసైతే తమ్ముడు వివాహం గావించుకోవడం పాపంకాదు. యజ్ఞయాగాల్లో పశువును వధించడం, వానిచరిత్ర తేలీక దానంచేయడం. దుర్మార్గుడైన పనివానిని తనపనిలోనుంచి తీసి వేయడం యెంతమాత్రం పాపంకాదు. పైని వ్రాసిన పాపదోషాలు పోవాలన్న పుణ్యవ్రతాలు ఆచరిస్తే తప్పక పోతాయి. వీటికి అనేక విధాలైన ప్రాయశ్చిత్తాలున్నాయి.

ధర్మరాజా! జాగ్రత్తగావిను. నీమనస్సులో పదునెనిమిది అక్షౌహిణిసేన, వేలాదిమహావీరుల నందరనూ, నేను చంపించాననే తీరని దుఃఖావేదన నీకెంతైనా ఉంది నీమనస్సులో నాకావిషయం బాగాతెలుసును. దాని వలన నీమనస్సంతా చింతాక్రాంతంగాఉంది. నీకు శాంతి కలుగాలన్న ఒకమహత్తర "అశ్వమేధయాగాన్ని"



చెయ్యి. దానివలన నీకు తగిన శాంతి లభిస్తుంది. శాంతి పొందడానికి అనేకమార్గాలులున్నాయి. చేయరాని అకార్యాలుచేస్తే అశాంతి కలుగుతుంది. యింకొకవిశేషం. నీకెక్కడనుండో శాంతిదిగి రానక్కరయేలేదు. నీహృదయంలో ఉన్న అశాంతికి భయపడి నీలోనున్న శాంతి పోయింది. యిక నీ అశాంతిని తొలగిస్తే వెంటనే శాంతి నీహృదయములోకి చేరుకుంటుంది. అశాంతి యెందువల్ల వచ్చింది? నీవుచేయరాని పనులు చేయడం వలన.

మానవునికి కావలిసింది శాంతి. కాని యీమనిషి యెప్పుడూ చేయరాని అకార్యాలే చేస్తుంటాడు. తనగొప్పతనాన్నితానే చెప్పుకుంటాడు. తనకు కావలసినది వీడి యితరుల బాగును చూసి ఓర్వలేడు. యివన్నీ అశాంతికి మెట్లు ధర్మజా! అందువలన నీవు మహాపవిత్రమైన "అశ్వమేధయాగాన్ని" చేయి. దానికి సమర్థత ఉందా? అంటావేమో!

గీ. **పుండరీ కాక్షునకు నాల్గు భుజములట్లు**
**కలరు నల్వురు తమ్ము; లాకంసవైరి**
**ఆప్తబంధుడు తోడునై యలరినాడు;**
**ధర్మజా యేడి నీపాటి ధన్యతముడు;"**

ఇన్ని సమర్ధతలున్న నీవుకాక యింక మరెవరు యీ యాగాన్నిగావింప సమర్ధులున్నారు? నీకుయీ యాగం మూలంగా సర్వదుఃఖాలూ పోయి అన్నివిధాలా శాంతులూ సమకూర్తాయి. నీయాత్మ పవిత్రతకు సహకరిస్తుంది. నీయోగ్యవర్తనకు దోహదం చేస్తుంది" అనువేదవ్యాస భగవానుని వాక్కులు ధర్మరాజు శిరోధార్యంగా స్వీకరించాడు. తమ్ములను కూడి హస్తినాపురం రాజధానికి వెళ్లాడు.

ధర్మరాజు హస్తినకు చేరుకొనేసరికి యింకపౌరుల ఆనందం, పల్లెల్లోగల వారి సంతోషం, నగరపెద్దల అద్భుతభక్తి భావాన్ని వర్ణించడానికి వేయినోళ్లు కూడాచాలవు జనమేజయ మహారాజా! అన్నాడు వైశంపాయన మహర్షి. యింక ప్రభుత్వంలో పనిచేయువారికి, మహామాత్యులకూ, సమస్త దుర్గాలనూ నగరంలో గల వాటిని బహుభద్రంగా రక్షణ చేయువారికి, కవిపండితగాయక శాస్త్రజ్ఞులకూ వర్తమానం పంపించి అందరూ ఆనందంతో రాగావారందరికీ సహృదయ సమ్మానభావంతో పేరు పేరునా పలకరించి పులకరించి పోయాడు ధర్మరాజు. వారందరూ యుధిష్ఠిరునకు వందనచందనలందించారు. అపూర్వగౌరవాన్నిచ్చారు. ఆతనిని అనేక విధాలనుతించారు. అందరూ అనేకవిధాల ఆనందసాగరాన మున్కలు వేశారు.

## ధర్మరాజు సామ్రాజ్యాభిషేకం

ధర్మరాజు పట్టాభిషేకోత్సవానికి సర్వజనులూ యెదురు చూస్తున్నారు. యెప్పుడెప్పుడని అందరూ యెదురు చూస్తున్నారు. ధౌమ్యమహర్షి సర్వమూ నిర్వహిస్తున్నారు. పరమేశ్వరుస్థానమైన యీశాన్యదిక్కుకు వాలుగా వేదికను

నిర్మించారు. సమస్త మంగళద్రవ్యాలతో అందం ఉట్టిపడ్డట్లు అలంకరించారు. దానిపై బంగారు సింహాసనాన్ని నవరత్నములచే స్థాపించిన దాన్ని యేర్పాటుగావించారు. పెద్దపులి చర్మమును దానిపై పరిచారు. యిక ముందుగా మహాగణనాధుని పూజించారు. తరువాత అష్టదిక్పాలురనూ, నవగ్రహాలనూ, త్రిమూర్తులనూ, త్రిదేవులనూ మహేంద్రాది దేవతలనూ పేరుపేరున అచ్చట ప్రతిష్ఠించారు. దివ్యమైన ఒకశంఖాన్ని ఒకస్థానమందుంచారు.

సువర్ణపుష్పాలతో అర్చించారు. నలువైపులాదానికి బంగారం, వెండి, నవరత్నాలునూ, మట్టికుండలు నాలుగు అక్కడ ప్రతిష్ఠగావించారు. వాటిని పవిత్రగంగా తీర్థాన్ని నింపారు. ఆనాలుగు కుండలకు నవరత్నాలూ, మంగళకరమైన, మామిడాకులు, చివుళ్లూ, అయిదు విధాల ద్రవ్యాలతోనూ, సశాస్త్రీయంగా, ధౌమ్యమహర్షి యేర్పాటుగావించారు. సర్వానందదాయకమైన "ధర్మరాజు" నామంసార్థకంగావించ ప్రజలందరూ వారివారి హృదయాల్లో ఆతని పేరునుప్రతిష్ఠించుకొని అపూర్వగౌరవ భావంతో ఆతనిపాలన ప్రజారాజ్యంగా ఉండాలని ఆకాంక్షిస్తూ, అందరూ కోటి దేవుళ్లకు మ్రొక్కుకున్నారు. నిరంతరం ప్రజలనాలుకల్లో ఆతని నామమే దైవనామంగా విరాజిల్లాలని ధౌమ్యులవారిఊహ.

యిక ప్రజలు తండోపతండాలుగా వచ్చి, యుధిష్ఠిరు దివ్యభారతసామ్రాజ్య పట్టాభిషేకంచూచి, తనయింటిలో కల్యాణమువలే యెవరిమట్టుకు వారు ఊహించుకొని ఉన్నారు. ధౌమ్యమహర్షి పరమాదర ఆనంద హృదయంతో తాను ధర్మరాజును తీసుకొని వెళ్లి ఆసామ్రాజ్యసింహ పీఠము పయినిల్పి, కల్యాణవాద్యాలు" శ్రీభారత సామ్రాజ్యనేతకు, భరతసమ్రాట్టుకు జైజై" అని అనేకవిధాలా జయనినాదాలు భూనభోంతరాళాలు మార్మోగగా అప్పుడు కూర్చుండబెట్టాడు. ఆతనికి సర్వ మంగళలాగుండి, సమస్త ఆభరణభూషితాలంకారాలతో, శ్రీమహాలక్ష్మిలాగున్న ద్రౌపదీ దేవిని ఆతని యెడమభాగాన కూర్చుండబెట్టారు. ఆమహారాజ్ఞితో ధర్మరాజు చేత ధౌమ్యమహర్షి వేదయుక్తమైన దివ్యహోమాన్ని సశాస్త్రీయంగాచేయించారు.

మాతృదేవియైన కుంతీదేవి, సోదరులు భీమార్జుననకుల సహదేవులు నలుగురూ, విదుర సంజయ ధృతరాష్ట్రాదులూ – యుయుత్స సాత్యకీ మొదలైనవారు, రమ్యరత్నపీఠాలపై ఆశీనులైయున్నారు. వరమపావనమూర్తి శ్రీకృష్ణ పరమాత్ముడు ద్రౌపదీ ధర్మరాజులను ప్రత్యేకమైన ఒకదివ్యాసనమ్మీద కూర్చుండ బెట్టాడు. "పవిత్రవేద మాతలాగున్న అత్తా!" శ్రీమహాలక్ష్మి లాగున్న ఆత్మసోదరీ! నేనప్పుడేమాటాడేనో ఆమాటదైవకృపతో నెగ్గించుకున్నాను. యీ ధర్మరాజును సామ్రాజ్యపట్టభద్రునిగా గావిస్తున్నా"నని ప్రజలందరి ఆనందకరతాళధ్వనులమధ్య తన మహత్తర పాంచజన్యాన్నిపూరించి ఆనందతుందిలహృదయంతో ధర్మరాజును అభిషేకించి, అభినందించాడు శ్రీకృష్ణుడు. అనంతరం మహారాజులందరూ బారులుగా తీర్చి ఒక్కరొక్కరే వరుస మహారాజు లందరూ బారులుగాతీర్చి ఒక్కరొక్కరే వరుసలు



కట్టి వచ్చి ద్రౌపదీ ధర్మరాజులకు అభిషేకించారు. ధృతరాష్ట్రుని చేయి పట్టుకొని ధౌమ్యమహర్షి తీసికొని వచ్చి, కలశమిచ్చి పాంచాలీ ధర్మరాజులను అభిషేకింపచేశాడు. యిక హస్తినాపురంలో ప్రజలు ఆనందోత్సాహాలొలకబోస్తూ, ప్రతియింటాపెళ్లివేడుకలు నింపుకుంటూ, పదికాలాల పాటు ధర్మరాజు యీభారత సామ్రాజ్యాన్ని పరిపాలించాలని అందరూ యేకముఖంగా మహారాజును కీర్తించారు.

పాండు పుత్రులు తల్లికుంతీదేవితో సహా, యెప్పుడు సుఖమనేదే యెరగరు. చిన్నప్పుడే పాండురాజు చనిపోవడం. మహర్షులు ఆబాలురను తీసికొని వచ్చి, ధృతరాష్ట్ర భీష్ములకు అప్పచెప్పారు. అప్పటినుండీ కౌరవపాండవులకు పడేదికాదు. ముఖ్యంగా భీముని మీద కౌరవులు వందమందీ కక్షగట్టారు. యిలా ఒకటారెండా? వాళ్లుగావించే దుర్మార్గస్థితి? చివరకు యీ అమాయకుడైన ధర్మరాజుచేత మాయద్యూతమాడించి, నిండుకొలువులో యీద్రౌపదీ దేవికి వస్త్రాపహరణగావించి పదమూడేడులు వనవాసంపాలు చేయించేరు. తరువాత దుర్యోధనుడు యెందరు చెప్పినావినక చివరకు యుద్ధాన్ని ప్రకటించి పదునెనిమిది అక్షౌహిణులను కుత్తుకలుకోయించాడు" అని హస్తిననగర ప్రజలందరూ జరిగిన విషయాలను నెమరు గావించుకున్నారు.

ఇప్పటికి యీమహనీయునికి అన్నిబాధలూ అనుభవించితుదకుధర్మమే జయిస్తుందని" చెప్పినపెద్దలవాక్కుల ప్రకారం భారతపట్టాభిషేకాన్ని పొందడం, దాన్ని మనందరం చూసేభాగ్యానికి నోచుకొనే స్థితికివచ్చిందని అందరూ ఆనందపడ్డారు. యిది యిలా ఉండగా యీ సమస్తకార్యనిర్వాహకుడై యిదంతా చేసిన శ్రీకృష్ణపరమాత్మను చూసి హృదయం పట్టరాని ఆనందంతో ధర్మరాజు యిలానుతించాడు.

"ఓవిశ్వకర్మా! విశ్వాత్మా! విష్ణూ! జిష్ణూ! హరీ! కృష్ణా! వైకుంఠా! పురుషోత్తమా! పురాణా! పృశ్నిగర్భా! త్రియుగా! సుచిశ్రవా! హృషీకేశా ఔఘృతార్చిష్ణూ! హంసా! త్రిచక్షూ! శంభూ! విభూ! దామోదరా! పరా! అగ్నీ! బృహద్భానూ! వృషభా! తార్క్ష్యవాహనా! అనీకహా! పురుషా! శిపివిష్టా! ఉరుక్రమా! ఉగ్రసేనా! సత్యా! వాజసనా! గుహా! అచ్యుతా! శత్రుంజయా! సత్కృతా! విక్రుతా! వృషాకపీ! కృష్ణధర్మా! అధీశ్వరా! వృషగర్భా! వృషాకృతీ! సింధూ! విధూర్మీ! త్రికకుబ్ధామా! త్రివృత్తా! సమ్రాట్! విరాట్! స్వరాట్! స్వారాట్! భూతమయా! భవా! విభూ! భూః! అతిభూః! కృష్ణవర్మా! స్విష్టకృత్! భిషజావృతా! కపిలా! వామనా! యజ్ఞా! ధ్రువా! పతంగా! జయసేనా! దుందుభీ! గభస్తినేమీ! శ్రీవత్సా! పుష్కరాక్షా! మహాసనా! ఋభూ! విభూ! సర్వసూక్ష్మా! ధరిత్రీ! అంభోనిధీ! బ్రహ్మా! పవిత్రా! పవిత్రధామా! ధర్మవిదా! హిరణ్యగర్భా! స్వధా! స్వాహా! కేశవా! విశ్వయోగీ! శంఖచక్రగదా ధరపాణీ! పద్మాక్షా! యదుశ్రేష్ఠా! ప్రభూ! జ్యోతిర్మయా! నిరంజనా! నిరామయా! హరీ! శ్రీకృష్ణా! నమోనమస్తే! అన్నాడు పరమాత్మ కృష్ణుడు తనను తెలిసికొని తననామాలతో హృదయపూర్వక భక్తిభావముతో స్తోత్రంగావించాడని యెంతోపొంగిపోయాడు.

యిక యువరాజుగా యెవరుంటారు? ప్రశ్నవచ్చి అర్జునునివైపు కొందరుచూశారు. మరికొందరు ఆలోచనల్లో మునిగున్నారు. యింతలో ధర్మరాజు శ్రీకృష్ణుని జూచి "బావా! మహానుభావా! ముల్లోకారాధ్యుడవు, అన్నింటికీ నీవు మాకుండగా మేమేమిమాట్లాడగలం? ప్రాణాలనైనా తమపాదాలపై పెట్టడానికి యీపాండవులున్నారు. తమ అభిప్రాయం శెలవివ్వండి?" అనగా; ధర్మరాజును జూచి చిరునవ్వు చిద్విలాసాన్ని చిందించే శ్రీకృష్ణ పరమాత్మ "ధర్మనందనా! యీచిన్నవిషయానికి నేను చెప్పాలా? మహాబలుడూ, మనందరం మెచ్చిన వాడు, మనభీమసేనుడే యువరాజు" అనగా అందరి హృదయాలూ వికసించాయి. యింకేమికొదువ? పెద్దలందరూ భీమన్నను యువరాజుగా అభిషేకించారు.

యిక "బావా! శ్రీకృష్ణా! అదినుండీ మాయోగాన్ని, మమ్మువిడువకుండా, కళ్లకురెప్పల్లాగ అతిప్రేమాభిమానాలతో పరిరక్షించిన, దివ్యపురుషుడు, సమస్తనీతిశాస్త్ర, కోవిదుడు విదురుని సమస్తరాజకార్యనిర్వహణ దక్షునిగా నీవేనియమించా''లని అనగా; అందరూ యెంతగానో సంతోషించారు. ఆపెద్దపీఠముపై విదురుని కూర్చుండ బెట్టారు. అంతటి గౌరవభాగ్యాన్నిచ్చిన ధర్మరాజాదులకు ఆశీస్సులిచ్చి, శ్రీకృష్ణపరమాత్మకు నమస్సులర్పించారు విదురుడు. యిక ధృతరాష్ట్రునికి కుడిచేయిలాగున్నా, సుయోధనుడు ఆతని సోదరులు గావించు దుర్మార్గకార్యాలను మొగమాటంలేకుండా చెప్పి పాండవులకు సహాయ సంపత్తులనందించు సంజయుని సమస్త రాజకార్యములు జాగ్రత్తగా చూడ్డానికి వ్యవహారకర్తగా నియమించారు.

సకల సైన్యపోషణమొదలగు, భృత్యపరిరక్షణ మొదలగు వాటికి నకులుని అధినాయకునిగావించారు. యజ్ఞయాగాదిక్రతుకర్మలన్నిటిని చేయించే అధికారాన్ని శ్రీధౌమ్యులవారికి అప్పచెప్పారు. పౌరులు – జానపదులు వారివారి అవసరాలు తీర్చడానికి, వారికార్యక్రమాలన్నీ పరిరక్షించడానికి వారు తగిన జాగ్రత్తలు తీసికొనడానికి వారిలోని వారినే నియమించారు. యిలా ధర్మరాజు పరిపాలన, ధర్మపరిపాలనగా, అందరి ప్రజలకూ ఆనందాన్నందించి నట్టుగా వెలుగులు నాలుగు దిక్కులకూ చిమ్ముచుండగా, ఆతని పరిపాలన సాగింది. ఒకనాడు ధర్మరాజు "బావా! పరమాత్మా! కృష్ణా! అమరుడు, మహాజ్ఞాననిధి, మాకాప్తుడు భీష్మాచార్యులు మనందరినీ చూడాలని యెదురు చూస్తున్నాడు. మనం తక్షణమే ఆతని దర్శనానికి వెళ్లాలని కృష్ణ– విదుర సాత్యకి సంజయాదులూ, సోదరులతో కూడి శరతల్పముపై నున్న గంగానందనుని దర్శనంకోసం ధర్మనందనుడు కురుక్షేత్రభూమికి బయల్దేరివేళ్లాడు. ముందు శ్రీకృష్ణుని దివ్యరథం సాగుతుండగా, తరువాత తక్కిన వారి రథాలన్నీ ఓఘవతీనదీతీరానికి చేరాయి. అప్పటికే భీష్మాచార్యుల వారివద్ద వ్యాసభగవానుడూ, నారద, దేవలుడూ, దేవస్థాణువూ, దేవరాతాది మహర్షులందరూ గంగానందనుని చుట్టూకూర్చొని ఉన్నా ధర్మరాజాదులందరూ దూరాన రథాలనుంచి దిగివచ్చి



వారందరినీ చూసి ఆశ్చర్యమందారు. అక్కడ భీష్ముడు మాత్రం యోగనేత్రుడై యున్నాడు.

అప్పుడచ్చట గల మునులు మెల్లగా భీష్మునికి శ్రీకృష్ణునితో కలిసి తమదర్శనానికి పాండవులు వచ్చారని చెప్పారు. ముందుగా ఆతడు కన్నులు విచ్చి చూచేసరికి కృష్ణుని దర్శనమయింది. గాంగేయుడు చూచి "పరమాత్మా! నీవూవచ్చావా?" అన్నట్లునేత్రాలతో నమస్కరించాడు. "భీష్మాచార్యా! మానసిక ఆందోళనకు గురియైన నీమనుమడు ధర్మరాజునకు కొంత నీతిని బోధించా"లన్నాడు. "మాధవా! హృదయముపవిత్రంగా వుంది. నాలుకపిడుచుకడుతుంది. దాహంవేస్తుంది నోటమాట సరిగా రాలేదు" అన్నాడు ఆచార్యుడు. అప్పుడు శ్రీకృష్ణపరమాత్మ ఆతనికి ఆకలి దప్పులూ, ఆవేదనా, అలసటలేకుండా వరాన్నిప్రసాదించాడు. మహర్షులందరూ తరువాత వస్తామని వెళ్లారు. యిప్పుడు శ్రీకృష్ణపరమాత్మ ప్రసాదితవరంతో మంచి ఆనందసంతోషముతో గొప్ప ఉత్సాహంతో ఉన్నాడు. మరల వస్తామని చెప్పి వెళ్లినపాండవులు మరునాడు వచ్చారు.

''మహాత్మా! గంగానందనా! నీప్రియమనుమడు యుధిష్ఠిరుడు, ఆప్తులైనవారందరినీ చంపుకున్నాను" అని యెంతో దుఃఖావేదనతో నున్నాడు. అని కృష్ణుడనగా; "నాయనా! ధర్మరాజా! క్షాత్రవధర్మానికి మొదటి మెట్టే శాత్రవసంహారం. దీనివలన నీకు పాపం రాదు సరేకదాపుణ్యంలభ్యమౌతుంది. యిది నీకర్తవ్యం. దానికి విచారమేల? నీవుదీని మూలంగాపరమానందమందాలి కాని పరితపింపరాదు. హృదయాన్ని జాగ్రత్తగా కుదురపరచుకో! యిందులో తప్పొరవంత కూడాలేదు" అన్నాడు భీష్ముడు. అప్పుడు ధర్మరాజు "తాతగారూ! యిలా అయినవారినీ" ఆప్తులనువిరోధులని చంపకపోతే యీసృష్టిసరిగా నడవదా?

రాజ్యాన్ని ఒకడు పాలిస్తుండగా, అదిచూచిన వేరొకనికి కన్నుకుట్టడం. యిక వారిద్దరూ యుద్ధములో చంపుకోవడం యిదే రాజనీతా! యిద్దరూ సంస్కారబలముతో రాజ్యాలను పాలించుకోకూడదా?" అని ధర్మరాజు. అన్నాడు. "మనుమడా! అలా ఉండలేక పోయారనే కదా మనపరిపాలకులు లేకుండానే యెంతో హాయిగా అందరూ బ్రతికారు అలావారు కొంతకాలమే కలిసుండగలిగారు. వారిని అరిషడ్వర్గాలు పట్టుకొని పీడించసాగాయి. పట్టుదల, దురభిమానం. వీటి వలనకొందరు బలహీనులమీదవిరుచుకుపడి వారిని పీడింపసాగారు. మరికొందరు. వ్యసనాలపాలై దోపిడీదొంగలయ్యారు. యింకాకొందరూ వేమూ తక్కువతినలేదని స్త్రీలమానభంగాలకు తయారయ్యారు.

అప్పుడు మనువు మొదలైన మహాత్ములులేచి రాజనీతి – దండనీతి – నీతి శాస్త్రం మొదలైనవన్నీ తయారు గావించారు. యిలా చెప్పిభీష్ముడు ధర్మరాజు ప్రార్ధనమేరకు యిలాచెప్పడం ప్రారంభించాడు. "ధర్మనందనా! ప్రజాపరిపాలకుడు మొట్టమొదట గావింపవలసినపని ధర్మరక్షణ. యెందుకనగా" ధర్మోరక్షతి రక్షితః"

అనివేదం. మనం మనధర్మాన్ని రక్షించుకున్న అదిమనకు రక్షణకల్పిస్తుంది. పుష్పాలను విక్రయించేవాడు పూలచెట్టుకు యేమాత్రం హానికలుగకుండా యెలా పూవులను జాగ్రత్తగా యేరుతాడో అదే విధంగా పరిపాలకుడురాజు ప్రజలు బాధపడకుండా వారినుండి పన్నులు వసూలుచేయాలి. అది యెంతో ముఖ్యవిషయంగా భావించాలి.

ఒకరుచెప్పుడు మాటలను పాలకుడు వినినా, దానిని బాగాతర్కించాలి. ప్రజలలో యేఒక్కడైనా అక్రమసంపాదనగావిస్తే. ఆధనాన్ని తీసికొని రాజుప్రజాహితకార్యాలకు వినియోగించాలి. యెవరినైనా అతిగా నమ్మరాదు. అలాగని నమ్మకుండా ఉండకూడదు. జాగ్రత్తగా పరిపాలకుడు వేయికళ్లతోసునిశిత బుద్ధితో యెవరు విశ్వాసముకల వారో, లేని వారెవరో బాగా ముందు వెనుకలు ఆలోచనతో దగ్గరకు తీసికోవాలి. మనకు ధనావసరము కొరకు ప్రజలనుండి అదేపనిగా ధనాన్ని పన్నులుపేరుతో దోచుకొని ప్రజాభిమానానికి దూరంకాకూడదు. ప్రజలకష్టసుఖాలకైన రాజుకు ప్రజలు ధనమేకాదు ప్రాణాలనైనా సమర్పిస్తారు. వారిని యెంతజాగ్రత్తగా చూసుకున్న రాజు రాజ్యం అంతశాంతి ధర్మాలతో ముందుకు సాగుతుంది.



ధర్మనందనా! ప్రజాపాలకునకు కోపము ఉండరానిది. అసలుకోపంపాపానికి మూలము. కోపముగలవానికి తల్లీతండ్రీగురువూ, బిడ్డలూ, ఆప్తులూ – బంధువులూ – మిత్రులూ యెవరూకానరారు. అంతకన్నాదుర్మార్గంమరిలేదు అందువలన కోపాన్నితన అదుపులోనే ఉంచుకొనాలి. ముఖ్యమైనది సత్యము పలకడం, పరస్త్రీని తల్లిగా భావించాలి. మనస్సును శాంతితో పవిత్రంగా ఉంచాలి. శరీరారోగ్యాన్ని యెంతైనా జాగ్రత్తగా పరిరక్షించుకోవాలి. నాలుగు వర్ణాలవారినీ వారి వారి ధర్మాలను సక్రమముగా రాజు పరిరక్షిస్తూవారికి యేవిధమైనలోటు పాట్లు లేకుండా చూసుకుంటే వారందరూ పరిపాలకునకు అతిసన్నిహితులై ఆతనియోగక్షేమాలనే యెల్లవేళలాకోరుతుంటారు.

బ్రహ్మత్వంగలవాడే బ్రాహ్మణోత్తముడు బ్రహ్మచర్యవ్రతముతో వేదవేదాంగపాండిత్యాన్నల వర్చుకోవాలి. ఆతడు సత్యధర్మాలను తప్పకూడదు. తనదగ్గరకు వచ్చిన విద్యార్థులకు తప్పకుండా విద్యను విరివిగా దానంగావించాలి. యజ్ఞయాగాదిక్రతువులను మహారాజులచేత చేయించాలి. తానుకూడా చేయాలి.

యిక సుక్షత్రియుడు – యీతడుకూడా ముందుగావేదాధ్యయనము గావించాలి. యాగాదిక్రతువులను సక్రమముగా చేయాలి. సత్యధర్మాలతో ప్రజలను తనకన్న బిడ్డలకన్న మిన్నగా దక్షతతో పరిపాలించాలి. కవులను, పండితులను, వేదాధ్యయన సంపన్నులను, సంగీతాది సకలకళలనూ పోషించాలి. ప్రజలకు గల జార – చోరాదిబాధలు లేకుండాచూడాలి. తనదేశరక్షణలో పాలుపంచుకొని దేశరక్షణగావించాలి. విరోధులను అంతంచేసి తనప్రతిభాపాటవాలుచూపి ప్రజారక్షణే తనధ్యేయంగా ఉంటారో వారే రాజ్యపాలనకు అర్హులు. అట్టివారినే ప్రజలు పరిపాలకులుగా కోరుకుంటారు.



వైశ్యుడు – ముఖ్యంగా వైశ్యుడువేదాధ్యయనంగావించాలి. యజ్ఞయాగాలు నిర్వర్తింపచేయాలి. దానధర్మాలు యెక్కువగా ఆచరించి ప్రజాసంక్షేమాన్ని చూడాలి. ధనసంపాదనపై ముఖ్యమైన దృష్టిపెట్టాలి. పసు సంరక్షణ గావిస్తూ, వ్యాపారాన్ని అనగా దూరప్రాంతాలనున్న ప్రజావసరనిత్యంవాడు కొనేవాటిని తెచ్చి, సరసమైన ధరలకు విక్రయించి ప్రజలందరికీ దగ్గరవాలి. అట్టివారికి ప్రజలే బ్రహ్మరథం పడతారు. వైశ్యులనగా వాణిజ్యవేత్తలని అర్థము. వాణిజ్యములో ఆరితేరిన వారేవైశ్యులు.

నాల్గవజాతి శూద్రులు – వీరు పై మూడు వర్గాలవారికి అన్నిటా సహకార సంపత్తులందిస్తూ, వ్యవసాయాభివృద్ధికి దోహదంచేస్తూ, నిరంతరం ప్రజాభ్యున్నతికి, మహారాజుకు అన్నిటా బాసటగానిల్చిన వారి కార్యక్రమాల్లో ముందడుగువేస్తూ, ప్రజలకు సర్వరూపాల్లో సహకారం చెయ్యడం వీరిముఖ్యమైన వృద్ధి.

ధర్మజా! ప్రతిమనిషికీ తప్పని సరిగా తనజీవితములో నెరవేర్చి తీరవలసినవి నాలుగాశ్రమాలు. కొందరు యీనాలుగూ అనగా (1) బ్రహ్మచర్యం; (2) గృహస్థం; (3) వానప్రస్థం; (4) సన్యాసం; వీటిని ప్రత్యేకముగా బ్రహ్మచారులు కొందరు, గృహస్థులుకొందరు, వానప్రస్థులుగా కొందరు, సన్యాసులుగా కొందరు ఉండాలని అభిప్రాయం. ఆ యభిప్రాయం పొరపాటు. యీనాలుగాశ్రమాలు ప్రతిమనిషి జీవితములో వర్తింపబడాలి.

(1) బ్రహ్మచర్యం – మానవజీవిత భవనానికి యీబ్రహ్మచర్యం గొప్పపునాదులాంటిది. పైమూడు ఆశ్రమాలు మనిషికి దీనిపైనే ఆధారపడి ఉంటుంది. ప్రతిమనిషి యీబ్రహ్మచర్యాన్ని పాటిస్తూ విద్యాబుద్ధులు ఆర్జిస్తూ యిరువదిఐదు సంవత్సరాలు పూర్తిచేసుకొని తక్కినడెబ్బదిఐదు సంవత్సరాలకూ సరిపడ్డ శరీరదార్ఢ్యత మనోవికాసం, ఆత్మబలం, ప్రజ్ఞా – ప్రాభవవికాసం మొదలైనవి సంపాదించాలి. అన్నివిధాలా మనిషి మనీషిగా అవడానికి తగినకృషి అంతా యీబ్రహ్మచర్యవ్రతమందే నిర్మించుకోవాలి. "బ్రహ్మచర్యం" అనగా బ్రహ్మమునందు చరించుబుద్ధిగలిగిన వారని అర్థం; అంతేకాని వివాహంలేని వారందరూ బ్రహ్మచారులుకారు.

(2) గృహస్థం – యీగృహస్థం చాలా బాధ్యతలతో కూడుకున్నది. ఒకసామ్రాజ్యాన్ని పాలించడం కన్నా యీగృహరాజ్యాన్ని పాలించి నిర్వర్తించడం కష్టం. రాజు శాసనాన్ని గావించి చెయ్యిదులుపుకుంటాడు. అది యెంతవరకు ప్రజల పట్లపనిచేసిందనే మాట రాజుకు సామాన్యంగా ఉండదు. యికగృహరాజ్యమో! అనుక్షణం వేయకళ్లతో చూస్తూ, యేలోటు వచ్చినా, తగిన బాధ్యతతో దానిని సక్రమమార్గంలో నిర్వహిస్తూ, పూర్తిగా తనకు అనుకూలంగా ఉన్నట్లు మలచుకోవాలి. యేమాత్రం ప్రతికూలమైనా గృహరాజ్యంకుప్పకూలి పోతుంది. దీనిలో పూర్తిగా బాధ్యత భార్యది. ఆమె అన్నిటా తనసామర్థ్యంతో సహకారసంపత్తులందించి పురుషునికి బాసటగా నిలిస్తే తప్ప పురుషుడెంత గొప్పవాడైనా పనికిరాడు. అందుకే

ఆమెను "గృహలక్ష్మి" గా పెద్దలు కీర్తించారు. యీగృహస్థంలో పురుషునికి భార్య, సంతానము, ఆసంతానాన్ని సక్రమమార్గంలో పెంచడం, వారికి వివాహాదికార్యక్రమాలు, యిన్నిగావించిన గృహస్థు పూర్తిగా అలసిపోకతప్పదు. అలా అన్నివిధాలా సంసారరాజ్యాన్ని పాలించినతరువాత సంతానం సమర్థులై అందివస్తే ఆగృహస్థు అరువది సంవత్సరాలకు అదే "షష్ట్యబ్ధిమహోము"న హాయిగా ఉండగలుగుతాడు.

(3) వానప్రస్థం – యిది గృహస్థమంత బాధ్యతలతో ఉన్నదికాదు. సంతానము అన్నిట చక్కగా నిర్వహిస్తున్నప్పుడు, యీతడు పర్యవేక్షకుడుగానే ఉంటాడు. సమస్యలేవీ అంటవు.

యీ వానప్రస్థము యెనుబది సం॥ వరకు హాయిగా జరుగుతుంది. తనకు యేమీపనంటూ ఉండదు. బ్రహ్మచర్యమునుండీ విడువకుండా వస్తున్న ఆధ్యాత్మిక భావాలను యీ వానప్రస్థాశ్రమములో పూయించి, కాయించి, పండింపచేసికొనడం.

(4) సన్యాసం – యిది పూర్తిగా పురుషునికి అవసరం. "సన్యాసం" అనగా, కుటుంబాన్నంతావిడిచి, యేమఠాల్లోనో, దేవాలయాల్లోనో, సత్రాల్లోనో గడ్డాలు మీసాలు పెంచి, యేగృహస్థులనో తిండికి యాచించి, హీన – దీన జీవితం కానేకాదు. "సః–న్యాసః" అక్కడ అనగా భగవంతుని దగ్గర బుద్ధిని ఉంచడం. దానినే సన్యాసమన్నారు పెద్దలు. యిది యెనుబదినుండి వందసంవత్సరాల వరకూ మనిషి జీవిస్తే ఆతనినే పూర్ణపురుషుడన్నారు. యిలా యీనాలుగాశ్రమాలూ, ప్రతీమనిషికీ కావాలి. నాయనా! అని భీష్మలవారు ధర్మరాజుకు చెప్పాడు.

అన్నిటినీ విన్నధర్మరాజు "తాతా! అపారపారావారంగా ఉండే యీధర్మాల్లో మనిషి ఆచరించడానికి పనికి వచ్చేవాటిని నాకుచెప్పండి" అని అడిగాడు. దానికి గాంగేయుడు యిలాచెప్పేడు. కుమారా! ధర్మజా! విను. పుట్టిన ప్రతిజీవికి తనకు జన్మనిచ్చిన మాతృమూర్తి అత్యంతపూజ్యురాలు. ఆమెను బట్టి తండ్రివచ్చాడు. అందుకే "తల్లి నిజం, తండ్రికల్ల" అని అన్నాడు. తల్లి యీయననీతండ్రి – యీయననీ అన్న అనిచెప్పితే జీవితాంతం నమ్మవలసిందే తప్పవేరేగత్యంతరమేలేదు. అందుచేత మాతృమూర్తి ముందుపూజనీయురాలు; తరువాత పితృదేవుడు పూజనీయుడు. యిక గురువు. తల్లి దండ్రులు శరీరాన్ని యిచ్చారు. గురువు జీవితాన్నే వెలిగించే వెలిగించే విద్యను యిచ్చాడు. యీజీవితాన్నేకాకుండా రెండవజన్మనుకూడా వెలిగించేమహత్తరవిద్యను యిచ్చాడు. ఆవిద్యచెడనిది. ఒకవిధంగాచూస్తే తల్లిదండ్రులకున్నా గురువేమిన్ననిచెప్పాలి.

యిక తల్లీ తండ్రీ, గురువూ "గార్హపత్య – ఆహవనీయ – దక్షిణాగ్నులు యాగాల్లోగల త్రేతాగ్నులు వంటివారు. ఋగ్ – యజుర్ – సామములనే మూడువేదాల్లాంటివారు. త్రిమూర్తులవంటివారు. యీముగ్గురనూ హృదయపూర్వకముగా పూజించేవారు యిక్కడా – అక్కడా నిండుగా



మహదానందనందనవన విహారము చేయగలుగుతారు. కొన్ని సూక్ష్మధర్మాలున్నాయి. "సత్యంవద" సత్యమేపలుకు; అన్నారు. దానిని మించినది లేదన్నారు. సత్యాన్నిమించిన ధర్మంసృష్టిలోనేలేదు అంటారు. అంత వరకు బాగానేఉంది. కాని ఒకరి ధనమానప్రాణాలు పోయేటప్పుడు పాపులకు సత్యాన్నిచెప్పడం పుణ్యంకాదు. మహాపాపమౌతుంది. సర్వదేవులకు మేలుచేయునవన్నీ సత్యస్వరూపాలౌతాయి. జీవులకు బాధనుచేకూర్చేవన్నీ అసత్యాలే. పాపులకు ముక్తిఉందా? ఉంది. యెలాగ? యెన్నోపాపాలు చేసిన వారైనా మంచిమార్గంలోపడి, వర్ణాశ్రమాచారాలను అనుసరిస్తూ అంతటితో పాపాలకు ఫుల్‌స్టాపుపెట్టి మంచిమార్గంలో ప్రయాణించేవాడికి యింకపాపాలంటవు. అటువంటి వారు పుణ్యాత్ములే అవుతారు. ధర్మకార్యాలు చేస్తూ–నిత్యంవేదాధ్యయనంగావిస్తూ, తాను హృదయపూర్వకంగానమ్మిన దైవారాధనలో నుండి, సర్వజీవులూ పరబ్రహ్మస్వరూపులని భావిస్తూ అందరినీ ప్రేమిస్తూ, సంస్కారం పొంది భగవద్భక్తితో నున్నవారు పూర్వంచేసిన పాపాలన్నీనశించి, పుణ్యాత్ములౌతారు. వారు తప్పక నారాయణునకు దగ్గరౌతారు. యిక పరమధర్మస్వరూపాన్ని విను యితరులు మనకు యేపనిచేస్తే బాధకలుగుతుందో, అటువంటి పనిని మనము యితరులకు చేయకుండా ఉండడం మహాధర్మం. మనకు మహర్షులు వేదాలు – ఉపనిషత్తులు – ధర్మశాస్త్రాలు – శాస్త్రాలు యెన్నోవ్రాసి యిచ్చారు. అందరూ నడిచేమార్గంలో, పదిమందీ కూర్చున్న స్థలందగ్గర, యెటువంటి పరిస్థితుల్లో మలమూత్రవిసర్జన చేయకూడదు. బ్రహ్మముహూర్తాన అనగా సరిగా తెల్లవారు జామున లేచి నదిలో స్నానంగావించాలి. మూడు సంధ్యాకాలాల్లో సూర్యారాధనజరపాలి.

సుర్యోదయం, సూర్యాస్తమయ వేళల్లో నిద్రపోకూడదు. ప్రతిదినం తప్పకుండా దేవ, పితృ, భూత – మనుష్య – బ్రహ్మయజ్ఞాలాచరించాలి. అన్నగత ప్రాణులైన మానవులకు యెట్టిపరిస్థితులలోనూ అన్నాన్నినిరసించరాదు. తూర్పునసూర్యుని ఉదయాన్ని అస్తమించే సూర్యునికూడా దర్శించరాదు. తనకులమును. తాను చూడకూడదు. వస్త్రములేని స్త్రీని చూడకూడదు. భార్యతో కలయిక రహస్యంగా ఉండాలి. మాతృపూజ – పితృపూజ – గురుపూజ సకల భాగ్యాలనూ యిక్కడ సమకూర్చి, పరలోకమున కూడా ఆనందాన్నందిస్తాయి. తుదకు మోక్ష సామ్రాజ్యాన్ని పాలించేటట్లు చేస్తాయి.

గంగానందనుడైన భీష్ముడు "ధర్మజా! నీకు ముందుగల యెందరో ప్రజాపాలకులు తాపసులై అరణ్యాన ఉండాలని యోజించారు. కానీ అలాజరగలేదు. యిలా అనుకున్నవారేమీ సామాన్య ప్రజాపాలకులు మాత్రంకారు. వారందరూ కేవలం మహేంద్రసమానులు. మాంధాతా మొదలైనదివ్య పురుషులు సుమా!

మాంధాతవంటి మహీపతి లేనేలేడు. అంతటివాడు కూడా చాలా నీరసపడ్డాడు. ఆతడు శ్రీమన్నారాయణుని దర్శనానికి ఉవ్విళ్లూరసాగేడు. ఆతనిగూర్చి

తన శక్తినంతా ధారపోసి సర్వమూ ఆయనే అని ఆరాధింపసాగేడు. ఆతని దివ్యారాధనాతపోదీక్షకు సంతోషించిన అమరేంద్రుడు ఆతనిముందు ప్రత్యక్షమయ్యాడు;. మహారాజా! శ్రీమన్నారాయణుని దర్శనం అతి దుర్లభం. వాణీపతికి – నాకే సాధ్యంకాదు. అటు వంటప్పుడు నీకు మాత్రం సాధ్యమవుతుందనుకోను. అదివిడువు నీకేమికావాలో చెప్పు?" అన్నాడు మహేంద్రుడు. అప్పుడు మాంధాత ఆతనికి వందనలర్పించి చేతులు జోడించి "మహేంద్రా! నాకీరాజ్యపాలన వద్దు. యింటియింటికీవెళ్లి భిక్షమెత్తి జీవిస్తాను. లేదా! అరణ్యాన ఆకులూ, దుంపలూతిని హాయిగా శ్రీనారాయణుని ధ్యానములో శేషజీవితాన్నిగడుపుకుంటాను" అనగా; మహేంద్రుడు అందుకు అంగీకరింపక "మాంధాతమహీపాలా! సర్వజీవకోటిలో మానవజన్మ యెంతోగొప్పది. అందులో చక్రవర్తి పదం సామాన్యమా? మహోన్నతమైన మహారాజపదము అందరికీ లభిస్తుందా? యింతకన్నా గొప్పపదవిలభిస్తే యిది విడుచుట న్యాయం. అందువలన యీనీ రాచరికాన్ని మాత్రంవిడువ"కని చెప్పాడు.



ఆమహేంద్రుని వాక్కులాలించిన మాంధాత మహారాజు తనమనసు మార్చుకున్నాడుసుమా ధర్మజా! అన్నాడు భీష్ముడు – సమస్త శాస్త్రవేత్త అమరుడు, సర్వమూ అనుభవించిన భీష్మునివాక్కులు ధర్మరాజుకు బాగాపనిచేశాయి. ఆపెద్దవాని దివ్యవాక్కులు విని తనమనసు చాలావరకు శాంతివహించింది ధర్మరాజుకు. మనస్సుకుదుట పడ్డ ఆతడు దుఃఖాన్ని బాపుకున్నాడు. అప్పుడు భీష్ముల వారిని తనకు కలిగిన సందేహాలను తీర్చమన్నాడు. "తాతా! ప్రజాపాలకుడైన రాజు యెవరిని నమ్మాలో సెలవివ్వండి?" అనగా; "కుమారా! యెవరినీ నమ్మకూడదు. కానీ యెవరినీ నమ్మకుండా యెలా ఉండాలి? తనశక్తి సామర్ధ్యాలు, సునిశిత బుద్ధి మూలంగానే తెలిసికొని నమ్మవలసినవారిని నమ్మాలి.

పూర్వం క్షేమదర్శి అనే రాజు నమ్మినవారిని నట్టేటిలో ముంచేసేవారున్నారు అంటే నమ్మేవాడేకాడు. యికపోతే ఆతనికి ఆనేకబాధలతో తలబరువెక్కి ఉండేవాడు. యెందుకిలాతానుబాధలకుగురి ఆవుతున్నానో అనే ధ్యాస ఉన్నాదానికి కారణాన్ని కనుగోలేక పోయేవాడు. యిలా పడుతుండగా ఆతని తండ్రికి ఆప్తమిత్రుడు కాలకవృక్షీయుడనే ఆతడు తనమిత్రుడుకుమారుని సంతాపాన్ని తీర్చాలని అనుకున్నాడు. ఒకకాకిని తెచ్చి, దానిని పంజరంలో నుంచాడు "యిదికాకి జాతిలో పుట్టినా దీనిని కాకిగా చూడకండి. దీనిశక్తి అపారం త్రికాలాలూ, అనగా జరిగిపోయినవి, జరుగవలసినవి, జరుగుచున్న విషయాలన్నీ పూసలలో దారము కూర్చినట్లు చెప్తుతుంది. రాబోయే ప్రమాదాలను ముందుగానే తెలుపుతుంది. దొంగలూ – మోసగాళ్లను గూర్చికూడా బాగాతెలుపుతుంది" అని అందరికీ తెలిసేలాగ బాగాప్రచారంగావించాడు.



ఒకరోజు కాకి ఉన్నపంజరాన్ని తీసికొని రాజదర్బారుకు వెళ్లాడు. క్షేమదర్శితాను అనేక బాధలు పడుతున్నాడుకాబట్టి యిది నాబాధలుతీరుస్తుందని దానిని కొన్నాడు. యిక యీసంగతి రాజ్యములో గలవారందరికీ తెలిసింది. యిక మనరాజుకు గూఢచారుల అవసరం లేదు. ఆఒక్కకాకి ఉంటే అన్నిసంగతులూ అదేచెప్తుతుందని ప్రజలందరికీ బాగా ప్రచారమయింది. అనుకున్నారు. అమరునాడు చూస్తే ఆకాకి పంజరములో చనిపోయిఉంది. అయ్యోయీకాకి చనిపోయిందే! మనరాజ్యానికి సంబంధించే అనేక రహస్యవిషయాలు తెలిసేవి" అని బాధపడ్డాడు.

సరిగా కాకిని యిచ్చిన మహర్షి రాజుదగ్గరకు వచ్చాడు. "ఓరాజా! త్రికాలవేదియైన యీకాకిని చంపేరూ అనగా, వారు చేసిన, చేయవలసిన విషయాలన్నీ ముందుగా త్రికాలవేదికాకి నీకు చెప్తుతుందనే కదా వారుదానిని చంపేశారు. అయితే చుట్టూఉన్నవారే యీపనిచేశారు. అంచేతవారందరినీ నీవిప్పుడే దూరంచేసికో! లేకుంటే కాకిని చంపినట్లే నిన్నూ అంతమొందిస్తారు. యిప్పుడెనిన్ను వంచింపదలచిన వారున్నారా? లేరా? అనే సందేహంలేకుండా ఉండును. అంతేకాదు మనమిద్దరం తగవులాడు కున్నట్లే ఉందాం. యీవిషయం యెవరికీ తెలియనివ్వకు. అని చెప్పివెళ్లాడు. తరువాత రాజు తనకు ద్రోహంగావించేవారిని పట్టుకొని శిక్షించాడు. అప్పుడు ఆరాజుహాయిగా రాజ్యపాలనగావించాడు" యుధిష్ఠిరా! విన్నావుకదా! ప్రజాపాలకుడైనరాజు యెవరినీ గాఢంగానమ్మకూడదు. కొంచంవివేకంతో మెలగాలి. యెవరు తనకైనవారో! యెవరు మంచిగానటిస్తూ తనకుద్రోహం చేస్తున్నారో బాగా తెలివిగా యెరిగి ప్రవర్తించుకోవాలి. యీకథవిను.

ఒకప్పుడు ఒకనక్కతనకు గల పూర్వజన్మశక్తితో మెలగడంప్రారంభించింది. అది మాంసాహారాన్ని మానేసింది. నక్కలకు గల గుణాలన్నీవీడి మెలగడం ప్రారంభించింది. ఫలాలనే ఆహారంగా తీసికొనేది. యిలా సాధు జీవితంచేస్తుండేది. దానిని చూసిన తనజాతినక్కలన్నీ గుమిగూడి వచ్చి "ఓయీ మిత్రా! నీవూ మాజాతిలోనే పుట్టావు. కానీమాజాతిగుణాల్లో యే ఒక్కటీ నీకు అబ్బలేదు. యిలా ఉంటే నిన్ను మాజాతి దానిగా మేమెలాచెప్తుకుంటాం. యిప్పుడైనా మించిపోలేదు. నీవుమారిపో!. లేదా! నిన్ను మాజాతిలోంచి వెలివేస్తాం. జాగ్రత్త" అని దండించాయి. అయినా ఆనక్కవాటిమాటలను యేమాత్రం పాటింపలేదు. పూర్వంవలెనే సంచరింపసాగింది. యిలాకొన్నాళ్లు జరుగగా! ఆ నక్కను నాకు పెద్ద పులి మిత్రునిగా ఉండండనికోరింది. నక్క ఒప్పుకుంది.

అప్పుడు పెద్దపులియిలా చెప్పింది. " ఓనక్కమిత్రా నాతో నీవు స్నేహంగా ఉంటే నీకూ, నాకూ ముందెంతో ఫలితముంటుంద"దని చెప్పగా, నక్కలేచి "పులిమిత్రా! నాపైని పయివారలు నిందలువేస్తారు. అవన్నీనీవునమ్మకూడదు. అలా అయితేనే నీతోమిత్రునిగా వుంటాను" అంది. దానికి పెద్దపులి సంతోషించి ఒప్పుకుంది. ఆనక్కను తీసుకొని తన గుహకు వెళ్లింది. కాని అక్కడ కొందరు

పులిస్నేహితులున్నారు. వాటికి మాత్రం యీసాధువైన నక్కగుణాలు యేవీనచ్చలేదు. అంతేకాదు పులి యొక్క క్రూరగుణాలన్నిటినీ నక్కమార్చివేసింది. అదితినే తిండినీ మార్చివేసింది. యిలా కొంతకాలం పులీనక్కాయెంతో మిత్రతతో మెలగాయి. ఒకనాడు పులి ఉన్నగుహలో ఆహారానికి తెచ్చిఉంచిన మాంసముకానరాలేదు. యీవిషయాన్ని తెలిసిపులి బాగా కోపముతో'' నేను తినడానికి తెచ్చినమాంసాన్ని యెవరుయేమిచేశారో! మీరందరూ జాగ్రత్తగా పట్టుకొమ్మని శాసించింది.

ఆలా యెప్పుడు యీనక్కపోతుందో! మనకు పీడవిరుగుడౌతుందో! పెద్దపులితో హాయిగా మాంసాహారంచేయుదుమో అని అవకాశానికై యెదురు చూస్తున్నపులిమిత్ర అనుచరులకు మంచి అదనుదొరికి "పులిరాజా! నీగుహలోనికి వచ్చి, నీవుతిన వలసిన మాంసాహారాన్ని మాయంచేయగల శక్తి యెవరికుంటుంది? నీవుకోరియెంచితెచ్చుకున్న నక్కమిత్రుడే యిలాచేశాడు'' అందరూ యేకగ్రీవంగాచెప్పారు. అవన్నీవికటముగానవ్వి, "పులిరాజా! నీవు నిజముగా అమాయకుడవే! లేకపోతే, యెప్పుడూ యెక్కడమాంసం యెముకలూ దొరుకునో అని యెదురుచూసే జిత్తులమారినక్కలు సాధువులాగనటిస్తే సాధువనినమ్మేశావు. యెంతటి అమాయకుడవో!" అని మరీయెగతాళీగావించారు. పులి నిజమనుకొని సాధువైన ఆనక్కను చంపబోగా, హఠాత్తుగా ఆపులితల్లివచ్చి "అమ్మా! నీమాటలువేదాలు. నీవురాకుంటే యీసాధుమిత్రుని యీసరికే చంపి ఉండేవాడిని" అనియెంతో బాధపడిందాపులి. నక్కను వెదుకగా నక్కకానరాలేదు. తరువాత! "పులిరాజా! నీహృదయం మంచిదే! కాని నీచుట్టూ ఉన్న వారందరూ నీవంటి వారుకారు. అందువలన నీకూ నాకూ స్నేహంకుదరదు" అని ఆసాధునక్క పులిని విడిచి వెళ్లిపోయింది.

"కావున ధర్మరాజా! యెంతో ముందువెనుకల చూపులతో అతివిచక్షణతో రాజు ఉండాలి. శత్రువులు మిత్రులుగానటిస్తూ, అవకాశందొరికితే కాటువేస్తారు. దాన్నిరాజు తెలిసికొనాలి. యిక మంచివారు మంచిమిత్రులూ, నీమేలుకోరే వారెప్పుడూ నిన్ను స్తోత్రపాఠాలతో ఉబ్బించరు. వారు నీయందున్న పొరపాట్లను యెత్తిచూపి, వాటిని సరిదిద్దుకొమ్మంటారు. వారేనీమంచి మిత్రులని నమ్ము" అన్నాడు భీష్ముడు.

"ధర్మరాజా! యిదివిను ఒకలొట్టిపిట్ట మహారణ్యాన వాణీపతిని గూర్చి ఘోరతపస్సుచేసింది. బ్రహ్మప్రత్యక్షమైతే వాణీపతీ! నామెడ నూరుయోజనాలున్నట్లు వరమిమ్మనగా యిచ్చాడు. ఆవరముతో దానికి గర్వంవచ్చింది. అలా ఉండగా దానిమెడ పొడవు యెక్కువైనందున యెంతో బరువైంది. అయినా నాకు ఒకరిసహాయం అక్కరలేదనుకుంది. యింతలో పెనుతుఫాను రాగాఒంటె ఒక కొండగుహలో ఆపెద్ద మెడ ఉంచగా దానిని ఆకలితో నుండే రెండు నక్కలువచ్చికొరికి పీకిదానిరక్తమాంసాలను తినగా అది కడకుచచ్చింది. కోరరాని కోరిక – అహంకారమున్న వారలాగే అవుతా"రన్నారు భీష్ముడు.



ఒకప్పుడు ఒకమహర్షి అరణ్యాన తపస్సుచేయగా ఒకకుక్కకూడ ఆతనితో ఉండేది. ఒకసారి పులివచ్చి దాన్ని వెంటాడగా మహార్షిని ఆకుక్క శరణం వేడగాదాన్ని మహార్షి పెద్దపులిని చేశాడు. ఆవచ్చిన పులిని యీకుక్క తరిమికొట్టింది. యిలా అడవిలో యే జంతువు వస్తే మహర్షి యీకుక్కను ఆరూపుతో దాన్ని తరిమికొట్టించేవాడు. యిలా ఉండగా శరభము మహాభయంకరముగారాగా, యీ కుక్కను శరభంగాచేయగా, యిదిదాన్ని పారద్రోలివచ్చి యీమహార్షి యెంతకైనాతగినవాడే! నేను కుక్కను భయపెడితే ఆవలకుక్కను శరభంగాచేసి నన్నుచంపించవచ్చు. అందువలననేనీ శరభంరూపుతో మహర్షిని చంపేస్తే నాకు అడ్డుతొలగుతుందని ఆలోచింపగా మహర్షితపోశక్తితో దాని మనస్సు తెలిసికొని మరలకుక్కగా మార్చి ఆశ్రమము నుండి దూరంచేశాడు. అందువలన దుష్టులకు మాత్రం ఆశ్రయమీయకూడ" దన్నాడు భీష్ముడు.

అడవిలో ఒకకిరాతకుడుండేవాడు. వాడచ్చట పక్షులనుచంపి ఆమాంసముతో జీవించేవాడు. ఒకనాడు యేపక్షులూ దొరకలేదు. సరికదా! తుపానువచ్చింది. దానిలోవాడు తడిసిముద్దైపోయాడు. వాడికక్కడ ఒకపావురం కనుపింపగా దాన్ని పట్టుకొని తనసంచిలో పెట్టుకొని చలికి వణికిపోతూ ఒకదట్టమైన చెట్టుదగ్గరకు వచ్చాడు. అక్కడ మగపావురముంది. ఆరెండూ మాటలాడుకొని యీబోయ మన అతిథి. యీతనిని మనంరక్షించాలని మగపావురం కుమ్మరియింటి దగ్గర ఎండుకట్టెలు తెచ్చి వెలిగింప యీకటికివాడు చలికాచుకొని "ఆకలి" అనగా మగపావురం ఆమంటల్లోపడగా, వాడు దానిని కాల్చుకొనితినగా. ఆడపక్షిభర్తలేనినాకిక బ్రతుకెందుకని ఆదీఅగ్నిలో పడిచనిపోయింది. యింతలో ఒకవిమానం వచ్చి ఆపావురదంపతిని తీసికొనివెళ్లారు" ధర్మరాజా! అన్నాడు భీష్ముడు.

ఒక అరణ్యములో వృక్షము తొఱ్ఱలో ఒక యెలుకుంది. చెట్టుపై రోమసుడను పిల్లి ఉంది. ఒకబోయ రోజూవలపన్ని అందులో పడ్డవాటిని తీసుకొని పోయేవాడు. యిలా ఉండగా వృక్షముపై నున్నపిల్లి ఆహారానికి చెట్టుదిగి ఆవలలో పడింది. ఒకగుడ్లగూబ – ముంగిస ఎలుకను తినడానికి వచ్చాయి. పిల్లి దగ్గరకు వెళ్లినేస్తం గుడ్లగూబ – ముంగిస నన్ను తినాలనుకుంటున్నాయి. నిన్ను చూసి ఆరెండూ భయపడతాయి. అనగా పిల్లి ఒడిలో ఎలుక కూర్చుండడం చూసి గుడ్లగూబ – ముంగిస రెండూ పారిపోయాయి. అప్పుడు పిల్లి ఎలుకనేస్తం యీ వల కొరికెస్తే నేను బయట పడతానని అనగా, మిత్రమా! బోయవాడు వస్తుంటే తప్పకనిన్ను వలలో నుంచి తప్పిస్తానని ఎలుక అంది. యిలా ఆరెండూ ఆన్యోన్యంగా ఉన్నాయి బోయవస్తూన్నాడు. వాడిని చూసి ఎలుక వలకొరుకగా పిల్లి చెట్టు మీదకు పోగా, ఎలుకతనకన్నంలోనికి వెళ్లింది ధర్మరాజా!" అన్నాడు భీష్ముడు అలా మిత్రులనూ, విరోధులనూ గమనించాలన్నాడు.

యమసుతా! యెంతగొప్పవాడైనా గర్వముతో విఱ్ఱవీగరాదు. ఆగర్వము వానినే నాశనంగావిస్తుంది. హిమాలయపర్వతాల్లో పెద్ద బూరుగు వృక్షం ఉండి విస్తారమైన కొమ్మలు కలిగి అనేక పక్షులకు నిలయంగా దారిని పోయేబాట సార్లకు నీడనిస్తుంది. ఒకనాడు నారదమహర్షి ఆదారిని పోతూ "ఓమహావృక్షమా బాగున్నావా?" అని పలకరించాడు. ఆహా నీ నీడ – నీశాఖలు యెంతమందికి రక్షణనిస్తున్నాయో! సరేగాని యెన్నోవృక్షాలను కూకటివ్రేళ్లతో కూలదోసే వాయుదేవుడు. నిన్నే మిాచేయలేదే "మని అడిగాడు." మునీంద్రా! వాయువా? నాబలముదగ్గర ఆయనెంత? నాశాఖలు చూడండి? నాపరిమాణంచూడండి? అకాశాన్నంటు నాచివురుపొడుగును చూడండి? వాయువుకు రూపులేదు. అటువంటి వాడు నాపేరును స్మరించడానికైనా పనికి వస్తాడా?

నారదమహార్షి నవ్వాడు "సరేలే! నీ ఆత్మవిశ్వాసంనీది. కాదనరాదుకదా!" అన్నాడు. జగడాలుపెట్టి చూస్తాడు నారదుడు. వాయుదేవుని దగ్గరకెళ్లి "వాయుదేవా! బూరుగుచెట్టు నీపైని కత్తి కట్టిందయ్యా?" అనగా! వాయువుదాని మాటలాలించగా వెళ్లాడు. దానిమాట లాలించి "ఓశాల్మలీ! నీబలమేదో చూస్తాను" అని వెళ్లగా, యీబూరుగు చెట్టుకు మహాభయం పట్టుకుంది. తనకొమ్మలూ, ఆకులూ, అన్నీరాల్చుకొని, విరుచుకొని మ్రోడయింది. దానిగర్వం అలా అడిగిం" దని ధర్మరాజుకు భీష్ముడు చెప్పాడు.

పాండుపుత్రాగ్రజా! సర్వజీవరాసులందు సమానత్వం పొందడం. హృదయాన్ని సత్కార్యాలకే ప్రేరేపించడం. యెన్నికష్టములు వచ్చినా భరించగలిగే క్షమాగుణం, పెరవారి సంపద – సామర్థ్యం ఓర్వలేనితనం, దయా, దాన సత్యాలను పెంపుచేసు కోవడం, ప్రశాంతిని కావాలన్నవారు యివన్నీకలిగి ఉండాలి. త్యాగం సుఖజీవనమిస్తుంది. భోగం రోగాన్నిస్తుంది. సత్యం పలకడము అత్యంతావసరం. దాని వల్లయెన్నో సుఖాలున్నాయి. సత్యం స్వర్గభోగాలను సమకూర్చును. సత్యమేనిత్యమైనది. సత్యము వలన మనిషికి కొన్ని యిబ్బందులున్నా దానిని విడువకుండా ఉన్న ఉన్నతస్థానం ప్రాప్తిస్తుంది.

యిలాభీష్ముడు చెప్పినవన్నీ చక్కగా వింటున్నాడు. "ధర్మరాజా! నీకు మహేంద్రు ప్లహ్లాదుల సంవాదం చెప్పుతానువిను. సామాన్యంగా దేవతలూ – రాక్షసులూ ఒకతండ్రికే జన్మించినా, వారి వారి బుద్ధుల్లో తేడాలున్నాయి. దేవతలే సాత్వికులు, రక్కసులు క్రూరస్వభావులు, ఆరాక్షసజాతిలో పుట్టిన ప్రహ్లాదునికీ రాక్షసులకూ జరుగుయుద్ధములో ఓడిపోయాడు ప్రహ్లాదుడు. అయినా ఆతడేమిా బాధపడకుండా హరినామాన్నే స్మరిస్తూ ఉండగా ఆతని దగ్గరకు మహేంద్రుడు వచ్చాడు. "ప్రహ్లాదరాజా! నీవు నీవారిచేతిలో ఓడిపోయావు. అయినా ఆబాధనీకు లేనట్లున్నావు.

యింత అవమానం జరిగినా నీవు దాన్ని అణుమాత్రమైనా పట్టనట్లున్నావు" అనగా! మహేంద్రా! కష్టాసుఖాలూ, కలిమిాలేములూ యివి లోకాన ఉన్నాయి.



గాని మనచేతుల్లో భావింపరాదు. అయినా దీనికి కొంచంప్రయత్నించడం అవసరమే! మనంగావించే ప్రయత్నమే మనకు విజయంచేకూరుస్తుందనీ, మనమే గొప్పవారమనీ యెప్పుడూ అనుకోరాదని తెలియాలి. మనజీవితాలు యెప్పటికి యెలాజరగాలో ఆవాణీపతి ముందుగానే నిర్ణయంచేస్తాడు. మానవులు సామాన్యంగా చంచలమానసులు. వారి ఊహలు స్థిరంగాఉండవు. అందుచేత జ్ఞానియైనవాడు. యిదంతాభ్రమగానే భావిస్తూదైవంపైనే సంపూర్ణముగా ఆధారపడతాడు. ఒకవేళతానే కర్తయితే, ఆతడు గావిస్తున్న కొన్నికార్యాలు సక్రమముగా జరగవు. సర్వేశ్వరుడే సర్వానికీ ఆధారమని తెలిస్తే ఆతని మనస్సు శాంతిగా ఉంటుంది.

దైవకటాక్షంచేత మనముగావించుకార్యము విజయమందితే అదంతా నాగొప్పతనమే అని అహంకరించడము యెప్పుడూపనికిరాదు. అందువలన సుఖదుఃఖాలు ద్వంద్వాలకు చిక్కకుండా అంతా దైవలీలగా భావించే వానికి హృదయం ప్రశాంతిగా ఉంటుంది. నేను యీ సంసారబంధాలన్నీ విడిచి యేదివచ్చినా, ఆ శ్రీహరిలీలగా భావిస్తూ ఉన్నాను" అలా అన్న ప్రహ్లాదుని మహేంద్రుడు వేయినోళ్లతో ప్రశంసించి వెళ్లిపోయాడు. ధర్మజా! అంతటినీ నడిపినవాడు పరాత్ముడని నమ్ము, అని ముగించాడు భీష్ముడు.

తరువాత ధర్మరాజు "తాతా! యెవని నామస్మరణగావిస్తే మానవులు మోక్షానికి వెళతారు? యేకర్మవలన మనకు పాపమంటకుండా ఉంటుంది?" అనగా! "నాయనా! ఒకప్పుడు నారదమహర్షి నాకు చెప్పినదానినే నీకు చెప్పుతానువిను. శ్రీమన్నారాయణుని వైకుంఠంలో నారదుడు దర్శించి, "నారాయణా! మోక్షంకావాలన్నవారు యేమహామంత్రం మూలాన నిన్నుకొలవాలో నాకు చెప్ప"మని కోరాడు "సురమునీంద్రా! ఉత్తమ భక్తి, పవిత్రహృదయం, అత్యంత శ్రద్ధ, పరిశుభ్రమైన మనస్సుకలవారే నాకాప్తులు. వారినేనేను యెక్కువగా ప్రేమిస్తాను. అంతేవారింట బంటునై ఉంటాను. యిక వారెవరంటావా? మూడుకాలాల్లో నన్నేధ్యానించేవారు. వారి పవిత్రహృదయమే నానివాసం. యిక మంత్రమంటావా? "ఓంనమోనారాయణాయ" యిదే నామంత్రం. దీనిని సర్వకాలసర్వావస్థల్లో జపించేవారే నావారు. (యిక్కడ తప్పక విష్ణుసహస్రనామం పారాయణ చేయాలి) పై మహామంత్రం గురుముఖతా ఉపదేశింపబడితేనే గొప్పఫలితాన్ననుగ్రహిస్తుంది" అన్నాడు భీష్ముడు.

ఇక యింద్ర బలిచక్రవర్తుల సంవాదాన్ని చెప్పుతానువిను. మహేంద్రునికి బలికి యుద్ధముారాగా, అందుబలిఓడిపోయాడు. ఆతనిసంపదంతా యింద్రునిపాలయింది. బ్రహ్మను అమరనాథుడు దర్శించి "వాణీనాథా! మహత్తరసంపదలతో తులతూగే బలి యెక్కడ జాడలేకుండా పోయాడు" అనగా అమరేంద్రా! బలియెక్కడున్నాడో నీకు చెప్పుతాను. ఆతనిని చంపనని ప్రతినచెయ్యమని" బ్రహ్మఅన్నాడు. యింద్రుడలా వెళ్లి బ్రహ్మచెప్పినట్లు

గాడిదలున్నచోట "బలీంద్రా! మునుపునీవు సర్వసంపదలతో తులతూగేవాడవు. యిప్పుడిలా ఉన్నావు. యిప్పుడవన్నీ యేమైనట్టు? గాడిదగాఉన్నావు. యెన్నియాగాలు, యోగాలు చేశావో! లెక్క లేకుండా షోడశదానాలు గావించావు. అదంతాపోయి యీరూపములో నున్న నీకు నీపూర్వస్థితి గుర్తుకువచ్చి నీకు బాధగాలేదా?" అన్నాడింద్రుడు. "సురేంద్రా! నామహత్తరసంపద బాహ్యానికి బడాయిగా నీలాగ కానరాదు. అప్పటికన్నా యిప్పుడే నాసంపద యెక్కువగా ఉంది. నాకిప్పుడేమీ లోటులేదు. నీగూర్చి నేనెంతో విచారిస్తున్నాను. పోనీ, నీచూపుకు నేను చాలాచిన్నవాడిగా కానవస్తున్నాను. అటువంటినన్ను యిలా అనడం నీయంతటి వానికి తగునా?" వెళ్లుఅనగా; యింద్రుడు అదివినకుండా యేదో అనబోగా "ఇంద్రా! యీ సర్వసంపదలూ శాశ్వతాలు కావు;. యీ జీవరాసులన్నీ జన్మించి, నాశనమై, మరలపుట్టి, మరల నాశనమౌతాయి. అందువలన జ్ఞానులు వీటిని గూర్చి యేమీ బాధపడరు.

నేను సర్వసామ్రాజ్యాన్నీ పాలించేటప్పుడు, యిప్పుడూ ఒక్కలాగే ఉన్నాను. నాకేలోటూలేదు. నాహృదయం సుఖదుఃఖాలనూ, కలిమీ బలిమీలేముల్నీ యేమీ పట్టించుకోదు. ద్వంద్వాతీతుడనైయున్నాను. యింతకముందు కన్నాయిప్పుడేనేను హాయిగా ఉన్నాను. యికనీవు పెద్దస్థితిలో ఉన్నావు. దీనిని నీవు తెచ్చుకొన్నది మాత్రంకాదు. దైవకటాక్షముతో వచ్చిందంతే అని నీకిప్పుడు తెలియక పోవచ్చు. యిది తెలియని నీవెలా మూడులోకాలనూ పాలిస్తున్నావు? యిదంతానాదని గుండెపై చేయివేసుకొని చెప్పగలవా? అహంకారంతో వచ్చి నన్నవమానించాలను కున్నావేగాని. నీవు యింతటి వాడివే? అనవసరంగా, గర్వంగా యెదుటవారిని తేలిగ్గాచూడ్డం మంచిదికాదనే యింగిత జ్ఞానం నీకేలదైవమనుగ్రహింపలేదని విచారిస్తున్నాను.

మరొకటివిను. నీవుకాదు యెవరువచ్చినన్నెంత చిన్నచూపుచూసినా వారిపై అనుగ్రహమేగాని. ఆగ్రహంరాదు. కారణం. సమానమైన చిత్తంతో ఉన్నానుకనుక. యిలా వారిరువురూ మాట్లాడు చున్నసమయాన బలీంద్రుని హృదయమునుండి ఒకబంగారు రంగుతో ఒకత్రిలోకసుందరి వచ్చింది. యింద్రుడు "బలీంద్రా! యెవరీమె? "ఆమెనే అడగవయ్యా? అన్నాడు. యింద్రుడడగ్గా" నేను శ్రీని – విభూతిని; అమరేంద్రా! నన్నెవరూ యెరుగరూ, తెలిసికొనలేరు. యిప్పుడు అశ్వమేధాది యాగాలెన్నో అవన్నీమానేశాడు. యిప్పుడు నీదగ్గరకు వచ్చేస్తున్నాను. నీవు శాస్త్రకర్మలు యధావిధిగా జరిపిస్తావుకదా? నీవు అతిజాగ్రత్తగా ఉండాలి?" శ్రీమహాలక్ష్మియింద్రుని దగ్గరకు వచ్చింది. అప్పుడు బలి "యింద్రా! యీమెనీదగ్గరుండాలన్న చాలాజాగ్రత్తగా ఉండు. శీతకాలములో సూర్యుడు చల్లగా ఉంటాడు. గ్రీష్మఋతువులో ఉంటాడా? ఓయీ! యిల్లలుకగానే పండగవస్తుందా? నీకూ యీసంపదశాశ్వతం మాత్రంకాదన్నాడు బలి; అయితే యీసర్వసంపదలూ నీకుకాదు యెవరికీ నిత్యంకావు.



భగవానుడు నాపై ప్రసరిస్తే నేనూ సర్వసర్వంసహా పరిపాలిస్తాను. నీవు అహంకారంతోనూ విఱ్ఱవీగకు. అట్టువేసినవారు. దానిని తిరగవేయరా! యింతమాత్రానికే నీవు నన్ను యెగతాళిచేయాలా? నీపదవిని నిల్పుకోడానికి గట్టిప్రయత్నంచెయ్యి; అంతేగాని పరులను నిందించి గోతిలోపడకు" అన్నాడు.

ఇంద్రబలిచక్రవర్తుల సంవాదాన్నివిన్న ధర్మరాజు "తాతా! మనిషి వాని పూర్వజన్మకర్మతో అనేక కష్టనష్టాలకు లోనౌతారు. అటువంటప్పుడు ఆతడు యేమిచేయాలి?" అనగా భీష్ముడు "పాండనాగ్రజా! దేనికైనా సాహసంతో కూడినధైర్యమే మానవునకు సర్వమూ చేకూరుస్తుంది. యెన్నిబాధలువచ్చినా ధైర్యంకలవానికి అవి యేవీయేమీ చేయలేవు. యీతవచ్చినవానికి లోతేమి చేస్తుంది? అందువలన మేరు పర్వతంపై బడినా ధైర్యంకలవానికి అదియేమీ చేయలేదు. ధైర్యమే సమస్త భాగ్యాలనూ, ఆరోగ్యాలాదిగాగల మనిషికి కావలసినవన్నీ యిస్తుంది?

ఒకప్పుడు దేవతలకూ, రాక్షసులకూ యుద్ధంసంప్రాప్తించింది. శ్రీహరిసహాయంతో దేవతలు గెలిచారు. రాక్షసచక్రవర్తి బలీంద్రుడు ఓడిపోయి సాగరం దగ్గర గుహలో తలదాచుకుంటుండగా అక్కడకు యింద్రుడు వచ్చాడు" బలిహాయిగా అక్కడ ఉన్నాడు. అదిచూసి మహేంద్రుడు "రాక్షసరాజా! అంతఐశ్వర్యాలలో మునిగితేలిన నీవు, యిక్కడ యిలా హీనమైన జీవితం యెలాచేయగలుగుతున్నావు?" అని అడిగాడు. అప్పుడా బలి చక్రవర్తి "ఇంద్రా! నీవింత ఐశ్వర్యంతో కులుకుతున్నావు. యిదంతానీదా? యెటువంటి వారినైనా కాలం మారుస్తుంది. నీవొకప్పుడు అమరావతిని విడిచి పారిపోలేదూ? అప్పుడు నీశక్తి యేమయింది? అంతాపరాత్పరుని చేతిలో ఉంది. ఆతడెట్లాడిస్తే మనమందరంతిరగవలసిందే! సుఖదుఃఖాలు, లాభనష్టాలు మానవులకు సమానమే. వాటిని గూర్చి పట్టించుకొనగూడదు.

కలిమి కలిగినప్పుడు చుట్టాలూ, స్నేహితులూ, బంధువులూ, అందరూ వస్తారు. ఆకలిమి కాస్తతొలగి పోతే అందరూ తొలగిపోతారు. అందువలన యిప్పుడున్నదే నిజముకాదు. నేనూ ఒకప్పుడూ అమరావతీ నగరంలో చింతామణీ పీఠంపై ఉన్నాను. తరువాత కాలం యిలాచేసింది. నీవెప్పుడూ యిలాగే ఉండగలనని చెప్పగలవా? యిప్పుడు కాలము నాకు అనుకూలించదు. నీవు యింతైశ్వర్యంతో ఉన్నావని నీపైనాకు అణుమాత్రమైనా ద్వేషంలేదు. నాకలాగే ఉంటే, నీవీస్థితిలో వుండేవాడివికావు. నిన్నంతం గావించేవాడిని. యింద్రా! సర్వజీవులూ, భగవంతుని చేతసృష్టింపబడేవేకదా! అలాంటప్పుడు వారిలో వారికి విరోధభావాలెందుకుండాలి? యింద్రులెందరో పోయారు. బ్రహ్మలెందరో మారారు. మన్వంతరాలు గడిచాయి. అంచేత కాలం కలిసిరాక మారాక్షసులమందరం యిలా బ్రతుకుతున్నాం" అనగా!

"బలీంద్రా! యేమినీ ఆత్మ శక్తి? యేమినీధైర్యం? యేమినీవిజ్ఞాన మహాశక్తి? నీకిన్ని రావడానికి మార్గం చెప్పుతావా?" అనగా! యింద్రుడు వేసినప్రశ్నలకు

బలిచక్రవర్తి చిరునవ్వునవ్వి, మహేంద్రా! ఒకరు చెప్పినంత మాత్రాన మార్పువస్తుందా? అంతాకాలమే చేస్తుంది. కాలానికి యెదురుతిరిగినవాడెవడూ లేడు. అదినీవెప్పుడూ మరిచిపోకు. ధైర్యంకలమనస్సున్నవానికి కాలమే అన్నీసమకూరుస్తుంది. నానావిషయాదులకు చిక్కక, దయాధర్మదాక్షిణ్యాది గుణాలతో ధైర్యముతో ఉన్న తప్పక కాలం వారికి రక్షణకల్పిస్తుంది. అరిషడ్వర్గాలకు చిక్కక, అహంకార, లో భాదులను రానీయక అహర్నిశలూ ప్రశాంతి జీవనముగావింపగా అటువంటి వారికి కాలము సహాయముకావిస్తుంది. వారే చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయబడతారు.

మరొకటి, మనకళ్లముందు యెందరో చనిపోతుంటారు. ఆదృశ్యాన్ని చూసిజాలితో అయ్యయ్యో! అని సానుభూతి చూపిస్తాము. కానిమనమలాగే అయిపోతామని అనుకోము. అదే పామరత్వం అందరుచనిపోతే మనముట్టిగట్టుకొని ఊగగలమా? ప్రపంచాన్ని మనజ్ఞానంతో జాగ్రత్తగా పరిశీలిస్తే, అన్నీమనకే తెలుస్తాయి. వాటిగురించి, మనంవెతకక్కరలేదు. దానిమూలంగా, శాంతీ, దాంతీ, ధైర్యం అన్నీచిక్కుతాయి. అంతేగాని యీ ఉత్తమగుణాలు అంగడిలో కొనుక్కోవడానికి దొరికేవికావు. నీమంచి ప్రవర్తన వలననే నీకింతటి సంపద ఔన్నత్యం సంప్రాప్తించింది. నీ ఆచరణలాగే అందరూ ఉంటే చాలును. దైవానుగ్రహానికి పాత్రులు, "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అనుమంత్రాన్ని పఠించాలి. హృదయంలో దానివిధానంగానడుచుకోవాలి. అలాగున్నప్పుడే సుఖశాంతులు లభిస్తాయి.

ఇంద్రా! నీపూర్వపు వికారాలకు నీవు స్వస్తి చెప్పినట్లుగా ఉన్నావు. అలా ఉంటే పూర్వము కన్నా అభ్యుదయాన్ని సాధిస్తావు. ముందు ధైర్యం కావాలి. నీవు అపూర్వంగా మారుట నాకెంతో ఆనందాన్నిచ్చిం"దని బలిచక్రవర్తి చెప్పగా" దేవేంద్రుండెంతో ఆనందంతో దేవలోకానికి చేరుకున్నాడు ధర్మరాజా!" అని భీష్ముడుచెప్పాడు.

"తాతా! సమస్త శాస్త్రాలూ చదివిన వానికే ముక్తిగాని, తక్కిన వారికి లభింపదా?" అన్నాడు ధర్మరాజు; దానికి భీష్ముడు ధర్మరాజువైపు చూసి "నాయనా! అందరూ శాస్త్రాధ్యయనంచేయలేరు. శాస్త్రంతెలియనివారే యెక్కువగా ఉన్నారు. యెంతచదివినా, కొందరికి మంచిపనులు చేయడం అలవాటుండదు. ముందుగా అనగా, దేవునికన్నాపూజింపతగిన వారు తల్లీతండ్రి. యీయిద్దరూ మనిషికి శరీరాన్ని యిచ్చేవారు. అందుకే "మాతృదేవో భవా! పితృదేవో భవా!" అన్నారు పెద్దలు అటువంటి తల్లిదండ్రులను పూజించి వారిదివ్యాశీస్సులు ముందు పొందాలి. ఆతరువాత మూడవవారు గురువు. ఒకవిధంగా చెప్పాలంటే తల్లి దండ్రులకన్నా ముందుగా పూజనీయులు. తల్లిదండ్రులు శరీరాన్నే యిచ్చారు. గురుదేవుడు మనజీవితాన్ని తీర్చిదిద్ది అజ్ఞానాంధకారాన్ని తొలగించి, సుజ్ఞానజ్యోతిని వెలిగించి యెన్నోజన్మల్లో చేసిన పాపాలను పారద్రోలడానికి కారణమైనవిద్యను మనకు కటాక్షిస్తాడు.



పెద్దలగు విద్వాంసులదగ్గర విజ్ఞానాన్ని పెంపొందించుకోవాలి. పూర్వము గాలవ మహర్షి నారదుని దగ్గరకు వచ్చాడు. "మహాత్మా! సమస్త శాస్త్రాలు చదివాను. వాటిలో గల గూఢార్థాలూ బాగాగ్రహించారు. యిన్ని చేసినా యీశాస్త్రాలకు పరమార్థం నాకు తెలీదు. అది తమరు నాకు వివరించా"లనికోరాడు. "మహర్షివర్యా! మనిషికి కావలసినవి నాలుగాశ్రమాలు (1) బ్రహ్మచర్యం; (2) గృహస్థం; (3) వానప్రస్థం; (4) సన్యాసం; యీ ఆశ్రమాల్లో అనేక ధర్మాదికర్మలు చేసి, యీనాలుగింటిలో ధర్మార్థకామాలను సమానంగా ఆచరిస్తే, వానిని పుణ్యలోకాల్లో అవేచేరుస్తాయి. జీవరాసులందరిలో సమానముగా ఉంటూ పరుషవాక్కులు పలక్కుండా శాంతిమయజీవితంగావించేవాడే పూతాత్ముడు. పుణ్యపురుషుడు. నిత్యమూ సత్యమునే వచించాలి. వ్రతదానాదులు, పితృదేవపూజలు గావించాలి. అహంకారం, గర్వం దరికి రానీయరాదు. విషయలంపటత్వం విడువాలి. పరనింద, తనను తాను పొగడుకొనడం విడవాలి. యితరులకు బాధకలిగించే మాటలుగాని, చేతలుగాని యెట్టి పరిస్థితుల్లో చేయరాదు. మనిషిని అధోగతికి పంపించే గుణాల్లో మొట్టమొదటిదికోపం; అన్ని అనర్థాలకూ మూలం కోపం. అలాగే అసూయ – యీర్ష్య యీ మూడు గుణాలు మనిషిని బ్రతికుండగానే దహించేస్తాయి. తనను యెవరు కోరినా, చేతనైనంత ఉపకారం చేసిపంపాలి. అవకాశంలేకపోతే, మృదువుగా అవకాశంలేదని చెప్పాలి. యిలా ఉన్నవారు సర్వశాస్త్రాలూ, చదివినవారికంటే సత్పురుషులే, యజ్ఞయాగాదులు గావించే వారికి సహాయం గావించాలి.

సగరచక్రవర్తి చాలా గొప్పవాడు. ఒకనాడు అరిష్టనేమి అనుమహర్షి ఆతని దగ్గరకు రాగా సగరుడు జ్ఞానము గూర్చి ఆతన్నికోరగా ఆతడు యిలా చెప్పాడు "ధరణీంద్రా! యీకనుపించే భౌతిక సంపదలు యేవీ మనకు జ్ఞానాన్నిగానీ, ఆనందాన్నిగానీ యియ్యలేవు. భార్యాబిడ్డలు, యీ భవనాలూ, యీరాజ్యం యిదంతా మనం కన్నుతెరచి ఉన్నంతకేగాని, కన్నుమూస్తే మాత్రం యివేవీకానరావు. యీ చూసేదే నిజమని నమ్మే వారికి ముక్తిలేనేలేదు. యిక యీసంసారమంతానాదే! వీరిని పోషణ, రక్షణకూడా నాదే అనే సంసార సాగరంలో పడిదరిచేరలేక తరువాత విచారించే వారెందరో! మనకన్నులయెదుట మృత్యువుకు బలైపోయేవారిని మనము రక్షిస్తున్నామా? మరెందుకు వారిపై అంత దుర్వ్యామోహాన్ని పెంచుకొనడం?

మనకు కావలసిన మోక్షమార్గాన్ని మనమే వెతుక్కోవాలి. అంతేకాని, దాన్ని యింకొకరు మనకు యియ్యలేరు. జీవులపుట్టుక, అవి పెరగడం, అంతమందడం యీ మూడూ మనము నిత్యంచూస్తున్న నిత్యసత్యాలు. వీటిని చూసి, మనంనేర్చుకున్నది? మనమూ అలాగేకదా! అని మనమోక్షమార్గాన్ని మనమే వెతుక్కోవాలి! యితరులెవరూ కారని తెలియాలి. ముందు మనిషికి విషయవాంఛలు నశించాలి. నేలైనా – హంస తూలికా తల్పమైనా – యేదైనా మనసులో ఒక్కలాగే చూడ్డం నేర్చుకోవాలి. యెన్నికష్టాలు వచ్చినా భరించగల మానసికధైర్యం

అలవర్చుకోవాలి. మనశరీరందినదినం శక్తుల్ని కోల్పోవడం చూసి ఆలోచిస్తేమనకు జ్ఞానం తప్పకుండా వస్తుంది. ప్రపంచాన్నంతా యేకచక్రంగా పరిపాలించే చక్రవర్తులు కూడా, అతిసామాన్యుల్లా అంతమవడం చూస్తున్నాం.

సమస్త జీవుల్లో మానవజన్మగొప్పదే! అయితే నేమి ఆజన్మను సార్థకంగా వించుకొనే శక్తికూడా భగవానుడు మనకిచ్చాడు. దాన్నిమానవుడు సద్వినియోగం గావించుకొంటున్నాడా! లేదు. యెక్కువపాపాలుగావిస్తున్నాడు. తక్కిన జీవులు యిన్నిపాపాలను చేయలేవు. యింతగొప్ప జన్మలో యిన్నిపాపాలుచేయాలా? యిదంతా అజ్ఞానమేకదా? ఓరాజా! నీవు యీసంసార సాగరాన మునగక సర్వసామ్రాజ్య సంరక్షణ సత్పురుషులతో చక్కని సాంగత్యం సత్యాన్ని తప్పక సంచరించడం నీవుమోక్షంపొందడానికి సరసమైన మార్గంగా భావించు. నీవు భగవానుడైన, త్రిమూర్త్యాత్మకుడు సూర్యుని వంశాన జన్మించావు. అంతానీకు ప్రజారక్షణలోనే ముక్తితో గూడాలభిస్తుందని చెప్పి అరిష్టమహర్షి ఆనందించినట్లు వెళ్లాడు. నీవు విజ్ఞానివి. దీని వలన నేర్చుకోదగిన దానిని నేర్చుకొని ఆచరించి ధన్యుడవవు" అన్నాడు భీష్ముడు.

"తాతా! వ్యాసులవారి పుత్రుడు శుకమహర్షి యెలాగ?" అన్నాడు ధర్మరాజు. "నాయనా! బంగారుకొండ మేరుపర్వతం దగ్గర కొండలో వృక్షాలతోటలో పరమశివుడు పార్వతీ అమ్మవారితో తనప్రమథగణాలతో హాయిగా కొన్నాళ్లచ్చట విహారంగావించారు. అసమయాన వ్యాసభగవానునికి ఒకకుమారుడుంటే బాగుంటుందని కోరిక కలిగింది. మహత్తరమైన తపస్సు గావించాడు. అనితరసాధ్యమైన ఆతని తపస్సుకు మెచ్చి పరమశివుడు ప్రత్యక్షమయ్యాడు. వచ్చిన పరమేశ్వరుని వ్యాసమహర్షి అనేక విధాలస్తోత్రంగావించాడు. "మహర్షీ! నీకేం కావాలనగా;" పరమేశ్వరా! పంచభూతాల శక్తిని మించిన మహాయోగము గల ఒకకుమారుని ప్రసాదింప" మనివేడుకున్నాడు. పరమ శివుడు అలాంటి వానినే వ్యాసమహర్షికిచ్చాడు. అలాకొన్నాళ్లు జరిగింది ఇంతలో

వ్యాసభగవానుడు హోమముకొరకు అరణిమధిస్తున్నాడు (అరణి = రావి – చంద్ర కఱ్ఱలను మధిస్తే అగ్ని పుడుతుంది.) ఆసమయాన ఆమార్గం గుండా ఘృతాచి దేవవేశ్యవెళ్లగా దాని రూపలావణ్యయౌవనాలకు ముగ్ధుడైన వ్యాసమహర్షికి వీర్యం పతనమైంది. ఆమె అదిగమనించి చిలుక రూపాన్ని దాల్చింది. ఆ రేతపస్సు అగ్నిలో పడింది. యింకా మహర్షి మధిస్తుండగా ఆ అగ్నిలో నుండి చిలుక మోముగల మహాతేజోమూర్తి ఒకబిడ్డడుద్భవించాడు. పవిత్రమయినగంగాదేవి ఆబిడ్డని స్నానాది పురిటిక్రియలు నిర్వర్తించింది. గగనాధిష్ఠాన దేవత ఆతనికి కృష్ణాజినం, దండం సమర్పించింది. వ్యాసభగవానుని వలెనే పుట్టినతోడనే పెద్దవాడయ్యాడు. ఆతనికి పరమశివుడు పార్వతి ఉపనయనంగావించారు. మహేంద్రుడు కమండలం ఇచ్చాడు.



ఆతనికి సురసిద్ధాది దేవతలు యెప్పుడూ మలినంకానిదివ్యవస్త్రాలిచ్చారు. శుకుని పుట్టువు వలన సర్వలోకాలూ ఆనందసాగరాన మునిగాయి. ఆయన నాలుగు వేదాలూ వల్లించి కంఠస్థం గావించుకున్నాడు. గురువన్నవారు ఉండితీరాలి గనుక దేవగురువగు బృహస్పతినే శుకుడు యెన్నుకొని గురుబ్రహ్మగా ఆతని పాదపద్మాలు శిరస్సుపై ధరించాడు. "తరువాత తనతండ్రి వ్యాసభగవానుని ఆశ్రమానికి రాగా, కుమారుని యెత్తుకొని పరమానందంతో సమస్తశాస్త్రాలను చెప్పాడు. శుకుడు పుట్టువులో నుండీ అన్నీనేర్చుకున్నాడు. యిలా శుకుడు సర్వమూ తెలుసుకొని, వ్యాసభగవానుని "జనక! నాకు మోక్షాన్ని ప్రసాదించే విద్యకావాలి" అని కోరగా; "కుమారా! జనక మహారాజు నీకావిద్యాదానం గావిస్తాడు. కాని ఆయన దగ్గరకు వెళ్లేముందు అహంకారాన్ని వదలాలి. వినయశీలాలతో వెళ్లా"లన్నాడు. నడిచి వెళ్లమన్నాడు.

శుకుడు అలాగే ప్రయాణిస్తూ, మహాపర్వతాలు దాటి, గంగానదీ మొదలైన నదులు దాటి, దారిలో అనేక చిత్రాలు కానుపించినా, వాటిని గమనించకుండా తిన్నగా విదేహనగరిచేరాడు. ద్వారపాలకులా తనిని రాజు దగ్గరకు వెళ్లనీయలేదు. అయినా శుకుడు అక్కడే నిలిచి ఉన్నాడు. తరువాత వారు పంపగా, మహారాజ సౌధము దగ్గర ద్వారపాలకులు లోనికి వెళ్లనీయలేదు. అయినా శుకుడు వినయముతో అక్కడకూడా యెంతో సేపు నిలబడే ఉన్నాడు. వారాతని బ్రహ్మవర్చస్సు జూచి పంపి బంగారు పళ్లెములలో అర్ఘ్యం, పాద్యాదులిచ్చి ఆపళ్ళెం జనకమహారాజు తలపైధరించి రా వెనుక వేదవేత్తలందరూ, శుక మహర్షికి యెదురువెళ్లారు. మహారాజు మంత్రులు, పురోహితులు, పండితులు, కవులతో సమస్త పరివారంతో విదేహరాజు ఆతనితీసుకొని వచ్చి నవరత్నస్థగిత బంగారు పీఠంపై కూర్చుండబెట్టి, అందరూ క్రిందకూర్చున్నారు. అందరూ, ఆసన్నివేశాన్ని చూసి అద్భుతాశ్చర్యాలనందారు. అందరూ ఆశుకునకు సాష్టాంగనమస్సులర్పిస్తున్నారు. మహారాజాతనికి భోజనాదికాలన్నీ హృదయపూర్వకభక్తితో సమర్పించాడు. మరునాడు వెళ్లి "అయ్యా! శుకవర్యా! తమరిక్కడకు దేనికివచ్చా"రని అడిగాడు. "మాపితృదేవుడు వేదవ్యాసభగవానుడు మోక్షమార్గాన్ని తెలిసికొని రమ్మనినన్ను పంపాడు. అదిమీరునాకు బోధించండి" అన్నాడు శుకుడు.

"భూమీసురనందనా! బ్రాహ్మణుడు బ్రహ్మచర్యంతో వేదాధ్యయనం గావించాలి. తరువాత గృహస్థంలో ప్రవేశించి మంచిసంతానాన్ని కనాలి. ఆతరువాత అర్ధాంగితో యజ్ఞాదిక్రతువులు, అతిథి అభ్యాగతారాధన అనంతరం అగ్నిహోమములో సకలకర్మలూ సమర్పించాలి. అప్పుడాతడు మోక్షమార్గానికి అర్హుడవుతాడు" అనగా; "మహారాజా! మోక్షం పొందడానికి యింత తంతూ జరపవలసిందేనా? మరివేరే దగ్గరమార్గములేదా? పూర్వంమహర్షులందరూ తపస్సుతోనే అన్నీ సాధించారుకదా?" అనగా; మహాత్మా! సర్వమూ బ్రహ్మమయంగాచూచేవానికి యింకా యివన్నీ

యెందుకు? నీవే బ్రహ్మవైయున్నావు – అది నీకు తెలీదు. కొద్ది రోజుల్లో తెలుస్తుం"దన్నాడు విదేహుడు.

పుట్టువులోనుంచే మహాజ్ఞానాన్ని సంపాదించే శుకునికి యీ ఆశ్రమాలూ, యీలౌకికాలెందుకు? సర్వమూ పరబ్రహ్మముగా భావిస్తూ, బ్రహ్మములోనే లీనమగువాడాతడు. అలా ఆతడు ఉత్తరానికి వెళ్లాడు. లోకాలన్నీ శుకుని జూచి అద్భుతాశ్చర్య ఆనందాలందాయి. హిమాలయ సమీపాన వ్యాసభగవానుడు అంతకు ముందే ఆశ్రమాన్ని నిర్మించుకొని జైమిని – పైల – సుమంత – వైశంపాయనులను, నాలుగు వేదాలుగా, నారాయణుని నాలుగు భుజాలుగా, నాలుగు దిగ్గజాలుగా, శిష్యులను తయారు గావించాడు. యీ నలుగురుకూ వేదాలను చెప్పుసమయానికి విదేహరాజు దగ్గరనుండి శుకుడు వేదవ్యాసమహర్షి ఆశ్రమానికి వచ్చాడు. విదేహమహరాజు తననుతెల్పిన సర్వవిషయాలు తండ్రితో చెప్పాడు. అందుకు వ్యాస మహర్షి పరమానందమందాడు. కుమారునికీ వారితో కూడా వేదాలు చెప్పాడు.

అంతట నలుగురు శిష్యులూ చేతులు జోడించి, "మహాత్మా! తమరుమమ్ము వాత్సల్యంతో చూసివేదాలూ శాస్త్రాలు, సాంగోపాంగంగా మాచేత అధ్యయనము గావించారు. యికతమ ఆశీస్సులతో నాలుగు దిక్కులకూ వెళ్లి తమరు చెప్పిన వేదశాస్త్రాలను ఆసక్తిగలవారికి నేర్పి లోకకల్యాణము గావించాలని ఉంది" అనగా; వారియిష్టానుసారంగా పంపాడు

సురమునీంద్రుడైన నారదమహర్షి వ్యాసాశ్రమానికి వచ్చాడు. "మహర్షివర్యా! పవిత్ర వేదనాదంతో ఆశ్రమమంతా ప్రతిధ్వనించేది. యిప్పుడు ప్రశాంతిగా ఉంది" అనగా; వ్యాసుడు నారదమహర్షి నానలుగురుశిష్యులూ, వేదశాస్త్రాలభ్యసించారు. వారువెళ్లారు" అన్నాడు. "పోనీ మీకుమారుడు శుకుడున్నాడు. మీరిద్దరూ కలిసి వేదనాదంగావింపవచ్చుగదా!'' అన ఆతండ్రీకొడుకులు ఆశ్రమమంతా వేదనాదంతోనింపేశారు.

వ్యాసమహర్షి, శుకుడు యిరువురూ వేదనాదంగావిస్తుంటే లోకమంతా ఆనందపారవశ్యములో మునిగి తేలుతున్న సమయాన యెక్కడనుండో ఒకవాయువు వచ్చి అందరినీ చలింపచేసింది. ''శుకుడిదేవి తండ్రీ?'' అనగా పంచభూతాలతత్త్వాలనీ తెలిసిన వ్యాసమహర్షి యిలా అన్నాడు. "కుమారా! శ్రీమన్నారాయణుడు ఊర్ధ్వానికి దేవయానమున వెళతాడు. యిక సూర్యభగవానుడు పితృయానాన క్రిందికి దిగివస్తాడు. వీరిద్దరూ వాయువుని ఆధారంగా చేసికొనే ప్రయాణిస్తారు. వాయువును గూర్చి చెప్తుతాను విను. సమానవాయువు దేవతలకుద్భవించాడు. ఉదానుడు ఆతనికి జన్మించాడు. ఆతనికి వ్యాసుడు; వ్యానునికి అపానుడు పుట్టాడు. ప్రాణుదాతని కుమారుడు. యీవాయువులచేత లోకాలన్నీ బ్రతుకుతున్నాయి. ప్రవహుడు – అవహుడు – ఉద్వాహుడు – సంవహుడు – వివహుడు – ఉపవహుడు – అనే ఏడుమంది అదితికి జన్మించారు.





వీరందరూ లోకాలన్నిటా తిరిగి ప్రాణులందరికీ ప్రాణశక్తుల్ని యిస్తారు. జీవులు నీరూ, నిప్పులేకుండా కొంచంసేపుబ్రతక గలవేమోకాని, గాలి లేకుండా కనురెప్పపాటుకూడా బ్రతుకలేవు. ప్రాణులందరూ పుట్టడం, నశించడం వీరివల్లే జరుగుతాయి. శ్రీమన్నారాయణను నిశ్శ్వాసమూలంగా యిప్పుడులాగ జరిగి ప్రాణుల్ని తికమక పెట్టడం కద్దు" అని వ్యాసమహర్షి చెప్తుతుండగా ఆపెనుగాలి శాంతించింది అలా వ్యాసుడు వెళ్లాడు.

నారదుడు "వ్యాసపుత్రా! ముల్లోకాల్లో సత్యంను మించింది యింకొకటిలేదు. మహాతపస్సు కూడా సత్యవాక్కే. సత్యవాక్యసంపన్నుడు. మహాతపస్వులందరిలో శ్రేష్ఠుడు. దానిని ఆచరిస్తూ, అరిషడ్వర్గాలను అదుపునందుంచుకొని, సంసార ఝంఝూమారుతములో చిక్కక జ్ఞానం సముపార్జించేవానికి యెక్కడా, యెప్పుడూ, యెలాగ దుఃఖాలుండవు. యీప్రపంచక సుఖాలకు అలవాటు పడితే అటువంటి వారికి యెన్నిజన్మలెత్తినా అణుమాత్రమైనా సుఖములభింపదు. యిక నిరంతరం తపోదీక్షలో సర్వమూ పరమేశ్వరుడనే భావముతో సత్యవాక్కులతో సర్వమూబ్రహ్మ మయమని భావిస్తున్నవానికి సర్వశుభాలూ వాటంతటవే వరించివస్తాయి. స్థిరతర ధీరతవీటన్నిటికీ ముఖ్యము. భార్యా, బిడ్డలకు ప్రాకులాడి గతినేను చెప్పనక్కరయేలేదు. లోకాన అందరినీ చూస్తున్నాం. వారు పడే ఆరాటం యింతంతకాదు. ఆత్మసాక్షాత్కారమయిన వానికి యింకయివన్నీ కొరగానివని తెలిసికొంటాడు. దానికొరకే యీతపస్సు యీసత్యవాక్కులు – సత్సంగాలన్నీ అని భావించు" అని చెప్పేడు నారదుడు. శుకుడు నారదునకు వందనలర్పించి, తండ్రికి నమస్కారముచేశాడు. వారిరువురూ "మనోవాంఛాఫలసిద్ధిరస్తు" అనిదీవించారు.

శుకుడు తనజన్మనిచ్చిన తండ్రి వేదవ్యాసభగవానుని సంబంధముకూడా అక్కడే తెగతెంపులు చేసికొని తిన్నగా కైలాసానికి బయల్దేరాడు. యోగశక్తులన్నీ శుకునికి వాటంతటవే ప్రాప్తించాయి. అష్టసిద్ధులూ అలవడ్డాయి. ఆతడు గగనమార్గాన ప్రయాణింపగా, సురసిద్ధ, సాధ్యవిద్యాధరులంతా యెంతో ఆనందముతో తిలకించి పులకించి పోయారు. యిదంతా యీతనికి పితృపూజవలననేలభించిందనుకున్నారు. శుకుడు పవిత్రగంగా నదీ ప్రాంతంగుండా ఒకప్పుడు ప్రయాణింప ఆనదిలో నగ్నంగా అప్సరసలు స్నానము చేస్తూ, ఆతనితేజోమూర్తిని తిలకించి నగ్నంగా ఉన్నామనే స్పృహలేకుండా ఆతని వెంబడించారు. కొంతదూరం వెళ్లగావారికి శరీరస్పృహవచ్చింది. అనగా శకుడు నిర్గుణ పరబ్రహ్మం" అన్నాడు గంగానందనుడు.

వ్యాసభగవానుడు ఆతని వెనుక వస్తూ "కుమారా!" అని పిలిచే సరికి అంతవరకూ నగ్నముగా ఉన్న అప్సరసలు కిలకిల నవ్వుతూ గంగలోనికిదిగి పోయారు. బట్టలు కట్టుకొని వచ్చిన వారిని చూసి "నాకుమారుడైనశుకుడు వస్తే మీకు సిగ్గులేదా? నన్ను చూసేసరికే సిగ్గేసిందా?" అనగా, అందులో ఒకజాణ "మహాత్మా! తమరెంతగొప్పవారైనా, మీలో యింకాకామక్రోధాదులు ఉన్నాయి

మీకుమారుడు శుకుడు కేవలపరబ్రహ్మము" అనగా, వ్యాసమహర్షి సిగ్గుపడ్డాడు. తనబిడ్డడంత గొప్పవాడని పరమానందమందాడు. ఇంతలో పరమశివుడు ప్రమథగణాలతో వచ్చి "వ్యాసమహర్షీ! నీవు ఒకప్పుడునన్ను పంచభూతాలతో సమానశక్తులుగల మగబిడ్డనిమ్మని అడిగావు. నేనబద్ధం పల్కలేను కదా! అంతటి వాడిని నీకు కుమారుడుగా దానికింత ఆశ్చర్యపడవలసిన పనిలేదు. నావరం నీమహాతపస్సుతో జన్మించిన ఆతడు మహేంద్రాదులు కూడా పొందలేని ఉన్నతోన్నత పదవిలో ఉన్నాడు. శుకునివంటి కీర్తి పొందగలిగిన వారెక్కడున్నారు?" అని శంకరుడు అంతర్హితుడయ్యాడు.

## హరి హరుల అభేదము

నారాయణుడు ఒకగిరిపై మహత్తరమైన తపస్సు లోకకల్యాణానికి గావిస్తున్నాడు. దక్షప్రజాపతి సతీదేవి తనకూతురుని పరమశివునకు యిచ్చాడు. ఆదక్షుడు దేవసభలో పరమేశ్వరుడాదికి దిక్పాలురందరూ ఉండగా అక్కడకు దక్షుడురాగా సభలో నున్న వారందరు లేచారు. పరమశివుడు యోగంలో నుండి లేవలేదని అహంకారి దక్షుడు పరమేశ్వరుని విడిచి ఒకయాగాన్ని చేయతలపెట్టాడు. సరిగా యిక్కడ నారాయణుడు తపస్సుగావిస్తు. అదేసమయాన గావిస్తున్నాడు. ఆయజ్ఞానికి కూతురు సతీదేవినైనా పిలువలేదు. ఆమెను పిలువక పోయినా తండ్రియాగానికి వెళ్లగా, ఆమెను కూడా ఆతడు అవమానించాడు. ఆయవమానం భరింపలేక సతి యోగాగ్నిలో కాలిపోయింది. దక్షునియజ్ఞము వీరభద్రుడు ధ్వంసంగావించాడు. నారాయణుని గుండెల్లో దాక్కుంది? అందువలన నారాయణుని గడ్డమూతలా అంతా వికారంగా తయారయింది.

రుద్రుడు కోపంతో వచ్చాడు. నారాయణుడు తన కేశాన్ని మంత్రించి రుద్రుని పై వేయగా అది పరశువయింది. దాన్ని ఆతడు ఆపరశువును నాశనముచేశాడు. యిలా హరుడూ – హరీ అభేదరూపం గలవారని తెలియాలి. త్రిమూర్తులుగూడా భేదంలేనివారే. అయినా యిద్దరూ యుద్ధానికి సిద్ధమయ్యారు. లోకాలన్నీ భయభ్రాంతులయ్యాయి. మహర్షులు వేదపఠనగావింపలేక తికమకపడ్డారు. పంచభూతాలు విలవిలలాడి యేమీతోచక విచారింపసాగాయి. గిరులూ, తరులూ, అన్ని కూలిపోయాయి. సాగరాలు యెండిపోయాయి. ఆకాశంబ్రద్దలయింది. దేవతలందరూ భయభ్రాంతులయ్యారు. వాణీనాధుని మోములు నాలుగు వెలవెల పోయి వేదాల నుచ్చరించ లేకపోయాయి. మహేంద్రాది దేవతలందరినీ, మహర్షులనూ, నారదాదులనూ, తీసికొని బ్రహ్మ హరిహరులు యుద్ధంగావించు గిరి దగ్గరకు వచ్చారు. వారందరూ పరమశివునకు ప్రణాలర్పించి, మహాత్మా! నీవు సర్వలోకారాధ్యుడవు. అందువలన నీవయినా శాంతించాలి. మీహరి హరులందు మాకు భేదం కానుపించదు. యీలోకాల నుద్భవించి, మీయందే పెరిగి మాయమవుచున్నాయి. మీరు రెండు రూపాలుగా ఉన్నారంతే. కాని భేదంలేదు.



లోకవ్యవహారం సాగాలని యిలా ఉన్నారంతే. మీరు యీయుద్ధాన్ని ఆపిలోకాల ప్రళయాన్ని ఆపాలి. అప్పుడు నారాయణుడు "పరమశివా! నీకూ నాకూ యేభేదమూ లేదు. యీమానవులే మనయందు భేదము కల్పించి, వారు రెండు వర్గాలుగా అయి ప్రళయాన్ని సృష్టించుకొంటున్నారు. మహాయుద్ధాలుగావించుకొని నాశనమౌచున్నారు" అనగా; శంకరుడు నారాయణా! యిక్కడనుండి మనయిరువుర యందు భేదభావాన్ని కల్పించే వారికి మనమే బుద్ధిచెప్పవలె"నని చెప్పి బ్రహ్మాది దేవతలందరినీ పంపారు. మామూలుగా నారాయణుడు తపోదీక్షలోనున్నాడు.

పరమశివుని త్రిశూలం విష్ణుని ఊర్ధ్వపుండ్రాలు. నారాయణుడు ధరించే శంఖానికి మూడు రేఖలు, శివుడు దాల్చిన విభూతి రేఖలుగా హరిహరుల భక్తులు గుర్తుంచుకోవాలి. అలా ఉన్న అందరూ సమానభావంతో ఉంటారు.

## మరణ సూచన

"నీకు కేవలం ధర్మదేవతా ప్రసాదమూర్తివి. "ప్రాణము యెప్పుడు పోతుందో! వర్షం యెప్పుడు వస్తుందో యెవరికి తెలుస్తుం"దన్నారు పూర్వులు. అటువంటి మహర్షులు, వేలాది దివ్యసంవత్సరాలు తపస్సు చేసి చనిపోవడానికి ముందువచ్చే కొన్ని సంకేతాలు చెప్పారు. మానవునికి యీసూచనలు వలన మరణంతప్పదు. అని చెప్పారు. వాటిని నీకు చెప్పుతాను. శ్రద్ధాళువువైవిను. అరుంధతీనక్షత్రం కానుపించదు. కుడిప్రక్క ముక్కు సగం పాడవడం. చంద్రుడు చాలా మసకగా కనుపించడం. యిటువంటి వారు ఒకసంవత్సరంలో చనిపోతారు. శరీరకాంతివిపరీతంగా ఉన్నా, బాగా తరిగినా, జ్ఞాపకం విపరీతంగా పెరిగినా, లేదా, పూర్తిగా తగ్గినా అటువంటివారు ఆరు మాసాలే జీవిస్తారు. సూర్య–చంద్రమండలాల మధ్య భాగం బాగా యెక్కువగా కానుపిస్తే ఒకవారంలో ఆతడు మరణిస్తాడు.

దేవాలయంలో అగరు – సాంబ్రాణీ సువాసన యేమీవాసన లేకపోయిన అటువంటివారు ఆరురోజులే బ్రతుకుతారు. ముక్కూ, చెవులూ బాగా పెరిగిపోయినవారు, దంతాల తెలుపు బాగా పెరిగినా, నేత్రదృష్టి తగ్గినా, శరీరం మనస్సుభ్రాంతి కలిగినా, చావుకు దగ్గరగా ఉన్నారని తెలియాలి. ఎడమనేత్రంవిపరీతంగా నీరుకారినా, తలపోగరేకలున్నా, చావుకు సిద్ధమైన వారని తెలియాలి" అని చెప్పగా, భీష్ముడు, ధర్మరాజు

"తాతా! మీరెన్ని చెప్పినా నామనస్సులో శాంతి కలుగలే"దన్నాడు.

**ఇది మహాభారతములో శాంతిపర్వం ముగిసింది**



# సంపూర్ణ మహాభారతం

## అనుశాసనిక పర్వము



### గౌతమి

గౌతమి పేరుగల ఒక బ్రాహ్మణోత్తముని భార్య. ఒకసర్పము ఆమె కుమారుని కాటేసింది. ఆబిడ్డ ప్రాణాలు విడిచాడు. ఆబిడ్డకు సర్పం పొడవడం ఒక బోయచూశాడు. ఆసర్పాన్ని పట్టుకొని వచ్చి గౌతమికిచ్చాడు. "అమ్మా! యిదే సర్పం. యిదికరవడం వల్లే నీబిడ్డచనిపోయాడు. దీన్ని బ్రతుకనీయరాదు. నీవు చంపు. లేదా! నేనైనాచంపుతాను" అనగా; గౌతమి కన్నులనీరు తుడుచుకొని "అయ్యా! యీసర్పము ప్రాణాలు తీస్తే నాకుమారుడు బ్రతుకుతాడా? దీనితల్లి, నాకుమారునికై యెంతగావిలపిస్తున్నాదో, అలాగే ఆమెకూడా యీపాముకై యేడ్వదా? అందువలన మనము దీన్నిచంపొద్దు" అన్నది. "అమ్మా! యిదివిషజంతువు. దీనిని బ్రతకనియ్యకూడదు" అన్నాడు.

దానికి ఆ సర్పము మానవభాషలో "ఓయీ! బోయా! యీబాలుడు చనిపోవడములో నాపాత్రయేమీలేదు. మృత్యువు యెలా త్రిప్పితే అలాగే తిరగవలసిందే! నన్ను నీవు శిక్షించినా, భక్షించినా, యీనేరమంతా మృత్యుదేవతదే! దాన్నిశిక్షించు" అన్నది. అక్కడే ఉన్న మృత్యుదేవత "ఓయికిరాతుడా! నాతప్పిందులేదు. సర్పమా! నాదానేరం? కాదు. మనంయిద్దరం నిమిత్త మాతృలం. కాలపురుషునిది. ఆతడు యెలాచెయ్యమంటే మనము అలాచేయవలసిందే యిదంతా వింటున్నకిరాతునికి ఒళ్లుమండి మీయిద్దరనూ యిక్కడే యిప్పుడు ఒకవ్రేటుతో



చంపుతానని హడావిడి గావింపగా, కాలపురుషుడవచ్చి, "ఓయి కిరాతకా! యీబిడ్డచావుకు, యీపామూ, మృత్యువూ, నేనూ యెవ్వరమూ కారణంకాదు. ఆబాలుని పూర్వజన్మలో చేసిన కర్మయోగమే ఆతడీ గతినందడానికి కారణమైంది.

వారు చేసికొన్న కర్మయే వారికి సుఖ దుఃఖాలూ, మంచి చెడ్డలు లాభనష్టాలు కలిగిస్తుంది. అంతేకాని యితరులు యెవ్వరూ కారణంకాదని తెలిసికో! అనవసరంగా పయివారిని నిందించి, యీకర్మకుతోడు, ఆపాపమూ మెడకు చుట్టుకొంటున్నారు. అంతేకాదు కర్మమూలంగా పుట్టి, కర్మమూలంగా పెరిగి, కర్మమూలంగానే మరణం సంభవిస్తుంది. అంతేకాదు జీవులు కావించు దుష్కృంత, సుకృతాలే వారికి అన్నింటికి కారణమౌతాయి. అలాకాలపురుషుడు, మీపనికి మాలిన ఆలోచనలను మాని జ్ఞానంతెచ్చుకొనండి" అని అంతర్హితుడయ్యాడు గౌతమి - కిరాతుడు యెంతగానో విషయంతెలిసినందుకు ఆనందించారు. ధర్మరాజా! వారిని చంపామని నీమనస్సంతా అశాంతితో నింపుకొని బాధపడుతున్నావు. వారి వారి కర్మలమూలంగానే వారందరూ అనుభవించి యుద్ధంలో నాశనమయ్యారు. అంతేగాని నీమూలంగా కాదని యీకథ మూలంగా తెలిసికో!" అని భీష్ముడు చెప్పాడు.

"నాయనా! గృహస్థంగూర్చి బాగావిను. కామం అర్థం యీరెండూ గృహస్థులకు విడరాని అనుబంధం ఉంది. యిక మోక్షము కామం యీరెండూ గృహస్థులకు వ్యత్యస్తంచూపిస్తాయి. గృహస్థుకు అతిథిసేవా ధర్మమును సక్రమముగా నిర్వర్తిస్తే సర్వధర్మాలూ, కలిసి గృహస్థునకు ఉన్నతి కలుగుతుంది. అందుకే శ్రీమద్రామాయణాన్ని ముఖ్యమని తెలుపుతుంది. అతిథిసేవను మించినది యేదీలేదు.

### ఓఘువతీ - సుదర్శనులు

మానసిక శాంతి కావాలన్న వనాలు - మహారణ్యాలలో నివసించాలి. ఓఘువతీ - సుదర్శనులనే. దంపతి ఉండేవారు. ఒకనాడు భార్యతో "ఓప్రియురాలా! గృహస్థు తరించడానికి ధర్మార్థకామమోక్షాలను పొందడానికి, సర్వదేవతారాధనకన్నా అతిథిసేవ మిన్న అంతేకాదు అతిథులు యేది కోరినా హృదయపూర్వకముగా సమర్పించాలి. ఆతిథ్యముకన్నా యేయాగయోగాలూ గృహస్థులకు యెక్కువకాదు. నీవు మాత్రంతప్పకుండా భక్తి పూర్వకంగా అతిథి పూజచేయాలని" సుదర్శనుడు భార్యకు చెప్పాడు ఆమెకూడా ఉత్తమురాలు కనుక తనగృహములో అతిథులకు నిత్యాన్న పూజ హృదయపూర్వకముగా జరిపించేది. యిలా ఉండగా ఒకరోజు సుదర్శనుడు అరణ్యములోనికి కట్టెలకు వెళ్లాడు.

ఆరోజు ఒక అతిథి ఓఘువతి యింటికి రాగా, ఆమె యెంతో ఆప్యాయం భక్తితో పూజింపగా వాడు కామాతురుడయ్యాడు. వానిని మంచముపై పరుండమని చెప్పింది ఓఘువతి. అదేసమయాన సుదర్శనుడు కట్టెలు వాకిట పడేసి భార్యను పిలువ జవాబు రాలేదు. యెన్నిమార్లు పిలిచినా పలుకకపోగా సరిగా పండుకున్న గది దగ్గరకేగి పిలిచాడు. అతిథి విసిగి "ఏమయ్యా నీభార్య అతిథి సేవలో ఉంటే

మధ్యను నీగోలేమయ్యా?" అన్నాడు. విషయంతెలిసి కొన్న సుదర్శనుడు, యెంతో తప్పుస్వయంగా నేనే చేసుకున్నాను. అతిథిదేవతకదా! అందువలన ఓమహానుభావా! నీరాకతో నాగృహమూ, నాగృహిణీతరించారు మీరేమీ తొందరపడకండి" అనిచెప్పాడు.

తరువాత అతిథి ఓఘవతీ! తలుపులు తీసి యిరువురూ ఒక్కమారేయీవలకు వచ్చారు. "సుదర్శనా! నీ అతిథిసేవాపరాయణతా, నీభార్యపాతివ్రత్యపరమధర్మం మెచ్చదగినది. ఆమెధర్మాన్ని విడువకుండా ప్రవర్తించింది. నేను ధర్మదేవతను. మీరిద్దరినీ పరీక్ష చేయడానికి యిలా వచ్చాను. సుదర్శనా! నీకుకావాలన్న యీ శరీరంతో స్వర్గానికి వెతావు. మేము తీసుకుపోగలము. నీ అర్ధ శరీరంకనుక ఓఘవతిపవిత్రనదిగా ఉంటుంది. ఆమెగృహస్థధర్మాన్ని చక్కగా యిక్కడ నిర్వర్తిస్తుంది. నీతో కూడా తిన్నగా స్వర్గానికివస్తుంది. నీవు మాత్రం గృహస్థంలో ఆతిథ్యమీయడం కన్న పరమధర్మంమరొకటి ఉండదు" అని ధర్మదేవత అదృశ్యమయ్యాడని" భీష్ముడు చెప్పాడు.

## పురుష దైవయత్నాలు

"పితామహా! పురుష – దైవయత్నాల్లో యేది ముఖ్యమోనాకు వివరించ" మన్నాడు ధర్మరాజు "ధర్మజా! యీప్రశ్న వశిష్ఠమహర్షి వాణీనాధునడిగాడు. ఆయన యిలా చెప్పాడు. పురుషప్రయత్నం తప్పకుండా ఉండాలి. అలాగే దైవయత్నము యీరెండూ సమానంగా కూడినప్పుడే ఫలిస్తుంది. ముందు పనిచేయాలి. తప్పకఫలితం వస్తుంది. యికపురుషుడు యెలా తలక్రిందులైనా దైవానుకూలత లేకపోతే మాత్రం యేమాత్రం ఫలితముండదు. మనిషి ప్రయత్నం చిన్నదిగా చేసినా, దైవానుకూలత ఉన్నచాలా గొప్పఫలాలనిస్తుంది. యెవరుచెడ్డగావిస్తే చెడ్డేజరుగుతుంది. మనంగావించిన కర్మబలీయమైతే, దైవం దానికి తోడైయుంటాడు.

అందువలన పురుష, దైవయత్నాలూ సమానమైనవే. యిందులో యేఒక్కటి తక్కువకాదు. యెక్కువకాదు. యికమంచి కర్మఫలితాలువిను. బాగా కష్టపడి పనిచేసి యెంతో అలసిపోయి వచ్చిన వారికి కడుపునిండా భోజనం పెడితే వచ్చేఫలితము లెక్కలేనంత కలుగుతుంది. అగ్నిహోత్రుని. ఆరాధనగావిస్తే. మహాపురుషుడౌతాడు. త్యాగికి ఆవస్తువుల వలన కలిమిలభిస్తుంది. మహాతపస్సుగావిస్తే లెక్కలేనన్ని భోగాలు అనుభవింపవచ్చు. యెవరు మౌనాన్ని పాటిస్తారో, వారికి మహావిజ్ఞానం పెరుగుతుంది. అహింసావ్రతాన్ని అవలంబించే వారికి సురూప, బల, మహాసంపదవస్తుంది. బ్రహ్మచర్యమవలంబించిన వానికి ఆయుర్ వృద్ధి, ఉపవాసాలు చేస్తే రాజ్యభోగాలు, నీరూఫలాహారంతో నున్న వారికి సర్వసంపదలు, పత్రాలతో ఉపవాసంగావిస్తే స్వర్గభోగాలు సంప్రాప్తిస్తాయి.

వేదపారాయణ సుఖమునిస్తుంది. దాని అర్థాన్ని తెలిసికొన్న ఉత్తమలోక ప్రాప్తికలుగుతుంది. సత్యవాక్సంపన్నునకు మోక్షం, ఆత్మని వెతుకుకొని వస్తుంది.



యింతెందుకు? యేరకము విత్తనము భూమిలో నాటితే ఆరకమైన చెట్టే మొలుచులాగ మనము యెటువంటి కర్మగావిస్తే అటువంటి ఫలితమే లభిస్తుంది. తలనెరసీ, పండ్లూడి, శరీరంలోగల రక్తమాంసాలన్నీపోయి, మూడు కాళ్లముదుసలికైనా దురాశా, దుష్కామ దుర్యోగ, దురాలోచన కొందరిలో యేమాత్రంపోవు. రోగమువచ్చి అటువంటివారు చనిపోతారు. జ్ఞానము లేనికొందరు పూర్వజన్మసుకృతము వలన లభించే సర్వభాగ్యాలూ, భోగాలూ యిలాగే ఉండిపోతాయని గర్వం అహంకారంతో విరుచుకుపడి చివరకు యెందుకూ పనికి రాకుండా అంతమై యముని దగ్గర నానాకష్టాలూ పడతారు" అన్నాడు భీష్ముడు.

## లక్ష్మి ఉండు స్థానాలు

"పాండవాగ్రజా! యీ చెప్పబోవు విషయాలు యెంతో ప్రాముఖ్యమైనది. నిరంతరం సత్యవాక్యసంభూతులు, మంచివేదాచారపరాయణులు, గురువుని త్రిమూర్త్యాత్మకునిగా యెల్లప్పుడూ పూజించేవారు, ఒక సత్కార్యాన్ని చేపట్టి యెన్ని అవాంతరాలు వచ్చినా ఆకార్యాన్ని సాధించేవారు, మంచిబుద్ధి శుద్ధి గుణాలు గలవారు. మంచిపనులేచేయువారు. మంచిజ్ఞానం, తపస్సు – త్యాగం, బ్రహ్మచర్యం, ప్రశాంతి, యింద్రియాలను అరికట్టినవారు. నాదివ్యానుగ్రహానికి నిత్యం పాత్రులౌతారని శ్రీమహాలక్ష్మీ దేవియేచెప్పింది. అటువంటి వారిగృహాలు నాకు స్థానాలు.

దుర్మార్గులు, నాస్తికులు, చేసిన మేలు మరచినవారు, చెడ్డబుద్ధులు కలవాడి, దగ్గరకు నేను చేరను, గృహాన్ని పరిశుభ్ర ఆచారవ్యవహారాలు కలవారు. ముఖ్యముగా స్త్రీలన్న నాకభిమానం. అటువంటి వారిగృహాల్లో నివశిస్తాను. భర్తనునిర్లక్ష్యము చేసేదాన్ని ఆతనికి యెదురు తిరిగి పనులు చేయుదానిని. నిరంతరమూ చిరాకుపరాకుగా ఉన్న దానిని, యెప్పుడూ పొరుగిళ్లకు వెళ్లేదాన్ని, నీతినియమాలు, పాటించనిదానిని అస్తమానమునిద్రపోయే దానిని, నుదుటపసుపుతిలకంలేని దానిని, అందరితో యెప్పుడూ, తగవులాడే దానిని, అత్తమామలు మరదులతో నున్న గృహాన్నివిడిచి మాయమాటలతో మనస్సువిరిచి భర్తను బాధించిన దానిని, పరుషవాక్కు కలదానిని, పరులనే పొగడుదానిని, నేను చూడను.

## అష్టావక్రుడు

"నాయనా! కన్యకు కావలసిన వరుని గూర్చి చెప్తుతాను విను దీనికి ఒక కథ చెప్తుతాను విను. అష్టావక్రుడను మహర్షి ఉండేవాడు. ఆతడు అచంచల బ్రహ్మచర్యనిష్ఠతో సమస్తశాస్త్రాలూ గురునిదగ్గర అధ్యయనంగావించాడు. ఆతడు గృహస్థాశ్రమములో ప్రవేశించే సంకల్పంతో వదాన్యుడను మహర్షి దగ్గరకు వెళ్లి "మునీంద్రా" సుప్రభ "అనుతమకుమార్తెను వివాహంచేసుకోడానికి వచ్చాను" అన్నాడు. "నాయనా! నీవు నాకుమార్తెకు తగిన వరుడవే! అయినా నీవు వుత్తరదిక్కుకు పోయిరా!" అన్నాడు మహర్షి. "దేనికి?" అని వరుడడిగాడు. ఉత్తరమున

అలకాపురికావల హిమాచలం ఉంది. ఆస్థలమున పరమపావని పార్వతీ దేవి పరమశివుని గూర్చి దివ్యమైన తపస్సు చేసింది. అదిమహా పవిత్రస్థలము.

ఆస్థలములో ప్రమథగణాలతో పరమేశ్వరుడు లీలావినోదుడై అమ్మవారికి అత్యంత అద్భుతానందాన్ని అంది ఉంటాడు. యిక అచ్చోటుబాసి యింకా ముందుకు వెళితే అది కడిమి చెట్టుతో నున్న దివ్యవనం. ఆవనం అందం వర్ణనాతీతం. ఆపరమవనాన త్రిలోకసుందరి, నవయవ్వనవతి, విద్యావతి, వినయవతి, వివేకవతి, గోమతి, ధీమతి ఉంటుంది. ఆమెసురకాంత. ఆమెను దర్శించి నీవు వచ్చి నాకుమార్తెను వివాహంచేసికో నాయనా!" అన్నాడు మహాముని. అలాగే అన్నాడు అష్టావక్రుడు.

ముందుగా కుబేరుని నగరం చేరాడు అష్టావక్రుడు. కుబేరునికి అష్టావక్రమహర్షివచ్చాడని విని పరమానందంతో మంత్రిపురోహితాదులతో అర్ఘ్యపాద్యాదులతో యెదురేగి పూజించి, ఆతనికి ఆనందం కొరకు రంభాద్యప్సరల నాట్యవినోదాన్ని కలిగించాడు. అలా ఆనందంతో అష్టావక్రుడు సుమారు ఒక సంవత్సరం సర్వమూ మరచిపోయి అక్కడే ఉండిపోయాడు "మునీంద్రా! తమకు కావలసిందేమి? మీరేదికోరినా సమర్పిస్తానన్నాడు అలకాధిపతి. "యక్షరాజా! నీకు చెప్పడానికి నాకేమి కోరికాలేదు. ఒక దివ్యర్షి ఒకకార్యము మీద పంపగా మధ్యలో మీ ఆతిథ్యాన్ని కాదనలేక యిన్ని రోజులున్నానంతే. మీరు సర్వసౌభాగ్యలతో ఉందురుగాక! అని అష్టావక్రుడు అచ్చటనుండి వెళ్లాడు. హిమాచల పర్వతానికి చేరుకున్నాడు.

ఆకడిమిచెట్ల మహావనము కన్నులకు ఆనందాన్నందించింది. అక్కడ ఒకదివ్యభవనముంది. అష్టావక్రుడు ఆభవనం సింహద్వారం దగ్గరకు వెళ్లగా ద్వారపాలకులు లోనికి పంపలేదు. యింతలో అపూర్వసుందరాంగులు సంతోషముతో వచ్చి ఆతనినిలోనికి తోడ్కొని వెళ్లారు. అపూర్వ త్రిలోకసుందరాంగులను వారిహావభావవిన్యాసాలకు యేమీచలించలేదు. లోనికివెళ్లాడు. ఒకగొప్ప పర్యంకా ఆతడు, శ్వేతవస్త్రాన్ని దాల్చి సువర్ణస్థగిత నూతన నవరత్నా భరణాలు శరీరాన దాల్చి, ప్రౌఢవయస్సున సురకాంత అందుపై కూర్చొని ఉంది. అష్టావక్రుడు తిలకించి హస్తమెత్తి "నీకు శుభమగాక!" అని ఆశీస్సులిచ్చాడు! ఆమెకూడా తను కూర్చున్నదగ్గరగా ఆతనిని కూర్చుండబెట్టుకొని ఆతనికి సాదరగౌరవపూర్వకముగా అర్ఘ్యపాద్యాదులవిచ్చి పూజించింది "ఓదేవసుందరీ! వీరందరూ యిక్కడేల? అనగా అందరినీ ఆవలకు పంపి ఆమె ఒక్కతే అష్టావక్రుని దగ్గరుంది. బాగా రాత్రి పడ్డది. ఆతనికి తగిన పర్యంకాన్ని యేర్పాటు గావించింది. ఆతరువాత ఆతనిప్రక్కలో మెల్లగా చేరుకుంది. అలా కూర్చొని ఆతనిని ఆలింగనంగావించుకొంది. యేమిగావించినా ఆమహర్షి యందణుమాత్రమైనా మనోచలనత కానిపించలేదు. "మహర్షివర్యా! మీరింత రాయిలాంటి వారని నాకు తెలీదు. యీ సర్వస్వం యీభోగభాగ్యాలూ,



నీకర్పిసున్నాను. నేను నీదానను. యింకెందుకాలోచిస్తారు?" అలాతొందరపడిన ఆమెను చూసి" ఓస్త్రీరత్నమా! పరస్త్రీ సంగమంకన్నా మహాపాపం యీ సృష్టిలో యింకేదిలేదు. నాసంగతి వినుకఠోరమైన బ్రహ్మచర్యవ్రతములో నున్నాను. నేను ఒక కన్యను వివాహం చేసుకొంటాను. అనగా ఆమెచిరునవ్వునవ్వి "ఓహో! యిన్ని రోజులకు మీరు పుట్టారు. స్త్రీకి కామంకలిగితే వావివరుసలతో పనిలేదు. కొడుకైనా, తండ్రిగాని, భర్తగాని ఆమెకంటికి ఒక్కలాగే కానవస్తారు.

నిజము చెప్తుతున్నాను విను. స్త్రీ యెందరి మగవాళ్లతో క్రీడించినా ఆమెకు కామసంతృప్తి మాత్రంకలగదు. సరిపుచ్చుకుంటుందంతే. కాని వేరుకాదని తెలిసికో!" అనీ, యింకా ఆమె యేదో అనబోవగా; మధ్యలో "తల్లీ! నీకు నమస్కారం. నన్నెందుకు పాపకూపములో ముంచుతావు? నీవింకనన్ను విడువునీకెంతేని పుణ్యముంటుంది" అని లేచిపోవడానికి సిద్ధపడగా అదివ్యాంగన "ఓబ్రహ్మచారీ! యేమంటావు? వెళతావా? సరే అలాగని రాత్రి గడిపాడు. మళ్లీ మరునాడూ అంతే. అలా అష్టావక్రుని ఆమె బాధిస్తుంది. యిలా ఆతనిని నానాయాతనలూ పెడుతుంది. అప్పుడాతడు విసిగి సారి పోయిరెండు చేతులెత్తి నమస్కరించి " తల్లీ! నీకేంకావాలి? నన్నెందుకిలా బాధిస్తావు?" అనగా; ఓమహర్షీ! నేను ఉత్తరదిశను. వదాన్యమహర్షి నిన్ను యిలా మనస్సు తెలిసికొనమని చెప్పాడు. యిలా బాధించానని నన్ను వేరుగా తలచకు వదాన్యుని కుమార్తెను వివాహంగావించుకో! "అని ఆతనిని పంపించిది" ధర్మరాజా! అన్నాడు గంగానందనుడు.

**పాపాలు**

"బ్రహ్మ హత్యను మించిన పాపాలను కొన్ని చెప్పతానువిన"మని భీష్ముడు యిలా చెప్పాడు.

1. ఆకలి గొన్న అతిథిని యింటికి తెచ్చి, అన్నంలేదని చెప్పడం.
2. ఉన్నత వంశంలో జన్మించి శాస్త్రాలు అధ్యయనం చేసిన వారి పొట్టపై కొట్టడం
3. మంచినీటిని త్రాగుచున్న గోవులను నీరుత్రాగకుండాచేయడం.
4. అవిటి వారిధనాన్ని అపహరించడం
5. శాస్త్రాలను, వేదాలను నిందించడం.
6. ఒకరు యేదోచేస్తే ఆగ్రామానికే నిప్పుపెట్టడం.
7. అసత్యంతో ఒకకుటుంబాన్నే నాశనంగావించడం.
8. యోగ్యుడైన వరునికి తన బిడ్డనివ్వక అయోగ్యునికి యివ్వడం.

ధర్మరాజా! యివన్నీ బ్రహ్మహత్యను మించిన పాపాలు" అన్నాడు భీష్ముడు.

## గంగాప్రభావం

ఒకప్పుడు ఒకనిగృహానికి గొప్పసిద్ధపురుషుడు వచ్చాడు. గంగ పవిత్రతను గూర్చి ఆతనిని చెప్పమన్నాడు. ఆతడిలా చెప్పాడు ధర్మజా! అని భీష్ముడు యిలా చెప్పాడు. హిమాలయ పర్వతశ్రేణులేకాదు, గంగప్రవహించే ప్రదేశాలన్నీ పవిత్రాలే. ఎన్నియజ్ఞయాగాలుగావించినా ఒక్కమారు గంగాస్నానం గావించిన దానికి సరికావు. యెంతటి పాపాత్ముడైనా గంగానదిలో ఒక్కమారు స్నానంగావిస్తే ఆపాపాలన్నీ అంతరిస్తాయి. యెన్ని సంవత్సరాలు గంగలో అస్తులుంటాయో, అన్నివేలదివ్య సంవత్సరాలు వారు స్వర్గలోకములో వారుంటారు. ఎటువంటి రోగాలున్న వారైనా గంగలో మునిగితే ఆరోగ్యం వస్తుంది. జీవితములో ఒక్కమారైనా గంగానదిలో స్నానముగావించక పోతే వారి జన్మంతావృథా!" అనిసిద్ధుడాతనికి గంగా పవిత్రచరిత్రను" వినిపించాడన్నాడు భీష్ముడు.

## చ్యవన నహుషులు

"ధర్మనందనా! విను. భృగువంశాన పుట్టిన చ్యవనుడు యమునాగంగా సంగమముదగ్గర పవిత్ర స్థలములో నీటిలో తపస్సుగావిస్తున్నాడు. అందులో జలజంతువులు ఆతని చుట్టూ తిరుగుతుండేవి. అలా ఆయన పదిరెండు సంవత్సరాలు మహత్తర తపముగావించాడు. చేపలకొరకు పల్లీలు వచ్చివలవేయగాచ్యవన మహర్షికూడా ఆవలలో చిక్కుకున్నాడు. అది తెలిసిన చేపలవాళ్లు యెంతో బాధపడి మహాత్మా! మమ్ముర్షించండి" అనగా; "ఓయీ! పదిరెండు సంవత్సరాలు యీచేపలూ నేనూ యెంతో అన్యోన్యంగా కలిసిఉన్నాం. మీరు వాటితో నన్నూ యెవరికైనా అమ్మండి" అన్నాడు మహర్షి, యిప్పుడు వీటిని వదలినేనెలావెళ్తాను?" అన్నాడు.

అందుకు వారు తిన్నగా వారిరాజైన నహుషుని దగ్గరకు నేగి విషయమంతా విన్నవించారు. అప్పుడు ఆరాజు యెంతో బాధపడి చ్యవన మహర్షికి నమస్సులర్పించి "మహాత్మా! మాచేపలవారు తమకు గావించే యీయవజ్ఞతకు నిష్కృతి యేది?" అనగా; అవనీంద్రా! వారేమీనన్ను చేయలేదు. వారిజాతివృత్తి ప్రకారం వారుగావించారు. దీనిలో తప్పేముంది? నాకు ధరకట్టి ఆచేపలవారికివ్వండి. మంత్రులు రాజున్ను తనరాజ్యమంతా యీ మునికి యిద్దామంటే చ్యవనుడుచాల దన్నాడు. రాజుమంత్రులూ ఆలోచనలో పడగా ఒకమహర్షి వచ్చి రాజా! యింతాలో చనెందుకు? ఒకగోవును యీమహర్షికి బదులుయివ్వండి?" అనగా గోబ్రాహ్మణులు యిరువురిదీ ఒకేజన్మ" అని చెప్పగా చ్యవనుండు సంతోషించాడు. "మహారాజా! యీ యనవిలువ ఒకగోవును యివ్వండి?" అనగా రాజు అలాచేశారు.

అప్పుడావచ్చిన మహర్షి చ్యవనుని చేపలవారిని ఆశరీరాలతో స్వర్గానికి తీసుకొని పోవగా, నహుషచక్రవర్తీ!, మంత్రులూ, ప్రజలూ, అద్భుతమందిచూశారు.



## చ్యవనుడు - కుశుకుడు

" ధర్మరాజా! విశ్వామిత్ర – కుశకుని చరిత్ర వింతగా ఉంటుంది. వినమని చెప్పాడు. చ్యవనుడు కుశికుని వలన తనవంశం సంకరమయిందని భృగువంశమంతా; అవంశాన్నంతా రూపు మాపుదామని కుశికరాజు దగ్గరకు పోయాడు. చ్యవనుని చూసి అపరిమితానందంతో అర్ఘ్యపాద్యాదులిచ్చి అతిథిపూజగావించాడు. "మహాత్మా! తమకు నాయీరాజ్యాన్నంతా అభిషేకిస్తాను. తమరుపాలించండి అన్నాడు. "మహారాజా! నేను రాజ్యాన్నేమిచేస్తాను. నీయర్ధాంగితో కూడానీవు నాయాగంలో సహాయపడండి?" అన్నాడు. దానికి కుశికరాజు ఆనందించి ఆతనికి అన్నియేర్పాటులూ చేశారు. రాత్రి అయింది. "కుశికరాజా! మీదంపతి నేను లేచినంతదాకా అనగా యెన్నిదినాలైనా నాకాళ్లుపట్టాలి. నన్నులేపకూడదు. అలాగే రాజదంపతి ఆతనిసేవగావించారు. తరువాత ఆతడు లేచివెళ్లాడు.

యింక రాజదంపతి వెన్నంటినా, చ్యవనుడు కానరాలేదు. నీరసించి రాజదంపతి భూమిపై పడిపోయారు. తరువాత అంతఃపురంలో నున్నమునిని చూచి ఆశ్చర్యపోయారు. మహర్షికి సేవజేశారు. యిలా చ్యవనుడు వారిని యెంతో విసుగుపుట్టిస్తూ బాధపెట్టసాగాడు. ఆరాజదంపతిచే రథాన్ని లాగించాడు. వారిధనమంతా యాచకులకు యిప్పించాడు. ఆలాజరగ్గాముని రథందిగివచ్చి "రాజ? యీదంపతి చాలా అలసిపోయి ఉన్నారు" అన్నాడుముని. "మాకు విచారములేదు బాగున్నాం" రాజదంపతి. "రాజదంపతులారా! యీనగర సమీప అరణ్యానికి వెళ్లండి" అని అనగా! మునిదంపతి అలాగే వెళ్లేసరికి అది అరణ్యంగాలేదు. అక్కడ సువర్ణస్థగిత నవరత్నకాంతులీను మహాభవనాలు చూసిన రాజదంపతి తమనేత్రాలను తామేనమ్మలేకపోయారు.

అలాలోనికి వెళ్లి ఆభవనాంతఃపురములో ప్రవేశించే రాజదంపతి చూసేసరికి అచ్చట హంసతూలికా తల్పముపై పండుకొని యున్నచ్యవనమహర్షిని చూశారు. ముందుకు వెళ్లారు. ఆతడూ కానరాలేదు. ఆమేడలూ వీరికి కానరాలేదు. మరల గంగాతీరాన మహర్షిని చూశారు. మునిరాజదంపతులను పిలిచి "రాజా! మీకేమికావాలో వరమిస్తాను కోరుకొమ్మన్నాడు. "మహాత్మా! తమదర్శనముకన్నా మాకు కావలసిందేమీ లేదు" అనగా! "మునీంద్రా! మాగృహానికి వచ్చిన దగ్గర నుండీ మీరు మాకు చూపించు యీయోగశక్తులన్నీ మీకు యెలా వచ్చాయో చెప్పండి?" అని అడిగారు.

మన రెండు వంశాలూ సంకరమౌతాయని వాణీపతి చెప్పగా, నీకింత పరీక్షపెట్టాను. యీపరీక్షలో మీరు ఓడితే మీవంశాన్నంతా నశింపచేసేవాడిని. కానిమీరే జయించారు. మీకు మహత్తరబ్రహ్మత్వము పై చాలాప్రతీతి ఉన్నట్లు గ్రహించాను. అందువలన నీకుమూడవ తరంవాడు గొప్పబ్రహ్మర్షి అవుతాడు. యింకా కావలసిందికోరు అన్నాడు" మహర్షి వర్యా! మావంశం వారంతా

ధర్మార్థకామమోక్షాలతో యిహానమంచి పేరుసంపాదించాలి" అలాగే అన్నాడు ముని. "మహర్షి వర్యా! మావంశములోని వాడు బ్రహ్మర్షియెలా అవుతా"డనగా!

నామనుమడు ఋచీకుడు నీ మనుమరాలిని వివాహంచేసికొంటాడు. వారికి జమదగ్ని గొప్పధనుర్వేదమందునిష్ణాతుడౌతాడు. అతని కుమారుడు పరశురాముడు గొప్ప క్షాత్రవబలసంపన్నత కలవాడౌతుడు. గాధిరాజుపుత్రుడు విశ్వామిత్రుడు మహత్తరబ్రహ్మర్షి చంద్రుడౌతాడు" అని చెప్పాడని భీష్ముడు చెప్పాడు.

## చిలుక కథ

"ధర్మరాజా! యిదివిను. ఒకగొప్పవృక్షం ఆవృక్షం కొమ్మలు నాలుగుదిక్కులనూ ఆక్రమించుకున్నాయి. అది దారిని పోయే వారికి నీడనీయడమేకాక అనేక రకాల పక్షిజాతులకు ఆశ్రయమయ్యేది. దానిపై ఒకచిలుక నివసిస్తుండేది. యిలా ఉండగా ఒకకిరాతకుడు తనబాణంతో ఒకజంతువునుకొట్టాడు. ఆబాణం జంతువుకు తగలలేదు. చెట్టుకు తగిలింది. అది విషంపూసిన బాణమౌటచేత, ఆవిషము వలన యింతగొప్ప విశాలవృక్షం యెండిపోయింది. యింకేముంది. అచెట్టు ఆకులు కొమ్మలూ అన్నీ భూమిపై పడిపోయాయి. పక్షిజాతులు పారిపోయాయి.

యిన్నీ చెట్టును విడిచిపెట్టినా, ఆచిలుక మాత్రం యెక్కడకూ వెళ్లలేదు. యెందరో దాన్నివెళ్లమన్నారు. కాని అది చెట్టును వీడలేదు. యీవిషయం ముల్లోకాల్లో ఉన్నవారి కందరికీ తెలుసును. మహేంద్రుడు వచ్చి "ఓచిలుకా! యీచెట్టు నేలకూలుతుంది. దీన్ని నీవువిడిచిపెట్టు" అని మానవరూపములో వచ్చి అన్నాడు. "మహాత్మా! సురరాజా! యీవృక్షము, యెన్నోపక్షిజాతులకు, జంతువులకు, పాంధులకు ఆశ్రయమైంది. ఫలపుష్పాలతో యెంతో అందంగా ఉండేది. దీని ఆశ్రయములో యెంతకాలము నుండోబ్రతుకుచున్నాను. యిప్పుడు యీచెట్టు యిలా అయిందని దీనిని వీడినేనెక్కడకూ వెళ్లను" అనగా; " యిది భూమిపై పడిపోతే? అనగా; దానితో నేనూ పోవడానికి సిద్ధముగా నున్నా" నని చిలుక చెప్పింది. మహేంద్రుడు చిలుక కృతజ్ఞతకు మెచ్చి "నీకేమికావాలో కోర" మనగా; మహేంద్రా! యీవృక్షాన్ని బ్రతికించి ఫలపుష్పపక్షిజాతులతో యీవృక్షం పూర్వంవలె ఉన్నట్లు" వరమిమ్మన్నది "అలాగే యిచ్చాడు. మనమాశ్రయించే వారికి చిలుక లాగుకృతజ్ఞతచూపాలి" అన్నాడు భీష్ముడు.

## నృగుని వృత్తాంతం

"నాయనా! నృగమహారాజు గొప్ప ధర్మమూర్తి. అపూర్వమైన దానధర్మాలు చేసేవాడు. అంతేకాదు సర్వదేవతాప్రీతికై అనేకయాగాదులు యెప్పుడూ చేసి సర్వజనానందంచేకూర్చేవాడు. కవిపండితులకు సమ్మానంగావించి, వారికి షోడశదానాలు చేసేవాడు. పరిపాలనలో ప్రజలందరినీ తనబిడ్డల్లాగ చూస్తూవారికి యేవిధమైన లోటూ లేకుండా, యీతిబాధలు లేకుండా రక్షించేవాడు. ఒకకవికి వందలాదిగోవులను దానంగావించాడు. అందులో ఒక ఆవురాజు గారి ఆలమందలో



కలిసింది. ఆకవి దానికి కొరకు రాజ్యమంతా గాలించాడు. యిలా ఉండగా మహారాజు యింకొకరికి కొన్నిగోవులను దానము యివ్వగా అందులో యీకవి గారికిచ్చిన గోవు ఉంది. దానిని ఆకవి కనిపెట్టి "మహారాజా! నాకు దానంగాయిచ్చిన ఆవును నీవు మరొకరికి దానంగా యిస్తావా." అని గద్దింపగా! "మహాత్మా! తెలియక చేసిన పొరపాటుకు క్షమించండి" అని యెంతవేడినా, ఆకవిఒప్పుకోలేదు. తనకా ఆవేకావాలని కూర్చున్నాడు. అలా ఉండగా మహారాజు చనిపోయాడు.

యమలోకంలో యీనృగరాజు పాపపుణ్యాలు చిత్రగుప్తుని చిఠాల్లో చూచాడు యముడు మహారాజా! ఆగోవుతప్పిదము తప్ప నీ యందు ఒక్కతప్పుకూడా లేదు" అని బాధపడ్డాడు. "రాజేంద్రా! నీవుగావించే తప్పు మహాపాపం. తప్పదు. నీవాపాపఫలాన్ని ముందుగా అనుభవిస్తావా? లేక పుణ్యాన్ని అనుభవిస్తావా?" అనియముడడిగాడు. పాపమే అనగా తొండై నృగమహారాజు భూమిపై జన్మించాడు. అలాగ ఆపాపఫలాన్ని అనుభవించి, చివరకు శ్రీకృష్ణపరమాత్మకరస్పర్శతో మామూలు రూపాన్ని పొందాడు. అందరూ చూస్తుండగా నృగమహారాజు పూలరథముపై స్వర్గలోకానికి వెళ్లాడు. ధర్మజా! అలాంటి పాపాన్ని రాజు యెలాంటి సమయంలో గాని చేయరాదు. పాపం తెలిసిగావించినా తెలియక చేసినా దానిఫలాన్ని అనుభవించవలసిందే. నేను పుణ్యం చేశాను నాకు పాపంరాదని యెప్పుడూ అనుకోరాదు.

## గరుడుని చరిత్ర

"పాండవాగ్రజా! ప్రజాపతులందు ప్రథమగణ్యుడు కశ్యపప్రజాపతి. ఆతనికి యిరువురు భార్యలు. కద్రువ - వినతలు. కద్రువ వేయిగ్రుడ్లుపెట్టింది. వినత రెండుగ్రుడ్లే పెట్టింది. వాటిని నెయ్యిభాండములో నుంచారు. సుమారు పదిహేను వందల వత్సరాల తరువాత వాటిలోంచి పాములు కద్రువకు పుట్టాయి. యెప్పటికీ వినతగ్రుడ్లు పగలకుండా ఉన్నాయి. తనసవతికి ముందుపిల్లలు పుట్టారనే ఉక్రోశంతో వినత ఒకగ్రుడ్డును పగలగొట్టింది. అప్పుడు తొడలు లేని అనూరుడు పుట్టాడు. తొడలు తయారవకుండా పుట్టాడు. తల్లిని "నీవు నీసవతికి దాస్యంచేతువుగాక!" అని కోపంతో శపించాడు. అతడు సూర్యభగవానుని రథానికి సారథి అయ్యాడు.

వినత రెండవ గ్రుడ్డును అతిజాగ్రత్తగా పొదిగించ అందులో నుంచి మహాబలజవ సత్వాలుగల గరుత్మంతుడు పుట్టాడు. కద్రువ - పిల్లలను బ్రతిమాలుకొని గరుడుడు "అమ్మా! సోదరులారా! మామాతృశ్రీకి - నాకు విముక్తికలిగించండి" అన్నాడు. వారు అమృతంతెమ్మనారు. అప్పుడు మహనీయుడైన గరుత్మంతుడు వెంటనే మహేంద్రుని పైకి వెళ్లాడు అప్పుడుదేవతలకూ గరుడునికీ గొప్పయుద్ధముజరిగింది. మహేంద్రుడు పక్షీంద్రునిపై తనవజ్రాయుధాన్ని వేశాడు; మొత్తంపై అమృత భాండాన్ని గరుడుడు తీసికొని వచ్చిసర్పాలకు అర్పించాడు. వారిదాస్యమునుండి తానూబయట పడ్డారు. వెంటనే మరల అమృతభాండాన్ని తీసికొని మహేంద్రుని కర్పించాడు.

మహేంద్రునితో మిత్రుడైనాడు. సర్పాలకు మాత్రం గొప్పవిరోధి అయ్యాడు. గరుత్మంతుని తలిస్తే చాలు సర్పాలు విషం క్రక్కుతాయి" అని భీష్ముడు చెప్పాడు.

## నచికేతుని కథ

ఔద్దాలకు డను మహర్షి గొప్పతపోనిధిగా పేరుగాంచాడు. ఆతనికి "నచికేతుడను కుమారుడున్నాడు." కుమారా! నదీతటాన దర్భలు, కమండలం మరచివచ్చాను. తెచ్చి పెట్ట" మన్నాడు. నదిలో నీరు బాగా వచ్చివాటిని కొట్టుకు పోయింది. పితృదేవునకు ఆ విషయం తెలిపాడు. బాగా ఆకలితో ఉన్నమహర్షి "ఓరీ! తండ్రిమాటను దాటావు. నీవు యముని చూడు" అని శాపమిచ్చాడు. నచికేతుడు అక్కడే వెంటనే ప్రాణాలు వీడాడు. మహర్షి చనిపోయిన కుమారుని కళేబరముపై పడి యెంతగానో యేడ్చాడు. ఆమరునాటికి యముడు కరుణించగా, నచికేతునికి ప్రాణము వచ్చింది.

అప్పుడౌద్దాలకముని యెంతో సంతోషముతో "కుమారా! యమలోకం – పుణ్యలోకాలన్నీ దర్శించి వచ్చినపుణ్యాత్ముడవు. ఆలోకాల సంగతులు తెలుపుమన్నాడు. "పితృదేవా! నీయాజ్ఞచేత ముందుగా యముని దర్శించాను. ఆతడు నీకుమారునిగా గుర్తించి, నాకు అర్ఘ్యపాద్యాదులిచ్చి యెంతగానో పూజించాడు. "యమధర్మరాజా! నేను యేలోకాన ఉండాలో నీవేశాసించు" అన్నాను. "నాయనా! నీతండ్రి నన్ను చూచిరమ్మన్నాడంతే నీవు చనిపోలేదు కదా!" అనగా! "సమవర్తీ! నేను పుణ్యలోకాలను దర్శించాలని ఉంది" అనగా! యముడు నాతో ఒకరథాన్ని యెక్కినన్ను జాగ్రత్తగా ఆప్యాయంగాపట్టుకొని అనేక పుణ్యలోకాలను నాకు చూపించాడు. నాకు హృదయాహ్లాదమయింది. అనేక చరిత్రలు నాకు విన్పించాడు.



తండ్రీ! యేమనిచెప్పాలి? మణిమయభవనాలు, ఉద్యానవనాలు నగరాలు, తరులూ, గిరులు, తినే ఆహారాలు కొండల్లాగున్నాయి. ఆవు నెయ్యి, సమస్త మైన భోగాలు గల పదార్థాలన్నీ నాకాయాపుణ్యలోకాల్లో చూపించాడు. ఆలోకాల్లో గోదానంచేసినవారు నివసించే పుణ్యలోకాలు ప్రత్యేకముగా ఉన్నాయి. అక్కడ ఉత్తమునికి గోదానముగావించేవారట అనుభవించు పుణ్యాన్ని నేను వర్ణించలేను తండ్రీ! వారు సూర్యభగవానునిలాగ ప్రకాశిస్తున్నారు" అని చెప్పారని భీష్ముడుచెప్పాడు.

## దానవైభవము

"నాయనా! యజ్ఞ యాగాలు దేవతాప్రీతికి చేసి ఆయాగాన్ని శాస్త్రీయముగా నిర్వర్తించే వారికి ఋత్విక్కులకు యిచ్చిన దానము గొప్పఫలితాన్నిస్తుంది. ధనము రత్నాలూ గోదానము వలన యజ్ఞఫలము యెంతైనా దక్కుతుంది. భూమిదానంగావిస్తే పదియారువిధాలైన దానాలఫలితం యజమానికి దక్కుతుంది. పాత్రునికి తక్కిన దానాలు చేయాలి. అలాకాక భూదానాన్ని యెటువంటి వారికిచ్చి మహత్తరఫలం వస్తుంది. అన్నదానము కూడా గొప్పదే! ప్రాణులు అన్నము మూలముగా పుడతారు. మరల ఆ అన్నము వలనే బ్రతుకుతున్నారు. యీ సర్వలోకాలూ అన్నంతో బ్రతుకుతున్నాయి. అన్నదానానికి పాత్రత అక్కరలేదు.



ఆకలిగా ఉన్నవారికెవరికైనా అన్నంతప్పక పెట్టాలి. అందుచేతేయజ్ఞయాగాలు చేయడానికి ముందు, ఆస్థలాన్నిగోమయముతో అలికి ముగ్గులు పెట్టి పవిత్రం చేసి అనంతరం యాగహోమాదులుగావిస్తారు. పితృదేవతా – దేవతారాధానా సమయాన యిది అంతాచేస్తారు.

## విద్యాదానం

విద్యా దానమంత పవిత్రమైనది యేదీలేదు. "నాకు విద్యనేర్పు" అన్నవారికి తప్పకుండా విద్యాదానం గావించాలి. గో– భూదానాలకన్నా విద్యాదానం యెంతో ఫలితాన్నిస్తుంది. విద్వాంసుడు అడిగిన" వారికి విద్యాదానము గావింపక పోతే అటువంటివాడు బ్రహ్మరాక్షసుడుగాపుడతాడు. సరస్వతీ దానము సమస్తమూ సమకూరుస్తుంది.

## బంగారందానం

"యజ్ఞయాగాల్లో తప్పక సువర్ణ దానం చేసియేతీరాలి. ధర్మరాజా! నాపితృదేవుడు శంతనమహారాజు చనిపోగా, హరి ద్వారానికి ఆతనికి పితృపూజలు (శ్రాద్ధవిధులనిర్వహణానికి) చేయడానికి వెళ్లాను. పిండప్రదానమును గావించు సమయాన నా అంగుళీయకాలు, కంకణాలు ముందుకువచ్చాయి. నాతండ్రి హస్తంనాముందుకు వచ్చింది. దర్భలపై పిండాన్ని పెట్టాను. అలానేనుగావించే సరికి "నాయనా! నీవు హృదయ పూర్వకంగా నిర్వర్తించే పితృకార్యానికి మేమందరిమెంతో సంతోషించాము. నీవు యేదానాలూ చేయవద్దు. సువర్ణదానంచేస్తే, కోటి విధాల దానఫలం నీకు లభిస్తుంది. మనవంశమంతా పునీతమౌతుంది. అందువలననే కార్యక్రమము చేసినా బంగారం దానం తప్పక చేస్తాను. యిప్పుడు భృగురాముడు రాజులందరినీ యిరవది ఒక్కమారు దండెత్తి వారి నందరినీ సంహరించాడు. ఆపాపాన్ని పోగొట్టుకొనడానికి అశ్వమేధయాగాన్నిగావించాడు. అనంతరం మహర్షులందరినీ పిలిచి "మహాత్ములారా! నాయీపాపం పోవాలన్న మార్గం చెప్పండి?" అన్నాడు. "భార్గవరామా! పవిత్రుడైన అగ్ని హోత్రుని రూపుతోనున్న బంగారంలాగ దేవతలుంటారు. కనుక బంగారం దానం అన్నిదానాల్లోనూ ముఖ్యమైనది. దీనికి మునుపు జరిగిన చరిత్ర చెప్పుతాను విను విను. పరమశివుడు. పార్వతీమాతయే కాంతంగా ఉండే సమయములో అగ్ని వచ్చాడు ఆయేకాంతాన్ని పాడుచేశాడు. యింతలో శివుని వీర్యం పడింది. "అగ్నిదేవా! నీవీవీర్యాన్ని నీలో ఉంచుకొన"మనగా, ఆవీర్యాన్ని తనలో ఉంచుకొనడం వలన అగ్నికి యెంతోనిద్ర వచ్చింది. దాంతో ఆతడు ఒక సరసులో నిద్రపోతుండగా, అక్కడ తారక రాక్షసుడుముల్లో కాలను అల్లకల్లోలంగావింపగా వారు బ్రహ్మదగ్గర మొరపెట్టుకొన్నారు. బ్రహ్మఅగ్ని దగ్గరకు వెళ్లారు. అక్కడ నుండి రావిచెట్టులో నిద్రింపసాగాడు.

తరువాత శమీవృక్షంలో దూరాడు. మొత్తంమీద దేవతలు విడువకుండా కడకు అగ్నిదేవుని పట్టుకున్నారు. మీకేంకావాలో చెప్పమన్నాడు ఆతడు. తారకుని వధించాలి అన్నారు. అగ్ని శివుని వీర్యాన్ని గంగలో వేశాడు. అదిభరించలేక బంగారుగిరి సమీపానగల దర్భలమీద దాన్ని విడువగా, దాని నుండి బంగారు రూపుతో ఆరుమోములతో అపూర్వ అద్భుతబాలుడొకడు ఉద్భవించాడు. ఆరుగురు కృత్తికలాతనిని పోషించారు! ఆతడే కుమారస్వామి! దేవతలందరూ ఆతనిని పూజించారు. ఆతడే తారక సంహారంగా వించి, లోకాలకుమేలు కూర్చాడు.

### దీపం - ధూపం - నైవేద్యాలు

"ధర్మరాజా ! వీటివిశేషాలు పూర్వము బలిచక్రవర్తికి శుక్రాచార్యులు తెలిపాడు. మనువుకాతడు, ఆతడు సుపర్ణ మహర్షికి, ఆతడు నారదునకు, నారదుడు నాకు తెలిపాడు. సృష్టిలో ప్రకృతి లెక్కలేనన్ని ఓషధులను ప్రసవించింది. వీటిని అమృత మనికూడా అంటారు. పూలతో భక్తితో భగవంతుని పూజించే వారికి మంచిమనస్సులుంటాయి. యీపూలను "సుమనస్సు" లంటారు. దేవతలను కూడా "సుమనసు" లంటారు. సువాసనకలిగి ఉంటాయి పూలు. ముళ్లులేని పూలంటే దేవతలకెంతో సంతోషం. యిలా ధూప దీపనైవేద్యాలు దేవతాపితృదేవతారాధనకు యెన్నోపనికి వచ్చేవి ఉన్నాయి" అన్నాడు.

### ఆయుర్వృద్ధి

మంచి ఆచారం గల వారికి ఆయుష్షు బాగా పెరుగుతుంది. మంచి కీర్తిని కూడానిస్తుంది. ముఖ్యంగా మానవులు వర్ణాశ్రమధర్మాలను బాగా పాటించాలి. సద్గురువును సేవించడం. సూర్యభగవానుని ఉదయిస్తున్నప్పుడు, అస్తమిస్తున్నప్పుడు చూడకూడదు. పరస్త్రీసంగమం ఆయువును హరిస్తుంది. నలుగురూ నడిచేమార్గంలో, దేవతామందిరాలదగ్గర, పంటలు పండే భూమిలో మూత్రాన్నిగాని, మలాన్నిగాని విడువరాదు. కాళ్లను బాగా కడిగి, చేతులు కడిగి, వాటి తడి ఆరకూడా తూర్పు ముఖంగా భోజనముగావించాలి." అనియిలా చెప్పాడు.

### పార్వతీ పరమేశ్వరులు

హిమాచలానికి వచ్చి, పచ్చగాకనులకెంతో ఆనందంగా ఉద్యానవనాన్ని అక్కడ తిలకించాను. అక్కడ స్వర్ణవేదికపై నందీశ్వర, భృంగీశ్వర - చండీశ్వరాదులు, దేవగణసేవిత పరమశివుని దర్శించి నమస్సులర్పించాను. యిలా ఉండగా పార్వతమ్మవారు చెలులతో వెనుక నుండి వచ్చి పరమశివుని నేత్రాలు హస్తాలతో మూసింది. యిక చూడండి - సూర్య చంద్రులు - నక్షత్రాలూ లేక లోకమంతా చీకటి మయమయింది. సర్వజీవులూ, అల్లకల్లోలమైనాయి. యింతలో పరమశివుడు తనమూడవనేత్రాన్నివిప్పాడు. యింకేముంది? ఆనేత్రాగ్ని జ్వాలలు హిమాచలమంతటినీ కాలుస్తున్నాయి. తనపితృదేవుడలా కాలిపోతుండగా చూడలేని పార్వతీ దేవి ముందుకు వచ్చి శివుని పాదపద్మాలపై వ్రాలింది. అప్పుడు శంకరుడు



ప్రసన్నదృష్టి ప్రసరింపచేయగా ఆమంటలన్నీ చల్లారిపోయాయి. "ప్రభూమీరు మీ అగ్నినేత్రాన్ని యెందుకిప్పుడు విప్పారు?" అనగా; "గిరిజా! నీవుసరదాగా నేత్రాలు రెండూనావిమూశావు. అవిసూర్యచంద్రులు, లోకాలన్నీ అల్లకల్లోలమయింది. అందుకు మూడవనేత్రం విప్పానంతే" అన్నాడు.

"పార్వతీ! ఒకప్పుడు సుందుడు - ఉపసుందుడను రక్కసులుండేవారు. వారిద్దరు యెటువంటి ఆయుధాలచేత చావులేని గొప్పవరాలు పొందారు. వారిని యెలాగైనా చంపకపోతే వారిరువురూ కలిసిలోకాలన్నిటినీ బాధించుతున్నారు. మయుని పిలిచి" "మయబ్రహ్మ! నీవు సృష్టిలో నున్న అందాలలో తిలంతలేసి (నువ్వుగింజంత) తీసికొని గొప్ప అంగంగల కాంతనుసృష్టించు" అనగా ఆతడు అలాగేసృష్టించాడు. ఆమెకు "తిలోత్తమ" అని పేరుంచాడు. ఆమెనాకు ప్రదక్షిణ చేసింది. ఆమెను చూసి "యీమెసుందోపసుందులను పరిమారుస్తుందా?" అని ఒకొక్కముఖంతో ఆతిలోత్తమను నేను చూశాను. నాలుగు సార్లు నాలుగుముఖాలు నామోలు ముఖముతో నేను పంచముఖుడనయ్యాను.

ఆమె కోసం ఆయిద్దరు రాక్షసులు బాగాకొట్టుకొని చనిపోయారు" అని యింకా సందేహముంటే అడగమన్నాడు పరమశివుడు. "ప్రభూ! మీశరీరమంతా తెలుపు కంఠం మాత్రం నలుపే"మని గిరిజ అడిగింది. "పార్వతీ అమృతమునకు దేవతలూ, రాక్షసులూ పాలసముద్రాన్ని తరచినప్పుడు హాలాహలం పుట్టింది. అదిలోకాలనన్నిటినీ కాలుస్తుందని నాకంఠంలో దానిని నేను నిలుపుకున్నాను" అన్నాడు శంకరుడు. "శంకరా! అశుచికిమారుపేరైన శ్మశాన వాటికలో ఉంటారేమి?" అని గిరిజ అడిగింది. "పార్వతీ! మహాఘోరమైన భూతాలు ప్రజలనందరినీ యెన్నోవిధాల బాధలు పెట్టగా, వాణీపతి నాదగ్గరకు వచ్చి వీటిని అదుపుచెయ్యమన్నాడు. అప్పుడు ప్రశాంతమయిన స్థలము శ్మశాన వాటికే అగుట అక్కడనివాసం యేర్పాటు చేసికొని భూతాలనన్నింటినీ అదుపులో ఉంచుకుంటాను. అంతేకాదు భూతాలు కూడా శ్మశానములో ఉంటాయికాబట్టి అక్కడుండడమే శ్రేయము." అనగా యెంతో సంతోషించింది." అన్నాడు భీష్ముడు.

### శ్రీకృష్ణుని చరిత్ర

"ధర్మరాజా! మీబావ శ్రీకృష్ణ పరమాత్ముని చరిత్ర చాలా చిత్రంగా ఉంటుంది. ఆతడు రుక్మిణీ దేవిని వివాహంగావించుకున్నాడు. వారికి యెప్పటికీ సంతానంలేదు. తపస్సు చేయడానికి శ్రీకృష్ణుడు బయల్దేరగా రుక్మిణీ వస్తానంది. అలా యిరువురూ కలిసి హిమాలయ పర్వతందగ్గర పుష్కరవ్రతము చేయడానికి పూనుకున్నారు.

అలా మహత్తర దీక్షా దక్షులై శ్రీకృష్ణదంపతి తపస్సుగావిస్తున్నారు. శ్రీకృష్ణ పరమాత్మ మహాతపస్సును తిలకించడానికి వాల్మీకి - వ్యాస - కశ్యపమహర్షులు శిష్యప్రశిష్యులతో వచ్చారు. వారిని గౌరవాదరపూర్వకముగా శ్రీకృష్ణుడు సమ్మానించి సత్సంగము గావిస్తుండగా హఠాత్తుగా శ్రీకృష్ణుని నోటినుండి ఘోరమైన అగ్ని వచ్చి,

ఆయగ్ని ఆహిమాచలపర్వతాన్నంతా కాల్చసాగింది. అంతలో శ్రీకృష్ణుడు ఆకాలాగ్నిని ప్రసన్నంగా తిలకింపగా వెంటనే చల్లారి. హిమాచలం పూర్వవైభవముతో కనులకానందంగా కానుపించింది. యిదంతా మహాద్భుతంగా చూసిన ఆమహర్షులకు "మహర్షులారా! ఒక రాక్షసుడు నాగూర్చి ఘోరమైన తపస్సుగావింపగా, ఆతనికి అనేకాస్త్రాలుయిచ్చాను. వాడు అహంకారం, గర్వంతో సమస్తలోకాలనూ బాధింపసాగాడు. వాడిని సంహరింపగల కుమారుడు పుట్టడానికి యీ పుష్కరవ్రతము తపమూ గావిస్తున్నాను.

నా ఆత్మే ఆ అగ్ని రూపాన్ని ధరించింది. అది వాణీపతి దగ్గరకు వెళ్లింది. దాంతో బ్రహ్మదేవుడు మన్మధుని నాకు కుమారునిగా జన్మింపమని పంపాడు. ఆమహాగ్ని అలావస్తూ, తన ఘోరతర ఉగ్రరూపాన్ని ఆపుకోలేక యీ అందము చిందించువనాన్ని దగ్ధముగావించింది. అందువలన నాప్రశాంత దృష్టితో ఆర్పివేశాను" అనగా; వారందరూ ఆశ్చర్యమందారు. "దేవ దేవా! ముల్లోకాలనూ సృష్టించి, పోషించి, నశింపచేయగల త్రిమూర్త్యాత్మకుడవు" అనిపొగిడారు" అని భీష్ముడు చెప్పాడు.



"ఓజనమేజయ మనుజాధిపా! యిలా గంగానందనుడు ధర్మరాజుకు లెక్కలేనన్ని చరిత్రలు దానధర్మాలు యెన్నోచెప్పాడు. యింతలో దక్షిణాయనము వెళ్లింది. మహాపుణ్యకాలం ఉత్తరాయణం రానే వచ్చింది. శ్రీకృష్ణపరమాత్మను జూచి "నందనందనా యీపుణ్యకాలంలో భౌతిక శరీరాన్ని త్యాగంగావించడానికి నీ ఆనుజ్ఞ దయచేయుము ప్రభూ!" అంటూ ప్రార్థించాడు భీష్ముడు శ్రీకృష్ణ పరమాత్మను.

**ఫుట్ నోట్**

మహాభారత యుద్ధం. కార్తీకబహుళ త్రయోదశితోకూడిన అమావాస్యదినాన ప్రారంభించబడి సరిగా పదునెనిమిది దినాలు మహాభయంకరముగా జరిగింది. అనగా పూర్ణిమ పోయిన తదియనాడు శకుని చావుతో పూర్తయింది.

భారతయుద్ధం మొదలైన పదిదినాలు భీష్ముడు మహాభయంకరముగా, పదిరోజులు యుద్ధముచేసి పితృదేవతనక్షత్రం అశ్వినీ నక్షత్రందినాన పడిపోయాడు. యోగసిద్ధుడగుట ఉత్తరాయణ పుణ్యకాలం వరకూ తన భౌతిక శరీరాన్ని విడిచిపెట్టలేదు. సూర్యభగవానుడు ఉత్తరదిశగా తిరుగగానే

**"పరివృత్తోహి భగవాన్ సహస్రాంశుర్దివాకరః**
**మాఘోయం సమనుప్రాప్తో మాసస్సౌమ్యం యుధిష్ఠిర!**
**త్రిభాగశేషః పక్షోయం శుక్లోభవితు మర్హతి" (అనుశా - (167 - 20 - 27)**

"ఓయుధిష్ఠిరా! సూర్యభగవానుడు ఉత్తరగతిని పొందాడు. యిది మాఘమాసం ప్రారంభమయి శుక్లపక్షం యింకామూడు భాగాలు మిగిలుంది" అన్నందువల్ల ఆదినం మాఘశుద్ధసప్తమి, సూర్యుని ఉత్తరాయణ ప్రవేశకాలంగా చెప్తుతుంది. ధర్మరాజు ఆరాత్రి హాయిగా పడుకొని మరుదినము యాభైరోజని గుర్తువచ్చి



**"ఉషిత్వా శార్వరీ శ్రీమాన్ పంచాశన్ నగరోత్తమ**
**సమయం కౌరవాగ్రస్యసస్మారపురుషర్షభం" (అనుశా - 13 - 253)**

దీనిని బట్టి చూడగా మహాభారతకాలములో మాఘశుద్ధసప్తమినాడు (రథసప్తమి) ఉత్తరాయణ పుణ్యకాలంగా తెలియాలి. ఆ మరునాడు మాఘ శుద్ధ అష్టమినాడు రోహిణీ నక్షత్రములో గాంగేయుడు యోగమార్గంలో తనశరీరాన్ని విడిచాడు.

**"శుక్లపక్షస్యచాష్టమ్యాం మాఘమాసస్య పార్థివ**
**ప్రాజాపత్యేచ నక్షత్రే మధ్యం ప్రాప్తే దివాకరే"**

"మాఘశుద్ధ అష్టమినాడు రోహిణీ నక్షత్రం ఉందని ఆదినం మధ్యాహ్నం పన్నెండు గంటలకు సూర్యుడు ఆకాశం నడిమింటనుండగా (మధ్యం ప్రాప్తే దివాకరః) భీష్ముని శరీరత్యాగం సింహలగ్నంలో రోహిణీ నక్షత్రమందు అభిజిన్ముహూర్తములో ఉత్తరాయణ పూర్వకాలములో జరిగింది. ముగిసింది.

**భీష్మయేకాదశి**

యింక యీ భౌతిక కాయంతో ఉండాలనిలేదు. అన్నాడు. "ఓమహానుభావా! నీవు అష్టవసువులందు ఒకడవు. కొన్నికారణాలవల్ల మనిషిగా పుట్టావు. నీవు పూర్వం వసువులోనికేవెళ్లు" అన్నాడు కృష్ణుడు. వ్యాసమహర్షి, ధృతరాష్ట్రుడు, ధర్మరాజు, విదుర, సంజయులందరనూ పేరు పేరున పిలిచి భీష్ముడుసవినయముగా వారినందరినీ ఆనందంతో తాను వెళ్లడానికి అనుమతి నిమ్మని అర్థించాడు. "మీరందరూ యెప్పుడూ శ్రీకృష్ణపరమాత్మను మరువకండి" అని శ్రీకృష్ణునినేత్రాలనూ యేకాగ్రతతో తిలకిస్తూ యోగాన్నిపొందారు. ఆతని తల బ్రద్దలైప్రాణవాయువును విడిచాడు. దివినుండి దేవదుందుభులు మ్రోగాయి. మహేంద్రాది దేవతలందరూ పూలవర్షం ఆభీష్మునిపై కురిపించారు.

పాండవులైదుగురు గాంగేయుని శవముపై పడి భోరుమని విలపించారు. ఆతని భౌతిక కాయాన్ని మోస్తూశ్మశానానికి తీసుకొని వెళ్లారు. మంచి గంధపు తరువులపై పేర్చిన చితిమీద ఆకాయాన్నుంచారు. ఆతని తలకు నిప్పంటించి చితికి ముమ్మారు ప్రదక్షిణగావించి గంగానదిలో స్నానాలు గావించారు. ఆతనికి తిలోదకాలిచ్చారు. గంగామాతవచ్చింది. ఆమెకనులలో దుఃఖాశ్రువులు జాలువారుతున్నాయి. తన కుమారుని యింక చూడలేనని యెంతగానో యేడ్చింది. అప్పుడు వ్యాసమహర్షి "అమ్మా! గంగాదేవీ! నీవంటి ప్రాజ్ఞురాలే యిలా యేడిస్తే యెలాగ? నీపుత్రుడు ఒకపనిమీద వచ్చాడు. వచ్చిన పని అయిపోయింది. తానెక్కడనుండి వచ్చాడో! మరల అచ్చటికే వెళ్లాడు.

ఆతని శాశ్వతస్థానము అదే! అనగా గంగా దేవి శాంతించింది. యికధర్మరాజును యెవరూ ఓదార్చలేకున్నారు. భోరున విలపిస్తూ బాల్యమాది

మమ్మెత్తుకొని, ఆదరానురాగాలతో, తండ్రి లేని మమ్ము పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించి, మాకన్ని విధాల బాసటై మమ్ముపోషించే తాతగారు మరిలేరు. మాకు పెద్దదిక్కెవరు? వ్యాసులవారిని చూచి "మహాత్మ! మేమింక యెలాగ జీవించాలి? అందరూ పోయినా, తాతగారున్నారన్న ధైర్యంతో జీవిస్తున్నాం. వీరింక కరువయ్యారు" అని యేద్వగా "ధర్మరాజా! భీష్ములవారితో యెన్నో విన్నావుకదా! యింకశోకాన్ని విడువు" అని ఓదార్చారు.

ఇది మహాభారతములో అనుశాసనికపర్వం ముగిసింది





# సంపూర్ణ మహాభారతం

## అశ్వమేధ పర్వము



### ధర్మరాజు అశ్వమేధయాగం

"జనమేజయభూపాలా! విను. వ్యాసభగవానుని ఆశీస్సులతో అందరకూ పితృకార్యాలను సశాస్త్రీయముగా ధర్మరాజు నిర్వర్తించినా, భీష్మాచార్యులు, కర్ణుడు అనుక్షణం కన్నుల్లో మెదులుట వలన ధర్మరాజుకు కొంచమైనా శాంతిమాత్రం చేకూరలేదు. వ్యాసులవారెన్నో విషయాలు చెప్పినా మనస్సు అతనికి ఊరటపడలేదు. అప్పుడిలా అన్నాడు. ॥పాండవాగ్రజా! నీవు శాంతించడానికి మార్గముంది. ॥ అశ్వమేధయాగాన్ని నీవు తప్పకుండా చేయాలి.దాని మూలంగా నీమనసు కుదుటపడుతుంది. అనగా ॥ "దివ్యర్షివర్యా! తమవాక్కులు శిరోధార్యముగా స్వీకరిస్తాను. అయినా దానికి ధనమెంతోవ్యయమవుతుంది. అంతేకాదు రాజులందరూ యుద్ధములో మా ఇరుపక్షాలకు వచ్చి అందరూ అసువులుబాశారు.

యింకా వారివారి భార్యాబిడ్డలు దుఃఖాలతోనే ఉన్నారు. అటువంటప్పుడు వారిమీదపడి ధనాన్ని దోచుకోవడం యేమిబాగుంటుందితాతా? అదీగాక దుర్యోధనుడూ యేదోఒక నెపము మీద రాజులందరిపైబడి వసూలు చేసేవాడు. మనమూ ఇప్పుడు వారినడిగితే వారు భాధపడతారు. మొత్తంమీద అందరి ఖజానాలు ఖాళీ అయ్యాయి. యుద్దానికి జననష్టంతో పాటు ధననష్టంఎంతయింది. ఇదంతా ఆలోచిస్తే ఈ యాగము ఎలా చేయగలుగుతాము? అందువలన ఈ యాగముచే యడానికి సుగమమార్గంకూడా తమరే ఆలోచించాలి. నాకుమాత్రం యేమీతోచడంలేదన్నాడు ధర్మరాజు నిస్పృహతో.

"నాయనా! పూర్వం మరుత్తుడను మహారాజు యెవరూ చేయని ఒకయాగాన్ని చేశాడు. యిక ఆయాగానంతరం బ్రహ్మజ్ఞులకు లెక్కలేనంత రొక్కం బొక్కసం నుంచి తీసి దానధర్మాలు చేశాడు. యిక ఆయన యిచ్చిన ధనము విపరీతమౌట చేత, బంగారంమరీ యెక్కువగుట చేత యీబ్రహ్మవేత్తలు బంగారాన్ని అందరూకలిసి ఒకచోటనిధిగా పాతిపెట్టారు. "యీనిధిని తెలిసి దీనిని యెవరు తీసుకుంటారో! వారికే యీనిధిచెందుతుంది" అని శాసనంవ్రాసిపెట్టారు. అలాగే హిమగిరి దగ్గర ఉన్న నిధినీ తీసుకొనవచ్చునని వ్రాశారు. అందుచేత నీవు అశ్వమేథయాగాన్ని తక్షణం ప్రారంభించు" అన్నాడు వ్యాసభగవానుడు.

యీవిషయాన్ని ధర్మరాజు తమ్ములతో చెప్పగా సరేనన్నారు. వ్యాసులవారిని నిధికి వెళ్లినప్పుడు రమ్మని ప్రార్థించారు. తరువాత గాంధారీ ధృతరాష్ట్రులకు వారికి నమస్సులర్పించి, వారి అనుమతి కూడా తీసికొన్నారు. ధర్మరాజు సోదరులతో ప్రయాణమై యుయుత్సుని రాజ కార్యములు నిర్వహింపమని శాసనం గావించాడు. ధౌమ్యులవారితో హిమగిరి దగ్గరకేగిన వ్యాసులవారు ప్రత్యక్షమయ్యారు. ఆనిధిలో గల బంగారు నాణేలు, బంగారు కడ్డీలు మొదలైనవన్నీ ఏనుగులు, గుఱ్ఱాలు, కంచరగాడిదలపై వేసి వాటిని హస్తినాపురానికి పంపారు.



## మృతశిశువుగా పరీక్షిత్తు

శ్రీకృష్ణుడు యజ్ఞముపేరుతో హస్తినకు వచ్చాడు. యుయుత్సుడు స్వాగతంతో ఆయనకు అర్ఘ్యపాద్యాదులు సమర్పించాడు. ద్రౌపదీ - గాంధారీ ధ్రుతరాష్ట్రాదుల - సుభద్రను పలకరించి, తాను తనవిడిదిలో విశ్రమించాడు. ఉత్తరకు పురిటి నొప్పులు వచ్చాయి. "మగశిశువును ఉత్తరకన్నదని" వృద్ధాంగనలు అన్నారు.

అందరూ ఆనందించారు. అంతలోనే ఆశిశువుచనిపోయాడని చెప్పారు. దాంతో ఆడవారందరూ యేడవడం ప్రారంభించారు. అందరూ శ్రీకృష్ణుని చూశారు. "కృష్ణా! సర్వమూ నీదే! మాకెవ్వరూ లేరని" యెలుగెత్తి అందరూ యేడ్వడం ప్రారంభించారు. "అప్పుడు మీరెవ్వరూ యేడవ"ద్దని పురిటి గదిలోనికి వెళ్లాడు. ఉత్తరకృష్ణుని పాదాలు పట్టుకొంది." నేనెప్పుడూ బ్రహ్మవేత్తలనే గొల్చినవాడనేని, యీబిడ్డబ్రతుకుగాక!" అని శ్రీకృష్ణుడు అనగానే ఆశిశువువెంటనే యేడ్వడం ప్రారంభించాడు. తరువాత సంతోషముతో బిడ్డను తెచ్చి శ్రీకృష్ణుని పాదాలపై నుంచింది. కృష్ణుడు సంతోషము ఆబిడ్డకు మణిమయ సువర్ణ రత్న భూషణాదులను యెన్నోసమర్పించాడు.

## ధర్మరాజాదులు ధనముతో రావడం

కొన్ని రోజులకు హిమగిరిప్రాంతం నుండి ధర్మరాజాదులు ఆమణిమయ సువర్ణరాశులతో హస్తినకు వచ్చారు. ఎదురుగా యుయుత్సాదులు వారికి పరమానందంతో స్వాగతించారు. జరిగిన విషయానికి మోదంగాంచారు. మంచి సుముహూర్తాన యజ్ఞప్రారంభానికి లేచారు. మంచి సుముహూర్తానకు



యజ్ఞప్రారంభానికి ముందుగా వ్యాసభగవానుడు వచ్చాడు. ఋత్విక్కులు యాగదీక్షితులయ్యారు. ధర్మరాజు ఒకనారచీరభుజాన దాల్చి, యింకొక భుజాన లేడి చర్మాన్నిదాల్చాడు. శాస్త్రపద్ధతిగా అశ్వాన్ని సిద్ధంగా నుంచారు దానిఫాలమందు "పాండవాగ్రజుడు ధర్మరాజు చేయసంకల్పించిన అశ్వమేధయాగాశ్వము. వీరులైన వారు దీనిని రాజులెవరైనా పట్టుకొనవచ్చు. దీని వెనుక విజయుడు సమస్త సేనతో వేంచేయుచున్నాడు" అని లిఖించి ఆ అశ్వాన్నివిడిచారు. ఉత్తరముగా వెళ్లి త్రిగర్తదేశానికి వచ్చింది.

కౌరవులకు యుద్ధములో మహాబలముతో పాండవుల నెదిర్చిన సుశర్మసంతానము యీత్రిగర్తదేశపాలకులైయున్నారు. వారు గర్వంతో యాగాశ్వాన్ని ఆపారు. అప్పుడు అర్జునుడు సానునయముతో "మనము మైత్రిని పాటిద్దామని" యెంత చెప్పినా వారువినలేదు. వారినందరనూ తనగాండీవం వానితో యెదిరించి విజయం పొందాడు. అర్జునుని దెబ్బలు తిని బుద్ధివచ్చి, వారందరూ అర్జునుని శరణుకోరారు. అర్జునునితో వారు మైత్రిచేసికున్నారు. మహాభారత యుద్ధములో చనిపోయిన భగదత్తుని కుమారుడు

ఆతడు అర్జునుని యెదిరించి నాలుగు రోజులు యుద్ధముగావించాడు. అయిదవనాడు సంధిబేరానికి వచ్చాడు. తరువాత సైంధవుని దేశం సింధుదేశానికి గుఱ్ఱంచేరింది. సైంధవుని బంధువులందరూ కలిసి అర్జునుని యెదిరించారు. వారినందరనూ చావకొట్టాడు. అర్జునుడు. యీవిషయం దుస్సలకు తెలిసితనమనుమలను రక్షింపుమనగా అర్జునుడు "సోదరీ! మనరెండువంశాలకూ ఆడబిడ్డవు. నీకేమీభయము లేదని" అభయమిచ్చాడు. గుఱ్ఱం మణిపురం చేరింది. మణిపురం పాలకురాలు చిత్రాంగదసుతుడు బభ్రువాహనుడు అర్జునునికి పుట్టినవాడే. తనతండ్రికి స్వాగతం పలికి అనేక మణిమయ భూషణాలర్పించి అర్జునుని ఆశీర్వదింపమన్నాడు. తరువాత యుద్ధంగావించారు యిద్దరూ. పాతాళంలో నుంచి నాగరాజుకుమార్తె అర్జున బభ్రువాహనుల యుద్ధాన్ని దివ్యదృష్టితో తెలిసి వచ్చి "కుమారా! నీయుద్ధాన్ని చూడాలని వచ్చాను - యింకచాలించి వారి ఆశీస్సుపొందు" అనగా అలాగే అభివందన చేశారు. బభ్రువాహనుని బాణాలు గుచ్చుకొని అర్జునుడు చనిపోయాడు. నాగకుమార్తె ఉలూచి "ప్రాణేశ్వరా! అని అంతకుముందు జరిగిన చరిత్రంతా చెప్పించి. మీకు రాబోవు ఒక ప్రమాదం తెలిసి యిలా చేశాను" వసువులు మీపై ఆగ్రహించారు.

## అర్జునుడు - వసువులు

"మనఃప్రియా! అష్టవసువులలో "ప్రభాసుడు" వశిష్ఠమహర్షి శాపమూలంగా గంగాపుత్రుడు భీష్ముడుగా పుట్టాడు. భారతయుద్ధములో భీష్ముని నీవు శిఖండిని ముందుంచి భీష్ముని పతనంగావించావని తెలిసి తక్కిన వారంతా కక్షగట్టి శపించాలని అనుకొనుచున్నారు. ఆకాశగంగ కూడా తనపుత్రుడు పోయినందులకు కుమిలి

యేడ్చింది. అందుకొరకు నాపితృదేవుడు నాగేంద్రునికి చెప్పియెలాగైనా నాభర్తను బ్రతికింపవేడ ఆతడు వసువుల దగ్గరకు వెళ్లియెంతగానో కాళ్లావ్రేళ్లా పట్టుకొని వేడుకొనగా చివరకు వారు నిన్ను అనుగ్రహదృష్టితో చూచారు. చిన్ననాటి నుండీ పెంచిపోషించిన తాతను అక్రమపద్ధతిలో అంతమొందించిన అర్జునుని విడువకూడదనుకున్నాం. కాని నీవింతగావేడినాడవు. అందుకు క్షమించాము.

యిక తనపుత్రుని వలన చంపబడితే మాత్రం అర్జుననకు మాశాపాలు యేమీపనిచేయవు" అని వసువులు మాతండ్రికి చెప్పారు. నాతండ్రినాకు చెప్పాడని జరిగిన దంతా ఆమె అర్జుననకు చెప్పింది. అప్పటినుంచీ మీచావును తప్పించాలని ఆలోచిస్తూనే ఉన్నాను. చివరకు నామాయతో బభ్రువాహనుని పౌరుషమెక్కి యుద్ధానికి పంపాను. ఆతని నాగాస్త్రము వలన మీప్రాణాలు పోయాయి. నాదగ్గర ఉన్న జీవమణితో మిమ్ము యెలాగోబ్రతికించుకోగలిగాను. మీ దగ్గరనాకుగల అతి చనువుతో యీలాగు చేసిన నా సాహసానికి మీరు మన్నించాలని" ఉలూచి చెప్పింది.

ఉలూచిగావించే యీ అతిసాహసానికి బభ్రువాహనుడు, అర్జునుడు, చిత్రాంగదలు మూర్ఛలోమునిగి కొంతసేపటికి తేరుకోగలిగారు. తన ప్రియురాలైన ఉలూచిని అర్జునుడు యెంతగానో అభినందించాడు. వారందరూ పట్టుపట్టి కొన్ని రోజులుండమని అన్నగారి అశ్వమేధయాగకారణంగా, అర్జునుడు వారందరికీ ఆశీరుపాయనలిచ్చి అనుగ్రహించి అశ్వమువెంట ప్రయాణంకట్టాడు. "రాజగృహపురం" అనునగరానికి గుఱ్ఱముచేరింది. జరాసంధునిమనుమడు ఆరాజధానిని పరిపాలిస్తున్నాడు. ఆతడు గుఱ్ఱాన్ని బంధింప అర్జునుడు యెంతగా చెప్పినా ఆమూర్ఖుడువినలేదు. తుదకు వాడిబాణాలు అర్జునునికి వాడికి మైత్రిగావించాయి.

తరువాత అశ్వము శిశుపాలునికుమారుడు శరభుడు యుద్ధాన్ని చేయాలనుకొని అదిసాధ్యపడదని అర్జునుని శరణు జొచ్చాడు శరభుడు. గుఱ్ఱము టెంకణ, కిరాటదేశాలలోనికి వెళ్లింది. వారందరూ అర్జున శరణాగతులయ్యారు. ఆతరువాత నిషాద, పౌండ్ర, ఆంధ్ర, ద్రవిడ, కేరళ, కర్ణాటాది దేశాలలో ప్రయాణించింది అశ్వము. వీరందరూ అర్జుననకు వసులయ్యారు. అలా అందరిరాజులనూ జయించి అర్జునుడు వారిడు బహుమానాలు యేనుగులు గుఱ్ఱాలపై వేసి హాయిగా అశ్వముతో అనందంగా హస్తినకుచేరాడు. ఆ తమ్ములూ, అన్నలు, అందరూ యెంతగానో అభినందించారు అర్జునుని.

## ధర్మరాజ అశ్వమేధయాగము

ధర్మరాజు బలరాముడు - కృష్ణుడు - వ్యాసాది దివ్యర్షులు, బభ్రువాహనాది బంధుసంబంధీకులతో యాగాన్ని ప్రారంభించాడు. నానాదేశాలనుంచి వచ్చిన, మహారాజులకు, కవి - పండిత - వేదపురుషులకందరకు అన్నివిధాలైన వసతులతో, సకలభోగాలూ యేర్పాటుగావించారు. వరుణుని కటాక్షముతో చెరకు రసముమొదలైన శీతలోదకాలు తయారుచేయించారు. గంధపుజలాలు అందరి మీదజల్లారు; అతిథులందరికీ ఆసనాలు సమకూర్చారు. పండుకోవడానికి శయ్యలు యేర్పాటుగావించారు. తడుపులకు మంచివస్త్రాలు, రాజులకు ఛత్రచామరాదులు సమకూర్చారు. షడ్రషభోజనాలు పచనాలు కూర్చారు.



ఘనులైన అతిథులు లెక్కలేని విథంగావచ్చారు. మాంసము. మధుద్రవాలు, సిద్ధముచేశారు. సురా, మైరేయ ఇక్షురసపానీయాలు ప్రవహించునట్లుచేశారు. ఒకచోట వీణానాదాలు, దేవగంధర్వగానాలమించునట్లు గానాలు హాయిగా వినిపింపసాగాయి. అప్సరసలవంటి స్త్రీల నాట్యాలు, మనోహరంగా ఉన్నాయి. అతిథులగౌరవార్థం పూలహారాలు తెచ్చారు. ఆకలితో నున్నవారికి పాయసాలు, సుర కావలసిన వారికి అవి, మాంసాహారులకు మాంసాలు, ఒక్కొక్కరికి తైలమంటారు; నలుగు పెట్టి స్నానాలు చేయించడానికి స్త్రీలు నియమింపబడ్డారు. రాజుల గజాలకు, గుఱ్ఱాలకు తగినట్లు యేర్పాట్లుగావించారు.

బాగా త్రాగిన ఆసేనలు తనగుఱ్ఱమేదో, యేనుగేదో తెలీకుండా ఉన్నారు. ఆయజ్ఞాన్ని చూడ్డానికి వచ్చేవారందరూ తెల్లని ఉడుపులు దాల్చారు. అనేక ఫలరసాలు, కన్నులచెదరినట్లున్న తెల్లని అన్నం, పాయసాలు యేరుల్లా బురదగా పారుతున్నాయి. మంచిపాలు, తేనెలు, వెలకొలది బంగారు గిన్నెలు, చిక్కని పెరుగు, వెలగపండు గుజ్జులు, పాయసాలు, కంఠస్నానము, శిరస్నానము, అభ్యంగన స్నానము చేసినవారికి నూతనవస్త్రాలు, చందనముతో నిండున్నగిన్నెలు, మంచి అద్దాలు, యిలా చెప్పలేనన్ని యేర్పాట్లుగావించారు. జనమేజయరాజా! చేస్తున్నాడు.

వచ్చిన అతిథులకు యేమికావాలో క్షణాలమీదవారికి అందేలాగు చేస్తున్నసేవకులకు యిది రాత్రీ, యిది పగలూ, అని తెలియకుండా నడుము వాల్చకుండా పనిచేస్తున్నారు. హస్తినాపురములో నున్న ఆబాలగోపాలం అశ్వమేథయాగమును నానాదేశాలనుంచి చూడవచ్చే వారి సంఖ్యరోజురోజుకూ పెరగడంతో మరీసందడితో సందర్శకులకు సంతోషంతో సకలమర్యాదలూ, సానుకూలంగా, సమకూర్చు సహృదయాలను చక్కగా మెచ్చుకొంటున్నారు. భోజనశాలలో భీముని సంగతి చెప్పనక్కరయేలేదు. భోజనాలు చేస్తున్నవారు, లేచినవారు, యికవడ్డన సకల పదార్థాలూ, అందరకూ అందుతున్నాయాలేదా, పర్యవేక్షకులు వేయికళ్లతో కనిపెట్టసాగారు. విడుదులు అతిథులకు అనుకూలించేలాగు, పరిచారికలు వారందరికీ, కావలసినవన్నీ సకాలంలో అందించేవారు అందరూ యెంతో ఉత్సాహంతో పనిచేసేవారు. యిక యాగశాలలో రాత్రీపగలూ ఋత్విక్కులు వేదగానాన్ని విని సందర్శకులు పరవశించేవారు. చూసిన వారెంతో మెచ్చుకొనేవారు.

సువర్ణముతో తయారు చేయించిన అష్టాదశహస్తాల పరిమాణంగల గరుత్మంతుని వలె తయారుచేయు యాగస్థలం. యిరువది రెండు యూపాలతో,

సువర్ణముతో కొన్ని చంద్ర, మానుగు, మోదుగ, దేవదారు, విరుగుడు కఱ్ఱలతో తయారు చేయించారు. యజ్ఞపశువు గుఱ్ఱము ఒక ప్రత్యేక స్థలములో కట్టబడిఉంది. ఆగుఱ్ఱం సమస్త అవయవాలూ, శాస్త్రం ప్రకారం ద్రౌపదీదేవిచే సర్వదేవతలకూ సమర్పించారు. యిక సోదరులందరితో ధర్మరాజు అశ్వం వపాహోమగంధాన్ని ఆఘ్రాణించి యెంతోతృప్తినందాడు. కోటివేలబంగారు నిష్కాలతో వ్యాసభగవానునికి యావద్రాజ్యాన్నీ ధారపోశారు. ద్రౌపదీ – అన్నదమ్ములతో అరణ్యంలో జీవించడానికి ధర్మరాజు నిశ్చయించి వెళ్లబోగా ఆతనిని ఆపారు.

"ధర్మరాజా! నిరంతరం తపస్సుగావించే తాపసులమగు మాకు యీ భారము మోసేశక్తిలేదు. సామ్రాజ్యాన్ని పాలించడం క్షత్రియునకు సాహసికునకే చెల్లుతుంది. సాధువులు సామ్రాజ్యాన్ని పరిపాలించగలరా? అందువలన యీభూమినంతా హాయిగా మీరే పరిపాలింప అర్హులు. ధనమిచ్చి ధర్మరాజు వ్యాసుని దగ్గరకొన్నాడు. ఆధనాన్ని బ్రహ్మవేత్తలందరికీ సమానంగా పంచాడు వ్యాసభగవానుడు. యిలా అశ్వమేధయాగం అద్భుతంగా ముగిసింది. యాగాన్నిచూడడానికి వచ్చిన వారందరూ వెళ్లి పోయారు. బభ్రు వాహనునికి సంతోషముతో అనేక మణిమయ సువర్ణభూషణాలిచ్చిపంపారు. యెక్కడచూసిన ప్రజలందరూ ధర్మరాజు అశ్వమేధయాగాన్ని గూర్చి, ఆయనచేసిన దానాలగూర్చియే చెప్పుకొనేవారు ఉలూచి – చిత్రాంగదలు తమభర్తదగ్గర కొంతకాలం హస్తినాపురములోనే ఉన్నారు. యిలా బ్రాహ్మణులాడు మాటలన్నీవిన్న ఒకముంగిస "ఓద్విజులారా! యిదొకగొప్ప యాగమా? వినండి" అని యిలా చెప్పింది.

## సక్తుప్రస్తుడు

ఒకప్పుడు మనకురుక్షేత్రమందు కుమారుడు, కోడలూ, భార్యాతో ఉండేవాడు. ఆతనికి తపస్సన్న యెంతో ప్రీతి. ఆయవారంచేస్తూ జీవించేవారు. ఒకదినం ఆతనికి పేలపిండేలభించింది. దాంతో వారు సంతృప్తిపొంది ఆదేతినడానికి కూర్చున్నారు. వారు యెంతో ఆకలితో ఉన్నారు. యింతలో వారింటికి ఒక అతిథి ఆసమయానికే వచ్చాడు. సక్తుప్రస్తుడు. ఆతనికి యెదురేగి గౌరవమర్యాదలతో అర్ఘ్యాదులిచ్చి పూజించి తీసికొనివచ్చాడు. ఆవచ్చిన అతిథి "నాకు ఆకలిగా ఉంది" ఆహారం పెట్టండి" అని అడిగాడు. యజమాని తనవాటాకు వచ్చిన ఒకశేరు పేలపిండి ఆతనికిపెట్టాడు. అయినా ఆతనికి క్షుద్బాధ తీరలేదు, సక్తుప్రస్తునిఅర్ధాంగి తనవంతు పిండినీ ఆతనికి పెట్టింది. కుమారుడూ, కోడలి వాటాపిండీ ఆతనికి సమర్పించినా ఆతనిముఖం లేవలేదు.

అప్పుడాతడు తన నిజస్వరూపం యమధర్మరాజుగా అక్కడ సాక్షాత్కరించాడు. "మీ ఉత్తమకుటుంబత్యాగశీలతకు సంతోషముకలిగింది. నేను నీకు ఒకవిమానం పంపుతాను. మీరందరూ బ్రహ్మలోకానికి వెళ్లండి" అని చెప్పి అదృశ్యుడయ్యాడు. సక్తుప్రస్తుడు అతిథికి కాళ్లుకడిగిన తీర్థం భూమిపై పడి ఆపేలపిండి వాసనతో



కలిసి చూడండి నాశరీరం సగం బంగారమయింది. తక్కిన రెండవభాగం కూడా బంగారంగా చేసికొనాలని ధర్మరాజుగారి యాగానికి వచ్చాను. నాశరీరం బంగారమవలేదు. అని అదృశ్యమయింది.

## జనమేజయుని సంశయం

అని వైశంపాయన మహర్షి చెప్పగా, వినిన జయమేజయభూపాలుడు "మహర్షివర్యా! మాముత్తాతగారి యాగము అపూర్వంగా ఉందని దేవతలు, మానవులు అందరూ మెచ్చుకొనుచుండగా యీముంగిసమాత్రం అంతతేలిగ్గా చెప్పడమేమి? ఆముంగిస యెవరు?" అని అడగ్గా యిలా అన్నాడు. "మహారాజా! ధర్మరాజు యాగానికిగాని, దానధర్మాలకు గాని యెవరూ వంకలు పెట్టలేదు. పెట్టరు. అయినా హింసతో గావించే యాగం; అహింసాయుత యజ్ఞం, యింకా తపస్సు చేత చేసిన యాగం గూర్చి చెప్పడానికే ఆముంగిస వచ్చి అలాచెప్పివెళ్లింది. మహాశాపాన్ని పొందిన పరశురాముని తండ్రి జమదగ్ని మహర్షి ఆముంగిస. ఆకథవిను.

"మహారాజా! సామాన్యంగా భృగువంశంలో పుట్టిన వారికి కోపం యెక్కువ. ఆపరీక్షలో జమదగ్ని మహాతపస్వికదా యీతనికోపాన్ని పరీక్షించాలని కోపదేవత ఆతని ఆశ్రమములో చొచ్చింది. ఆరోజు జమదగ్ని పితృతిథి అయినందున క్షీరభాండాలను జాగ్రత్తచేయుచున్నాడు. కోపదేవత నిండుగా ఉన్న ఆపాలకుండలను నేలదొర్లించి పాలన్నీభూమిపాలుచేసింది. అయినా జమదగ్ని యేమీమాటాడలేదు. కోపదేవత ఆతనికాశీస్సులిచ్చి వెళ్లింది. అయినా, ఆయన పితృదేవతలంతా ఆగ్రహోదగ్రులయ్యారు. "ఓరీమూర్ఖుడా! నీవూ మహర్షివేనా? మానిమిత్తం పాలకుండలను తెచ్చావు. ఆకోపదేవతనెత్తిని కొట్టావా? యింత అనాలోచనుడవు నీవు తపోనిధివెలా అయ్యావు. నీవు ముంగిసరూపాన్నిదాల్తువుగాక" అని శపించారు.

జమదగ్ని పితృదేవతలనర్థించి శాపవిముక్తి మార్గంచెప్పమన్నాడు. "జమదగ్నీ! భూజనులందరూ బాగుందని కొనియాడినదాన్ని, అది యేమీబాగులేదని నీవు ఋజువుకావిస్తే నీశాప మిమోచనమౌతుం"దని అలా చెప్పారు. అందువలన ఆముంగిసరూప జమదగ్ని మహర్షి ఆబ్రహ్మవేత్తలతో తనమాటలచమత్కారాన ధర్మరాజు దానవిశారదత్వాన్ని ఆక్రమంగా చెప్పింది. అంతేకాని వేరొకటికాదు. తరువాత విను. యాగానికి వచ్చి బంధుసాగరులను పంపి, ధర్మరాజు పెద్దమ్మ – పెద్దతండ్రులను హృదయపూర్వకముగా సేవిస్తూ, రాజ్యపాలనగావిస్తున్నాడన్నాడు. వైశంపాయన మహర్షి.

**ఇది మహాభారతములో అశ్వమేధపర్వం ముగిసింది**



# సంపూర్ణ మహాభారతం

## ఆశ్రమవాస పర్వము

"మహర్షివర్యా! గాంధారీ – ధృతరాష్ట్రులను పాండవులెలాచూసేవారు? తరువాత వారి చరిత్ర యెలా జరిగిందో తెలుపండి? అని అడిగిన జనమేజయ నృపాలునకు యిలా చెప్పాడు. "మహారాజా! విను. మహాత్ములు, త్యాగనిరతులూ, పరోపకార పారాయణులు – సర్వసమర్థులు – రాజ్యపాలనానిరతులు, మహావీరులు మీముత్తాతల వంటివారు భూపాలురలో యెవ్వరూ లేరు. యిక పెద్దకుమారు ముద్దుచెల్లించి అందరినోళ్లలో పద్దారుగాని స్వతహాగాచాలా ధర్మగుణ, త్యాగులే. దుర్యోధనాదుల దురుద్యమాలకు తలొగ్గి. వీరూ దుష్కర్మరతు లయ్యారు. యింకొకటి ఆదంపతికి వందమంది కుమారులు తమయెదుటే అసువులుబాసినా అణుమాత్రంబాధ పడలేదు. పాండవులు వారికి గావించేసేవ అపారం. యికధర్మరాజంటావా? యేరాచకార్యంగానీ, మరేదికానీ, వారిచెవిలో వేసి, వారౌనన్న తరువాతే ఆకార్యంచేసేవాడు. అన్నీవారికి యేర్పాటుగావించిన అనంతరం తనతమ్ముల సంగతి చూసేవాడు. వారి ఆరోగ్యాదులు ముందుచూసేవాడు. వారిసేవే తనపరమ లక్ష్యంగా భావించేవాడు. వారిరువురూతిన్న తరువాతే వీరి భోజనం, వారు పండుకున్న తరువాతే వీరుపండుకోవడం. అలా చూసేవాడు. అంతేకాదు దుర్యోధనాదులందరూ బ్రతికున్నప్పుడు గాంధారీ ధృతరాష్ట్రదంపతికి మనశ్శాంతుల్లేవు. యే సమయానికి యేముప్పుతెచ్చి పెడతారో! అని యెప్పుడూ బాధలలోనే బ్రతికారు.



ఇప్పుడు అలాంటి దేమీలేదు. వారిరువురకూ హాయిగావేళకింతభోజనం. వేళకునిద్ర. యేది యెప్పుడుకావలిస్తే వెంటనే వారికాళ్ల ముందుండేవి. వారికి సేవగావించే పరిచారకులను హృదయ పూర్వకంగా పనిచేసేవారినే నిర్మించారు. ముఖ్యముగా కుంతీదేవి – ద్రౌపదీదేవి – సుభద్రాదేవి వీరు అనునిత్యం కనులకు రెప్పల్లాగ గాంధారీదేవి – ధృతరాష్ట్రులను చూచేవారు. యిలాజరుగుచున్నది.

### ధృతరాష్ట్రుని వానప్రస్థము

ఒకరోజు ధర్మరాజును ధృతరాష్ట్రుడు పిలిచి "కుమారా! ప్రతీప్రాణీ ఒరులకొరకు సహాయపడాలి. నేనలా ఉపయోగపడలేదు. ఉపయోగపడలేను. పోనీ, నాయాత్మ శ్రేయానికొరకు తపస్సుకువెళాతను. నీ అభిప్రాయాన్ని తెలుపు" మనగా; " ఓ అలాగే హాయిగా తపస్సు చేసికొను" అన్నాడు. నేనింక ఉండలేననగా "తండ్రీ! నిన్నువిడిచి మేమెలా ఉండగలం?" ధర్మరాజుఅనగా; "అగ్రజా! నేనిక్కడ ఉండలేనో" అంటే నీవువుండమంటావేమీ?'' అని చిరాకుగా భీముడన్నాడు. సరిగా అదేసమయానికి వ్యాభగవానుడు అచ్చటకువచ్చాడు. "ధర్మరాజా! యినీతండ్రిని వారించకు" అనగాధర్మరాజు" చిత్తంతమ అభిప్రాయమే అన్నాడు.

### ధృతరాష్ట్ర తపోగమనం

ధృతరాష్ట్రుడు గాంధారీ దేవీ యిద్దరూ సకలకార్యక్రమాలూ ముగించుకొని బయల్దేరగా, యింక కుంతీ దేవి కూడా వారిద్దరకూ సేవచేయడానికి నేనూ వెళతానని ప్రయాణమయింది. పాండవులకూ, పాండవ పత్నులకూ యిష్టము లేకున్నా, వారందరికీ నచ్చచెప్పి రాజమాత కుంతీ దేవీ, గాంధారీ ధృతరాష్ట్రులతో అరణ్యానికి వెళ్లనుంకించింది. వారు పరమానందముతో వెళ్లగా వారికి శతయూపమహర్షి యెదురువచ్చాడు. తన ఆశ్రమములోనే ఉంచుకున్నాడు. ధృతరాష్ట్రుడు ఆమరునాడే తపోదీక్షలో మునిగాడు. యిక ఆదీక్ష అమోఘుంగాకొన సాగుతుంది. అక్కడతపస్వులు గాంధారీ, ధృతరాష్ట్రుల తపస్సుకు అద్భుతాశ్చర్యాలందారు. యిలా కొంతకాలం జరిగిన తరువాత సహదేవుడు "మహారాజా! మాతృదేవినీ గాంధారీ – ధృతరాష్ట్రులనూ చూసి చాలాకాలమయింది. ఒక్కమారు వారిని దర్శించి, వారి దివ్యాశీస్సులు పొందాలని ఉంది" అనగా ద్రౌపది సంతోషించి" ఆతని మాటల్తో వంతపాడింది. రాజ్యపాలన యుయుత్సునికి యిచ్చి, చక్రవర్తిగా తగిన పరివారంతో అట్టహాసంగా, మంత్రులూ, సేనలూ, ఏనుగులూ గుఱ్ఱాలతో ధర్మరాజువెళ్లాడు. యిలా ధర్మరాజాదులు వెళ్లేసరికి శతయూపమహర్షి ఆశ్రమములోకాక, ఆసమీపాన ఒకమంచి ఆశ్రమాన్ని నిర్మించుకొని ఉండగా, ధర్మరాజాదులు అక్కడకు వెళ్లారు. ధృతరాష్ట్రాదులు నదికి స్నానానికి వెళ్లారు. సహదేవాదులు వారికి యెదురయ్యారు. సహదేవుడు కుంతీ దేవి పాదాలపై పడి ఆనందదాశ్రువులను చిందించాడు.

అప్పుడుద్రౌపదీ మొదలగువారు వారికి పాదాభివందనగావించారు. ధర్మరాజాదులను చూడ్డానికి అరణ్యవాసులు, మహర్షులు లెక్కలేనందరు వచ్చారు. వనౌకసులు, ధర్మరాజాది నగర రాజులను చూసి యెంతో ఆశ్చర్యంగా చూడసాగారు. తరువాత అందరూ కలిసి మాట్లాడుకున్నారు. ధర్మరాజు "తండ్రీ! మహానీయుడైన విదురుడెక్కడ?" అని అడగ్గా ధృతరాష్ట్రుడు "నాయనా! అదేవింతగా ఉంది. గాలీ – నీరూ తప్ప ఆహారంగా యేమీతీసుకోవడం మానివేశారు. శరీరం నగ్నంగా అరణ్యంలో తిరుగుతూ ఒక్కమారే కానవచ్చాడు. అలావారనుకొనుచుండగా, యింతలో అక్కడకు విదురుడురానే వచ్చాడు. ధర్మరాజు ఆతనిని పిలుచుకొని వెంటపడగా, చెట్లూ, పుట్టలు వెంటపరుగెత్తాడు. దొరకకుండా పరుగెత్తాడు.

ముందువిదురుడు, వెనుక ధర్మరాజు పరుగులు పుచ్చుకున్నారు. ధర్మరాజు అలసి పోయి ఒకచెట్టు దగ్గరకూలబడ్డాడు. "విదురా! విదురా! అనగా వచ్చి కన్నులెత్తి ధర్మరాజు కన్నులలోనికి చూశాడు. విదురుని మహత్తరయోగశక్తి, ధర్మరాజులోనికి వెళ్లి ధర్మరాజులో నున్న మహాశక్తులన్నీ వికసించాయి. తరువాత విదురుడు తన భౌతిక దేహాన్ని విసర్జించాడు. అదిచూచి ధర్మరాజు బోరునయేడ్చాడు. తనయులుగా చిన్ననాటినుంచీ మమ్ములను కాపాడిన మహాపురుషుడు విదురుడిక మాకు కానరాడని దుఃఖించినాడు ధర్మరాజు. అశరీరవాణి "ధర్మరాజా! విదురుడు యతీంద్రుడు యోగపురుషుడు ఆతని భౌతికకాయానికి అగ్నిసంస్కారంచేయరాదు" అని చెప్పింది.



కొన్ని రోజులు అరణ్యాన ధృతరాష్ట్రాదులతో ధర్మరాజాదులు ఉన్నారు వ్యాసులవారు అచ్చటికి రాగా, యుద్ధములో చనిపోయిన వీరులను చూడాలనుకున్నవారు. నాతోరమ్మనగా చాలమంది వచ్చారు. వారందరినీ యమునానది దగ్గరకు తీసుకుపోయి మరునాడు వారిని యమునానదిలోకి తపోశక్తితో రప్పించాడు. యుద్ధంలో చనిపోయిన వీరులందరూ ఆనందంగా, ఆరోగ్యంగా ఆరోజుయుద్ధము నచని పోయేసరికి యే ఆయుధాలు హస్తాలలో దాల్చారో! యే బట్టలు కట్టుకున్నారో! అలాగే కాన్పించారు. ఎవరైనావారిభర్తలతో ఉత్తమలోకాలకు వెళ్లదలచిన వారు వెళ్లండి" అని వ్యాసులవారనగా కొందరు గంగలో దిగి వారివారిభర్తలతో ఉత్తమలోకాలకు వెళ్లారు. అదిగని అందరూ ఆశ్చర్యమందారు.

## ధృతరాష్ట్రాదులు భౌతికకాయాలు విడవడం

అనంతరం పాండవులందరూ, హస్తి నాపురానికి వచ్చారు. రాజ్యపాలనలో మునిగిపోయారు. కొంతకాలం జరిగినతరువాత నారదమహర్షి రాగా, వారికి ధర్మ రాజాదులు అర్ఘ్యపాద్యాదులిచ్చి పూజించారు. "ధర్మజా! గాంధారీ, ధృతరాష్ట్ర సంజయవ కుంతీ దేవులు స్నానంనుంచి వస్తుండగా, అరణ్యంలో అగ్నిప్రజ్వరిల్లింది. అదివారితపోయోగాన్ని. యెవరియోగాగ్నిలో వారు కుంతీదేవి ధృతరాష్ట్రదంపతి దగ్ధమయ్యారు. సంజయుడు బయటపడ్డాడు. ధర్మరాజా! నీవు విచారింపకు, వారికి తిలోదకాలియ్యి" అన్నాడు నారదుడు.



అప్పుడు ధర్మరాజు ఆముగ్గురకూ యమునానదిలో తిలోదకా లిచ్చి వారి పేరుమీద దానాదిక్రియలుచేశారు. అంతేకాదు పద్దెనిమిది సంవత్సరాలయింది యీ రోజుకు ధర్మరాజు సామ్రాజ్యాభిషిక్తుడయి. ప్రజాపరిపాలనలో యింతకు ముందురాజు లెవ్వరూ యీతని వలె పరిపాలించలేదని మహత్తరకీర్తిని తెచ్చుకున్నాడు. భారతదేశము మూడు పూవులు ఆరుకాయలుగా పెంపొందింది'' అని వైశంపాయనమహర్షి జనమేజయునకు చెప్పాడు.

**ఇది మహాభారతములో ఆశ్రమవాసపర్వం ముగిసింది**



# సంపూర్ణ మహాభారతం
## మౌసల పర్వము



“జనమేజయ మహారాజా! మీముత్తాతలచరిత్రకు ముడిపడ్డయాదవుల సంగతివినుమనివైశంపాయన మహర్షి యిలా చెప్పాడు.

### సాంబునికి శాపం

కణ్వ విశ్వామిత్ర, నారద మహర్షులు త్రిమూర్తుల్లాగ శ్రీకృష్ణ పరమాత్మ దర్శనంకోసం ద్వారకానగరానికి వెళ్లారు. అక్కడ రాజమార్గములో వెళుతుండగా కొందరు ఆతతాయి యాదవయువకులు యీ మహర్షులతో హాస్యాలాడాలని శ్రీకృష్ణుని కుమారులలో సాంబుడన్నవాడికి ఆడవేషంవేయించారు. వారి దగ్గరకు తీసికొని వెళ్లి “మీరు త్రికాలజ్ఞులు వాడిని చూపించి, వీడికి మగబిడ్డపుడుతుందా? లేక ఆడబిడ్డపుడుతుందా? అని నవ్వుతూ అడిగారు. వారికి వారాడుమాటలకు బాగా కోపంవచ్చింది. ముగ్గురు మహర్షులూ యేకవాక్కుగా, “ఓరి వాజమ్మలారా! వీడికి ఆడామగాకాకుండా ముసలంపుడుతుంది. మీ సర్వవంశాన్నీ నాశనంగావిస్తుంది. యీముసలాన్ని మీయాదవులలో యేఒక్కడూ తప్పించుకోలేడు” అని వారు వెనక్కు వెళ్లిపోయారు. శ్రీకృష్ణునికి యీవిషయము తెలిసి యేమీ మాట్లాడలేదు. యెలా జరుగవలసింది అలాగే జరుగుతుందికదా!

ఆమరునాడే ముసలం సాంబుని కడుపునుండి పుట్టింది. దాన్నిచూసి సర్వయాదవులూ మహాభయం చెందారు. శ్రీకృష్ణపరమాత్మయిదంతా యాదవనాశనానికే వచ్చిందని యెంతో బాధపడ్డారు. యాదవులందరినీ పిలిచి “మీరు



యీముసలాన్ని సాగరతీరాన అరగతీయండి” అనగా అందరూ అలాగే దాన్ని అరగతీయగా తీయగా! కొంచంపొడవుతో ఆముసలం మిగిలింది. అప్పటికి అందరూ బాగా అలసి పోయారు. దాన్ని సాగరానపారేశారు. యిలా ఉండగా యాదవులందరూ నాశనమందేదినాలు సమీపించాయి. దుశ్శకునాలు యెదురౌతున్నాయి. మొత్తం ద్వారకానగరమంతా అగ్నిదేవుడు ఆరిపోయాడు.

శ్రీకృష్ణ పరమాత్మ చక్రం హఠాత్తుగా ఆకాశానికి యెగిరిపోయింది. ఆతని గరుడధ్వజం – బలరాముని ధ్వజాలు మాయమయ్యాయి. అంతేకాదు. కృష్ణుని రథం – గుఱ్ఱాలూ కానుపించలేదు; కృష్ణునికి విషయంతెలిసి, యాదవులనుపిలిచి “మీరందరూ ఉదయాన్నే వెళ్లి సాగరునికి పూజలుచేయం”డని చెప్పాడు.

### యాదవుల విలాసం

ముందుగా కృష్ణుడు సాగరతీరానికి వెళ్లాడు. యికతక్కిన యాదవులందరూ యేనుగులూ, గుఱ్ఱాలు, వారి వారి కాంతలతో సహావిలాసయాత్రకు బయల్దేరి సాగరతీరాన్నిచేరారు. సత్యభామాదులు వచ్చారు. కృష్ణుడు మౌనంతో ఉన్నాడు. ఉద్ధవుడు తపస్సుకు వెళ్లాడు. బలరాముడూ అడవిలో ధ్యానంలో మునిగిపోయాడు. యిదేతగిన సమయముగా నెంచిన యాదవులందరూ మధువును కుత్తుకబంటిగాత్రాగారు. యింకేముంది? దాంతో మత్తెక్కిపోయారు. ఆడా మగాకూడా తేడాతెలియలేదు. ఒకరినొకరు చంపుకుంటున్నారు. యెవరినెవరు చంపుకుంటున్నారో యెవరికీతెలీదు. శ్రీకృష్ణుడు అంతా అలాచూస్తూ ఊరుకున్నాడు. యెవరినేమీ అనలేక పోయాడు.

జనమే జయ భూపా! ముసలం అరగదీశారు. దాని చూర్ణం రెల్లుగడ్డయింది. ఆరెల్లుతో, ఒకరినొకరుచంపుకుంటున్నారు. యిలాయాదవకుల మంతా నాశనమయింది. అక్కడసాగరతీరాన రక్తపుటేరులు ప్రవహించాయి. రెండవ మహాభారతయుద్ధంలాగ కానవచ్చింది. యెక్కడచూసినా పీనుగుపెంటల్లా కానవస్తున్నాయి.

### యాదవ వినాశనం

శ్రీకృష్ణునికి అంతాతెలుసు. అందుకే యేమీ అనలేదు. గాంధారీ శాపాన్ని కూడా జ్ఞాపకంచేసికున్నాడు. “అల్లుడా! కృష్ణా! నావంశంలాగే నీయాదవకులమంతా నాశనమవుతుందిలే” అనగా ఆమె శాపాన్ని సంతోషంతో స్వీకరించాడు కృష్ణుడు. అంతా అయింది. శ్మశానమయింది. యిప్పుడు “దారుకా! నీవుతొందరగా హస్తినకువెళ్లు. చూశావుకదాయిదంతా; అర్జునుని తొందరగా తీసికొని రా! అని పంపి; బభ్రుని స్త్రీలందరినీ అంతఃపురంలో జాగ్రత్తగా ఉంచమని చెప్పాడు. ఒకబోయ బభ్రుని కొట్టేసరికి అతడక్కడే చనిపోయాడు. దేవకీవసుదేవులకు పాదాభివందనగావించి “నేను బలరాముని తీసుకువస్తానని” కృష్ణుడు బయల్దేరాడు. ఆ అరణ్యవీధుల్లో ఎంతో ఒళ్లంతా కళ్లుచేసికొని కృష్ణుడు వెదుకగా, ఒకదగ్గర ధ్యానంచేస్తు కానవచ్చాడు.

వేయి పడగల కాలసర్పం వచ్చింది. బలరాముని భౌతికకాయంనేలబడింది. అదిగగనానికి వెళ్ళి, అందరినమస్సులంది. బలరాముని భౌతిక కాయంలో లీనమై యింక కానరాలేదు.

**శ్రీకృష్ణావతారపరిసమాప్తం**

శ్రీకృష్ణావతారం ఒకచిత్రమయింది. మొత్తం భారతదేశంతో ముడిపెట్టబడింది. వ్యాసభగవానుడు ఒకచరిత్రగా, ఒకమహాకావ్యంగా, తానూ అందులో పాత్రధారిగా ఉండి వ్రాశాడు. బాల్యంనుండీ శ్రీకృష్ణుని అపూర్వమానవాతీతశక్తులు చూసి దేవతలే అద్భుతపడేవారు. అంచేత ఆతని ప్రభావమంతా మహాభారతంలో కానవస్తుంది. అటువంటిపరమాత్మ తన అవతారంముగింపు యెంత ఆశ్చర్యజనకంగా ఉందో మీరికచదవండి.

పరమాత్ముడు బలరాముని చూసి నిట్టూర్పుగావించాడు. ఆఅడవి అంతా తిరిగాడు. ఒకచెట్టుమొదట సమాధిలోనున్నాడు. ఒకబోయవేటకు అక్కడే అటూ యిటూ తిరుగుచున్నాడు. శ్రీకృష్ణుడు నిద్దురలో నున్నట్లు ఆతనికి కానుపించింది. "నాకింక యీశరీరం అనవసరం యికదీనిని విడిచి పెట్టవచ్చు." ఒకదగ్గర యింద్రియాలను లోనుకు తీసుకున్నాడు. ఆబోయ లేడిగా కృష్ణుని భావించాడు. బాగా లాగి ఆతడు బాణాన్ని విడిచాడంతే. శ్రీకృష్ణుని పాదంనుండి వెళ్ళింది. ఆతనిలోనున్న నారాయణాంశ పైకి ఎగిరిపోయింది. మహేంద్రాది దేవతలందరూ యెదురువచ్చారు. యింక దారకుడు హస్తినకేగి అర్జుననకు ఆమూలంగా జరిగినవిషయం వివరించాడు. అందరూ గొల్లుమన్నారు. వెంటనే బయల్దేరాడారథముపై అర్జునుడు.

మార్గము అరణ్యములో అశరీరవాణి "అర్జునా! యీరోజుకు యేడవనాడు సాగరగర్భంలో ద్వారకానగరం కలిసిపోతుంది" అన్నమాట విన్నాడు అర్జునుడు. ద్వారకచేరాడు ఉన్నయాదవులందరికీ ఆకాశవాణి పలుకులు వినిపించాడు. యిక అంతిపురిలో గల సత్యభామాదిస్త్రీలందరకూ జరిగినవిషయం, జరుగగల విషయం చెప్పాడు. అందరూ రోదించారు. వసుదేవుడు తరువాత భౌతికదేహాన్నివిడిచాడు. సముద్రతీరాన సాత్యకి మొదలైనవారి కళేబరాలకు అంత్యక్రియలు చేసి తర్పణాదులు యిచ్చాడు.

**కలియుగ ప్రవేశం**

> **"యథాముకుందో భగవానిమాం మహీం**
> **జహౌ స్వతన్వాశ్రవణీయ సత్కథా**
> **తదా ణాప్రతి బుద్ధ తేజసా**
> **మభద్రహేతుః కలిరన్వ వర్తత" (శ్రీమద్భాగవతం - 1 - 15)**



"ఎప్పుడు భగవంతుడు ముకుందుడు ఈభూమిని విడిచిపెట్టి పుణ్యకథల రూపములో మనకు శ్రవణీయుడైనాడో! సరిగ్గా అదేసమయానికి లోకానికి ప్రమాదాన్ని కలిగించే కలియుగం ప్రారంభమయింది"అని

శ్రీమద్భాగవతంలో పదిరెండవ స్కంధంలో యింకా యెంతో విశేషంగా యీకలియుగం ప్రారంభింపబడిందో చూడండి

> **"యస్మిన్ కృష్ణో దివంయాతః**
> **తస్మిన్నేవ తదా అహని ప్రతిపన్నం కలియుగం" (12 - స్కంధం)**

శ్రీకృష్ణుడు యేరోజైతే భూమినివిడిచి దివంగతుడైనాడో సరిగ్గా అదేరోజున కలియుగం ప్రారంభమైంది"అని.

అర్జునుడు అరణ్యాన బలరామకృష్ణులకళేబరాలకు యెంతగానో వెదకివెదకి వేసారిపోయాడు. మొత్తంమీద కృష్ణుని భౌతిక దేహందొరికింది. యేడుస్తూ అర్జునుడా కళేబరాన్ని కౌగిలించుకున్నాడు. యింతంతనరాని విధంగా శ్రీకృష్ణుని కళేబరంపైబడి దొర్లుతూ ఘోషపెడుతూ యేడ్చాడు. యిక ఉప్పెనవస్తుందని రథాలపై బళ్ళపై అందరూ సాగరాన్ని దాటి తీరానికి వచ్చారు. యిక చెప్పేదేముంది? యాభైతాడుల ప్రమాణాన సాగరుడు కెరటాలతో మహాభయంకరుడుగా కనుపిస్తున్నాడు. యాదవసామ్రాజ్యమంతా భయంతో ప్రాణాలను గుప్పెట్లో పెట్టుకొని ఒక అరణ్యమార్గాన్ని ప్రయాణింపసాగారు.

లెక్కలేనన్ని సువర్ణ, రత్నరాశులతో, త్రిలోకసుందరులనదగు అందగత్తెలతో మార్గమా మహారణ్యంలో స్త్రీలు ప్రయణిస్తున్నారు తగినపురుషులేకపోవడం ఒకటేమిటి దైవం అనుకూలించనప్పుడు మానవులకు లెక్కలేనన్ని అవాంతరాలు వస్తాయి. బోయలు ఆస్త్రీలపై పడ్డారు. అర్జునుడొక్కడే. ఒకప్పుడు జగదేకవీరుడు. యిప్పుడు నిర్వీర్యుడైనాడు. గాండీవం యెందుకూ పనికిరాలేదు. వచ్చిన బోయలు సర్వసంపదలనూ, దొరికిన యెందరినో స్త్రీలను పట్టుకుపోయారు. అర్జునుడు యెందుకూ పనికి రానివాడై తుదకు ప్రాణాలను నిలుపుకొని వారందరితో యేలాగోచచ్చిచెడి కురుక్షేత్రాన్ని చేరుకోగలిగాడు. కృతవర్మకుమారుని దానికి ఆనగరానికి సామ్రాజ్యాధిపతిగా గావించాడు.

**శ్రీకృష్ణ పత్నుల తపోదీక్ష**

అర్జునుడు యాదవులకు ఒకొక్క రాజ్యాన్ని పరిపాలించు కొనమని అర్జునుడు ధారాదత్తంగావించారు. వారు ఆరాజ్యాలు హాయిగాప్రజామోదంగా పరిపాలించు కొనసాగిరి. రుక్మిణీ, సత్యభామాది శ్రీకృష్ణుని భార్యలు హాయిగా ఉండగా అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మ అవతారం చాలించారని అనునంతలోనే వారందరూ అగ్నిలో దూకారు. స్త్రీకి భర్తేకదాసర్వమని చెప్పువేదమును వారు పాటించారు యింకామిగిలిన వారు అరణ్యమున తపోదీక్షనందారు. అర్జునుడు యాదవులనందరనూ పిలిచి

"అయ్యా! నేను చేయగల కార్యాలన్నీ నెరవేర్చాను. యింకా మిగిలి యేమీలేవుకదా! యింకమీరు శలవిస్తే హస్తినాపురానికి వెళతా" నన్నాడు.

మనస్సంతా అర్జునునకు వ్యాకులముగా ఉంది. యేమీతోచలేదు. అందు వలన శ్రీవ్యాసభగవానుని ఆశ్రమానికి చేరాడు. ఆతని దగ్గర వెక్కి వెక్కి యేడవడం ప్రారంభించాడు. శ్రీకృష్ణ బలరాములు సిద్ధిపొందారని తెలిపాడు. అతి సామాన్యబోయల నెదిరింపలేని నిర్వీర్యుడనయ్యానని యేడ్చాడు అర్జునుడు. అప్పుడు ఆతనిని యెంతగానో ఓదార్చి "నాయనా! నరనారాయణులను మహర్షులుండేవారు. అందులో నరుడవునీవు, నారాయణుడు శ్రీకృష్ణపరమాత్మగా తెలిసికో! నీశక్తి శ్రీకృష్ణునిలో చేరింది. నీగాండీవము పనికూడా అయిపోయింది. అందుచేత నీవు విచారింపకుము. మీ అవసరాలు తీరాయి" అను వ్యాసమహర్షివాక్కులువిని అర్జునుడు తాతగారి దగ్గర శలవు తీసికొని హస్తినకు ప్రయాణము కట్టాడు.

**ఇది మహాభారతములో మౌసలపర్వం ముగిసింది**







# సంపూర్ణ మహాభారతం

## మహాప్రస్థాన పర్వము

### ధర్మరాజు మహాప్రస్థానం

"ఓజనమేజయ జనపాలా! యింతవరకూ విన్నావు. అలా శ్రీవ్యాసమహర్షికి వందనలర్పించి అర్జునుడు హస్తినకు వచ్చాడు. ముందుగా మహారాజు ధర్మరాజు దగ్గరకు చేరుకున్నాడు. బలరామకృష్ణులసంగతీ, తన జరిగిన పరాభవమంతా విన్నవించాడు ఆతనికి అర్జునుడు. యింక కలియుగం ప్రవేశించింది. శ్రీకృష్ణపరమాత్మ అవతారాన్ని యెప్పుడు చాలించాడో సోదరా! అప్పుడే మనము నిర్వీర్యులమయ్యాము. అని నిట్టూర్చాడు. పట్టాభిషేకానికే ధర్మరాజు వైరాగ్యంతో యిష్టపడలేదు. అప్పటినుండి నిస్పృహతోనున్నాడాతడు. వ్యాసాదుల వలన యింతవరకైనా రాజ్యాన్ని యేదోరకంగా పాలించాడు. యిక యీభౌతికశరీరాన్ని నిలుపుకోవాలన్నధ్యాసఅణు మాత్రమూ ఆతనికిలేదు.

మహాప్రస్థానంగావించాలనే ఊహాసంపూర్ణముగా ఆతనిలో అలము కుంది అర్జునునికి చెప్పాడు. ఆతడు దానికి సమ్మతించాడు. యికమొత్తంవంశానికి మిగిలినవాడు పరీక్షిత్తేకదా! యిక ఆతనికి పెద్దదిక్కుగా, అనుభవజ్ఞునిగా, రాజకీయ సలహాదారుగా, అన్నీతెలిసిన వానిగా యుయుత్సును నియమించాడు. కృపాచార్యులను సద్గురువుగా, యిక ద్రౌపదితోకూడి తనకు గల సర్వ సంపదలనూ షోడశవిధాలైన దానాలను గావించాడు. తనకు మహాప్రస్థానమున తోడురాగలది ద్రౌపది ఒక్కరే అని నిశ్చయించుకున్నాడు. యిక సుభద్రను పిలిచాడు. "అమ్మా

విజయార్థాంగీ! మనవంశాన్ని ఉద్ధరింపగల పరీక్షిత్తు నీ మనుమడొక్కడే. యికరాజమాతగా, సామ్రాజ్ఞివిగా నీవే అన్నింటికీ తగినదానవు.

మామాతృదేవి కుంతీదేవికి అప్పుడున్న బాధ్యతలన్నీ నీవిప్పుడు నిర్వర్తించాలి. యిక నీవుపుట్టినింటినీ, మెట్టినింటినీ సరిదిద్దాలి" అని ధర్మరాజుచెప్పే సరికి "మహారాజా! తమవాక్కులు శిరోధార్యంగా స్వీకరిస్తా" నన్నది. ధర్మరాజు పరీక్షిత్తు పట్టాభిషేకాన్ని ప్రజలందరకూ ప్రకటించాడు. వారిమహాప్రస్థావనం తెలిపాడు. పౌరజనులు యెంతో దుఃఖింప సాగారు. ధర్మరాజు తనరాజలాంఛనాలన్నీ తీసేశాడు. పరీక్షిత్తును భారతసామ్రాజ్యాభిషిక్తునిగాచేశారు. అందరూ నారచీరలు ధరించాడు. హస్తినా పురాన్నివీడారు. జానపదులూ, పౌరులూ వారిని వెన్నంటినా వారు తిరిగి చూడకుండా వారుతూర్పు దిక్కుగా ప్రయాణించారు. అందరూ అలావెంటబడి వదిలినా ఒకకుక్కమాత్రం వారివెనకాలరావడంమానలేదు.

## అగ్ని దేవుని అద్భుత దర్శనం

అలా వారు ప్రయాణాన్ని సాగించగా, సరిగా తూర్పుసాగరందరిని అగ్ని భట్టారకుడు వారికి అద్భుతంగా దర్శనమిచ్చాడు "అర్జునా! ఖాండవ వనదహనమప్పుడు నీకు గాండీవాన్నిచ్చాను. దానితో భారతయుద్ధంగావించావు. యింక ఆగాండీవంతో నీకు పనిలేదు.

అదివరుణ దేవునిది. ఆతనికే దానిని యిచ్చి!" అన్నాడు. తూర్పుసాగరాన గాండీవాన్నివిడిచి అర్జునుడు వరుణునకు వందనలర్పించాడు. జనమేజయా! పాండవుల వెంబడించిన కుక్క మాత్రం వారిని విడువకుండా వస్తుంది. వారు దక్షిణ సముద్రము నుండి పడమరకు ప్రయాణించారు. సరిగా ద్వారక సాగరాన కలసిన ఆదిశగావెళ్లసాగారు. సరిగా మేరుగిరి దగ్గరకు వెళ్లే సరికి ద్రౌపది యోగశక్తి చాలక భౌతిక శరీరాన్నివిడిచింది. దానిని యెవరూ గమనించకే అందరూ మహాజోరుగా నడువసాగారు. వారివెంటకుక్కకూడా అలాగే ప్రయాణించింది. ద్రౌపదికి అయిదుగురు భర్తలున్నా అభిమానం అర్జునునియందే. అందుచేత యోగంచాల్లేదు.

యిలాకొంత దూరం వారేగగా సహదేవుడు నేలపైపడి ప్రాణాలుకోల్పోయాడు. సహదేవునికి వివేకము అందరికన్నా నాకున్నదన్న అహంకారం కలవాడు. అందుచేత యోగశక్తిచాల్లేదు. తరువాత నకులుడు నేలకొరిగాడు. నకులునకు అందమూ, ధైర్యమూ నాకుందనే గర్వము అందువలన అలా అయ్యాడు. భీమార్జునులూ భూమిపై పడి ప్రాణాలను గోల్పోయారు. నేను గొప్పవిలుకాడిని అనేగర్వం అర్జునుని కుంది అందుకే ఆతడు యోగశక్తిని కోల్పోయాడు. తరువాత భీముడు పడిపోయాడు. ఆతని విపరీతపు తిండి వలననే అలా అయ్యాడు. యిందరూ యిలా అయినా ధర్మరాజు మాత్రం హాయిగా ముందుకే ప్రయాణించాడు. ఆతని వెంటవచ్చిన కుక్క మాత్రం అలాగే రావడం ప్రారంభించింది.



యిలా ధర్మరాజు వెనుక చూపులేకుండా వెళుతుండగా, మహార్భలతో మహేంద్రుడు ప్రత్యక్షమయ్యాడు. "ధర్మజా! నీవు యీరథముపై తప్పక స్వర్గానికి రమ్మని ఆతనిని ఆహ్వానించాడు. "మహాత్మా! నాసోదరులందరూ అలాపడిపోగా నేను మాత్రమే స్వర్గానికా?" అన్నధర్మరాజును చూచి "ధర్మనందనా! నీకన్న ముందే మీవారందరూ స్వర్గములో ఉన్నారు. చూద్దువుగానిరా!" అన్నాడింద్రుడు. అయితే నాతోవచ్చిన యీకుక్కకూ స్వర్గానికి అనుమతింపమన్నాడు. యింద్రుడు చిరునవ్వుతో "కుంతీపుత్రా! నీవారందరినీ విడిచావు. కాని యీకుక్కను వీడనంటున్నావు. యెలాగ?" అనగా; మహేంద్రా! నాయందున్న విశ్వాసముతో యింతదూరం ప్రయాణించేదీన్ని నేనెలావిడిచేది?" అనగా అకుక్కధర్మదేవతా స్వరూపంతో సాక్షాత్కరించింది. "నాయనా! నీధర్మ రక్షణనాకునచ్చింది. నీవుపడే అతిక్లేశాల్లో యెప్పుడూ ధర్మాన్ని నీవుతప్పలేదు. నిన్ను పరీక్షించడానికే యీరూపంతో వచ్చానులే! విమానాన్ని యెక్కిస్వర్గాని వెళ్లు" ఆశీస్సులర్పించాడు; ధర్మదేవునికి ధర్మరాజు నమస్కరించి "తమయానతిని శిరోధార్యంగా స్వీకరిస్తాను. మాసోదరులనూ ద్రౌపదినీ ముందునాకు చూపించండి'' అని అదివ్యరథముపై కూర్చున్నాడు'' అనిజనమేజయునకు చెప్పాడు.

ఇది మహాభారతములో మహాప్రస్థానపర్వం ముగిసింది



# సంపూర్ణ మహాభారతం



## స్వర్గారోహణ పర్వము

యిలా స్వర్గమున ధర్మరాజు సంచారంగావిస్తుండగా నారదాదులతో నుండగా దుర్యోధనుడు గొప్ప నవరత్నసింహాసనం పై నుండగా రూపయౌవన సుందరాంగులు కొలుస్తుండగా, బాలభానునిలా వెలిగిపోతున్న వానిని జూచి ధర్మరాజు ఆశ్చర్యమందాడు. నారదునిజూచి "సురమునీంద్రా! యేమియీవింత? యెంతో దుర్మార్గుడైన దుర్యోధనునకు యింతభోగమా? నిండుపేరోలగమున పతివ్రతాశిరోమణిని యెంతోదుర్మార్గంగా వలువలూడదీయించాడే! వాడికీ భోగమా?" అనగా; నారదుడు ధర్మరాజా! అట్టే ఆవేశపడకు. భూలోకాలలో ఉన్నకామక్రోధాదులిక్కడుండవయ్యా! యిది స్వర్గభూమి. యుద్ధమందుక్షత్రియుడైనవాడు వీరోచితముగా యుద్ధభూమిలో మరణించే వాడెవడైనా యిలాంటి భోగాలతో యీ స్వర్గంలో ఉంటాడు.

యింకనీవు అనవసర ఆలోచనలతో ఉండక హాయిగా యిక్కడభోగాలను భవించు" అన్నాడు అలా దేవదూతలతో ధర్మరాజు వెళుతుండగా, దారిన యెముకలూ, మాంసపుముద్దప్రోవులూ, ప్రేవులు

### నరకాన్ని దర్శించడం

కొండలు, గుట్టలుగా కానవచ్చాయి. అన్నిటిమీద ముసిరిన యీగలూ, దోమలూ, క్రిమికీటకాలన్నీ కానవచ్చాయి. యినపముక్కులుగల కాకులు భయంకరంగా అరుస్తూ కానుపించాయి. యెంతతొందరగానో సోదరులనూ,



ద్రౌపదినీ చూడాలనే ఆత్రతో వీటిని లెక్కచేయకుండా ధర్మరాజు దేవదూతల్తో ముందుకు పోతున్నాడు. అరణ్యంకానుపించింది. ప్రాణిభయంకరంగా ఉందా అడవి. దేవదూతచెప్పాడు. "ఓమహాత్మా! యిది యమధర్మరాజు పాలనలో నున్న నరకం. అదిగో! వైతరిణీనది. పాపముగావించువారిని యమదూతలు ఘోరముగా శిక్షిస్తుంటే అదిగో! చెవులు చిల్లులు పడినట్లు వారందరూ అరుస్తున్నారు. ధర్మరాజుకు ఆనరకయాతన లనుభవించేవారు అరుస్తూ "మహానుభావా! నీవిక్కడ కొంచంసేపుంటే మాబాధలు కొంత నివారింపబడతాయేమో!" అని ఆప్రాణుల అరుపులు ధర్మరాజు వినలేక పోయాడు.

ఇంతలో ధర్మరాజుకు ఒకప్రక్కద్రౌపది; మరొకప్రక్కకర్ణుడు; వేరొకప్రక్క ధృష్టద్యుమ్నుడను, యీ అందరూ ధర్మరాజును అన్నివైపులనుండి అరుస్తూ పిలుస్తున్నారు. వాటిని విన్న ధర్మరాజుకు మతిపోయింది. "అయ్యో! యెంత ఘోరం సత్య సంధులు, ధర్మకర్మలు చేసే నాసోదరులూ, మాద్రౌపదీ యెన్నిపడరానియిక్కట్లు, ఘోరనరకయాతనలను భవించుచున్నారు. పరమదుర్మార్గుడైనదుర్యోధనుడు స్వర్గ సుఖాలను భవించుటా! యెంత దారుణం?" అనికళ్లంట నీరు పెట్టుకున్నాడు. యింతలో మహేంద్రుడు వచ్చాడు. ధర్మదేవుడువచ్చాడు. అలాధర్మదేవత అచ్చటికి వచ్చేసరికి యింక యమలోకమంతా మాయమయింది. అరుపులూ, కేకలూ యేవీలేవు. మహత్తర సుగంధం నాసాపుటాలను అలరిస్తుంది. వాయువు ఆహ్లాదంగా వీచుతుంది. అప్పుడు దేవతలూ, మహర్షులూ అందరూ "ఓపాండవాగ్రజా! నీ ధర్మాచరణకు మేమందరం ముగ్ధులమయ్యాం. ముందు జీవులందరూ పాపఫలాన్ననుభవించి, తరువాత అమరసుఖాలను అనుభవిస్తారు. నీవు యేపాపమూ యెరక్కపోయినా, నరకాన్ని చూపకతప్పలేదు. "కుమారా! నిన్నెన్నోరకాలుగా పరీక్షించాను. కానీ నీవు ధర్మము తప్పలేదు. నీవంటివానిని నేనెవరినీ చూడలే"దని ధర్మదేవుడు ధర్మరాజునెంతో శ్లాఘించాడు. తరువాత ధర్మరాజు గగనగంగాతరంగాలలో స్నానంగావించి భౌతికదేహాన్నిత్యజించి అమరుడయ్యాడు. తరువాత స్వర్ణసింహాసనాశీనుడు శ్రీమన్నారాయణుని ధర్మరాజుదర్శించాడు. మహానందంతో అమరులతో ఉండే భీముని చూశాడు; అశ్వినీ దేవతల్లాగున్న నకులసహదేవులు కానవస్తున్నారు. యింకాముందుకు వెళ్లారు. అక్కడ అమోఘమైన స్వర్ణభవనంపై సువర్ణ డోలలోత్రిలోక సుందరిలాగుండి చెలులు సేవింపగా ధర్మదేవతలా గున్న ద్రౌపదిని చూసి ఆశ్చర్యపోయాడు. యిలా మొత్తం తనవాళ్లందరూ, ఆనందోత్సాహాలతో, అపూర్వ అమరసుఖాలను అనుభవించు ఆ అమరమూర్తులందరినీ చూచి అద్భుతాశ్చర్యాలందాడు ధర్మరాజు.

ఓజనమేజయమహారాజా! ధర్మరాజు – నీతండ్రీ ! భారతదేశాన్ని ఆనందంగా పరిపాలించారు.

## మహాభారతం ఫలశ్రుతి

యిది శ్రీమహాభారతం. యింతబృహద్గ్రంథం ప్రపంచ భాషల్లో యెక్కడాలేదు. యిది వ్రాసినా, పఠించినా, వినినా సర్వపాపాలూ నశిస్తాయి. మానవులందరికీ కావలసిన, ధర్మాలు, నీతులు, వేదాంతాలు, అన్నీఉన్నాయి. అందువలన దీనిని పఠించి, దీనిలో చెప్పినట్టుగా అచరిస్తే మనిషిమనీషి. మానవుడు మాధవుడుగా తయారవుతాడు. సమస్త శాస్త్రాలు సమగ్రంగా యిందు వేదవ్యాసభగవానుడు వ్రాశాడు. యిది చదవడం కూడా ఒకగొప్ప యజ్ఞమే. మీముత్తాతల చరిత్ర నీకు చెప్పగల గొప్ప యోగం మాగురు కటాక్షంచేతలభించింది.

**ఇది మహాభారతములో స్వర్గారోహణపర్వం ముగిసింది**

**ఓమ్ శ్శాంతి శ్శాంతి శ్శాంతిః**

# మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | |
|---|---|
| శ్రీ వినాయక వ్రతం | వెల రూ.5 |
| శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 20 |
| శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 9 |
| లక్ష్మీగణపతి పూజాకల్పం | ... |
| వరలక్ష్మీ వ్రతం | 5 |
| కేదారేశ్వర వ్రతం | 5 |
| త్రినాధ వ్రతం(కలర్) | 5 |
| త్రినాధవ్రతం(సాదా) | 3 |
| క్షీరాబ్ధి వ్రతం | 5 |
| మంగళ గౌరీవ్రతం | 9 |
| వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 15 |
| శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 15 |
| కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 15 |
| సంతోషీమాతా వ్రతం | 15 |
| ఏడు శనివారాల వ్రతం | 15 |
| సత్యనారాయణవ్రతం | 15 |
| శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 15 |
| శివదీక్ష | 9 |
| మార్గశిర లక్ష్మీవారాలవ్రతం | ... |
| శ్రీ వేంకటేశ్వర (దీక్ష) గోవిందమాల | ... |
| కాత్యాయనీ వ్రతం | 15 |
| సౌభాగ్య గౌరీవ్రతం | 15 |
| తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 30 |
| స్త్రీల వ్రతకథలు | 25 |
| స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి(నేదునూరిగంగాధరరావుగారి) | 45 |
| స్త్రీలపాటలు (కామేశ్వరీపాటతో) | 27 |
| సర్వదేవతా పూజావిధానం | 15 |
| ఆరువ్రతాలు | 25 |
| ధన్వంతరీ వ్రతకల్పం | 9 |
| రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 9 |
| పార్వతీ నిత్యపూజ | 9 |
| తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 9 |
| శ్రీ చక్రపూజ | 9 |
| శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 30 |
| శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 30 |
| లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 9 |
| శ్రీలలితా నిత్యపూజ(లలితాసహస్రనామస్తోత్రంతో) | 9 |
| శ్రీ గాయత్రీ నిత్యపూజ | 9 |
| అన్నపూర్ణ నిత్యపూజ | 9 |
| శ్రీ బాలాత్రిపురసుందరీ నిత్యపూజ | 9 |
| శ్రీ సరస్వతీ నిత్యపూజ | 9 |
| మహిషాసుర మర్ధనీపూజ | 9 |
| రాజరాజేశ్వరీ నిత్యపూజ | 9 |
| శ్రీ దుర్గానిత్యపూజ | 9 |
| కాలభైరవ నిత్యపూజ | 9 |
| శివపూజ | 9 |
| వీరభద్ర పూజ | 9 |
| ఆంజనేయ నిత్యపూజ | 9 |
| నాగేంద్ర స్వామి పూజ | 9 |
| సుబ్రహ్మణ్య నిత్యపూజ | 9 |
| రామదేవుని కథ | 9 |
| శివదేవుని కథ | 9 |
| విష్ణుపూజ (విష్ణుసహస్రనామస్తోత్రసహితం) | 9 |
| శ్రీకృష్ణ పూజ, గోపూజ | 9 |
| లక్ష్మీనరసింహపూజ | 9 |
| రాఘవేంద్రపూజ | 9 |
| విశ్వకర్మపూజ | 9 |
| శనైశ్చరపూజ | 9 |
| వేంకటేశ్వరపూజ | 9 |
| బ్రహ్మంగారి నిత్యపూజ | 9 |
| సూర్య నిత్యపూజ | 9 |
| నవగ్రహ నిత్యపూజ | 9 |
| సకలదేవతా అష్టోత్తర శతనామావళీపూజ | 9 |
| పంచాయతన పూజ | 45 |
| రుక్మిణీ కల్యాణం | 15 |
| అష్టనాగపూజ | 30 |
| ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 30 |
| ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 30 |
| ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 30 |
| ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 30 |
| సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 20 |
| పంచముఖ ఆంజనేయనిత్యపూజ | 15 |
| హనుమద్ వ్రతం | 30 |
| 28 వ్రతములు | 99 |
| పూజలు ఎందుకుచేయాలి ? | 30 |
| కలశపూజలు (9ఒకేసారి) | 150 |
| కలశపూజలు (విడివిడిగా) | 150 |
| ఉమామహేశ్వర వ్రతం | 30 |

### 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | |
|---|---|
| శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు | 31 |
| సర్వదేవతా స్తోత్రమంజరి | 99 |
| సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 20 |
| విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 20 |
| లలితా సహస్రనామ స్తోత్రమ్(క్రౌన్) | 30 |
| లలితా సహస్రనామములు | 18 |
| లక్ష్మీ సహస్రనామములు | 18 |
| దుర్గా సహస్రనామములు | 18 |
| ఆంజనేయ సహస్రనామములు | 18 |
| శివ సహస్రనామములు | 18 |
| విష్ణు సహస్రనామములు | 18 |
| గణపతి సహస్రనామములు | 18 |
| సుబ్రహ్మణ్య సహస్రనామములు | 18 |
| గాయత్రి సహస్రనామములు | 18 |
| లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 18 |
| శ్రీరామా సహస్రనామములు | 18 |
| లక్ష్మీనృసింహసహస్రనామములు | 18 |
| సరస్వతి సహస్రనామములు | 18 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | |
|---|---|
| లక్ష్మీగణపతి సహస్రనామములు | 18 |
| సూర్యసహస్రనామములు&ఆదిత్యహృదయం | 18 |
| శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 18 |
| మణిద్వీపవర్ణన (పెద్దది) | 18 |
| సంధ్యావందనం | 18 |
| మంత్రపుష్పమ్ | 18 |
| హనుమాన్ చాలీసా | 7 |
| (పాకెట్) మణిద్వీపవర్ణన | 7 |
| ఆరు చాలీసాలు | 9 |
| శివారాధన (శివస్తోత్రాలు) | 7 |
| వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 7 |
| ఆరుదండకాలు | 5 |
| వేంకటేశ్వర గోవిందనామములు | 5 |
| అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 7 |
| దేవీఖడ్గ మాలాస్తోత్రమ్(మహిషాసురమర్దనీ స్తోత్రంతో) | 7 |
| నమశ్శివాయ గేయామృతం | 5 |
| బాలాత్రిపుర సుందరీ స్తోత్రకదంబం | 81 |
| సుందరకాండ (పాకెట్) | 9 |
| భగవద్గీత మూలం | 18 |
| రామరక్షాస్తోత్రమ్ | 18 |
| స్తోత్ర రత్నావళి | 30 |
| పురాణపండలలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్ (మినీ) | 8 |
| పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్ (మినీ) | 8 |
| పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 8 |
| పురాణపండ ఆదిత్య హృదయం | 8 |
| మంత్రపుష్పం (మినీ) | 8 |
| శివానందలహరి-సౌందర్యలహరి | 30 |
| కుజదోషం | 9 |
| కాలసర్ప దోషం | 9 |
| మీ అప్పులు తీరాలా? | 9 |
| దృష్టిదోషాలు నివారణ | 9 |
| సర్వదేవతా ధ్యానశ్లోకములు | 9 |
| పంచసూక్తములు | 9 |
| సంధ్యావందనం | 9 |
| శ్రీరామదూతంశిరసానమామి(తాత్పర్యంతో) | 9 |
| రుద్రనమకమ్-చమకమ్ | 9 |
| మన్యుసూక్త-మంత్రపారాయణం | 9 |
| గాయత్రీమంత్రాలు | 9 |
| పంచరత్న స్తోత్రాలు | 9 |
| కరావలంబ స్తోత్రాలు | 9 |
| దశావతార స్తోత్రాలు | 9 |
| అష్టోత్తర శతనామస్తోత్రాలు | 9 |
| భుజంగ స్తోత్రాలు | 9 |
| ప్రాతఃస్మరణాలు | 9 |
| జపమంత్రాలు | 9 |
| సర్వదేవతా సుప్రభాతములు | 9 |
| ద్వాదశ నామస్తోత్రాలు | 9 |
| కుమారస్వామి స్తోత్రమాల | 9 |
| సుదర్శన స్తోత్రమాల | 9 |

| | |
|---|---|
| హయగ్రీవ స్తోత్రమాల | 9 |
| దక్షిణామూర్తి స్తోత్రమాల | 9 |
| పంచముఖఆంజనేయస్తోత్రమ్ | 9 |
| దండక రత్నాలు | 9 |
| ద్వాదశ జ్యోతిర్లింగాలు-పంచారామాలతో | 9 |
| శ్రీసూక్తం పురుష సూక్తం | 9 |
| పంచ అధర్వణ శీర్షములు | 9 |
| ప్రార్థనా శ్లోకములు | 9 |
| గణపతి స్తోత్రమాల | 9 |
| శ్రీ గురుగీత | 9 |
| సర్వదేవతా కవచములు | 9 |
| సర్వదేవతా అష్టకములు | 9 |
| హిందూ సంస్కృతిసంప్రదాయాలు | 9 |
| విష్ణు స్తోత్రమాల | 9 |
| దేవీ స్తోత్రమాల | 9 |
| శివస్తోత్రమాల | 9 |
| విష్ణు స్తోత్రములు | 9 |
| భర్తృలహరి సుభాషితాలు | 9 |
| నవవిధ భక్తిమార్గాలు | 9 |
| నవదుర్గలు | 9 |
| దశమహావిద్యలు | 9 |
| తిరుపతి వెళదాం | 9 |
| నవగ్రహస్తోత్రమాల | 30 |
| మహాన్యాసమ్ | 30 |
| సుందరకాండ గానామృతం | 30 |
| సంధ్యా వందనం (పెద్దది) | 30 |
| పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | |
| లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 36 |
| లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 36 |
| స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 81 |
| మూకపంచశతీ | 81 |
| పురాణపండవారి సౌందర్యలహరి (శ్లోకతాత్పర్యసహిత విపులవ్యాఖ్యతో) | 108 |
| గోమాతపూజావిధానము | 7 |
| ఆనందసిద్ధి - శ్రీదేవీ స్తోత్రమాల | 108 |

### 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | |
|---|---|
| శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 99 |
| సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 99 |
| బొమ్మల గురుచరిత్ర | ... |
| బొమ్మల సాయిచరిత్ర | ... |
| బాలలబాబా శ్రీ సాయిచరితం | 9 |
| శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 99 |
| శ్రీసాయిసన్నిధిద్వారకామాయిలీలలు | .... |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 50 |
| శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 50 |
| దాసగణకృత శ్రీసాయి చరిత్ర | 30 |
| నవనాథ చరిత్ర | 90 |
| శ్రీ సాయిచరిత్ర(బైండు)ప్రయాణపుపారాయణగ్రంథం | 50 |
| శ్రీ గురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 50 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | |
|---|---|
| సత్యదత్తవ్రతం దత్తాత్రేయ | |
| పూజాకల్పం,సహస్రంతో | 15 |
| అనఘాదేవీ వ్రతం | 15 |
| శ్రీ సాయిసచ్చరిత్ర గానామృతం | 15 |
| శ్రీ గురుచరిత్ర గానామృతం | 45 |
| భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 25 |
| మనసులోనిప్రశ్నకుశ్రీసాయిబాబాజవాబులు | 25 |
| అక్షరక్రమములో శ్రీసాయిసూక్తులు | 25 |
| శ్రీసాయి అష్టోత్తరశతనామావళీమాహాత్మ్యం | 25 |
| శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 15 |
| శ్రీ సాయిభజనమాల | 15 |
| శ్రీ సాయి భజన్స్ | 15 |
| శ్రీ సాయిభక్తి గీతాలు | 15 |
| శిరిడిహారతులు (భావంతో) | 15 |
| ప్రతిగురువారంసాయినిత్యపూజ | 8 |
| "శ్రీసాయి"కోటి | 15 |
| "శ్రీసాయిరామ్"కోటి | 12 |
| ద్వారకామాయి భక్తిగీతాలు | 9 |
| శ్రీ సాయిబాబా భక్తిమాల | 9 |
| శ్రీలక్ష్మీ సాయిభక్తిమాల | 9 |
| శ్రీ ద్వారకామాయిభక్తిమాల | 9 |
| శ్రీ శిర్డీభక్తిమాల | 9 |
| శ్రీ సాయిబాబా భక్తిమాల | 9 |
| శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 9 |
| శ్రీ సాయివేయినామాలు | 4 |
| శ్రీ సాయి సహస్ర నామావళి | 9 |
| శ్రీ సాయి చాలీసా-సుప్రభాతం | 9 |
| శ్రీ సాయినాధ చాలీసా | 9 |
| శ్రీ సాయి హారతులు (పాకెట్) | 9 |
| శ్రీ సాయి నిత్యపూజ (పాకెట్) | 9 |
| శ్రీ దత్తాత్రేయ నిత్యపూజ F | 9 |
| శ్రీ సాయి సూక్తులు | 9 |
| శ్రీ సాయి స్తవనమంజరి | 9 |
| శ్రీసాయి నక్షత్రమాలిక | 9 |
| హిందీ శ్రీ సాయి హారతులు | 10 |
| భక్తుల సందేహాలకుబాబా సమాధానాలు | 45 |
| శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 45 |
| శ్రీ షిర్డీసాయి లీలామృతం (VG) | 25 |
| ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 10 |
| షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 90 |
| సాయిపూజావిధి | 30 |
| సాయిమహిమ | .... |
| సాయిసత్యవ్రతం | 15 |
| సాయి అనుగ్రహమ్ | 116 |
| నవగురువారాల వ్రతకల్పము | 12 |
| శ్రీదత్తలీలామృతము | 72 |
| హృదయంలో సాయి | 12 |
| శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్చరిత్ర) | 81 |

## 4. జ్యోతిషాలు

| | |
|---|---|
| 'శుభసమయ' గంటల పంచాంగం | 30 |
| సనాతన వైదిక బ్రాహ్మణ పంచాంగం | |
| (వంగిపురపువారి పత్రికసైజ్‌పంచాంగం) | 69 |
| 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 50 |
| చిత్రాలగురుమూర్తిగుప్తాపంచాంగము | 50 |
| గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 116 |
| శ్రీచక్ర పంచాంగము(రాష్ట్రతొలిమహిళపంచాంగకర్త) | 30 |
| వేంకట్రామా&కో సిద్ధాంతుల | |
| రేలంగితంగిరాలవారి గంటలపంచాంగము | 30 |
| తంగిరాల పెద్దపంచాంగం | 39 |
| కాలచక్రం జ్యోతిష క్యాలండర్ | 20 |
| గ్రహబలం క్యాలండర్(శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 20 |
| శుభలగ్నం (తంగిరాల) క్యాలండర్ | 20 |
| శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 20 |
| సాదా క్యాలండర్ | 5 |
| పాకెట్ క్యాలండర్ | 10 |
| తాజకనీలకంఠీయమ్ | 100 |
| 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 207 |
| 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 150 |
| కేరళ జ్యోతిష రహస్యాలు | 150 |
| జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 150 |
| మానసాగరి జాతకపద్ధతి | 150 |
| వరాహమిహిర జాతకపద్ధతి | 150 |
| వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 81 |
| సింపుల్ రెమిడీస్ | .... |
| హోరాసార | ..... |
| శంభు హోరప్రకాశిక | ..... |
| పూర్వ పరాశరి | 100 |
| పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200 |
| 1940-60వరకు పాతపంచాంగములు | 225 |
| ప్రశ్న సింధు | 90 |
| నక్షత్ర విశేష ఫలితాలు | 36 |
| సర్వార్థ ఫలచంద్రిక | 90 |
| సూర్యసిద్ధాంత పంచాంగగణితంచేయడంఎలా? | 150 |
| దృక్సిద్ధాంత పంచాంగగణితం చేయడంఎలా? | 150 |
| ఆయుర్దాయ నిర్ణయం | 36 |
| పంచప్రాచీన జ్యోతిషాలు | 36 |
| జాతక గణిత ప్రవేశిక | 30 |
| భృగు సూత్రాలు | 36 |
| జ్యోతిషమర్మబోధిని | 45 |
| జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 45 |
| ముహూర్తం నిర్ణయించడంఎలా? | 45 |
| జాతక మకరందం | 30 |
| జ్యోతిష సరస్వతి | 30 |
| మీజననకాల విశేషాలు | 30 |
| ముహూర్త విజ్ఞాన భాస్కరం | 30 |
| జ్యోతిష స్వయంబోధిని | 30 |
| శుభముహూర్త శిరోమణి | 30 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

